ప్రతులు : 1300

ప్రథమ ముద్రణ : జులై 1988.

వెల : సాదా ప్రతి 50/-
గ్రంథాలయ ప్రతి 80/-

ప్రతులకు : జయధీర్ తిరుమలరావు
1-8-1/117,
సూర్యానగర్, చిక్కడపల్లి
హైదరాబాద్-500 020.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్
1-4-435, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్-500 001.
మరియు అన్ని కేంద్రాల్లో

నవయుగ బుక్ హౌజ్
సుల్తాన్ బజార్, హైదరాబాద్

---

ముద్రణ : హైదరాబాదు ప్రింటర్స్, హబ్సిగూడ, హైదరాబాద్.

# కృతజ్ఞతలు

*పరిశోధనా క్షేత్రంలో*

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఈ పరిశోధనాంశంతో, పరిశోధనకు అవకాశం కల్పించిన ఆచార్య బి. రామరాజు, అంశానికి పేరు పెట్టి ప్రోత్సహించిన ఆచార్య సి. నారాయణరెడ్డి, మార్గదర్శకత్వం వహించిన ఆచార్య ఎస్. వి. రామారావు—

*పరిజ్ఞాన రంగంలో*

పాటల్నే కాదు సాహిత్య చరిత్రనీ పరిజ్ఞానాన్నీ కలిగించిన ఎంతో మంచి వ్యవహర్తలకీ-

మొదటి దశలో ఎంతో విలువైన చర్చలు జరిపిన మిత్రులు బి. నరసింగరావు, గద్దర్-

రెండో దశలో ఎన్నో చిక్కు ముడులనుండి తప్పించిన ఆచార్య కె. వి. రామకోటిశాస్త్రి, ఆచార్య చేకూరి రామారావు, డా॥ పి. వరవరరావు, హరి పురుషోత్తమ రావు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి—

అడిగిన ప్రశ్నలకు సైద్ధాంతిక వివరణతో లేఖ రాసిన త్రిపురనేని మధుసూదన రావు, సమాచారాన్ని అందించి చర్చలకు తావిచ్చిన కె.వి. రమణారెడ్డి—

ప్రజానాట్యమండలి వివరాలు, తెలంగాణా పోరాట కాలంలోని సాంస్కృతిక రంగం సమాచార వివరాలు చెప్పిన తిరనగరి రామాంజనేయులు, ముక్కామల నాగభూషణం, కోగంటి గోపాలకృష్ణయ్య, కీ॥శే॥ సుద్దాల హనుమంతు, కీ॥శే॥ రాజారాం, కాసం నారాయణ, నల్ల నరసింహులు, కే. కృష్ణమూర్తి, శ్రీమతి స్వరాజ్యం వట్టిపర్తి రాఘవరెడ్డి మొ॥ అనేకమందికి....

*ఆర్థిక రూపంగా*

నా రచన వెలుగులోకి రావాలని పెన్నుతట్టి ముందు నడిపిన ఆప్తమిత్రులు—

డి. విద్యాసాగర్ రావు

నిజాం వెంకటేశం

రమేశ్ అగర్వాల్

మహేందర్ భాయ్

ఉస్మాన్ అలీ

బి. నరసింగరావు

జి. జోగారెడ్డి

*ఇంకా తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ వారు చేసిన ఆర్థిక సహాయానికి*

*ముఖచిత్ర విషయంలో*

ముఖచిత్ర రచనలో సహకరించిన సన్నిహితులు షరీఫ్

అక్షరాలు రాసిన గంగాధర్

ఛాయా చిత్రాలు తీసిన ఫొటో భరత్ భూషణ్

అచ్చులో సహకరించిన ఆర్. సుదర్శన్ గారికి

హైదరాబాద్ ప్రింటర్స్ యాజమాన్యం డి. రాజిరి,- జి. రాఘవులు

అచ్చు రచన చేసి పెట్టిన కార్మిక మిత్రులకు—

మొదటినుండి చివరిదాకా 'మన పని' అని పూర్తిగా సహకరించిన నీలాగారికి

అచ్చు కావడానికి వీలైన పరిస్థితి కల్పించిన ఎ. తారాబాయిగారికి

ఎన్ని ఆర్థిక ఇబ్బందులకి లోనైనా మావాడు మంచి పనే చేస్తున్నాడని ప్రోత్సహించిన—

*కనకపోయినా కన్నతల్లి ప్రేమ చూపిన అమ్మమ్మకి*

*స్నేహితుడుకాని స్నేహితుడు మా బాపుకి ……….*

—కృతజ్ఞతాభివందనాలు

# విషయసూచిక

ఐదో అధ్యాయం



ఆరో అధ్యాయం



ఏడవ అధ్యాయం

# సాహిత్యంనుండి ప్రజాసాహిత్యానికి...

సాహిత్యం అనే మాట ఉంది. జానపద సాహిత్యం అనే మాటా ఉంది. అభ్యుదయ సాహిత్యం కూడా ఉంది. ప్రజా సాహిత్యం అనే మాట ఆ తరువాత కాలంలో వచ్చిన, వస్తున్న ఒక రకం సాహిత్యాన్ని ఉద్దేశించి చెప్పడానికి వాడబడుతున్నది. ఒకప్పుడు జానపద సాహిత్యాన్ని ప్రజా వాఙ్మయం అన్నారు. కాని అక్కడ ప్రజా శబ్దానికున్న అర్థానికి ఇప్పుడు ప్రజా సాహిత్యం అనటంలోగం 'ప్రజా' శబ్దానికి ఉన్న అర్థానికీ చాలా తేడా ఉంది. అక్కడ వాళ్ళంతా జానపదులు. ఇక్కడ వీళ్ళంతా ఉత్పత్తి శక్తులు, శ్రమజీవులు. వీళ్ళ కష్టసుఖాలు, వీళ్ళ శ్రేయస్సు, వీళ్ళ రాజకీయాలు మొ॥ వాటికి సంబంధించిన వీళ్ళ ఉద్యమస్ఫూర్తిగల చైతన్యం వస్తువుగా వచ్చిన సాహిత్యాన్నే ప్రజా సాహిత్యం అంటున్నాం.

ఈ విధంగా ప్రజా సాహిత్యం అనే మాటకి ఒక చారిత్రక జీవిత దృక్పథం నుండి నిర్దిష్టంగా అర్థ వివరణ చేసి శ్రీ తిరుమలరావు ఈ సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించారు.

భారతదేశంలో మరే ప్రాంతంలో కూడా తెలంగాణా రైతాంగ పోరాటంవంటి పోరాటం 1940లకు ముందు ఎక్కడా జరగలేదు. అందువల్ల ఏ భారతీయ భాషల లోనూ తెలంగాణా రైతాంగ పోరాట చైతన్యం వంటి చైతన్యంతో సాహిత్యం రాలేదు. ఆ విధంగా తెలుగు ప్రాంతానికి, తెలుగు భాషకు తెలంగాణా రైతాంగ పోరాటం, ఆ సాహిత్యం రెండూ కూడా గొప్ప చారిత్రక సంఘటనలు. చరిత్ర గతిని మలుపు తిప్పి అభ్యుదయ మార్గం పట్టించిన సన్నివేశాలు. ఈ సిద్ధాంత గ్రంథానికి ఆధారభూతమైన సాహిత్యమంతా కూడా ఆ రైతాంగ పోరాట గేయ సాహిత్యమే. శ్రీ తిరుమలరావు అందుకు సంబంధించిన దాదాపు ఐదు వందల రచనలను సేకరించి వాటిని ప్రధానంగా ఉద్యమ రచనలనీ, పోరాట పాటలనీ రెండు రకాలుగా చేసి పరిశీలించారు. ఉద్యమ రచనలు ఎక్కువగా జమీ ఫాసిస్టు వ్యతిరేక చైతన్యాన్ని ఉద్యమంగా ప్రచారం చేసేవి, ప్రబోధించేవి. ఈ రచయితలంతా శ్రామికులు కాదు. శ్రామిక ఉద్యమం గురించి అనుకూలమైన దృక్పథం గలవాళ్ళు శ్రామిక ప్రజా విజయాన్ని అభిలషించే వాళ్ళు. అందుకు ప్రజా చైతన్యాన్ని ప్రబోధించేవాళ్ళు.

పోరాట పాటలు- వీటి రచయితలు అందరు కూడా తెలంగాణా రైతాంగ పోరాటంలో సాయుధులై పనిచేసినవాళ్ళు. అలా పనిచేయడంవలన పొందిన కష్ట సుఖాల అనుభవాలనుండి, ఆలోచనలనుండి సాహిత్యాన్ని సృష్టించారు. అది వాళ్ళ జీవితాన్ని, దృక్పథాన్ని ప్రతిఫలించేదిగా ఉంది. ఈ సిద్ధాంత గ్రంథంలో ఈ రెండు కోణాలనుండి తెలంగాణా రైతాంగ పోరాట గేయ సాహిత్యాన్ని శ్రీ తిరుమలరావు సలక్షణంగా విశ్లేషించాడు, విమర్శించాడు.

ఈ ప్రజా సాహిత్యానికి విలువలను నిర్ణయించడానికి సాంప్రదాయిక సాహిత్య ప్రమాణాలు పనికిరావు. ఆ విషయాన్ని గమనించడం చేతనే శ్రీ తిరుమలరావు వస్తువుకు, రూపానికి ఉండే అవినాభావ సంబంధం యొక్క భౌతిక పునాది మీద దృష్టిని కేంద్రీకరించి ప్రజా సాహిత్య అధ్యయన విధానానికి ఒక మార్గాన్ని రూపొందించాడు. ఈ పద్ధతిలో నవలా సాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి ఒక మార్గాన్ని రూపొందించిన సిద్ధాంత గ్రంథం శ్రీ పి. వరవరరావు "తెలంగాణా విమోచనోద్యమం-తెలుగు నవల" ఇంతకుముందే వచ్చింది. ఇప్పుడు కవిత్వాన్ని గురించిన అధ్యయనం చేయడానికి ఈ సిద్ధాంత గ్రంథం వచ్చింది. ఆధునిక తెలుగు సాహిత్య పరిశోధన లోనూ, విమర్శనలోనూ ప్రజా సాహిత్యానికి సంబంధించిన ప్రామాణిక గ్రంథాలుగా ఇప్పటికి ఈ రెండింటినీ పేర్కొనవచ్చు.

తెలంగాణా పోరాట సాహిత్య రచయితలు సాంప్రదాయిక కళారూపాలను తమ ఉద్యమ ప్రయోజనాలకు ఎలా వాడుకొన్నదీ ఈ సిద్ధాంత గ్రంథంలో చూపించారు. జానపద కళారూపాలను కూడా ఈ ప్రజా ఉద్యమ స్ఫూర్తికి తోడ్పడేటట్లు ఉపయోగించుకొన్న వైనం ఈ గ్రంథం నిండా పరుచుకొని ఉంది.

సాంప్రదాయిక మతతాత్విక భావ జాలంతో ఉండే జానపద వాఙ్మయ కళా రూపాలనుండి భావజాలాన్ని అంటే వస్తువును వదిలి రూపాన్ని ప్రజా రాజకీయ చైతన్యంతో నింపి సృష్టించబడిన సాహిత్యమే ప్రజా సాహిత్యంగా ఆధునికయుగంలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్న వైనాన్ని శ్రీ తిరుమలరావు ఈ గ్రంథంలో స్పష్టంగా నిరూపించారు.

సాంప్రదాయిక సాహిత్యంలో వస్తువు భౌతిక పునాది కలిగింది కాదు. అది ప్రజా జీవిత సంబంధాలనుండి పుట్టిందీ కాదు. కాబట్టి శ్రమజీవుల జీవన సంఘర్షణ లోంచి వెలువడిన కొత్త వస్తువుకు చోటు ఇవ్వవలసి వచ్చినందువల్ల అది తొలగిపోక తప్పలేదు. ఇదే పద్ధతి సాంప్రదాయిక ప్రక్రియలైన కావ్యం, నాటకం మొదలైన

వాటన్నింటిలోనూ జరిగింది. ఇంతగా మొత్తం సాహిత్య ప్రక్రియలన్నింటిని కొత్త వస్తువుతో నింపగల సామర్థ్యం తెలంగాణా రైతాంగ పోరాటం రచయితలకు, కళాకారులకు ఇవ్వగలిగింది.

తెలంగాణా పోరాట సాహిత్యం తెలుగు సాహిత్యాన్ని ఎలా ప్రభావితం చేసిందీ, ఏ విధంగా మార్చిందీ, ఏ రకంగా రూపొందించిందీ సంగ్రహంగా నిరూపిస్తున్న ఈ సిద్ధాంత గ్రంథం వర్తమాన పరిశోధన గ్రంథాలలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొంటుంది. ముందు ముందు విశ్వవిద్యాలయాలలో జరిగే ప్రజా సాహిత్య పరిశోధనలకు ఈ గ్రంథం ప్రాతిపదికగానూ, కొంతవరకు మార్గదర్శకంగానూ ఉండగలదని ఆశించవచ్చు.

వరంగల్, —**కేతవరపు రామకోటిశాస్త్రి**

1-7-1988.

# పనీ-పాటల్లోంచి జనజీవితాల్లోకి...

పరిశోధన రెండు రకాలుగా కొనసాగుతున్నది. 1. అకడమిక్ రంగం (విశ్వవిద్యాలయాలు, అకాడమీలు మొ॥నవి.), 2. సామాజికరంగం (రాజకీయ-సాంస్కృతిక సంస్థలు). డిగ్రీ ప్రధాన ధ్యేయంగానూ, పాండిత్య ప్రధానంగానూ మొదటరకం పరిశోధన ఎక్కువగా జరగ్గా రెండోరకంలో ఒక 'ప్రయోజనం' ఆశించి పరిశోధనలు జరుగుతున్నాయి. అంటే ప్రజలకోసం అనే ఆలోచనతో ప్రజల సంబంధమైన సాహిత్యాంశాలమీద ఈ రకం పరిశోధనలు చేస్తున్నారు. ఈ రెండు విధానాల మధ్య కొంత సంఘర్షణ ఉంది. మరికొంత వైరుధ్యం ఉంది. అప్పుడప్పుడు మాత్రం ఒకదాన్ని మరొకటి గుర్తించుకోక తప్పదు.

అంతేకాదు ఆదాన ప్రదానాలు కూడా సాధ్యమవుతున్నాయి. ప్రయోజనం, పాండిత్యం రెండూ అవసరమే. కాని పాండిత్యంకోసం పాండిత్యమైతే ఆ పాండిత్యం కొరగానిదైపోతుంది. ఇది మన సామాజిక భౌతిక పరిస్థితి మీద ఆధారపడ్డ నూటపాళ్ళ సత్యంతో ముడిపడి ఉంటుంది. దీన్ని ఎవరూ కాదనలేరు.

విశ్వవిద్యాలయాల్లో జరిగే పరిశోధనకు సామాజిక ప్రయోజనం కలిగించాల్సిన అవసరం ఉంది. పరిశోధన దృష్ట్యా, సామాజిక అవసరాల దృష్ట్యా ఇది అనివార్యం. ప్రస్తుతం ఉన్న అకడమిక్ పరిశోధక సంస్కృతిని మార్పుచేసి నూతనదృష్టి కలిగించడం కోసం జరిగే ప్రయత్నాల్లో భాగంగా ఈ చిన్నపాటి కృషి చేశాను.

తెలంగాణా పోరాటానికి ఒక స్పష్టమైన లక్ష్యం ఉంది. ఈ సాహిత్యానికి ఒక భౌతిక పునాది కూడా ఉండటం వల్ల ఈ పరిశోధనలు విశ్వవిద్యాలయాల్లో జరిగినప్పటికీ వీటివల్ల సామాజిక ప్రయోజనం తప్పనిసరి అనే అభిప్రాయం సాధారణంగా నెలకొని ఉంది.

పోరాటకాలంలో సమాజంలోని వివిధ అంశాలు, మానవసంబంధాలు మొదలైనవి త్వరితంగా మారుతాయి. అంతర్గతంగా ఉన్న వైరుధ్యాలు స్పష్టంగా ఉపరితలంలో కనిపిస్తాయి. ఈ సంక్లిష్టతను సమగ్రంగా అర్థంచేసుకోడానికి ఆనాటి సాహిత్యం చాలా వరకు ఉపయోగపడుతుంది. ఈ నేపథ్యంలోంచే ఇలాంటి పరిశోధనల్ని చూడవలసి ఉంటుంది.

అలా కాకుండా మన సమాజానికి, దాని అవసరాలకి దూరంగా ఊహాజనిత ఆలోచనలతో పరిశోధన చేస్తే అవి ఈ నేలమీద పెరిగి కాయలు కాయవు. 19వ శతాబ్దంలో ఉండి ఇరవయ్యొక్కో శతాబ్దం సూపర్ కంప్యూటర్‌ని ఉపయోగించినట్లుంటుంది. కంప్యూటర్ టెక్నాలజీ స్వతహాగా పెరగని సమాజంలో అరువు తెచ్చుకుంటే-

ఒకవేళ అవి వెడిపోతే దాన్ని రిపేరు కూడా చేసుకోలేం! మళ్ళీ రిపేరింగ్‌కోసం సము ద్రాల కావలికి చేతులు చాచక తప్పదు. కొన్ని అరువు పరిశోధనలూ అంతే. అరువు పరిశోధన ఆకర్షణీయంగానే కనిపిస్తుంది. పరిశోధనా పద్ధతులు ఏవైనా, ఎక్కడివైనా గ్రహించవచ్చు కాని ఆ ఆకర్షణలో కొట్టుకుపోయి నేల విడిచిన సాము చేయకూడదు.

**2**

పది శతాబ్దాలుగా రాత సాహిత్యమే సాహిత్యంగా నిలబడి అయింది. మిగిలిన సాహిత్య మంతటినీ అనేక ముద్దుపేర్లుపెట్టి దాని అసలు అస్థిత్వాన్ని కప్పిపెట్టారు. దాని వ్యక్తిత్వాన్ని గుర్తించలేదు. ఆ ఝరీవేగ సాహిత్యప్రవాహాన్ని (తత్వాలు, పదాలు, పాటలు మొ॥నవి.) చూసీ చూడనట్లు నటించారు. అదే ప్రవాహం ఆగి ప్రశ్నించింది. ఇవ్వాళ ప్రజాసాహిత్యం రూపంతో ముందుకు వచ్చింది. అంటే దేశీ సాహిత్య ప్రక్రియలన్నీ ప్రజల పరమయ్యాయి.

ప్రజా రాజకీయ సిద్ధాంతాల వెలుగులు విరజిమ్మాక సాహిత్య చీకటి కోణాలు సుస్పష్టంగా కనిపించడం ప్రారంభమయింది. ప్రజలకోసం ప్రజలు, ప్రజల కోసం ఇతరులు - వాళ్ళ బతుకులకోసం బాగుకోసం రాసే సాహిత్య స్వరూపం గురించిన ఆలోచనలు వచ్చాయి. ఈ సాహిత్యాన్ని మొదట కవులే గుర్తించారు.

> రాజు మరణించె నొకతార రాలిపోయె
> కవియు మరణించె నొక తార గగన మెక్కె
> రాజు జీవించె రాతి విగ్రహములయందు
> సుకవి జీవించె ప్రజల నాలుకలందు

అని జాషువా అన్నాడు. మామూలు కవి చచ్చి ఒక తార అయ్యాడు. సుకవి (ప్రజా కవి) ప్రజల నాలుకలమీద జీవిస్తాడు. అంటే 'మౌఖికంగా' జీవిస్తాడు. హృదయాల్లో, తలల్లో కాదు కేవలం నాలుకల మీద. 'నాలుకలమీది సాహిత్యం'లో నిలిచే కవి.

కొంత భిన్నమైన ఆలోచనతో శ్రీ శ్రీ తనని తాను—

> నిజంగా నేను
> ప్రజల కవినేను
> ఎంచేతంటేను
> వాళ్ళను చదివేను
> చదివిందే రాశేను-అంటాడు.

ప్రజలను 'చదివి' రాశానన్నాడు. జీవితాన్ని చదివినవాడు వాళ్ళ బాగుకోసం మాత్రమే రాస్తాడు. అందుకే ప్రజాకవినని తనకు తాను చెప్పుకొన్నాడు. శ్రీ శ్రీ రచనలు రాతకు

పరిమితమయ్యాయి. రాసినా, పాడి ప్రచారం చేసినా ఎవరికోసం అన్నదే ముఖ్యం. 'జానపద' సాహిత్యం అన్న పదం ఎక్కువగా అకడమిక్ అర్థాన్నిచ్చే పదం 'జానపద' పదంలో ఉన్న 'ప్రజ' అర్థం మాత్రం రాజకీయమైనది. ప్రజల ప్రయోజనం ప్రధానంగా ఉద్దేశించే కవులూ, పరిశోధకులు 'ప్రజాసాహిత్యం' అనే దృక్పథాన్ని అవలంభించక తప్పదు. వరవరరావు తమ సిద్ధంత గ్రంథంలో ఆనాడు వెలువడిన నవలలను 'ప్రజా రాజకీయ నవలలు' అన్నారు. ఒక విశాల పరిధిలో ప్రజారాజకీయాలు ఉండే సాహిత్యానంతా ప్రజాసాహిత్యంగా పరిగణించడానికి కూడా వీలుంది. ఈ గ్రంథంలో మాత్రం ఎక్కువగా ప్రజల వెన్నంటి వచ్చే గానయోగ్యమైన సాహిత్యాన్ని గూర్చి ప్రధానంగా చర్చించాను.

సామాజిక మార్పుకోసం జరిగే సంఘర్షణా సమయంలో కవులు ప్రజల భాషలో భావనలో వారికి దగ్గరగా చెప్పడానికోసం వారి జీవితంతో పెనవేసుకు పోయిన రూపా(Form)ల్లోనే వ్యక్తం చేయక తప్పదు. ఈ క్రమం(Process)లో రచనా రూపాలు ప్రజలకు అతి దగ్గరగా వస్తాయి. అప్పుడు మాత్రమే ప్రజాసాహిత్య ప్రక్రియలుగా మారతాయి. ఈ మార్పుని దృష్టిలో పెట్టుకోవలసిన అవసరం ఉంటుంది.

ఇంతవరకు చరిత్ర గుర్తించని అంశాలు, వార్తాపత్రికల కెక్కని వాస్తవాలు, రాజకీయ పత్రాలు పట్టించుకోని విషయాలు, మధ్యతరగతి రచయితలు దృష్టి సారించని కోణాలు ప్రజా సాహిత్యంలో నమోదు అవుతాయి. చరిత్రని నిర్మించే క్రమంలోనే ఆ సాహిత్యం వెలువడింది. అంటే ఆక్రమంలో భాగంగా సాహిత్యం పునాదిలోంచి ఒక పాయగా బయట పడింది.

ఈ సిద్ధాంత గ్రంథంలో పాటలనే ప్రధానంగా తీసుకొన్నాను. ప్రజావీరుల త్యాగాలవలె తమ కర్తవ్యాన్ని నేరవేర్చి అవి మరుగున పడిపోతాయి. అజ్ఞాతత్యాగాల లాగే పాటలు కూడా ఎక్కువ మొత్తంలో మరుగునపడిఉన్నాయి.

## 3

## గానం-ప్రభావం

ప్రాచీనకాలం నుండే పాట ప్రభావాన్ని చాలామంది గుర్తించారు. అందులో గ్రీకు తత్వవేత్త ప్లాటో ఒకరు. ఆయన రాసిన 'ది రిపబ్లిక్' గ్రంథంలో గానం ప్రభావాన్ని గురించి ఇలా రాశారు.

**"..........any Musical innovation is full of danger to the whole State, and ought to be Prohibited (because it) imperceptively Penetrates into manners and customes; whence, Issuing with**

**greater force, it invades contacts between man and man and.... goes on to laws and constitutions, in utter recklessness, ending at last....by an overthrow of all rights, private as well as public.**

ప్లాటో చెప్పిన రీతిలో పాటల ప్రచారంవల్ల తెలంగాణాలో నైజాం అధికారం గద్దె దిగింది. తరతరాల భూస్వామ్య అధికారం కొంతవరకు జోరు తగ్గింది. పాట ప్రభావాన్ని ప్లాటో గుర్తించినంత చక్కగా సాహిత్యవేత్తలెవరూ గుర్తించలేదు.

మత ప్రచారంకోసం ప్రజల్లోకి వెళ్ళి పాటలద్వారా విపరీతమైన ప్రచారంచేసి విజయం పొందిన సాక్షాలున్నాయి. అంతేగాదు ప్రతి తత్వవేత్త తన సిద్ధాంతాన్ని తత్వాలుగా ప్రజలకు దగ్గరైన భాషలో, బాణీలో పాడి వారి జీవితంలో ఒక భాగం చేస్తాడు. ఈ పాటలే అతని సిద్ధాంతానికి ప్రచారవాహికలుగా పనిచేస్తాయి. తుదకు ప్రజా వ్యతిరేకమైన నీతినియమాలన్నీ పాటల ద్వారానే ప్రచారం చేయడాన్ని గమనించాలి.

కొండవీడు మందేరా / కొండపల్లి మందేరా
కాదను వాడుంటే / కటకం దాక మనదేరా- అంటూ

కృష్ణదేవరాయలు దిగ్విజయార్థం బయలుదేరినప్పుడు ఉత్తేజంతో పలికిన నినాద

చరణాలు— రామ రామ యన్నంతకాలము రాజ్యమేలలేము
జగము వుండుకాలము వరకు మనము వుండబోము—

అనే చరణం యుద్ధ నినాదంగా పనిచేసి మూర్తీభవించిన పౌరుషానికి ప్రతీకల్లాగా పనిచేశాయి. యుద్ధరంగంలో ప్రాణాలను సైతం లెక్కచేయకుండా పోరాడేలా చేశాయి.

ఆంగ్లేయ చక్రవర్తులైన ఎనిమిదో హెన్రీ, మొదటి మేరీ, మొదటి ఎలిజబెత్‌లు వీరగాథలను, ప్రజావీరుల గాథలను పాడకుండా చేయడానికి చాలా రకాలుగా ప్రయత్నించారు. మొదటి మేరీ తన పరిపాలనా కాలంలో పుస్తకాలు, వీరగాథలు, పాటలు చక్రవర్తుల అనుమతి లేనిదే ప్రచురించకూడదని ఆజ్ఞలు జారీ చేసింది. ఎలిజబెత్‌రాణి కూడ ఇలాంటి కట్టుదిట్టాలను చేసింది. 18వ శతాబ్దపు ఆంగ్లేయ రాజకీయ రచయిత ఆండ్రూ ఫ్లైచర్ పాట శక్తిని గమనించి ఇలా అన్నాడు. **"Give me the making of the songs of a Nation and I care not who makes its laws"**

గానానికున్న ప్రభావాన్ని గమనించి ఎన్నో దేశాలలో ఎంతోమంది రాజులు, అధికారులు ప్రజలకోసం పాటల్ని పుట్టకుండా చేయాలని ప్రయత్నించారు. అమెరికాలో ఆర్థిక మాంద్యం ప్రజల్ని తినేస్తున్నప్పుడు హెర్బర్ట్ హోవర్ అన్న మాటలు గమనించండి. **"If you can sing a song that would make people forget their troubles....I will give you a Medal"**

ప్రజలు పడే బాధలనుంచి వారిని మరోవైపు దృష్టి మరల్చాలి. అంటే వారు ప్రభుత్వాన్ని ఎదిరించకుండా, ప్రశ్నించకుండా వారి మనస్సులకు అన్యథా పని కల్పించాలి. అలాంటి సమ్మోహన శక్తి కూడా పాటకుంది. అందుకే అధికారులు పాటని ఎప్పుడూ తమ ప్రయోజనాలకు అనుగుణంగా వాడుకుని ప్రజలకు వ్యతిరేకంగా ఉపయోగిస్తూనే ఉన్నారు. (చూ. కుందూరి ఈశ్వరదత్తు నివేదిక పే. 246)

**4**

ఇంతటి ప్రభావం చూపే పాటల్ని సుమారు నలభై ఏళ్ళ తరువాత సమయాన్ని సందర్భాన్ని మినహాయించి కృత్రిమంగా పాడించి సేకరించాను. వాటిని ఇప్పుడు అక్షరాల్లో బంధించి మీ ముందుంచాను. ఇవి శబ్దశక్తినీ, పోరాట వాతావరణాన్ని కోల్పోయాయి. అందువల్ల సాదాసీదా వాక్యాల్లా కనిపిస్తాయి. వీటిని రాత సాహిత్యం దృష్ట్యా చూడకుండా ధ్వని సంపుటాల దృష్ట్యా పరిశీలించాలి. ఈ విషయాన్నే **"Verses that sound clumsy and un-inspired when read in a drawing rooms were often extraordingly effective when sung in the meeting hall or on the picket line"** అని అభిప్రాయపడ్డారు.

కాబట్టి ఈ పాటల్లో కనిపించే మాండలిక పదాలు, మోటుమాటలు, తిట్లుదీవెనలూ, శబ్దాలను తప్పుగా వాడడం మొ॥ అంశాలనుఆయా సందర్భానుసారం అవగతం చేసుకోవాలి. సామాజిక అస్తిత్వంతో అన్వయించకుండా పోరాటపాటల్ని ప్రత్యేకంగా చూడడం సరైన పద్ధతికాదు.

అందుకే ఇది పాటల చరిత్రగా కన్నా పోరాట పాటలలో ప్రజల చరిత్రగా చెప్పవచ్చు. అందుకే ఈ సిద్ధాంత వ్యాసంలో శ్రమజీవుల పాటల నుండి చరిత్రను తవ్వితీయడం తప్పనిసరి అంశమైంది.

పోరాట పాటల గురించి చెప్పే క్రమంలో ప్రజల కోసం పాటలు ఉపయోగపడిన ఉద్యమాల గురించి కూడా తప్పక చెప్పాల్సి వచ్చింది. కాబట్టి "తెలుగులో జమీ-ఫాసిస్టు వ్యతిరేకోద్యమ సాహిత్యం" (1928-1944) తరచి చూడాల్సి వచ్చింది. ఆ తరువాత తెలంగాణా రైతాంగ పోరాటంలో ఈ పాటలు ఎన్నో రకాలుగా ఉపయోగపడ్డాయి. ఈ విధంగా తెలుగులో వెలువడిన ప్రజా సాహిత్య స్వరూప స్వభావాలను అంచనా కట్టడం జరిగింది. ఇందుకోసం తెలంగాణ ప్రజల శ్రమ సంబంధాల గురించీ, పని పాటల గురించీ వివరంగానే పరిశీలించడం జరిగింది.

హైదరాబాదు
3-7-1988

—జయధీర్ తిరుమలరావు

# సమాచార సేకరణ-వివరణ

*ఉస్మానియా విశ్వవిద్యాలయంలో* "తెలంగాణా రైతాంగ పోరాటం ప్రజా సాహిత్యం" అనే సిద్ధాంత వ్యాసం రాయడానికి విశాలాంధ్ర ప్రచురించిన తెలంగాణా పోరాట గేయాలు, విరసం ప్రచురించిన రెండు తెలంగాణా పోరాట పాటల సంపుటాలు తప్ప మరేమీ కనిపించలేదు.

అందుకే క్షేత్ర పర్యటన చేసి పాటల సేకరణ ప్రారంభించాను. ఈ పర్యటన లోనే ప్రజల జీవితంతోనూ సాహిత్యంతోనూ దగ్గరి పరిచయం ఏర్పడింది. రాజకీయ పుస్తకాలు, కరపత్రాలు లభించాయి. 1946లో ప్రజాశక్తి ప్రచురణాలయం వారు ప్రచురించిన చిన్న పుస్తకాలు లభించాయి.

పాటలే కాకుండా పిశారూపాలు కూడా క్షేత్ర పర్యటనలో సేకరించవలసి వచ్చింది. శారదలు పాడే కథ, లత్కోరుసాబు పదం మొ॥నవి ఎక్కడా ప్రచురితం కాలేదు. అవి ప్రజలు, వృత్తిగాయకులు పాడుకుంటారు. ఈ విధంగా పాటలకోసం తెలంగాణాప్రాంతం విస్తృతంగా పర్యటించాల్సి వచ్చింది. ఈ పర్యటనలో విసునూరు రామచంద్రారెడ్డి వంటి దొరలనూ, అతనికింద పనిచేసిన జేరి కృష్ణారెడ్డిలాంటి వ్యక్తులనూ, అనేకానేకమంది శ్రమజీవులైన పోరాట వీరులనూ, వృద్ధులనూ కలిశాను.

పాటలు వెలువడడానికి ఎంత ప్రేరణ అవసరమో, అవి గుర్తుతెచ్చుకొని పాడించడానికి అంతే అవసరం. గత చరిత్రను చెప్పి సంఘటనలు విడమరిస్తేనే పాటలు గుర్తువస్తాయి.

మరికొంతమంది పోరాట పాటలను పని పాటలుగా పాడుకొనేవారు. తీరిగ్గా టేపురికార్డరు ముందు పాడలేకపోయారు. అందుకే నాట్లు, కోతల సమయంలో దూరంగా ఉండి పాటలు సేకరించాను. కొన్నిచోట్ల రాత్రివేళల్లో చప్పట్లుకొడుతూ పాడే ఉయ్యాలపాటల్ని సేకరించాను.

క్షేత్ర పర్యటనలో సేకరించినవన్నీ నోటి పాటలే. పుస్తకాల్లో అచ్చయిన పాటల్ని కూడా ప్రజలు పాడుకుంటారు. ఐతే ఈ పాటల్లో చాలా మార్పు కనిపిస్తుంది. అప్పుడప్పుడు ఈ రెండు పాటలూ వేరువేరా అనిపిస్తుంది.

పని పాటల సేకరణ జరగలేదు. కాబట్టి మనకు ప్రజల ప్రతిఘటనలూ, పోరాటాలూ లభించలేదు. ఆ పాటలు కాలానుగుణంగా మారుతూ ఉంటాయి.

క్షేత్ర పర్యటనలో సుమారు 310 గ్రామాలు తిరిగాను. దాదాపు 600 మంది వ్యక్తులను ఇంటర్వ్యూ చేశాను. నల్లగొండ, వరంగల్, ఖమ్మం, కరీంనగర్ జిల్లాల్లోని గ్రామాలు ఎక్కువగా తిరిగాను. పోరాట ప్రదేశాలలోనూ, వాటికి దూరంగా ఉన్న ప్రాంతాలలోనూ పోరాట పాటలు పాడుకుంటారు. భద్రాచలం, పాల్వంచ గిరిజనులు ఈనాటికీ పాటలు పాడుకుంటారు. ఆ పాటలు సేకరించగలిగాను.

శ్రమ జీవులు ఉత్పత్తికి సృష్టికర్తలు. ఆయా ఉత్పత్తి సంబంధాలను అనుసరించి మానవ సంబంధాలు ఏర్పాడతాయి ఈ ఉత్పాదక క్రియలో భాగమైన శ్రమ చేసే సమయంలోనూ, ఆ తరువాత కూడా కొనసాగే ప్రజల జీవిత సంబంధాల వల్ల కళా సాహిత్యాలూ, సంస్కృతీ ఏర్పడతాయి.

భౌతిక సామాజిక జీవితం పునాది కాగా సాహిత్యం, కళలు ఉపరితలంలో ఉంటాయి. అందుకే సాహిత్యానికీ, కళలకూ అవధిలేని వనరుగా సామాజిక జీవనం పని చేస్తుంది. సాహిత్య సంస్కృతులు నిత్యనూతనమైన, సజీవమైన కళలూ శ్రమతో పాటు నిరంతరం ఉద్భవిస్తుంటాయి. అందువల్ల వర్గ సమాజంలో సాహిత్యం రెండు రకాలుంటుంది.

1 ప్రజా సాహిత్యం, కళలు
2 పాలక వర్గ సాహిత్యం, కళలు.[1]

## ప్రజా సాహిత్యం

ప్రజా సాహిత్య నిర్మాతలు ప్రజలే. ప్రజలంటే శ్రమజీవులు. శ్రమ జీవుల పాట లంటే ప్రజల పాటలే. ఈ పుస్తకంలో ఇక ముందు కూడా ప్రజ లంటే శ్రమజీవులనే భావించాలి. ఈ శ్రమజీవులు తమకు తాము వెలువరించు కున్న సాహిత్యాన్నీ, శ్రమజీవుల కోసం వారి సాహిత్య లక్షణాలతో ఇతరులు వెలువరించిన సాహిత్యాన్ని ప్రజా సాహిత్యం అనవచ్చు.

## ప్రజా సాహిత్యం మౌలిక రూపం గానం.

ఈ గానం పని పాటగా, కథలు (మౌఖిక), వీర గాధలుగా మరెన్నో రూపాలతో ప్రజల్లో ప్రచారంలో ఉంది. ఈ రూపాలన్నీ ఉత్పాదక క్రియలో అంటే శ్రమలో భాగంగా, దాని లయను అనుసరించి పుట్టినవే. (ఈ రకమైన పాటల్ని గాన కళారూపాల్ని ఈ పుస్తకంలో పరిశీలనకు తీసుకున్నాను.)

పనిపాటలు శ్రమజీవులు వెలువరించుకునేవే. ఐతే శ్రామిక గేయాలు అనే పదం కూడా వాడుకలో ఉంది. కాని ఆ పదానికి 'శ్రామికులు పాడే అన్నిరకాల పాటలు' అనే అర్థం వస్తుంది. అందుకే మరింత స్పష్టంగా ఉండడానికి కేవలం పని చేసుకునేటప్పుడు, ఆ శ్రమ సంబంధ వాతావరణం, ఆ సందర్భంలో పాడుకునే పాటల్ని మాత్రమే 'పని పాటలు' అనాలి. మరో మాటలో చెప్పాలంటే ఉత్పత్తి కోసం పని చేసే శ్రమజీవుల శ్రమ క్రమవిధానంలో మాత్రమే వెలువరించుకొనే పాటలు అని చెప్పవచ్చు.

పని క్రమం ఉత్పత్తితో పాటే పాటని కూడా సృష్టిస్తుంది. నిత్య జీవితంలో శ్రమ జీవులు ఎన్నో పనుల్లో శ్రమిస్తారు. ప్రతి శ్రమలోనూ లయ ఉంటుంది. లయ స్వభావం అతని జీవితంతో ముడిపడి ఉంటుంది. అందుకే శ్రమ స్వభావం ప్రాతిపదికగా ఈ అధ్యాయంలో వారి సాహిత్యాన్ని విశ్లేషించాను.

ఇకపోతే ప్రజా సాహిత్యంలోని రెండో రకం సాహిత్యాన్ని చూద్దాం.

సామాజిక జీవనంలో ఒక వర్గం పెత్తనం వల్ల కొంత సాహిత్యం ప్రజలకి దూరమైపోయింది. "శ్రమ లేక శ్రమ ఫలితం ధనంగా, పెట్టుబడిగా మారి భూస్వామి, పెట్టుబడిదారుల వశమవుతుంది. ఇది పరాయికరణ చెందే క్రమ దశ. ఉత్పత్తి పరాయిదై పోయినప్పుడు శ్రమ, శ్రమ సృష్టించిన సామాజిక సంబంధం నుండి పుట్టిన కళలు, విజ్ఞానం, సాహిత్యం, సంస్కృతి కూడా భూస్వామ్య పెట్టుబడి దారుల సొత్తుగా మారతాయి"[2] సాంఘిక, సాహిత్య సాంస్కృతిక రంగాలు అధికారంలో ఉన్న వాళ్ల అభిరుచులమేరకు లొంగి పోతాయి.

శ్రమజీవుల పని పాటల బాణీలను తీసుకుని వ్రతాలకు, నోములకు, భక్తి భావాలకు; వినోదానికి (ఇవ్వాళ సినిమాలకి) అనుగుణంగా మార్చుకుంటారు. ఈ విధంగా ప్రజా సాహిత్యం ఇతర వర్గం వారి భావజాల దాస్యానికి తల ఒగ్గు

తుంది. ఫలితంగా అవి ఏ సందర్భంలో, ఏ వాతావరణంలో పుట్టాయో ఆ ప్రజా జీవితానికి, సంఘానికి అతీతంగా వ్యతిరేకంగా మారి వారి నెత్తిన రుద్దడం జరుగుతుంది.

ఈ సాహిత్యంలో రూపం మాత్రం ప్రజలది. వస్తువు లేదా భావన పాలక వర్గానిది. ఇలా ప్రజా సాహిత్యం లోంచి దూరమైన సాహిత్యం పాయని దేశీ సాహిత్యమనీ, పామర సాహిత్యమనీ, జానపద సాహిత్యమనీ పిలుస్తున్నారు.

చాలా కాలంగా ఈ సాహిత్యాన్ని చాలా రకాలైన పేర్లతో పిలిచారు.[3] కాని చివరకు జానపద సాహిత్యమనే పేరు ప్రచారంలోకి వచ్చింది. సాహిత్య పరిశోధకులు, సేకర్తలు ప్రజాసాహిత్యం నుండి పరాయికరణ చెందిన ఈ సాహిత్యాన్నే ప్రధానం చేసుకున్నారు. వీరు పైపై రూపాల్ని మాత్రమే గ్రహించారు తప్ప స్వభావం రీత్యా పరిశీలించలేదు. జానపద సాహిత్యం సమాజం ఉపరితలం మీద సులభంగా లభిస్తుంది. అంతే కాదు ఎక్కువ మొత్తంలో కనిపిస్తుంది. ఈ సేకర్తలు ఈ పరిధి దాటి లోతులోకి వెళ్ళలేదు.

పరాయికరణ క్రమంలో చిక్కుకొని పాలక వర్గ సంస్కృతిలో ఒక భాగంగా మారే క్రమంలో ఉన్న 'జానపద సాహిత్యం' తెలంగాణాలో ఎక్కువ పాళ్ళలో ఉంది. ఐనప్పటికి దీని మౌలిక రూపం, భాష, బాణీ, ప్రతీకలు ప్రజా సాహిత్య లక్షణాలకు దగ్గరగా ఉంటాయి. అందుకే దీన్ని కూడా ప్రజా సాహిత్యంలో ఒక భాగంగా గుర్తిస్తూనే దీని పరిమితిని, స్వభావాన్ని పరిశీలించాల్సి ఉంటుంది. ఐతే ఏ పాళ్ళలో, ఏ క్రమ పద్ధతిలో ఈ సాహిత్యం పరాయిదై పోయిందో పరిశీలిస్తే కొన్ని ఆసక్తికరమైన విషయాలు తెలుస్తాయి. ఈ పరిశీలన అటు సాంఘిక ఆర్థిక స్థితిగతుల్ని, ఇటు సాహిత్య పరమైన కొత్త అంశాల్ని వెలికి తీస్తుంది.

ఈ సాహిత్యంపై రాత సాహిత్యపు ప్రభావం (వస్తువు, భావన, కవిత్వ వ్యక్తీకరణ) ఎక్కువ. ఐతే రాత సాహిత్యంలో అభివృద్ధి చోటు చేసుకున్న కొద్దీ ఇందులోనూ కొంత మార్పు కలుగుతూ ఉంటుంది. ఈ మార్పుల్ని మౌలికంగానే వెలువరించుకోవడం గమనార్హం. నిత్య జీవితంలో శ్రమకు అవసరంగా, శ్రమ సాధనంగా, ఆట పాటల్లోనూ, పనిపాటల్లోనూ, ఆచార వ్యవహారాల్లోనూ తమ

జీవితాన్నే పాటగా పాడుకుంటారు. ఇవన్నీ అప్పటికప్పుడు ఆయా పనుల్లో భాగంగా ఆ శ్రమజీవుల నోళ్ళ నుండి అశువుగా వెలువడినవే. ఇలా వెలువడ డాన్నే మౌఖిక రూపమని అంటున్నాం.

ప్రజల పాటల నిర్మాణ (రచన) పద్ధతి చాలా పాతది. పాటల శైలీ, లయ, శ్రవ్యత మాత్రం స్థిరంగా, నిర్దుష్టంగా ఉండదు. పాత పద్ధతి వర్తమానం లోకి నిరంతరం మారుతుంది. కాని ఆ మార్పు ఆకస్మికం కాదు. స్వాభావికంగా వచ్చే మార్పు పాట పాడే పద్ధతిలో ఈ అంశాన్ని గుర్తించ వచ్చు. ఉదాహరణకు 'బండోళ్ళ కురుమయ్య పాట' ఇది అన్ని గాన రూపాలకు వర్తించకపోయినా కొన్నిటిలో ఎక్కువ కొన్నిటిలో తక్కువగా ఈ మార్పుల్ని గమనించవచ్చు. ఈ విషయాన్ని ప్రజాసంగీతంలో మాత్రం స్పష్టంగా చూడవచ్చు.

తెలంగాణా రైతాంగంలో పాత కాలం నుంచి అవిచ్ఛిన్నంగా వస్తున్న ఆచారాలు, నమ్మకాలు నిలకడగా ఉన్నాయి. రైతాంగం ఆశలు, ఆశయాలు మత సంబంధమైన ప్రక్రియల్లో ప్రతిబింబిస్తాయి. సమాజంలో ఎలాంటి గుణాత్మక మైన మార్పులు లేనందువల్ల ప్రక్రియలోనూ, రూపంలోనూ, ఇతర కళా రూపా ల్లోనూ మార్పులు తక్కువ. ఈ మార్పు మొదటి రకం ప్రజా సాహిత్యంలో తక్కువగా కనిపిస్తుంది. రెండో రకం ప్రజా సాహిత్యంపై ఎక్కువగా కనిపిస్తుంది.

మొదటి రకం సాహిత్యాన్ని శ్రమ జీవులే ఎక్కువగా వెలువరించారు.

రెండో రకం సాహిత్యంలో ప్రజల కోసం, ప్రజల తరపున పనిచేసే వాళ్ళు ఎక్కువగా వెలువరించారు. ఐతే నిర్దిష్టంగా గిరి గీసి చెప్పడం కష్టమే.

ఇక పోతే పాలక వర్గ సాహిత్యాన్ని చూద్దాం.

## పాలకవర్గ సాహిత్యం

పాలకవర్గ సాహిత్యం బలహీనులపై అధికారం నెరపే క్రమంలో ప్రారంభ ది. ఈ అధికారం బానిసల ఏర్పాటుతో తారాస్థాయికి చేరుకుంది. రాజ్యం, రికాలు ఏర్పాటయ్యాయి. రాజపరివారం కోసం స్థావరాలు ఏర్పడటంతో

కోటలు, నగరాలు ఆవిర్భవించాయి. దాన్తో పల్లెలకీ, పట్టణాలకీ వైరుధ్యం అధిక మైంది. మెల్లిమెల్లిగా ప్రజాసాహిత్య రూపానికి దూరమైన ఆస్థాన లిఖితసాహిత్యం వెలువడింది.

ఈ సాహిత్యంలో ప్రజల జీవితంతోపాటు ప్రజాసాహిత్య స్వభావం కనుపించకుండా పోయింది. కవులు ప్రజలనుండి దూరమై ఆస్థానాలకు పరిమితమయ్యారు. వినేవారి స్థానంలో చదివేవారు వచ్చారు. రాతసాహిత్యం నోటి సాహిత్యంనుండి వేరుపడింది. కేవలం ఆస్థాన ప్రముఖులకు ఆనందం కలిగించడానికి పరిమితమయింది. రాతసాహిత్యంలో ప్రజాజీవితం, సంబంధాలు లేకుండా కృత్రిమంగా, నిర్జీవంగా తయారైంది. దీన్ని శిష్ట (*classical*) సాహిత్యమనీ, ఆస్థాన (పాలకవర్గ) లేదా విశ్రాంతి (విరామ) వర్గ సాహిత్యమనీ అంటారు.

లిఖితసాహిత్యంలో పురాణం తరువాత కావ్యం అభివృద్ధి చెందింది. కావ్యం నుంచి ప్రబంధం వచ్చింది. ఆ తరువాత ఖండకావ్యం, నవల తదితర ప్రక్రియలు వచ్చాయి. లిఖితసాహిత్య ప్రక్రియల్లోనూ, రూపం, వస్తువులోనూ కొట్టవచ్చినట్లు కనుపించేమార్పును ప్రజాసాహిత్యంలో మౌలికంగా గుర్తించడం కష్టం

ఆంగ్లేయులు వచ్చాక అట్టడుగు రైంతాంగం, ఇతర గ్రామీణ ప్రజలు ఇదివరకన్నా ఆర్థికంగా మరింత చితికిపోయారు. మధ్యతరగతి, ఉన్నతతరగతి మీద ఆంగ్లేయ సంస్కృతీ సాహిత్యాల ప్రభావంఉంది. కాని తెలంగాణా గ్రామీణ ప్రజలమీద ఆంగ్లేయ సంస్కృతీ సాహిత్యాల ప్రభావం ఏమాత్రం పడలేదు. అలాగే ఉర్దూ సాహిత్య ప్రభావంకూడా తెలంగాణా ప్రాంతపు మౌలికసాహిత్యంపై పడలేదు. అంతకు ముందునుండి అవిచ్ఛిన్నంగా వస్తున్న ప్రజాసాహిత్య కళారూపాలు అలాగే ఉండిపోయాయి.

హిందూరాజులు, ఢిల్లీ మొగల్‌పాలకులు, నిజాంనవాబులు మొ॥ వారెందరో పాలించినప్పటికీ ప్రజాసాహిత్య కళారూపాలపై, వాటి ధోరణులపై వారి ప్రభావం అంతగా కనిపించదు. తరతరాలుగా వస్తున్న ఉత్పత్తి, సంబంధాలలోని శ్రమ స్వభావంలో మార్పులేకపోవడం, తదితర సమాజపరమైన మౌలిక మార్పులు లేకపోవడం ఒక కారణంగా చెప్పవచ్చు. కాని "ధనానికీ శ్రమకూ మధ్య, పెట్టుబడికీ శ్రమకూ మధ్యగల వర్గసంబంధం పాతసమాజ గర్భంలోంచి

అత్యున్నత, విప్లవాత్మక సామాజిక సంబంధంగా విధిగా చీల్చుకుని వస్తుంది."[4] ఆదే నాటి తెలంగాణా రైతాంగ పోరాటం, నేటి శ్రీకాకుళం గిరిజన పోరాటం. ఈ పోరాటాల్లో ప్రజాసాహిత్యం పోరాటసాహిత్యంగా రూపెత్తింది. ఇలాంటి పరిస్థితుల్లోనే అంతకుముందు లేనంతమార్పు సాహిత్య కళారూపాల్లో అధికంగా సాధ్యమవుతుంది. వస్తువులోనూ, రూపంలోనూ ఈ మార్పుని చూడవచ్చు. ఈ మార్పువల్లే ప్రజలకు దూరమైన సాహిత్యం మళ్ళీ ప్రజలకు చేరువవుతుంది.

శ్రమజీవులే నిజమైన కవులూ, కళాకారులు. గుర్తింపు కలిగిన వాళ్ళ వరూ పెద్దమొత్తంలో కలిసి రాకపోయినా రైతాంగ పోరాటంలో ప్రజలే కవులూ, కళాకారులయ్యారు. ఈ అంశం నిరూపణకుగాను వారిజీవితం, జీవితంతో పెన వేసుకుపోయిన కళాభిరుచుల గురించికూడా రాశాను. మొదట శ్రమజీవుల జీవితం, పనిపాటల సమన్వయ సంబంధాల గురించి చూద్దాం.

## పని పాటల సంబంధం

ప్రజాసాహిత్యం సృజనాత్మకమైన శ్రమసంబంధాలలోంచి వెలువడుతుంది. ప్రజల శ్రమ దోపిడీకి గురవుతూ ఉండడంవల్ల, నిత్యనూతనంగా పుడుతూన్న పాటలలో ప్రజల నిరసన, తిరుగుబాటు భావాలు పుణికి పుచ్చుకొంటాయి. శ్రమ ఫలితం తమకు దక్కడానికి చేసే కృషిలో, ప్రజల పాటలే పోరాటసాధనాలై ఉపయోగపడతాయి. ఈ క్రమాన్ని తెలుసుకోవడం కోసం ప్రజల జీవితంలో ప్రధానభాగమైన పనినీ ఆ పనిలోంచి వెలువడే పాటలనీ, వాటికిగల సామాజిక సంబంధాన్నీ అర్థంచేసుకోవాలి. అప్పుడే ప్రజల పాటలస్వభావాన్ని తెలుసుకోగలం.

తెలంగాణా శ్రమజీవుల పాట వారి జీవనపరిస్థితి, వారిపై దోపిడీ, ఉత్పత్తి సంబంధాలు మొదలైన వాటిపై ఆధారపడి ఉంటుంది. కనుక ఈ అంశాలను వివరంగా పరిశీలించడం అవసరం.

ప్రజలపాటల సేకరణలో ఇంతవరకు పనిపాటలమీద ఎక్కువ శ్రద్ధ చూపలేదు. పనికీ పాటకు గల సంబంధాన్ని ప్రజలు బాగాగుర్తిస్తారు. 'పనీపాట లేనోడు' అంటారేగానీ 'పనిలేనోడు' అనరు. 'పనీ పాటా' లోని 'పని' దూరం అయ్యాక కూడా పాట ప్రజలనుండి దూరంకాలేదు. ఏపనీ లేనిసమయంలో ముద్దూ - ముచ్చట్లలో, ఆటపాటల్లో పాటఉంటుంది. పాటకి ప్రజల్లో పర్యాయ

పదం కై కట్టడం. కై (కయి, కైత) అంటే కవిత. వాళ్ళకు కవిత అంటే పాటే. కట్టడం అంటే రాయడంకాదు కూర్చడం. ఈ కూర్పు శ్రమక్రమ విధానంలోంచి వెలువడుతుంది. అంటే పని — పాటని నిర్మిస్తుంది. పనివిధానం మారినప్పుడల్లా బాణీ మారుతుంటుంది.

గ్రామీణ జీవితంలో పని ప్రధానమైనది. పనే వారి జీవితాన్ని నడిపిస్తుంది. పనిపాట శ్రమజీవియొక్క తీవ్రాభివ్యక్తీకరణ సాధనం. పనిలో లయ, సమతూకం విరామం (పాజ్) ఎక్సర్‌సైజ్ ప్రధానంగా ఉంటాయి. దానికి అనుబంధంగానే పాటలో ఈ అంశాలు ప్రతిబింబిస్తాయి. పనిపాట ఆయా ఉత్పత్తి సంబంధాలకు సంబంధించిన దశలకు, ఆ దశల ప్రయోజనాలకు అనుగుణంగా తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తుంది.

సృజనాత్మకమైన ఉత్పత్తి క్రియ పాటకు ఆధారం. అది శ్రమజీవిలో తన శక్తిని గురించిన గర్వాన్ని, ప్రేమనూ అతి సున్నితమైన భావాలను కలిగిస్తుంది. ఆత్మవిశ్వాసాన్ని కూడా పెంపొందిస్తుంది.

ఉత్పత్తి క్రియలో భాగమైన పాట శ్రమజీవిని రంజింపచేస్తుంది. ఊపునిచ్చి, అతని శ్రమశక్తిని పెంచడానికి ఉపకరిస్తుంది. ఉదా॥ కలుపు, నాట్లు, దంపుడు పాటలు.

పనిపాటలో పాడటం ముఖ్యం కాదు - పని ముఖ్యం. ఈ అభిప్రాయాన్ని జార్జి థామ్సన్ కూడా వెలిబుచ్చాడు.[8] పనిపాటల స్వరూప స్వభావాలను ఈ దృష్టితో చూడాలి. పనిపాటల్ని అక్షరాల్లో బిగించి చూడ్డంవల్ల వాటిని క్రతు గీతాలుగా, ఆచార వ్యవహారాలకు సంబంధించిన గీతాలుగా కొందరు పొరపడ్డారు. తెలంగాణాలో ప్రజలు పనిపాటని క్రతుగీతాలుగాకూడా పాడుకుంటారు. వస్తువునీ, పాటశైలినీ, రాగాన్నీ మార్చుకొని పాడుతారు. అంతేగానీ స్వభావరీత్యా, పాట నిర్మాణరీత్యా రెండు పాటలకు ఎలాంటి సంబంధమూ ఉండదు. (చూడు-పరాయీకరణ)

శ్రమ, శ్రమతో కలిసిన భాష శ్రమతో అనుబంధమై ఉన్న లయ, ఊపు పాటకు మూలంగా ఉంటాయి. ఈవిధంగా ఉత్పాదకశ్రమలో వేళ్ళు తన్నుకున్న పాటని వెలికితీయాలి. స్థూలంగా శ్రమ రెండు రకాలు.

1. నియమక్రమంలో గల శ్రమ.

2. నియమక్రమంలో లేని శ్రమ.

మొదటిదానికి పల్లకీ మోయడం, రెండవదానికి బరువులు లాగడం - ఉదాహరణలుగా చెప్పవచ్చును.

## నియమక్రమ శ్రమ

తెలంగాణా పోరాటకాలానికి ముందు దొరలు, దొరసానులు పల్లకీల్లో ప్రయాణించేవారు. పల్లకీని పెళ్ళిళ్ళలో ఇటీవలి కాలంవరకూ ఉపయోగించారు. ఈశ్రమలో నియమక్రమం ఉంటుంది. మోసేవారు ఈపనిచేయడానికి అనుభవం పొంది ఉండటంవల్ల పని సులభంగా సాగుతుంది. పల్లకీ మోయడానికి ముందు వెనకగా సమానంగా మనుషులుంటారు.

బరువుని ఎత్తుకున్న క్షణంనుండి ఉచ్ఛ్వాస - నిశ్వాసాల ఊపు ప్రారంభమౌతుంది. పదడుగులు పడగానే శ్రమకు సంబంధించిన క్రమశిక్షణ ఏర్పడుతుంది. ఒకరి అడుగు తర్వాత మరొకరి అడుగు అదే వేగంతో, ఊపులో పడుతుంది. గుంపులో అలసట కూడా అందరికీ సంబంధించిందే.

బరువు మోసేటప్పటినుంచి నోటినుండి అహ - అహ — అనే నిశ్వాసాలు వెలువడుతుంటాయి. అడుగులు వేగాన్ని అందుకుంటాయి. వెన్ను (నడుం) పై భాగంనుంచి మోచేతులవరకు ఒకరకం కదలిక, పాదాలనుంచి నడుంవరకు ఒక రకం కదలిక (బరువు మోయడంవల్ల కలిగే కండరాల కదలిక) ఉంటాయి. కదలికలు ఎక్కువ కావడంతోపాటు ఉచ్ఛ్వాసనిశ్వాసాల వేగం పెరుగుతూ ఉంటుంది. ఆవేగమే అహ-అహ- అనే కూతని హ....హ...హో....హ్లో అనీ, హాహ్లోం....గా మారుతుంది,

బాటనిబట్టి, మోసే పద్ధతినిబట్టి, (భుజం మార్చుకోవడం) అలసటనిబట్టి హహ్హం - హహ్హం - అహ్హాం....అహ్హాం ! అని శబ్దాలు మారతాయి.

ఈ శ్రమలయ, అందులోని విరామం రానురాను క్రొత్తధ్వనులకు చోటి స్తుంది. త్వరగా వెళ్ళాలనే సంకేతాన్నీ, ఊపునీ శ్రమలయ కనుగుణమైన పద - పద-పద-పద అనిగానీ, బిర-బిర-బిర-బిర అనిగానీ, నడు- నడు నడు - అని గానీ హెచ్చరించుకోవడం జరుగుతుంది.

ప్రతి మూడు నిముషాలకో, ఐదు నిముషాలకో ఆ శ్రమనిబట్టి అలసిపోయే కంఠరాల 'విరామం'లో కొన్ని చరణాలు చేరుతాయి. విరామం ఎక్కువ అవుతూ న్నట్లు భావించగానే వేగాన్ని పొందడానికి మళ్ళీ అహ్హో-అహ్హోం... హహ్హో.... హహ్హోం... అని పునరుక్తి అవుతుంది. ఇది పాటకు పల్లవిలా వస్తుంది. (ఈ పాటను గద్దర్‌ద్వారా సేకరించాను.)

అహ - అహ - అహ - అహ
హో ....హో....హో హో
హోహో....హోహో....
హహ్హం....హహ్హం (నడక వేగం పెరుగుతుంది)

పద....పద....పద....పద
బిర....బిర....బిర....బిర
పదపద........పద పద

రాజులెక్కిన రంగుల బండీ
పగడం ముత్యం పల్లకి మనది (అహ....అహ)

కంటికి దూరం

కాలికి దగ్గర

పదరా ముందుకు

పదపద....పదపద

నడునడు....నడునడు (అహ....అహ)

కడుపుల పేగులు కరకరమన్నా
కాళ్ళకు చేతులు గుంజుకు పోయినా
పల్లకి దించకు
పదరా ముందుకు (అహ....అహ)

పాటలోని చరణాలను సమూహంలో ఒక్కొక్కరు ఒక్కో సమయంలో ఉచ్చరిస్తారు. బరువూ, బాధా అందరిది కాబట్టి అవి అందరూ పంచుకొంటారు. పల్లవిని అందరూ అందుకుంటారు.

ఈపాట భూస్వామ్య ఉత్పత్తి సంబంధాన్ని సూచిస్తుంది. శ్రమజీవులు తయారుచేసిన రంగులబండీ, దాని అలంకరణలో సృజనాత్మకతా కనిపిస్తుంది. వాళ్ళు తయారుచేసిన పల్లకిని వాళ్ళే మోయాలి. అంటే మళ్ళీ వాళ్ళే నడపవలసి వచ్చింది.

ఇంతగా మమేకమైన ఆ వస్తువు 'పగడం ముత్యం పల్లకి మనదీ' అని అనుకోగలరు. అంటే ఆవస్తువుని తమదిగా భావించుకొంటారు. కానీ తమది ఎలా అవుతుంది? ప్రస్తుతం అది ఎవరి అజమాయిషీలో ఉంది? అనే చైతన్యం వారికి లేదు. శ్రమజీవులు శ్రమ చేయడానికి నిరాసక్తులు కారు. 'కంటికి దూరం కాలికి దగ్గర' అని ధీమాగా చెప్పుకొని గమ్యాన్ని చేరతారు. ఆ ధీమావల్లనే 'పదపద, నడునడు' అనే భావన వెలువడుతుంది. ఉత్పత్తి సంబంధాల్లో పాల్గొనే శ్రమ జీవుల ఐకమత్యం పనిలోనూ, పాటలోనూ ప్రతిబింబిస్తుంది.

## నియమక్రమంలో లేని శ్రమ

శ్రమ నియమక్రమంలో లేకపోయినా, లాగే బరువు లేదా మోసే బరువు నియమితంగా ఉండొచ్చు. ఒక్కోసారి ఉండకపోవచ్చు. ఈభేదాన్నిబట్టి పాటలు మళ్ళీ రెండురకాలుగా ఉంటాయి. టెలిఫోను స్తంభాలను మోయడంలో శ్రమ ఉంది. కూలిపోయిన చెట్టును తీసెయ్యడంలో కూడా శ్రమఉంది. టెలిఫోను స్తంభాలలో బరువు నియతంగా ఉంటుంది. పైగా శిక్షణపొందిన కూలీలుంటారు. పనిచేసేచోటూ, గమ్యం మొ॥వి నిర్దేశితమై ఉంటాయి. కూలిపోయిన చెట్టును తీసేయడంలో శ్రమ ఇందుకు భిన్నంగా ఉంటుంది. బలం ఉండడమే అర్హత.

శ్రమజీవులకు ప్రత్యేకమైన శిక్షణ ఏదీ ఉండదు. ఈ రెండురకాల పాటల్ని విశ్లేషిస్తే కొన్ని పోలికలూ, తేడాలు కనిపిస్తాయి.

ఈ పాటలు 'హాయ్' 'హెసో', 'హైసో' వంటి కేకలతో ప్రారంభ మవుతాయి. ఇక్కడ శ్రమజీవులు సామూహిక శ్రమకు ఉద్యుక్తులవుతారు. 'లాగండి' 'కొట్టండి' వంటి మాటల్లో చేయవలసిన పనిని ఒకరికొకరు తెలియ జేసుకొంటారు. బరువును మోయడం వల్ల లేదా లాగడం వల్ల కండరాలలో కలిగే క్లిష్టమైన పరిస్థితిని 'లాగండి', 'కొట్టండి' వంటి చిన్నచిన్న మాటల్ని ఆవేశంగా వ్యక్తీకరిస్తారు పని మొదలై సాఫీగా సాగుతున్నప్పుడు ఆ కేకల స్థానంలో లేదా చిన్నచిన్న మాటలస్థానంలో చరణాలు చోటు చేసుకొంటాయి. పనిలోని దశలనుబట్టి పాట పరిణతి ఉంటుంది.

మళ్ళీ ఈ పాటలోని చరణాన్ని ఎప్పుడూ ఒకే విధంగా పాడరు. భూస్వామ్య ప్రతినిధి కాపలా ఉన్నప్పుడు[7] ఒక విధంగానూ, లేనప్పుడు[8] మరొక విధంగానూ పాడతారు. శ్రమ సామూహికంగానే కాక వ్యక్తిగతంగా కూడా ఉంటుంది.

## వ్యక్తిగత శ్రమ - పాట

ఇందుకు ఉదాహరణగా మోటపాటల్ని తీసుకోవచ్చు. మోట, ఏతం గూడు వేయడం ఇవన్నీ వ్యవసాయానికి సంబంధించినవి. ముఖ్యంగా నీళ్ళ తోడే పనికి చెందినవి. రాటుకి, ఏతానికీ, గూడుకి ఇద్దరు ఉండగా మోటకు మాత్రం ఒక్కరే ఉంటారు

పాటలోని రాగం మోటపనికి అనుగుణంగానే ఉంటుంది. పనికి ఉద్యుక్తుల్ని చేస్తుంది. మోటపాట శ్రమపాటే అయినప్పటికీ దీనికి కొంత విశ్రాంతి స్వభావం ఉంటుంది.

'చింతా కిందారో మోటారా
చిగురు మామంచి ఎడ్లబోడోయి
నీ యద్దుల మెడమీద షదిర ఖాడోయి'[10]

చుట్టూరా ఆకులు కదలడం, చెట్లు ఊగడం, చీకటి నెమ్మదిగా తొలిగి వెలుగు పర్చుకోవడం, పశువులు లయబద్ధంగా అడుగులు వేయడం. మెడలో గంటల శబ్దం, బావిగిలక గరగరలాడ్డంతో ఒక మంచి వాతావరణానికి అనుకూలమైన పాట రాగయుక్తంగా శ్రమజీవి కడుపులోంచి వెలువడుతుంది. ఇందులో సామూహికంగా బరువు లాగుతున్నప్పుడు పాడే పాటలో లాగా చరణాలు, పదాలు విరగ్గొట్టడం ఉండదు. రాగం, పాట పేర్పు చాలా పొందికగా ఉంటాయి.

చివికి చిల్లులు పడ్డ తొండం బొక్కెనలోంచి నీళ్ళుకారి పోతూంటాయి. నీళ్ళుపడ్డశబ్దం మోటగొట్టె రైతు గుండెను కలచివేస్తుంది. పొద్దెక్కుతుంటుంది. ఎండ కొరకొరలాడుతుంటుంది. అతను, అతని పశువులు అలసిపోతుంటాయి. అలాంటి పరిస్థితుల్లో జీవితమంతా పరులకోసం అలసిపోయిన అనుభవంలోంచి గతజీవిత సారాన్ని పాటగా వెలువరిస్తాడు.

తొండామంతా తొర్రావాయె
బొక్కెనంతా బొర్రవాయె
బొల్లికోడె గిల్లు సేరె
సిన్నా పిల్లగా[11]

బొందామాడి యెండిపోయె అంటూ శ్రమజీవి తన మనస్సులో వెలితినే పాటగా పాడుకుంటాడు. ఈ విధంగా శ్రమ - పని - వాతావరణం - పరిస్థితి అనే అంశాలు పనిపాటల్లో చాలా ముఖ్యం.

## స్త్రీల పనిపాటలు

గణసమాజంలో స్త్రీ కూడా పురుషునితోపాటు సమానంగా కష్టించి పనిచేసింది. రాను రాను శ్రమవిభజనలో మార్పులు, వర్గాల ఏర్పాటు ఫలితంగా స్త్రీల పనులు, పురుషుల పనులు, బాధ్యతలు వేరయ్యాయి. ఎక్కువ శారీరక శ్రమగల పనులు పురుషుడు చేస్తూ, తక్కువ శారీరక శ్రమగల పనులు చాలావరకు స్త్రీలు నిర్వహించడం మొదలయినది. భూస్వామ్య యుగం ప్రారంభానికల్లా పురుషాధిక్యత వేరూనుకుంది. స్త్రీలపై యజమానివర్గాల దౌర్జన్యాలూ మెండయ్యాయి. వాటికి బలైపోయిన స్త్రీలకథలే స్త్రీలపాటల్లో

చోటుచేసుకొన్నాయి. పనిలోనూ, విరామకాలంలోనూ స్త్రీలు ఆ పాటలు పాడు కొంటారు. ఐనా తమకు తెలియకుండానే భూస్వామ్య నీతికి లోబడి పోతున్నారు. ఉదాహరణకు ఈ క్రిందిపాటను పరిశీలించవచ్చును.

| | |
|---|---|
| సతులారా మీరు ఉయ్యాల్లో | సద్బోధ వినరండి ఉయ్యాలో |
| పతిభక్తియు ,, | పచ్చలా పధకమ్ము ,, |
| భర్త సేవలు మీకు ,, | బంగారి గొలుసులు ,, |
| కష్టాలోర్చుటే ,, | కనకపు సాకట్లు ,, |
| కులాభిమానంబు ,, | అ(?)జాల కమ్మలు ,, |
| ఈ సొమ్ములు మీరు ,, | ఇంపుగ తలవండి ,, |
| ఈ సొమ్ములవంటి ,, | ఏ సొమ్ములుగలవు[12] ,, |

శ్రమనుండి, ఉత్పత్తినుండి దూరమైన స్త్రీలు వినోదగీతాలు, ఆచార - క్రతుగీతాలు పాడుకోవడానికి అలవాటుపడ్డారు.

జానపద సాహిత్యం పేరుతో పరిశోధనలు చేసినవారు మామూలుగా శ్రామికస్త్రీని ఆమె శ్రమజీవితం నుండి, శ్రామికవర్గ సంస్కృతినుండి వేరు చేశారు. నిజానికి ప్రాంతాన్నిబట్టి అక్కడి కులమత వర్గాలనుబట్టి ఆయా స్త్రీల జీవనవిధానం ఉంటుంది. ఆ జీవనవిధానాన్ని అనుసరించే స్త్రీల చైతన్యం ఉంటుంది. ఆ చైతన్యాన్ని ఆధారం చేసుకొనే వారి పాటల్లో ఇతివృత్తం ఏర్పడుతుంది.

వర్గ సమాజంలో పురుషునిలాగే శ్రామిక స్త్రీకి స్వేచ్ఛలేదు. పొద్దస్తమానం పురుషునితో సమానంగా స్త్రీ పనిచేయడం భూస్వామ్య సమాజంలో తప్పనిసరి. ఇక్కడ స్త్రీ పురుష భేదంకన్న భూస్వామ్య నీతి, దాని ప్రయోజనాలే ప్రాముఖ్యం వహిస్తాయి.

నైజాం కాలంనాటి జమిందారీ, జాగీర్దారీ వ్యవస్థలో గ్రామంలోని అన్ని రకాల భూములపైనే కాదు, అన్ని విషయాలపైనే కాదు, స్త్రీలపై కూడా భూస్వామ్య అధికారం చెల్లవలసిందే.

వూరికి పాటేల్కు ఉయ్యాలో
నాతాన కొకనాడు ,,
మంద తోలరాద ,,
మందవోలే నేను ,,
ఖర్తెము యియ్యాను ,,
పై ఖర్చుకు నేను ,,
పైసాలు యియ్యాను ,,
.... .... .... ,,
.... ... ....
నాతీ నొకనాడు ,,
మరి తోలరాదా ,,[18]

అనేకామంది భార్యలు కలిగి ఉండడం, అడబాపవిధానం, దాసీలు, దేవదాసి పద్ధతిమొదలైన విధానాలు తెలంగాణంలో సాంఘికంగా అమలుజరిగాయి. ప్రజలు నూటికి తొంభయితొమ్మిది మంది నిరక్షరాస్యులే. ఉత్పత్తిలో పాల్గొనే స్త్రీలు నాలుగు గోడలకు పరిమితంకావడం అసాధ్యం. పనులకు పోయినప్పుడో, పండగలకూ, పబ్బాలకూ బయటకు వచ్చినప్పుడో - దొరకో, అధికారులకో లొంగక తప్పని పరిస్థితి. పశువుల మందకూ, స్త్రీలకూ తేడా లేకపోవడాన్ని పై పాటలో చూస్తాం. నాతి అంటే స్త్రీ.

సమర్తపట్టి, షాదీపట్టి మొదలైన పేర్లతో అర్థంలేని పన్నులు విధించి స్త్రీలను హీనంగా చూడడం పరిపాటి అయింది. ఇలాంటి పరిస్థితులలో స్త్రీలు వెట్టిచాకిరి వల్ల, ఇంట్లో పనిభారం వల్ల క్రుంగిపోయారు. ఇలాంటి స్త్రీకి శారీరక, మానసిక విశ్రాంతే లేదు. ఎలాంటి వినోదమూ లేదు. పనిలో పాడుకొనే పాటల్లో, విరామకాలంలో పాడుకొనే పాటల్లో తమ జీవిత పరిస్థితినీ, నిరాశనీ వెళ్ళగక్కేవారు. అయితే విరామకాలం మాత్రం అరుదే.

స్త్రీల శ్రమ రెండు రకాలు—

1. ఇంటిబయట చేసే పనులు (ఉత్పత్తి శ్రమ)
2. ఇంటికి పరిమితమైన పనులు

నాట్లు, కలుపు, కోతలు మొదలైన పనుల్లో కొన్ని మధ్యతరగతి రైతు కుటుంబాల స్త్రీలు పాల్గొంటారు కౌలు తీసుకొన్న భూమిలో మొత్తం కుటుంబం కలిసి కాయకష్టంచేసి పంటలు పండిస్తారు. వీరిలో కొంతమంది మాత్రం ఇంటిపనుల కోసమో, వ్యవసాయంకోసమో, పశువులు కాయడానికో చిన్నచిన్న పాలేర్లను పెట్టుకోగలరు. వీరికి వ్యవసాయం మీద వచ్చే ఆదాయం మామూలుగా కుటుంబావసరాలకు సరిపోతుంది. ఎక్కువమంది రైతులు తరచు అప్పుల పాలవుతుంటారు. కూలీలను పెట్టుకొని పనిచేయించుకోలేరు. అందుకే కుటుంబ సభ్యులందరూ కలసికట్టుగా పొలాల్లో పనిచేస్తారు. తమకోసం శ్రమపడటమే కాకుండా భూస్వామి కోసం కూడా శ్రమజీవుల కుటుంబసభ్యులు [14] తప్పనిసరిగా వెట్టి చేయాల్సివస్తుంది.

రైతు కూలీ స్త్రీలు పూర్తిగా కూలీ పనిమీద ఆధారపడి జీవిస్తారు. కొంత మందికి ఎకరమో, అర ఎకరమో ఉన్నప్పటికీ ప్రధానంగా కూలీ డబ్బు వల్లనే జీవితం గడుస్తుంది. ఈ కుటుంబంలో అయిదేళ్ళ పిల్లవాడి దగ్గర్నుంచి డెబ్బై ఏళ్ళ ముసలివాళ్ళ వరకు కూలీ పనులు చేయవలసిందే. వీళ్ళు భూస్వాముల అదుపాజ్ఞల్లో ఉంటారు. గడిలో వెట్టిపని చేస్తూనో, పశువులు కాస్తూనో, దొరల భూముల్లో పొద్దస్తమానం పనిచేస్తూనో జీవిస్తారు.

చాకలి, మంగలి, కుమ్మరి, హరిజన, బేగరి, నీరడి, మస్కూరి మొదలైన కులాల స్త్రీ పురుషులు దొరలకు, దొరసానులకు చాకిరి చేయాలి. [15] ప్రతి సంవత్సరం దొరలకు గొల్లలు గొంగళ్ళనేసి ఇవ్వాలి. మేదర్లు గంపలు, చేటలు, తట్టలు, తడకలు అల్లి ఇవ్వాలి. కుండలు, ముంతలు - కుమ్మర్లు ఇవ్వాలి. బట్టలు, చీరెలు సాలెవాళ్లు; కట్టెలబండ్లు వడ్లర్లు ఇవ్వాలి. ఈ ఉత్పత్తి క్రమలో స్త్రీల భాగం కూడా ఉంది. ఇలాంటి వృత్తికులాలవారే గాకుండా అయ్యగార్లు, బ్రాహ్మణ కులాలకు చెందిన స్త్రీలు విస్తర్లు కుట్టి గడికి పంపాలి.

ప్రొద్దున లేచింది మొదలు పిల్లలకు వండిపెట్టి, పొలానికిపోయి పని చేయడం వరకు రోజువారీ జీవితంలో శ్రమ ఒక ప్రధాన భాగమైంది.

ఎగజాముున లెగి అన్ని పనులు చేసి
ఏంటరాయో ఎల్లి ఇంటి ముంగటికి

సూర్యుడూ పొడిసేనూ సుక్కల్లు పోయేను
కళ్ళాపు సల్లేటి ఏళ్ళాయే రాయే
అంబాలి కాయలే అంటందుకోవాలె[16] ఇలాటి జీవితం గడిపే శ్రమ జీవుల పాటల్లో వారి భౌతిక జీవితాన్ని అనుసరించే పాటలు వ్యాప్తిలో ఉన్నాయి.

* * *

నాట్లు, కలుపులు, కోతలు - ఇవి మూడూ వ్యవసాయ ఉత్పత్తికి సంబంధించి ప్రధానమైన పనులు.

నాట్లకైనా, కోతలకైనా ఊళ్లోని స్త్రీలందరూ ముందుగా దొర పొలానికే వెళ్ళాలి. దొర పొలంలో పని అయిన తర్వాతే సొంత పొలాల్లో పనిచేసుకోవాలి. అందుకు భిన్నంగా ఎవరైనా నడిస్తే వారికి జుర్మానాలు విధిస్తారు. పనిలో ఏ మాత్రం విశ్రాంతి తీసుకోగూడదు. ఏ కారణం వల్లనైనా కొద్దిసేపు పని ఆపితే, వెంటనే అజమాయిషీ చేసే దొరబంటు బూతులు తిడతాడు. అంతేకాదు పసి పిల్లలకు పాలు ఇచ్చి రావడానికి కూడా ఒప్పుకోడు.[17]

## నాట్ల పాటలు

నాట్లు వేయడం[18] ఒక సామూహిక శ్రమ. దీని పాట కూడా సామూహికమే. నాట్లపని చేస్తూనే, శ్రమలో ఒక భాగంగా తమ కోర్కెలను వెల్లడించు కొంటారు.

ఇడదీసి వరిమొక్క లెడమెడముగా పాతండీ
బాదనక బందనక పాటుపడినామంటే
మారాజు పనిచూసి మనకినామిస్తాడు
ఆ వూరి మారాజు బదబా లిస్తేను
ఈ వూరి మారాజు ముప్పావు లిస్తాడు[19]

పనిచూసి దొర ఎలాగూ మెచ్చుకోడు - పాటతోనైనా దొరని మెప్పించి ఎక్కువ కూలీ పొందాలని ఆశిస్తారు.

## కలుపు పాటలు

కలుపుల్లో కూడా స్త్రీలే పని చేస్తారు.[20] ఈ పనికి ఎంతో ఓర్పూ, నేర్పూ అవసరం. ఈ పనిలో నాట్లమీద అడుగుపడకుండా, చాలులోనే జాగ్రత్తగా కదులుతూ పాదు తగ్గర ఉన్న కలుపు మొక్కల్ని పీకి వేయాలి.

పొలాల గట్టుకాడ పోచవ్వకు మొక్కి
కలుపుదీయ దిగుతాము కామాక్షిలాయె
చేలోకి పోవాలె చింగులు చెక్కి
కలుపులు తీయాలె కామాచ్చి రాయే [21]

వీరు పనిలో లీనమయ్యేసరికి ఒక సమష్టి క్రమ స్వభావం ఏర్పడుతుంది. కొంతసేపటి తర్వాత అందరి చేతులు కాళ్ళ కదలికలు ఒకేలా మారిపోతాయి. శ్రమ సమూహాన్ని ఒక క్రమ పద్ధతిలోకి నెడుతుంది. ఎవరో ఒకరు పాటను అందుకొంటారు. లేదా పదం ఎత్తుకోమని సూచన చేస్తారు. పాట ఎత్తుకోక ముందు పని మందకొడిగా ఉంటుంది. పాటతోపాటు పని వేగం పెరుగుతుంది. లేక, పని వేగాన్నిబట్టి పాట సాగుతుంది. ఈ పాటలు దీర్ఘ గేయాలు. ముఖ్యంగా స్థానిక గాధలు. స్త్రీలకు జరిగిన అన్యాయాలూ, ఆత్మహత్యలూ, కష్టాలూ మొదలైనవి కథా వస్తువులుగా ఉంటాయి.

పౌరాణిక కథలుకూడా పాడుకొంటారు. ముఖ్యంగా స్త్రీలను కదిలించే ఘట్టం వారి పాటకు ప్రాణం. స్త్రీ సహజమైన కరుణభావాలు వారికి ఇష్టంగా ఉంటాయి.

శ్రమ క్రమంలో అలుపు అందరికీ ఒకేసారి వస్తుంది. అలసట పని వేగాన్ని తగ్గించగానే అదే ఎత్తున పాట వేగంకూడా నెమ్మదిస్తుంది. పాటపాడే స్త్రీ కూడా అలసిపోతుంది. పాట మాత్రం ఆపదు. పనితోపాటే అదీ సాగిపోతూనే ఉంటుంది.

## కోతల పాటలు

నాట్లు కలుపుల్లాగే రెండు మూడు రోజులు అటు ఇటుగా పొలాలన్నీ కోతకు వస్తాయి.

కోతలకు కొడవళ్ళు పరికరాలు. వరి కోయడానికి (ముంపుకోత =ముమ్మరంగా కోసేవి) పెద్ద కొడవళ్ళు వాడుతారు. వ్యవసాయ ఉత్పత్తిలో స్త్రీ పురుషుల శ్రమను బేరీజు వేసి చూస్తే స్త్రీల శ్రమే అధికంగా కనబడుతుంది. వారి పాటల్లోనూ ఈ విషయం వ్యక్తమవుతుంది.

పురుషుడు నాగలితో దున్నుతున్నప్పుడు స్త్రీ విత్తనాలు వేస్తుంది. పురుషుడు మోటగొడితే స్త్రీ నీళ్ల పారిస్తుంది. మళ్లు కడుతుంది. కాలువ తీస్తుంది. నీళ్లు మళ్ళిస్తుంది. నాట్ల కార్యక్రమంలో స్త్రీలే ఎక్కువగా శ్రమిస్తారు.

పురుషుడు కట్టలు అందిస్తుంటే స్త్రీ నాట్లు వేస్తుంది. నడుంవంచి, వెనక్కి అడుగులు వేస్తుంది. పంట కోస్తూ ముందుకు పోతుంది. ఎడంచేత పట్టుకొని కుడి చేత్తో కోసిన పైరును వెనక్కి గిరాటేస్తుంది. అది ఒక కుప్పగా అవుతుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా ఈ కదలికలను బట్టి ఉంటాయి.

పని విధానం, స్వభావం ఒక్కటే. పనిలో వాడే పరికరంకూడా ఒక్కటే. అది పెద్ద కొడవలి. ఇలాంటి సామూహిక శ్రమ, దానికి ఉపయోగించే పరికరాలను బట్టి పాటలోని లయ, రాగం అన్ని కంఠాల నుంచి ఒకే విధంగా వెలువడుతుంది.

తెలంగాణా ప్రాంతంలో నాట్లల్లో, కలుపుల్లో, కోతల్లో పాల్గొనే శ్రామిక స్త్రీలు పనిలో అడ్డు రాకుండా చీరను గోచీ పెడతారు. తల వెంట్రుకల్ని సిగలా ముడచి కడతారు. కొంగును నడుముకు బిగిస్తారు. పనీ, వేష భాషలు అందరికీ ఒకేలా ఉన్నట్లుగానే శ్రమజీవు లందరి జీవితాలు సుమారు ఒకేలా ఉంటాయి. వారి ఆశలూ, ఆశయాలూ కూడా. ఒకరి లాభం అందరిదిగా భావిస్తారు.

> కోతకొయ్యండమ్మలాలా సేలూ కోరకున్నా అమ్మలారా
> ఆరుమూడు కాలమైన ఆసరుకి మరి కొసరు లేదు
> సోడి సేలు ఎన్నులేసి సోలెడు గింజలైతే
> పాలేర్ల బత్తాలకు పనికొచ్చునూ కొయ్యండి
> దసరా బోగాలంటే ఆసరా తీరుస్తాయి.
> పసరానిక్కసవుంటే భాగ్యాలే పండ్తాయి.

సాలొచ్చిన దొరవారు సెంబులుగా యిస్తారు
కాసు సేత పడితేసు గగన మూడేసు సేను[22]

కోస్తున్నప్పుడు కాళ్ళకు పని తక్కువ. చేతులకు పని ఎక్కువ. కాని బురదలో అడుగులు వేయడంవల్ల కాళ్ళకు కూడా శ్రమ కలుగుతుంది.

అడుగుల శబ్దం, వరికోసిన కొడవలి శబ్దం, కోసిన వరికట్ట వెనక్కి వేసిన శబ్దం పాటకు ఒక విధమైన లయని కూర్చుతాయి. కోతల్లో పని జాగ్రత్తగా చేయాలని చెబుతూ ఆ పని క్రమాన్ని కూడా పాడుకోవడం జరుగుతుంది. వానలు వరదల్లో వంగిన చేనుని తిన్నగా విడదీసి కోయాలని సూచిస్తుంది ఈ పాట.

కొయ్యండల్లా కొయ్యండి
కోసి ఒణుపూ లేయ్యండి
వానల వరదల వంగిన సేను
తిన్నగ దీసి మొదలుకోసి
పనలన్నీ నీ పంజెట్టావా
గింజలు, ఐందలు పడిపోకుండా
పొందుగ వెన్నులు కోయండల్లా
కాలం సూత్రె శీతాకాలం
కొడవలి పాటు జాగ్రత్తా
కాలూ సెయ్యీ ఆడితేనే
కుండలో కూడు కనిపిస్తాది[23]

నాట్లు, కలుపు, కోతల పాటలకు భేదం ఎక్కువగా ఉండదు. మూడు రకాల పాటలు ఒకేలా ఉంటాయి. ఒక పాటనే ఈ మూడు సందర్భాల్లోనూ పాడుకుంటారు. ఈ మూడింటిలో పని విధానంలో మార్పు తక్కువ. పాటని ఆయా పనుల స్వభావానికి అనుగుణంగా మార్చుకొని పాడుకొంటారు. పాట స్వభావం, రూపం ఒక్కటే. ఇందులో మార్పు ఉండదు. శారీరక చలనాన్ని బట్టి పాట పాడటంలో కొంత మార్పు ఉంటుంది.

ఇలాంటి పనిపాటల్లో పనిచేసే సమయం ఎక్కువ. పనికూడా ఒకేలా యాంత్రిక స్వభావం కలిగి ఉంటుంది. పాడినప్పుడల్లా పాట నిర్మాణమైన మార్పుకు లోను కాదు. వస్తువులో కొంతమార్పు కలగడానికి అస్కారం ఉంది. ఇది పనిచేసే స్త్రీలని బట్టి ఉంటుంది.

ఈ పాటలో కథ ఏదైనప్పటికీ కథలోని పాత్రలూ, సంఘటనలు పరిచిత మైనవిగానే ఉంటాయి. ఆయా పాత్రలకు కలిగిన కష్టాలను తమవిగా భావించు కుంటారు. మమేకత్వం పొందుతారు.

ఈ రకం పాటల్లో కథకు లేదా సంఘటనకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. పాటలో క్రమమైన పేర్పు అనివార్యంగా ఏర్పడుతుంది. సాలీడు దారంలాగా పాట సాగిపోతూ ఉంటుంది. ఇలాంటి కథాకథనంలో సామాజిక వాస్తవికత అనివార్యంగా చోటుచేసుకుంటుంది.

పాటల్లోని కొన్నిఘట్టాల్లో, వ్యక్తీకరణంలోనూ కంఠస్వరంలోనూ మార్పు కనిపిస్తుంది. కథలోని భావానికి తదాత్మ్యం చెంది, ఆ పాత్రల్లోకి తామే ప్రవే శిస్తారు. కథాక్రమంలో వారి స్పందనలకీ, చేస్తున్నపనికీ, పనివేగానికీ అంతర్లీ నంగా ఒక సంబంధం ఉంటుంది. ఈ పాటల్లో మూలకథ పాత్రలు చాలా వరకూ మార్పు చెందవు. ప్రాంతాన్ని బట్టి, వాతావరణాన్ని బట్టి, పనిచేస్తున్న సమూహాన్ని బట్టి సంఘటనలు మార్పుచెందుతాయి. ఒక కథ వివిధ ప్రాంతాల్లో వివిధ రీతుల్లో కనిపించడానికి ఇదేకారణం. అసలు కథ దేశకాల పరిస్థితుల్తో వీరికి నిమిత్తంలేదు. సొంత సాంఘిక జీవిత పరిధినుండి బయటపడలేరు. తమ జీవిత సత్యాలను, అనుభ వాలను,అనుభూతులనే ఎప్పుడో జరిగిన కథలో ఇముడుస్తారు. అందువల్లనేయథార్థ గాథల్లో లేని సంఘటనలూ, స్వభావాలూ మనకు ఈ పాటల్లో కనిపిస్తున్నాయి. ఈ రకమైన మార్పు ప్రధానంగా పనిపాటల్లోనే ఉంది.

ఇందుకు కారణం ఈ పాటలు మౌఖికరూపంలోబతకడమే. ఆశుధోరణిలో వాటిని మార్చుకోగల సామర్థ్యం శ్రమజీవులకు మాత్రమే ఉంది. ఉదాహరణకు వాడుకలో ఉన్న 'కలికి కామాక్షి' కథను పరిశీలిద్దాం. కామాక్షి తనను తీసుకు పోవడానికి అన్నలొచ్చారని తెలియజేస్తూ, తనను పుట్టింటికి పంపుతారా అని మామను, అత్తను అడుగుతుంది. చివరగా "రచ్చలో కూర్చున్న రాజేంద్రభోగి

మా అన్నలొచ్చారు మమ్మంపుతారా'' అని భర్తను అడుగుతుంది. "పెట్టుకో సొమ్ములు, కట్టుకో చీర పోయిరా సుఖముగా పుట్టింటికిని" అని అతడు ఆమె ప్రయాణానికి అంగీకరిస్తాడు. ఇది ఉన్నతవర్గం వారి కథ అని చెప్పకుండానే తెలుస్తూంది.

ఈ కథ క్రమాన్ని శ్రమజీవులు తీసుకొని వేరేకథలో వేరే సందర్భంలో జోడించారు. ఉన్నతవర్గం వారికథ బడుగువర్గం వారి పాటలో ఒక ఉపకథగా మారిపోయింది. వీరి కథానాయికకు అడిగిపోవడానికి తల్లితప్పి ఎవరూ లేరు. ఆమె కోతకోస్తూ శ్రమిస్తూ ఉంటుందనే వారి భావన. ఎందుకంటే వారు ఆపనే చేస్తారు కనుక.

| | |
|---|---|
| కోతల్లో మునిగున్న | ఉయ్యాలో |
| నాయికన్నా తల్లీ | ,, |
| కొడవల్లి లిక్కిని | ,, |
| కోసేటి పానాపు | ,, |
| అల్లుడొచ్చేనమ్మ | ,, |
| గాలెక్కి వచ్చేనె | ,, |
| గాయిగాయి చేసెనే | ,, |
| నను పంపకదలవే | ,, |
| నాయి కన్నా తల్లీ | ,,[24] |

ఇలాంటి సన్నివేశాలను ప్రతిపాటలోనూ కలుపుతారు.

## ఇంటికి పరిమితమైన పని పాటలు:—

### విసుర్రాయి పాటలు:—

పొద్దస్తమానం పనిచేసి ఇంటికి రాగానే ఆపూటకోసం ఆహారపదార్థమేదీ సిద్ధంగా ఉండదు. దానికోసం వారు మళ్ళీ శ్రమించాల్సి ఉంటుంది. అప్పటి కప్పుడు ధాన్యం విసురుకొని వండుకోవాల్సి వస్తుంది. పొట్టపోసుకోవడమే

గగనమైన ప్రజలకు ఆహారపదార్థాలు నిలువచేసుకొనే తాహతు లేదు. తెలంగాణాలో చాలా మందికి "గటక" జొన్నరొట్టెలు ప్రధానమైన ఆహారం. జొన్నలు విసరినప్పుడు రవ్వ, పిండి వస్తుంది. వీటిని వేరుచేసి రవ్వను 'గటక'గా చేసుకుంటారు. పిండిని రొట్టె చేసుకుంటారు.

గ్రామంలో ఉన్నతవర్గాలవారు మాత్రమే ఆహారపదార్థాల్ని నిలువచేసుకోగలరు వడ్లు దంచి, పిండిచేయడం నిత్యావసరం. వీరి కుటుంబాలలో జరిగే వేడుకలు, పండుగల సందర్భాల్లో విసరడం, దంచడం వంటి పనులు చాలా పెద్ద ఎత్తున జరుగుతాయి. అలాంటి సందర్భాలలో ఈ కుటుంబాలలోని స్త్రీలు కూలీలపై పెత్తనం చెలాయిస్తారు. విసరడానికి, దంచడానికి, కూలీస్త్రీలను నియమిస్తారు. ఇద్దరుగానీ, ముగ్గురు గానీ, విసరడంలో పాల్గొంటారు. ఈ విసుర్రాళ్ళు గుండ్రంగా రెండడుగుల నుండి ఒక అడుగు వరకు ఉంటాయి.

ముగ్గురిలో ఎవరో ఒకరు పిడికిలితో ధాన్యంపోస్తారు. పోసిన ధాన్యం పిండి అవుతున్న క్రమంలోనే శబ్దం మారుతుంటుంది. విసురుతున్నప్పుడు మిగిలిన వారితో సమానంగా ఎక్కువ తక్కువలు లేకుండా సాఫీగా పనినడవాల్సిందే. లేని పక్షంలో క్రమం తప్పుతుంది. క్రమం తప్పితే పని కుంటుపడ్డట్లే.

విసురుతున్నప్పుడు ముందు ఎవరో ఒకరు శబ్దాన్ని అనుసరించి "బండా మీద పాపమ్మా పంట్లెండా బోసె" అని రాగాన్ని తీస్తారు. విసిరేటప్పుడు ఈ పదాలు సాగుతాయి. శబ్దంరాగంలో ఇముడుతుంది. ఒక్కోచరణం పాడేటప్పటికి విసుర్రాయి రెండుచుట్లు తిరుగుతుంది.

విసుర్రాయిలో ధాన్యం పోసేపాళ్ళ కదలికనుబట్టి పాటసాగుతుంది. విసిరే క్రమంలో అలసటనిబట్టి, చేతులు మార్చడాన్నిబట్టి, పాటరాగం మారుతుంటుంది. చెయ్యి మారుతున్న సమయంలో గాజుల చప్పుడు, కర్రపిడిని రాయితో కొట్టిన శబ్దం మొదలైనవి పాటకి అదనపు శబ్దాలను, విరామాన్ని కలిగిస్తాయి. ఈ విరామంలో —

"పారిపోయినోడు — పారిపోయినోడు
పండందూ కొచ్చే కొట్టాకు పాపమ్మో" 25

అని విరామంలో రాగాన్ని తీస్తారు. విసుర్రాయి తిరిగే గరగర శబ్దమే ఆ పాటకి శ్రుతిగా ఉంటుంది.

ధాన్యంపోసి కొంతసేపు విసిరిన తరువాత పనివేగం హెచ్చుతుంది, అప్పుడు రాగం తారస్థాయి నందుకొంటుంది. వేగం ఎక్కువయిన తర్వాత పాట ఆగుతుంది, పని నడుస్తూనే ఉంటుంది.

విసురుతున్న సమయం. స్థలం, సందర్భం, సమూహాన్ని బట్టి పాటలోని వస్తువు ఉంటుంది. దొర గడిలోనైతే పాట మతానికి, దైవభక్తికి లేదా స్త్రీలకు సంబంధించినదై ఉంటుంది. సామాన్యుల ఇండ్లలో నైతే అత్తాకోడళ్ల జగడాల గురించో, మోటు సరసం గురించో, ప్రేమకు సంబంధించిన వాని గురించో పాడు కుంటారు. అయితే ఏ పాటకైనా శ్రమరాగం ఒకటే.

అన్ని ఇతర పరికరాల మాదిరిగానే విసుర్రాయినీ భావిస్తున్నారు. ఇది ఒక ఉత్పత్తి సాధనం. వారి జీవితాల వలెనే వారి ఉత్పత్తి సాధనాలు కూడా శిథిలదశలో ఉంటాయి.

విసిరేటప్పుడు ఏదో ఒకపాట పాడకపోతే మూగపిల్లలు పుడతారనీ, పాడితే పంటలు బాగా పండుతాయనీ నమ్మకం కూడా ఉంది. మత పౌరాణిక సంబంధ మైన పాటలకు ఫలశ్రుతి చెప్పడం జరుగుతుంది. శ్రమఫలంగా కూలిడబ్బు గిట్టి నట్లే శ్రమలోంచి వెలువడిన పాట పాడినందుకు కూడా కొంత ఫలితం దక్కు తుంది. ఈ ఫలితం పుణ్యం రూపంలో ఉంటుంది. విసరడానికి ఒక కూలీ రేటు లేదు. దొరసానులు ఇచ్చినంతనే తీసుకోవాలి. డబ్బు రూపంలో గానీ, ధాన్యం రూపంలో గానీ తమకు వీలైన రూపంలో ఇస్తారు. లేదా ఇవ్వకనూ పోవచ్చు.

శ్రమ మాత్రం స్త్రీలది. ఫలితం పని చేయించుకున్న వారిది. శ్రమ జీవులు శ్రమిస్తూ పాడిన పాటవల్ల వచ్చే పుణ్యంలో దొరసానికి కూడా వాటా ఉంటుంది.

ఒక్కొక్క బుక్కలో నూటొక్క గింజా
బుక్కబోసిన సెయ్యి భూములేలాలని
మళ్ళి వచ్చేదనక మరచిపోకమ్మా
సల్లంగ సాకాలే తల్లిగౌరమ్మ
పాడిన్న వారికి బ్రహ్మలోకమ్మ
విన్నట్టి వారికి విష్ణులోకమ్మ[26]

ఇక్కడ "బుక్కబోసిన దొరసాని చెయ్యి భూములేలాలని" శ్రమజీవులు మాత్రం మళ్ళీ అలాగే దంపుళ్ళకు రావాలనే అర్థం ధ్వనిస్తుంది. శ్రమ చేస్తూ పాట పాడిన వారికీ, విన్నవారికీ పుణ్యం లభిస్తూంది. ప్రజావ్యతిరేకమైన భావ జాలం పాటల్లో చోటుచేసుకోవడానికి ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా చూప వచ్చును.

**దంపుడు పాటలు :** ధనిక రైతుల ఇళ్ళలో స్థిరంగా ఏర్పరచిన రోలూ, దానికి కావలసిన కుందెన (ఇనుముతో తయారు చేసింది) ఇనుము లేక ఇత్తడి పొన్నులు అమర్చిన అయిదారు రోకళ్ళూ ఉంటాయి. శ్రమజీవుల ఇండ్లలో మాత్రం చిన్నరోలూ, కుదురు (వెదురుతో అల్లినది), ఓ చిన్న రోకలి ఉంటుంది.

ఇకపోతే ఉన్నత వర్గం వారు వడ్లు, ఇతర ధాన్యాలు పెద్ద మొత్తంలో దంపించుకుంటారు.

"పుట్లకొలది వడ్లు దంచి పోటు తెల్ల గెయ్యాలి[27]" ఉన్నత వర్గంవారి ఇళ్ళల్లో దంచడానికి ముందు స్త్రీకూలీలే ఎన్నో ఏర్పాట్లు చేసుకోవాల్సి ఉంటుంది. చిన్నచిన్న పరికరాలు అన్నీ తెచ్చుకోవడం, సంచుల్లో ధాన్యాన్ని చాటల్లో పోసు కోవడం, కుందెనకూ, రోటికీ మధ్య ధాన్యం పడకుండా 'దాయి' (గుడ్డ) కట్టడం, ధాన్యాన్ని ఐట్టి 'వాయి' పోయడం వగైరా అన్నీ స్వయంగా సొంత పని లాగా చేసుకోవాలి. ఈ పనిలో యజమానురాలి సహాయం ఏ మాత్రం ఉండదు.

దంచడం మొదలు పెట్టగానే ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు ఎక్కువవుతాయి. చేతులకు బొక్కలు వస్తాయి. మంట పుడుతుంది. మంటపుట్టి చేతులు మారుస్తారు. నోటి నుండి 'హస్ హ్హస్' అనే విధంగా నిశ్వాసం వెలువడుతుంది. శ్వాస ఎగ

పిల్చే శబ్దం న్, న్స్, హ్నగా మారుతుంది. ఈ పోట్లు వేసి రోకలి లేపే క్రమ క్రమంలోంచి ఈ శబ్దాలు వెలువడుతాయి.

పని మొదలైనప్పుడు వెలువడిన హన్, హ్హన్ శబ్దాలే పల్లవిగా ఏర్పడి దానికి అనుగుణంగా వారి నోటి నుంచి పదాలు వెలువడుతాయి. పోటు వేసినప్పుడు ''హ్హన్'' శబ్దం రోకలిని లేపే సమయంలో స్సహ్హ శబ్దం వెలువడుతుంది.

ఈ శబ్దం సువ్-సుప్ అవుతుంది. పని కొనసాగే క్రమంలో సువ్విగా మారుతుంది.

సువ్వి / సువ్వి | సువ్వాన / రంగ
సువ్వి మోహన రంగ
దంచి దంచి సేడెలంత
దప్పులేమొ గొన్నరేమొ ॥సువ్వి॥

ముంచి ముంచి ఇయ్యరమ్మ
మంచి ఉదకాము ॥సువ్వి॥

నడుం వంచి పోటు వెయ్యాలి. అలా చెయ్యడానికి కాలు వాయిని తట్టాలి. ఈ క్రింది సువ్వి పాటలో శ్రమ క్రమాన్ని, శ్రామిక పరికరాల తయారీనీ గమనించవచ్చు.

సువ్వి సువ్వి సువ్వన్నల్లారా
అన్నల్లారా సువ్వి అన్నల్లారా
సువ్వి అని పాడరే సేడె లందరూ
అడ్లొడు సేసిన్నె అన్నెల్ల గజము
కమ్మరి సేసిన్నె గంటలా పొన్ను
కుమ్మరి సేసిన్నె గుండు కుందెనే
కంకణాల సేతా గజమందుకొనీ
నడమంచి ఏయ్యండి
నాగరీక మేమి
ఝంగ జాపెయ్యండీ

జాణతనమేమి
బొడ్డంచి ఏయ్యండి
దొడ్డ తన మేమి
ఉంగురాలా సేలా
ఊని పోచేయండి[29]

ఇంత కష్టపడి ధాన్యం దంచినా దొరసానులు శ్రమకు తగిన ఫలితాన్ని ఇవ్వరు. పైగా "దంచినమ్మకు బుక్కిందే కూలీ'' అని బుకాయిస్తారు. పొద్దస్తమానం దంచడమే పని. అలా దంచినంతసేపూ ధాన్యాన్ని ఎవరూ తినరు. ఒకవేళ అప్పుడప్పుడూ నోట్లో వేసుకున్నా అది కూలీ విలువ చేయదు. అందుకే "పొదుగుంజాములు వడ్లు దంచాలె / పొట్టంతా జల్లెడ ఇట్టాలె | పిడికెడు బియ్యం పెట్టూమంటే మొద్దు పొరకతో కొట్టేవారు[30] అని పాడుకోవడం జరిగింది.

దంపుడు, విసురుడు పాటలు కలుపు కోతల పాటల కంటే కొంత భిన్నమైనవి. అక్కడ సామూహిక శ్రమలోంచి పాటలు సామూహికంగానే వెలువడుతాయి. ఇక్కడ అంత సమష్టిస్వభావం ఉండదు. కేవలం నలుగురైదుగురే ఉంటారు. పాట వీరినుండే వెలువడుతుంది. ఈ రెండు రకాల పాటలూ ఉత్పాదకశ్రమలోంచి వెలువడినవి అనేదే ముఖ్యం.

ఈ రెండు రకాల పని పాటలు వేర్వేరు పరిసరాల్లో, వాతావరణంలో వెలువడుతాయి. అక్కడ భూస్వామ్య ప్రతినిధి వెంట ఉన్నా, పని జరిగేది చేలల్లో గనుక, ప్రకృతి ఒడిలో కొంత స్వేచ్ఛ ఉంటుంది. ఇక్కడ పని జరిగేది భూస్వాముల ఇళ్ళల్లో గనుక, పనిచేసేవారికి స్వేచ్ఛ ఏ మాత్రం ఉండదు పైగా ఒక రకమైన బెరుకుతనం, భయం ఉంటాయి. కలుపు, నాట్ల పనులకన్నా దంచడం, విసరడం పనుల్లో శ్రమతీవ్రత ఎక్కువ. అందువల్లనే కలుపూ నాట్ల పాటల్లాగా ఇవి వర్ణనాత్మకంగా ఉండే పొడవైన పాటలు కావు. అక్కడ పని సాగుతున్నంతసేపు సాగిన పాట ఇక్కడ సాగదు. పని తీవ్రత ఎక్కువ కాగానే పాట ఆగి పని సాగుతుంది. దంచడం, విసరడం వంటి కష్టతరమైన పనులు చేయడం వల్ల తెలంగాణా స్త్రీలు రాటుదేలారు అందువల్ల పోరాటంలో పాల్గొనడం కష్టమైన

పనిగా వారు భావించలేదు. దొరల ప్రాంగణాల్లో పాడుకొనే ఈ పాటలు సైతం పోరాట కాలంలో పోరాట పాటలై సంకుచిత సరిహద్దుల్ని దాటాయి.

## పాట పరాయీకరణ

వ్యవసాయం క్షీణించడానికి వందల సంవత్సరాల నుండి నైజాం నవాబు జాగీర్దారులు, దొరలు దేశ్‌ముఖ్‌లే కారణం. ఆంగ్లేయుల రాక వల్ల సంస్థానాధీశులు, వారి అధికారులు ఆర్థిక దోపిడిని పన్నుల రూపంలో ఎక్కువ చేశారు. కానీ రైతులకు పారుదలవంటి నీటి సౌకర్యాలు మాత్రం పెరగలేదు. దిన దినం అప్పుల పాలౌతూ తమకున్న చిరాస్తిని బలవంతంగా ఏదో ఒక రూపంలో దొరల హస్తగతం చేయవలసి వచ్చేది. ఈ విధంగా తిని కూర్చునే వాళ్ళకి తమ ఉత్పాదకశ్రమనే కాకుండా స్వంత ఆస్తిని కూడా బదిలీ చేయాల్సి వచ్చింది. తాము మాత్రం భుక్తికి నోచుకోని స్థితికి వచ్చారు. ఇదే క్రమంలో ప్రజా సాహిత్యం కూడా రైతాంగం నుండి దూరమై భూస్వాములకు సేవ చేస్తూ వచ్చింది. ప్రజలు తమ వేలుతో తమ కంటినే పొడుచుకునే పరిస్థితి అది.

రైతులపై భూస్వామ్య దోపిడీ భారం అధికమయింది. వ్యవసాయం చేసుకునే ఆర్థిక శక్తి, ఉత్సాహం రైతాంగంలో నశించి పోయింది. రైతుల భూములు క్రమక్రమంగా భూస్వాములచేతుల్లోకిమారి సాగు చేసేవారు లేక బీడు పడిపోయాయి. ఈ విధంగా పడావు[31] పడిన భూభాగం హైదరాబాదు సంస్థానంలోని ఇతర ప్రాంతాల కన్నా తెలంగాణాలోనే ఎక్కువ.

ఆధునిక విజ్ఞానం వికసించే కొద్దీ మానసిక శ్రమ - శారీరక శ్రమల మధ్య వ్యత్యాసం మరింతగా పెరిగింది. విభజనకి దారి తీసింది. ఉత్పత్తికి పథకం వేసేవారు - పాలకవర్గం. ఉత్పత్తి చేసేవారు - పాలితులు. ఈ రకం ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి అటంకంగా పరిణమించాయి.

శారీరక శ్రమకు దూరమైన వారిలో ఉన్నత కులాలకు చెందిన బ్రాహ్మణ, రెడ్డి, వెలమ, వైశ్య మొదలైన కుటుంబాల వారు ముఖ్యులు. వీరు చాలా ఏళ్ళ క్రితమే శారీరక శ్రమనుండి తప్పుకున్నారు. ప్రజలు తమ శ్రమ ఫలితాన్ని వీరికి అప్పిస్తూ తాము శారీరక శ్రమకు పరిమిత మయ్యారు. కూర్చుని తినడమే ప్రధానంగా భావించిన పై వర్గం వారు, క్రమక్రమంలో జనించిన సాహిత్య కళా

రూపాలను కూడా తమ వినోదావసరాలకు అనుగుణంగా మార్చుకున్నారు.[32] వ్యవసాయ ఉత్పత్తిని పెంచడానికి, ఫలసాయాన్ని స్వాధీనం చేసుకోవడానికి వెట్టి చాకిరిని ఒక ముఖ్యమైన సాధనంగా అమలు చేశారు. వెట్టి చాకిరికి మాత్రం వర్ణవ్యవస్థ అడ్డురాలేదు. ఊహకందని ఎన్నో రూపాల్లో వెట్టి చాకిరి చేయించుకునేవారు. వ్యవసాయానికి సంబంధించిన అన్ని రకాల పనుల్లోనూ, అన్ని వృత్తుల వారితోనూ జీవితాంతం వెట్టిపని చేయించుకునేవారు. వీరి సాహిత్యకళా రూపాలు పరాయీకరణం చెందడానికి వెట్టి ఒకముఖ్యకారణమయ్యింది.

శ్రమకు దూరమై, వెట్టి చేయించుకున్న వర్గానికి సొంత కళలూ, సాహిత్యం లేవు. వాళ్ళలోంచి కవులూ, కళాకారులు రావడానికి ఆస్కారం తక్కువ. కాబట్టి వాళ్ళు శ్రామిక వర్గ కళలను, కళారూపాలను చేరదీయడం అనివార్యం. ఇందుకు భూస్వామ్య వర్గం కుల వ్యవస్థను ఆధారం చేసుకుని, అందులోని కళాకారులను, కళారూపాలను తన అధీనంలోనికి తెచ్చుకుంది.[34]

ఈ పద్ధతి ప్రాచీనకాలం నుండి అమలులో ఉంది. శైవ, వైష్ణవ మత ప్రచారకులుగా సాహిత్య సాంస్కృతిక కళా రూపాలతో ప్రచారం చేయడానికి తక్కువ కులాలవారిని నియమించేవారు. ఈ దశలో ప్రజాసాహిత్యం తన స్వాభావిక సాంఘిక లక్షణాల నుండి దూరమై[35] వ్యక్తిగత భావావేశానికీ, కృత్రిమత్వానికి ఆలవాలమై పోయింది. పాలకవర్గ సామాజిక వ్యవస్థను సమర్థిస్తూ (దైవభావన, మతం, పూజలు మొ.) పాటలు విస్తరించాయి. అలాంటి సాహిత్యం తెలంగాణా అంతటా వ్యాపించింది. పాలకవర్గాన్ని అనుసరించి దాని అవసరం, అధికార స్వరూపాన్ని బట్టి, మధ్యతరగతి కుటుంబాల విరామ సమయాన్ని బట్టి ఈ సంస్కృతీ సాహిత్యం ఏర్పడుతుంది. శ్రమైకజీవనంతో సంబంధం కోల్పోవడం వల్ల వారి సాహిత్యంలో 'ఊహ', భావనకి అధిక ప్రాధాన్యం ఏర్పడుతుంది. అంతేకాదు వీరి సంగీత సాహిత్యాలూ - ప్రజలకు దూరమయ్యాయి. వీరి అవసరం కోసం ఆనందానికి మాత్రమే పరిమితమయ్యాయి. పైగా ప్రజావ్యతిరేక సంస్కృతీ, భావజాలం చోటు చేసుకున్నాయి. ఆ విధంగా సాహిత్యంలో ప్రజాస్వభావం సన్నగిల్లింది. శ్రమజీవి ఉత్పాదకశక్తి ఎంత పెరిగితే పరాధీనత అంత అధికమవుతుంది.[36] ఎంత ఎక్కువ ఉత్పత్తి చేస్తే అంత ఎక్కువగా అదనపు విలువ పరులకు ధారాదత్తమవుతుంది. ఈ

రకంగా శ్రమజీవి నాగరిక ప్రపంచాన్ని నిర్మించి విశ్రాంతివర్గానికి దత్తం చేస్తాడు. తాను మాత్రం భుక్తికి నోచుకోడు.

బానిసవిధానంలో ఈ పరాయీకరణ తీవ్రస్థాయికి చేరుకుంది. శ్రమ మాత్రమే కాకుండా శరీరం కూడా పరాయిదై పోతుంది. భూస్వామ్య సమాజంలో శరీరం అతనిదే కాని అవయవాలు, చలనం అన్నీ పాలకవర్గాలవే. అతని భార్య, భూమి, ఇల్లు అన్నీ పై వర్గం చెప్పు చేతల్లో ఉంటాయి. ఇరవై నాలుగు గంటల శ్రమఫలం తనకి దూరమైతే గుండెల్లో ఉబికే బాధను పాటల్లో వ్యక్తం చేశారు.

మనిషి ప్రాథమిక జీవితావసరం, మానవసారం అయిన శ్రమ మనిషిది కాకుండా పోయింది. శ్రమించడమంటే మరొకరి కోసం పనిచేయడమనే అర్థం స్థిరపడింది. జనం పాటల్లో ఈ బాధ పలువిధాలుగా వ్యక్తమయింది.

జాబిరి జాబిరి జాబిరి పాపా
జాజులాడవే గాజులపాపా
తూర్పు నుండి వచ్చెరా తుప్పలనక్క
పడమటి నుండి వచ్చెరా పర్వతాలనక్క
ఆ నక్క ఈ నక్క తోడెరా బొక్క
జోగయ్య నాకు కొన్ని గింజలిచ్చె
ఏటి ఒడ్డున సేద్యం చేస్తే
ఈడ్చి కొడితే ఇరవై పుట్లు
ఆడ్చి కొడితే అరవై పుట్లు
అవి కొంచపోయె అప్పయ్య దొర
ఇసుకో ఉసుకో ఇద్దామె ఉంచె
మన్నో మైలో మానెడె ఉంచె
ఉప్పులేని గంజి తాగితిమయ్యా
సొప్పకట్టలోలె సోలితిమయ్యా

కుక్కా మంచంలో కూలితిమయ్యా
జాజిరి జాజిరి జాజిరిపాపా
జాజులాడవే గాజులపాపా[87]

రైతుజీవితంలోకి తూర్పునుండి తుప్పల నక్క (చిన్ననక్క=ముస్లిం రాజులు) పడమటి నుండి పర్వతాల నక్క (పెద్దనక్క=ఆంగ్లేయులు) వంటి షావుకార్లు, పాలకులు వచ్చి రైతాంగం భూమికెలు తోడారు. వడ్డీంకు వడ్డీలు కట్టి కల్లం నుండే ధాన్యాన్ని తీసుకుపోయారు. తిండికి లేకుండా దోచుకు పొయ్యారు. దీనిపై నిరసన భావంతో శ్రమ జీవులు పాటలు కట్టుకున్నారు. ఇది సుమారు వందేళ్ల నాటి పాట ఆనాటి పరిస్థితికి ఇది అద్దం పడుతుంది.

నేనేమి సేతూ నేనెట్లు గాతూ
మొగులు మెత్తనాయె భూమి బురబుర పొంగె
నల్లనీ రాగట్ల తెల్లజొన్న లేస్తే
మొలిసి మొలవక ముందె కోతింత పీకె
ఉరికురికి వచ్చేటి ఉడుతింత పీకె
ఉడుత పీకిందాని ఉరిమురిమి నేనంటె
పసపస వచ్చేటి పందింత పీకె
ఆవు లేగా వచ్చి ఆయింత మేసె
ఎన్నేల కాలంల ఏదులా మందొచ్చి
పడమటి భూమిలో పంటంత మేసె
బాకిసాకి సేసి బక్కలను నేగొంటే
బాకి తీరక ముందె బక్కలె తరలె
కరణాలు కాపులు పన్నులడగ వస్తె
పన్ను గట్టక పోతె పట్టి తన్నేరు
(వాసిగా భద్రాద్రి ఈశుణ్ణి నమ్మితే
అరవై ఆరు పుట్లు జొన్న లెల్లునురా)[88]

రైతులు ఎలాంటి సామాజిక పరిస్థితుల్లో జీవించారో ఈ పై రెండు పాటలు తెలియజేస్తాయి. మొదటి పాటలో శ్రమ జీవులు దోపిడి చేయబడే క్రమం

వాస్తవంగా చిత్రితమైంది. దొరల అజమాయిషీలోని గ్రామీణ వ్యవస్థలో ఈ పాట వారి వ్యక్తిగత చైతన్యాన్ని వ్యక్తంచేసింది. ధాన్యాన్ని అప్పుగా ఇచ్చిన జోగయ్య (షావుకారు) కౌలుకిచ్చి పన్నులు తీసుకునే అప్పయ్య దొరలు శ్రమ జీవుల శ్రమ ఫలితాన్ని జబర్దస్తీగా దోచుకున్న విధానాన్ని పాటలో చిత్రించారు.

రెండోపాటలో పాలకవర్గం శ్రమజీవుల్ని భయపెట్టి వారి చైతన్యాన్ని మరో విధంగా మరలించింది. పెత్తందారుల పేరెత్తడానికి భయపడి వారిస్థానంలో జంతువుల్ని పెట్టుకుని పాడుకున్నారు. శ్రమ దోపిడిని మరుగుపరిచారు. పాట పరాయీకరణలో ఇది ఒక ముఖ్యమైన అంశం. ఇలా మరుగుపరచే పరిణామ క్రమంలో - ఒకదశలో ప్రజావ్యతిరేక భావాలు తయారుకావచ్చు. భద్రాద్రి రాముణ్ణి నమ్మితే అరవై ఆరుపుట్లు పండుతాయన్న భావం ఖచ్చితంగా పై వర్గం ప్రభావంతో వచ్చిందేగాని శ్రమజీవులకు వంటబట్టిందికాదు. పాట నడకను బట్టి చూసినా ఈ విషయం తెలిసిపోతుంది. పంట నాశనమైపోయిన విధానం చెప్పు కుంటూ అకస్మాత్తుగా చివరలో భద్రాద్రి వాసుణ్ణి నమ్మాలి అని అనుకోవడం పై వర్గంవారి మన్ననలను పొందడానికే. కొన్ని జంతువులు పంటల్ని నాశనం చెయ్యడం సహజమే. శ్రమజీవులు అమాయకులు కావడం వల్లనే వ్యవస్థాగతమైన దోపిడిని అమాయక ప్రాణులైన జంతువులపైకి నెట్టగలిగారు. వారికున్న కొద్ది పాటి భూమిలో అరవై ఆరు పుట్లు పండవని వారికి తెలిసే అలా పాడుకున్నారు. ఈ రకంగా పరాయీకరణ చెందిన పాటలు పరాకాష్టచెంది తెలంగాణా సాయుధ పోరాటానికిముందు జరిగిన ఖమ్మం మహాసభలవరకూ బాగా ప్రచారంలోఉన్నాయి.

పక్క యింటి పాపరాయుడు
నిక్కముగ పదికొట్లు నింపెను
బిక్కమొగము ఇక ఏలవేసెదవు
చక్క మార్గము నెరుగవైతివి
పరుల పాలై పోయెరా
నీ పాటు పాడై పోయెరా[39]

ఇందులో దొర వర్గానికి చెందిన పాపారాయుడు ధాన్యం పదికొట్లు నింపు కున్నాడు. కానీ ఒక శ్రమజీవికి పంటరాలేదు. వచ్చిందేదో అప్పులకే పోయింది. ఈ పాటలో తండ్రి కొడుకుతో చక్కని మార్గము తెలుసుకోలేక పొయ్యావు అని

అంటాడు అవి ఆనాటి రైతుల చైతన్యం "పాటు" (శ్రమ) పరులపాలైంది - అని తెలుసుకోగలిగారే కాని వ్యవస్థాగతమైన కారణాలు మాత్రం తెలుసుకోలేక పొయ్యారు.

## విశ్రాంతివర్గం స్త్రీలపాటలు

నైజాంకాలపు భూస్వామ్య వ్యవస్థలో మతాన్నీ, కర్మసిద్ధాంతాన్నీ చాల ఎక్కువగా ప్రజల జీవితాల్లో చొప్పించారు. గోల్కొండ ముస్లిం రాజులుగాని, దేశంపై పెత్తనంచేసిన ఆంగ్లేయులుగాని, నైజాం ప్రభువులుగాని తెలంగాణాలో నామమాత్రంగానైనా సాంఘిక సంస్కరణల్ని అమలుచేయలేదు. తరతరాలుగా ప్రజలు శవప్రాయులుగా, నిస్సహాయులుగా జీవించారు. "కష్టాలు పడడానికే పుట్టాం" - అనే భావం వారిలో పేరుకుపోయింది.

తెలంగాణా ప్రజలపై మతం అనే బరువు కూడా నిజానికి ఆర్థిక భారంలో భాగమే. ముస్లిం పాలకుల మతతత్వం తెలంగాణా ప్రజలపై ఒకరకమైన నియంతృత్వానికి దారితీసింది. ఇది రెండు మతాల మధ్య అస్వాభావికమైన వైరుధ్యం వల్ల ఏర్పడింది. దీనివల్ల నష్టపోయింది ఇరువర్గాలకు చెందిన శ్రమ జీవులే కాని పాలకులు కాదు.

గ్రామాలలో మతానికి కేంద్రం గుడి. ఈ గుడే బడి. గుడీ, పూజారి వర్గమూ భూస్వామ్య వ్యవస్థలో పావులవంటివారు. వీరు భూస్వాముల దయా దాక్షిణ్యాలపై బతుకుతారు పూజారే బడిలో పంతులు. వీళ్ళనే "అయ్యగారు" అంటారు. భూస్వామ్య వ్యవస్థ చెప్పుచేతల్లోనే బడులు, విద్యా విధానం ఉండేవి.

మతం, దేవుని పేర్లతో, కులం, కట్టుబాట్ల పేరుతో ప్రజల నీతి, నియమా లను సృష్టించారు. నియమరాహిత్యం జరిగితే శిక్షించేది భగవంతుడు కాదు - భూస్వామి! ఈయన కేవలం ఆర్థిక రూపంలో (వెట్టి, జుర్మానాలు, దండగలు) మాత్రమే దండిస్తాడు.

భూస్వామి తన కుటుంబంలోని స్త్రీలను ఎక్కువ శ్రమ చెయ్యనివ్వడు. ఇంట్లో కేవలం తన సుఖం కోసమే ఆమెను ఉపయోగించుకుంటాడు. నిజానికి

గదిల్లో స్త్రీల పరిస్థితి పంజరంలోని చిలకలాంటిది.[40]

విరామం ఎక్కువగా ఉన్న ఈ వర్గం వారు ప్రతి చిన్న సంప్రదాయానికి, పండుగలకు పాటలను పాడుకుంటారు. నోములు వ్రతాలు, పెళ్ళిళ్ళు, పేరంటం, లాంటి మొదలగు సందర్భాల్లో వేడుకగా పాడుకొంటారు.

స్త్రీల వ్రతాలూ, పూజా పద్ధతులు చాలా రకాలుగా ఉన్నాయి. ఈ వ్రతాలు చేసే సందర్భంలో వాటికి సంబంధించిన పాటలు తప్పక పాడతారు. ప్రతి చిన్న కోర్కెకు ఒక వ్రతం ఉంది. ప్రతి వ్రతానికి ఒక పాట ఉంది. ఈ వ్రతాలను ఆచరించే వారికి విరామ సమయం ఎక్కువ. అందుకే ఎన్నెన్నో వ్రతాలు పూనుతారు. వీరుపాడే పాటలలో భాషలో సంస్కారం, వ్యక్తీకరణలో నాగరికత, శిష్ట సాహిత్యపు అందచందాలు కనిపిస్తాయి.

పాలక వర్గాలకు చెందిన స్త్రీలు పెళ్ళి ఎంతో వేడుకలతో జరుపుతారు. శ్రమ జీవులకు పెళ్ళి జీవనావసరం. సాదాగా పెళ్ళిని ముగిస్తారు. కాని వీరు వేడుకని సంప్రదాయం చేసి, ఆచారంగా భావించి దాన్ని అమలు చేయని పక్షంలో అపచారం జరిగినట్లు భావిస్తారు. అందుకే పెళ్ళిలోని ప్రతి తంతుకి ఒక పాట ఉంటుంది. ప్రతీ దాంట్లోను స్త్రీలే ప్రాముఖ్యత వహిస్తారు. సమర్త, సీమంతం, బారసాల మొదలగు సమయ సందర్భాల్లో పాటలూ, మంగళహారతులు తప్పక గానం చేస్తారు. ఇవి ఎక్కువగా సంస్కృత సమాసాలతో ఉంటాయి.

ఈ వర్గానికి చెందినవారు ఎక్కువగా సమిష్టి కుటుంబంగానే జీవిస్తారు. కాబట్టి అనునిత్యం ఈ కుటుంబాలు పిల్లాజెల్లలతో కళకళలాడుతాయి. ఈ పిల్లల పెంపకం వారి జీవితంలో ఒక ముఖ్యమైన భాగంగా ఉంటుంది. ఏడ్చినప్పుడు బుజ్జగించడానికి లాలిపాటలు, నిద్రపుచ్చడానికి జోలపాటలు, ఉయ్యాల ఊపుతూ ఉయ్యాల పాటలు పాడుతారు.

భూస్వామ్య సమాజంలో పురుషుడికి ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. కనుక ప్రతి ఇల్లాలు కొడుకే పుట్టాలని పూజలు చేస్తుంది. ఈ కుటుంబాల్లోని ముసలివాళ్ళు వత్తులు చేస్తూనో, విస్తళ్ళు కుట్టుకుంటూనో భక్తి పాటలు పాడుకుంటారు. కథలు చెప్పుకుంటారు. ఇవి ఎక్కువగా పౌరాణిక పాటలు, నీతి కథలు! ఈ విధంగా విరామ వర్గం స్త్రీలు తమ జీవిత విధానాన్ని కూడా ఈ కింది పాటలో నమోదు చేసారు.

కట్ట మీద పోయేటోళ్ళెవరమ్మా
రెడ్డి బిడ్డా సూరమ్మా
తేనేగాజులు తొడిగిందీ
కొబ్బరి కొప్పులు పెట్టిందీ

మూలకు మంచం వేసిండీ
ముగ్గురి బిడ్డల కన్నాడీ !

## వృత్తిగాయకులు - కళాకారులు

వృత్తి గాయకులు తరతరాలుగా కథాగేయాలు పాడుతూ వస్తున్నారు. నాటి గాయకుడికి సమాజంలో పురోహితునికి, ప్రపత్తకూ గల గౌరవం వుండేది. ఆశువుగా పలుకబడే గానం వింటూ శ్రోతలు ఒక విచిత్రమైన వాతావరణంలో మంత్ర ముగ్ధులై వినేవారు. నేటికీ గ్రామాల్లో గాయకుడికి పై హోదా, గౌరవం వుంది.

రాచరికం అంతరించి భూస్వామ్య విధానం ఏర్పడే క్రమంలో ఈ వృత్తి గాయకులు కుల మతాల అవసరాలకి ప్రచారకులయ్యారు. యుద్ధ సమయాల్లో వీర గాథలు పాడినట్లే తక్కువ కులాల వారికి సైతం గాథలు పాడి వినిపించే సంప్రదాయం నేటికీ ఉంది. పోతే కాలం మారుతున్నకొద్దీ వీరి కథాగేయాలు మారుతున్నాయి. కులాన్ననుసరించి ఆ మూల పురుషుని కథ, దైవప్రార్థన, శక్తి పూజ మొదలగు అంశాలు వీళ్ళ కథలో నేటికీ ఉన్నాయి. పందొమ్మిదో శతాబ్దంలో ముస్లిం రాజులకు వ్యతిరేకంగా పోరాడిన నాయకులు ప్రధానపాత్రలయ్యారు. పౌరాణిక పురుషుల జోరు కొంత తగ్గింది. తెలంగాణా పోరాట కాలంలో పై నాయకుల స్థానంలో ప్రజలకోసం ప్రాణాలర్పించినవాళ్లు వచ్చారు.

ఈ వృత్తిగాయకులు పాడే వీరగాథలు (సర్వాయి పాపడు, సదాశివరెడ్డి, బల్గూరి కొండరాయుడు) భూస్వామ్య వ్యవస్థకు ఉపయోగపడే విధంగానే ఉంటాయి. ఈ వీర గాథలలో ఎక్కువగా ఉన్నత వర్గాలవారే వీరులుగా ఉంటారు. రాజులకో, సామంతులకో, సామంతుల పాలెగాళ్ళకో జరిగిన యుద్ధాలు లేదా మతానికి సంబంధించిన యుద్ధాలు ఎక్కువగా వర్ణించబడుతాయి. ఈ కథల్లో వీరులను పౌరాణిక పురుషుల్లా వర్ణిస్తారు. పౌరాణిక కథా విధానం ఇక్కడకూడా స్పష్టంగా కనిపిస్తుంది. ఇలాంటి కథల్లో జానపద కథ మూలాంశాలు (Motifs) అన్నిటిలోనూ ఒకేలా కనిపిస్తాయి. నాయకుడు దైవాంశసంభూతుడుగా ఉంటాడు. అద్భుత వీర రసాలను జోడించి కథను నిర్మిస్తారు. ముందు చెప్పుకున్నట్టుగా పురాణం ఒక ఊహా ప్రపంచంలోని ఊహగా ఉన్నట్లే ఒక వాస్తవ సంఘటన పురాణ ఫక్కీలోనే పెరిగి పెద్దదవుతుంది.

కథా గానం చేసేవాళ్ళు చాలా మంది దేశదిమ్మరులే. కాని పేరుకు మాత్రం ఒక సొంత ఊరు ఉంటుంది. భూస్వాములు ఇచ్చిన కొన్ని సెంట్ల భూమి ఉంటుంది. ప్రత్యేకించి ఒక కులం వారికే పాడే గాయకులు ఆయా కులాలున్న ఊళ్ళకు వెళ్ళి పాటలు పాడతారు. ఇందులోని కొన్ని జాతులవాళ్ళు ప్రస్తుతం అందరికోసం పాటలు

పాడుతున్నారు. వీళ్ళకు సంగీత వాయిద్యాలు, సంచారానికి పనికొచ్చే తక్కువ సామా నులు ఉంటాయి. వీళ్ళ అలవాట్లు ఆచారాలు భిన్నంగా ఉంటాయి. మారుమనువు సాధారణం. స్త్రీ పురుషునితో పాటు సమంగా పాడుతుంది. లేదా ఆమే ప్రధాన గాయనియై కథలు చెబుతుంది.

ఆస్తిపాస్తులేమీ లేకపోయినా తగవులు ఎక్కువగానే ఉంటాయి. ఈ తగవులను కులపెద్దలు తీరుస్తారు. వీరికి ఇరుపక్షాలవారు దండుగలు చెల్లించుకోవాలి.

ఈ గాయకులు వనమూలికలతో వైద్యం చేస్తారు. తమ తమ కులంలో కర్మకాండ, పెళ్ళికి సంబంధించిన తంతు నిర్వహిస్తారు. ఈ కవి గాయకుని లక్షణాలు కొన్ని ఇంకా సజీవంగా ఉన్నాయి.

సమాజం శాస్త్రీయంగా అభివృద్ధి చెందుతున్నకొద్దీ, వీరు ఇలాంటి ఎన్నో లక్షణాలను విడిచిపెడుతూ గానాన్నే ప్రధానం చేసుకుంటూ వచ్చారు. ఈ క్రమంలోనే వీరు సంచార గాన ప్రదర్శనలు ఇచ్చే స్థాయికి వచ్చారు. ఇందులో తమ నైపుణ్యాన్ని బట్టి, కొంతమంది కథాగానాన్ని ప్రత్యేకంగా రూపొందించుకొన్నారు. ఈ రెండు రకాలలో ఒక దానిలో గానానికి, మరొక దానిలో నటనకు ప్రాముఖ్యం ఉంటుంది. రెండింటిలో కూడా ఒక ప్రధాన నాయకుడు ఉంటాడు.

ముఖ్యంగా ఒగ్గు కథని పరిశీలిస్తే ఆసక్తికరమైన అంశాలు బయటపడతాయి. ప్రధాన గాయకుడూ, వంతలూ కలిసి కథలోని పాత్రలుగా నటిస్తారు. వారికున్న సెల్లా, కట్టె, సంగీత వాయిద్యాలు మొదలగు అతి తక్కువ వస్తువుల్ని కథలోని పాత్రల దుస్తులుగా, పరికరాలుగా, ఆయుధాలుగా ఉపయోగించుకుంటారు. తద్వారా ఆ కథలోని వాతావరణాన్ని భ్రమింపజేస్తారు.

గాయకుడు గానం చేస్తూ, నటిస్తూ పాత్రతో సంభాషిస్తూ, గాయకునిగా తన కర్తవ్యం గుర్తించుకొంటూ ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేస్తాడు. స్త్రీ పాత్ర వచ్చినపుడు భుజంమీది సెల్లా (కండువా) ను చీరగా మార్చుకొంటాడు. ఆ పాత్ర ముందు ఓ బిచ్చగాడు ఉంటే మరుక్షణమే అదే సెల్లాను జోలెగా చేసుకొంటాడు. ఆ సమయంలో అక్కడకు రాజభటుడు వస్తే అదే సెల్లా అతని చేతిలో కత్తిగా మారు తుంది. గుర్రం మీద స్వారీ చేస్తూ పోతూంటే ఆ సెల్లాయే పగ్గంగా మారుతుంది. ఈ విధంగా పాత్రలను, సన్నివేశాలను బట్టి పాటలోని దరువూ, వంతలూ మారినట్టే పాత్రలూ మారతాయి. ఇలాంటివి కేవలం కథాగానాలే కావు, ప్రదర్శనలు కూడా. ఇలాంటి నైపుణ్యం ఉన్న కళాకారులు తెలంగాణాలో కోకొల్లలుగా ఉన్నారు. వీరు మొదటినుండీ రైతాంగంతో దగ్గరి సంబంధాలు కలిగి ఉన్నారు. వీరికి ప్రధాన దాతలు రైతులే. రైతే తిండిని ఉత్పత్తిని చేసేవాడు. కాని అతనే భూస్వామ్య వ్యవస్థలో పీల్చి

పెప్పిచేయబడ్డాడు గనుక ఏది పరిస్థితి కూడా అందులో భాగంగానే క్షీణిస్తూ వచ్చింది.

వృత్తి పన్నుల పేర స్థానిక దొరలు వసూళ్ళు ప్రారంభించాయి. తప్పులపేర, దండుగలపేర కుటుంబ పెద్దల్ని కాదని దొరలే వసూళ్ళు ప్రారంభించారు. ఒక గ్రామంలో పెళ్లి పెద్దానికి ముందు ఆ దొర అనుమతి తీసుకోవడం తప్పని సరైన కట్టుబాటైంది. దొరగడికిపోతే ఊరగాలన్న ఆంక్షలు పెట్టారు. అక్కడ తప్పనిసరిగా ఆ దొరల రాజ ముత్తాతల నాటి ధర్మాల గురించి స్తోత్రం చేయవలసి వచ్చేది.

భూస్వాముల ఇళ్ళల్లో ఎవరు చనిపోయినా పెద్ద దినం రోజు ఎంత దూరం నుండైనా సరే ఈ గాయకులు అక్కడకు చేరి ఆ వ్యక్తిని ప్రశంసించాలి. ఇంత చేసినా ఈ గాయకుల బతుకు దినం దినం దిగజారుతూ వచ్చింది. కానీ తమ గానాన్ని మాత్రం వదిలి పెట్టలేదు. ఎందుకంటే అదే వారి బతుకు తెరువు!

## తెలంగాణా ప్రజల సాంస్కృతిక కళాభిరుచులు

పాలకవర్గం తన స్వభావానికి అనుగుణంగా ప్రజాకళలను మార్చుకొని ప్రత్యేక కళలుగా తయారు చేసుకుంది. విరామ సమయం, ఆర్థిక వ్యయం అనే అంశాలవల్ల ఈ కళల మధ్య తేడా గమనించవచ్చు.

ఈ కళాభివ్యక్తీకరణకు ప్రత్యేకమైన కారణాలు కూడా ఉంటాయి. ఒకరికి పొట్టపోసుకోవడానికి అవసరమైతే, వేరొకరికి వినోదానికి అవసరంగా ఉంటుంది. కాకి పడగలు, తోలుబొమ్మలు చిత్రకళలే అయినా పాటతో సంబంధం కలిగిఉన్నాయి. ఇందులో చిత్రలేఖనమే ప్రత్యేకంగా ఉండదు. పాటతోనే వాటి అస్తిత్వం ముడిపడి ఉంటుంది. దాదాపుగా ప్రదర్శన కళలన్నీ పాట, నృత్యంతో పాటు ముడిపడి ఉంటాయి పైవన్నీ జీవనభృతి కోసం నిర్వహించేవి. ఇకపోతే కొన్ని అలంకరణలు, కళాభివ్యక్తీకరణలు సమాజావసరం కోసం, ముఖ్యంగా మతం అవసరం కోసం వృద్ధి పొందు తాయి. గొల్లల పెళ్ళిళ్ళలో ఉపయోగించే పరదాపై చిత్రించిన బొమ్మలు, పండగల సమయంలో పూజించే గొబ్బిళ్ళు, బతకమ్మ పేర్పు సంక్రాంతి పండగనాడు వేసే రంగు రంగుల ముగ్గులు, స్త్రీ పురుష భేదం లేకుండా వేసుకొనే పచ్చబొట్లు, మైదాకుతో వేసుకొనే అందమైన నమూనాలు మొదలైన వ్యక్తీకరణల్ని నిత్యజీవిత కళలుగా చెప్ప వచ్చును. ఇవన్నీ శ్రామిక జీవన క్రమంలో ఒక భాగంగా ఉంటాయే కాని ప్రత్యే కంగా ఉండవు. ఇందులో భాగంగానే 'వస్తుసంస్కృతి'ని చూడాల్సి ఉంటుంది. అప్పుడే వారి జీవన విధానం, దాని వెనక ఉన్న సాంఘిక, ఆర్థిక పరిస్థితి తెలుస్తుంది.

హోళీ పండగనాడు రంగులతో ఆడుకోవడానికోసం, ఆ రంగును తయారు చేసే విధానాన్ని పాటగా-ఒక కళాత్మక రూపంగా వ్యక్తీకరించారు.

కోళ్ళ కోళ్ళల కోళ్ళ
చెమ్మ కేళిల కోళ్ళ
పుట్ట పుట్ట తిరిగినాడె కోళ్ళ
గుట్టగుట్ట తిరిగినాడె కోళ్ళ
చెట్టుచెట్టు తిరిగినాడె కోళ్ళ
చెమ్మపూవు తెచ్చినాడు కోళ్ళ
రోట్లేసి దంచినాడె కోళ్ళ[41]

రంగుని తయారు చేసుకునే విధానమే కాకుండా, ఆట ఆడే పద్ధతి, ఆడుతూనే తమ జీవిత విధానాన్ని కూడా ఆ పాటల్లో వ్యక్తం చేసుకుంటారు. ఈ కోళ్ళ పాటలు పాడుతూ, కోలలతో సంగీతాన్ని జతకూరుస్తారు. వారి సంగీతం, లాగే సంగీత వాద్యాలు కూడా చాలా సాధారణంగా ఉంటాయి.

## శ్రమజీవులు — సంగీత వాద్యాలు

శ్రమ విధానంలోంచి వెలువడే సృజనాత్మకతలో భాగంగానే కళలు ఉంటాయి. ప్రజలను అలరించే ఎన్నో సంగీత వాద్యాలు, వాటి సంగీతం ప్రతిరోజూ వాళ్ళను ఉత్సాహపరుస్తాయి. ఈ సంగీత వాద్యాలు కూడా కొందరికి జీవనాధారమైతే, మరి కొందరికి ఆనందాన్ని కలిగించడానికి ఉపయోగపడతాయి.

పిచ్చుక గుంట్లు భిక్షాటనకు బయలుదేరినపుడు ఓ చేతిలో శంఖం, మరో చేతిలో గంట మోగిస్తూ ఎద్దును అదిలిస్తూ వాని మెడలోని గంటల సవ్వడితో వీధులు తిరుగుతాడు. చిరుగజ్జెలు కట్టిన త్రిశూలం కూడా ఉంటుంది. ఈ విధంగా అతని సమస్తము సంగీత సాధనాలతో ఉంటుంది. దూరం నుంచే అతను వస్తున్నాడని తెలిసిపోతుంది. వీరిలో కొంతమంది గంటతిత్తిని కూడా వాడతారు. అలాగే శారదలకు శారద తంత్రీ వాద్యం, అందెలు, వీరముష్టివారికి జేగంట లేదా తప్పెట, బైండ్లవారికి జమిడిక లేదా పంబ, బీరన్నలకు ఒగ్గువాద్యం, జంగాలకు బుడిగె వాద్యం ఉంటుంది. సంగీత వాద్యాల ననుసరించి కథలు పాడే వారికి పేరు వస్తుంది. కథలు పాడే వారిని, వారు పాడే సంగీత వాద్యంతో పిలవడం జరిగినట్లుగానే ఆ కథలకు కూడా ఆ సంగీత వాద్యాల పేరుతో ప్రజలలో ప్రచారం జరిగింది. కులాలనుబట్టి, తెగలనుబట్టి వృత్తి గాయకులకు ప్రత్యేక వాద్యాలుండటం గమనార్హం. ఇవి తంత్రీ వాద్యాలో, డప్పుకు సంబంధించినవిగానో ఉంటాయి.

ఇక్కడ తెలంగాణా శ్రమజీవులకు సంబంధించిన 'డప్పు'ను చెప్పుకోవడం అవసరం 'డప్పు' కేవలం ప్రజల వాద్యం. దీన్ని పెళ్ళినుండి చావు వరకూ ఉపయో

గిస్తారు. ఈ రెండు సందర్భాలలో వాద్యం ఒకటే గాని వాయించే పద్ధతులు వేరువేరుగా ఉంటాయి. ఈ డప్పును ఒక్కడు గానీ, సామూహికంగా కానీ వాయించుతారు. ఇది అవసరాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి ఉంటుంది. రెండు డప్పులతో ఎన్నో రకాల దరువులు వాయించడం సాధారణ విషయం. డప్పు వాయించడం సులభమే కాని వాయించే పద్ధతిలో ధ్వనిలో మాత్రం చాలా ప్రత్యేకతలున్నాయి. రౌద్రంగానూ, అత్యంత మార్దవంగానూ వాయించడం తెలంగాణా ప్రజలకు వెన్నతో పెట్టిన విద్య. కొమ్ములు, పీరణాలు కూడా ప్రజల సంగీత వాద్యాలే.

ఐతే ఈ వాద్యాలని సంగీత వాద్యాలని ప్రత్యేకంగా అనడం సరికాదు. వీటి అవసరం సంగీతం సృష్టించడం కాదు. ఒక ప్రత్యేకమైన శబ్దం అవసరంగా ఉపయోగించడమే. క్రతువులకీ. ఆచారాలకీ, పండగ సందర్భాలకి వీటిని ఉపయోగిస్తారు. 'డప్పు'కి నృత్యం జతగా ఉంటుంది. పెళ్ళిలోనూ, చావులోను ఇతర సంతోష సమయాలలోనూ నృత్యం డప్పుని వెన్నంటే ఉంటుంది. ఎక్కడో సుదూరాన మోగే డప్పు శబ్దాన్ని విని అది విలాసానికో, విషాదానికో సులభంగా తెలుసుకోవచ్చు. డప్పు కొట్టేటప్పుడు చేసే నృత్యంలో గజ్జెలు కట్టుకోవడం తప్పనిసరిగా ఉంటుంది. తెలంగాణా ప్రజలకు గజ్జెల శబ్దం కూడా ఇష్టమైనదే. ఈ గజ్జెలు పశువుల మెడలకు, బండి నొగలకు రకరకాల చోట్ల వాడతారు. ప్రజల సంగీత సంస్కృతిలో ఇవి చాలా ముఖ్యమైనవి.

పశువుల కాపరులు, పొలంకాపలా కాసే వాళ్ళు పిల్లంగోయి ఎక్కువగా ఉపయోగిస్తారు.

స్థూలంగా ప్రజల సంగీత వాయిద్యాలను నాలుగు రకాలుగా విభజింపవచ్చు.

1. కర్మకాండలో వాయించేవి.
2. విరామ సమయంలో వాయించేవి.
3. వృత్తిగాయకుల వాద్యాలు.
4. మత పరమైన వాద్యాలు.

పై విభజనలో చేరనిదీ ఒక వాద్యంగా లేనిదీ. ప్రజలందరి చేతుల్లో దాగినదీ "చప్పట్లు". చేతులే పరికరాలుగా పనిచేసే శ్రమజీవుల సంగీత వాద్యంగా దీని చెప్పవచ్చు. శ్రమలో చేతులు చేసేపని సృష్టించే లయాత్మక శబ్దం విరామంలో చప్పట్లు చప్పుడుగా మారుతుంది.

ఏ సంగీత వాద్యమయినా చేతి సహాయం లేనిదే పలకదు. తెలంగాణాలో ఎక్కువగా ఉపయోగించే కొమ్ము, పిల్లంగోయి, నాగస్వరం, శంఖం మాత్రమే ఊదే వాద్యాలు. ఇవికూడా శ్రమలో భాగమైన ఉచ్ఛ్వాస నిశ్వాశానికి సంబంధించిన పద్ధతిలో

మోగించేవి. వీటిని కూడా చేరి సహాయంతోనే (స్వరం పెంచడం, తగ్గించడం) మోగి స్తారు.

కోలలు, పీరణం, ఒగ్గు, డప్పు, సన్నెటు వాయించే వాద్యాలు.

వీరణాలు, డక్కి, జమిడికిలు, బుర్రలు, ఒగ్గు, డప్పు మొ॥వి చర్మ వాద్యాలు.

కటి వాద్యం, తంబుర, శారద మొదలైనవి తంత్రీ వాద్యాలు. పై సంగీత వాద్యాలకు కొంత నైపుణ్యం అవసరం. ఈ నైపుణ్యం అనుభవాన్ని బట్టి ఉంటుంది. ఈ వాద్యాలను ఎక్కువగా వృత్తి గాయకులు ఉపయోగిస్తారు.

విరామ కాలంలో పాడే పాటల్లో చప్పట్లే ఎక్కువగా ప్రాధాన్యం వహిస్తాయి. చెమ్మచెక్కలు, కోలాటం, చుట్టు కాముడు మొ॥ స్త్రీలకు సంబంధించిన పాటల్లో చప్పట్లు ప్రముఖంగా ఉంటాయి.

శ్రమజీవులు అనివార్యంగానే తక్కువగా మాట్లాడతారు. గంటల కొద్దీ పాటలు పాడగల వాళ్ళు సైతం చక్కగా ఐదు నిమిషాలు మాట్లాడలేరు. పాటే వారి సర్వం.

కంఠం, స్వరాల మేళనం ప్రజల పాటకు ప్రాణం. పాడే వారి భావ ప్రకటనా రూపం కాబట్టి కడుపువిచ్చి పాట పాడడం సహజ స్వభావం. అందుకే గీర పోవడం అంటూ ఉండదు. పోయినా వెంటనే పదాల్లోని శబ్దాలను విరవడమో, తుంచడమో జరుగుతుంది. కాబట్టి రాగానికి దెబ్బ తగిలితే ప్రశ్నేలేదు. అది సామూహిక గానమైతే, ఆ గానంలో శ్రమలో ఒక భాగంగా వెలువడితే స్వరం దెబ్బతిన్నా పాట నిర్మాణం దెబ్బతినదు. ఇలాంటి పాటలే ఇంత రాగయుక్తంగా, సజీవంగా ఉండటం జరుగు తుంది.

సంగీతం పాటకే పరిమితం గాకుండా గ్రామికుల జీవితంలోనే అది ఒక భాగం. బిచ్చగాళ్ళు, ప్రదర్శకులు ప్రత్యేకమైన సంగీత వాద్యాలతో నిత్యం దర్శనమిస్తారు. పొట్ట పోసుకోవడం కోసం రకరకాల ప్రదర్శనలు ఇస్తారు ఈ ప్రదర్శనలు మనుషు లకి సంబంధించకుండా పశుపక్షులకు సంబంధించినవిగా ఉంటాయి. పామును ఆడించే గారడీ వాడు నాగస్వరం ఊదుతాడు. గంగిరెద్దులను ఆడించే అతను-

డూడూ డూడూ బసవన్నా
అమ్మగారికీ దండం బెట్టూ
అయ్యగారికీ దండం బెట్టూ

బాల దొరలకు దండం బెట్టూ——అని పాడుతూ శంఖం ఊదుతాడు: ఎలుగుబంటిని ఆడించే వాడు ఇనుపసేరుకు కట్టిన గుంగ్రని బిళ్ళల సాధనం ఉపయో గిస్తాడు.

కోతి, చిలుక మొదలైన వాటికికూడా శిక్షణఇచ్చి ఆడిస్తారు. ఈ విధంగా మనుషులు

ఆడే ఆటలు, పాడే పాటలు, మనుషులు ఆడించే ఆటలు, పాడించే పాటలు రకరకాలుగా ఉంటాయి. వీటిని బట్టే సంగీతమూ ఉంటుంది.

ప్రజల సంగీతం సృజనాత్మకమైనది. అది వారి జీవితానికి దూరమై కూడా ఈ సృజనాత్మక శక్తిని విడిచిపెట్టలేదు. ఈ శక్తి శ్రమ జీవులను నిద్రపుచ్చే శక్తిగా మారినా మళ్ళీ ప్రజల కోసం తన సంకెళ్ళను ఛేదించుకొని ప్రజల పక్షాన నిలబడింది. బలమైన తన శక్తిని చూపించగలిగింది.

ఈ ప్రకరణం తెలంగాణా ప్రజల జీవితాల్లో ఎన్ని రకాల పనులు, పాటలు ఉన్నాయో వర్గీకరించి చెప్పడానికి కాదు. ఇన్ని రకాల పనులు చేయించి భూస్వాములు శ్రమని ఎన్ని రకాలుగా దోపిడి చేసారో చెప్పడానికి మాత్రమే ఈ ప్రయత్నం జరిగింది.

వారి శ్రమైక జీవన సంస్కృతి పోరాటానికి చాలా దగ్గరగా ఉంది. గోచీ పెట్టి చీర, దోవతి కట్టడం, అంబలి, గంజీ తాగడం, నిరంతరం కొడవళ్ళు, గొడ్డళ్ళతో పనిచేయడం, విశ్రాంతి లేక ఎక్కువ కాలం శ్రమిస్తూ గడపడం వగైరా గమనిస్తే వారు పోరాటానికి నిత్యసన్నద్ధులుగానే ఉన్నట్లు కనిపిస్తుంది. పోరాట వీరులకు ప్రత్యేకంగా లభించే శిక్షణ వీరికి వీరి జీవితమే ఇచ్చింది. భూస్వాముల దౌర్జన్యాలకు గురై సతమతమైన వారికి జీవించడమే ఒక పోరాట మయింది. ఆ విధంగా సాయుధ పోరాటానికి నేపథ్యం వారి జీవితమే. కొడవళ్ళు, రోకళ్ళు మొ॥ ఉత్పత్తి సాధనాలే పోరాటంలో ఆయుధాలయినాయి. ఏ కారం తిని బ్రతికారో అదే కారం దుండగుల కళ్ళలో-గుప్పించారు. ఏ పని పాటలు వారి జీవితంలో ఒక భాగ మయ్యాయో అవే పోరాట పాటలై ఉత్తేజాన్నిచ్చాయి.

శ్రమ జీవితంలో, పనిపాటల్లో హిందూ, ముస్లిం అన్న తారతమ్యం లేదు. అందరూ ఒకే లాంటి శ్రమ చేస్తారు. చేసే పనులు కూడా ఒకటే, ఒకే తిండి తింటారు. ఒకే విధమైన పనిలోంచి పనిపాటని వెలువరుస్తారు. ఆ పనిలో సామూహికంగా కష్టసుఖాలు పాలుపంచు కుంటారు.

ఏ దేశంలోని శ్రామిక ముస్లింలైనా ఇదే విధంగా జీవితాన్ని గడుపుతారు. అలాంటి తెలంగాణా శ్రమజీవులు పాటల్ని తరతమ భేదం లేకుండా పాడుకున్నారు. శ్రమజీవుల జీవితంలోని 'ఐకమత్యం' పోరాటంలో వారిని కలిపి ముందుకు నడిపించింది. వారి మతాచారాలకు సంబంధించిన పాటలు పోరాట పాటలై అన్ని రకాల ప్రజలకు అందుబాటులోకి వచ్చాయి.

ఏ శ్రమైతే వెట్టిచాకిరీలో మగ్గిపోయిందో అదే ఒక సామాజిక శక్తిగా తిరగబడింది. వారి పనిలోని ఓర్పు, నేర్పు పోరాటంలో ఉపయోగపడ్డాయి. అణగగొట్టబడిన వారి శక్తి, సామర్థ్యాలు మేల్కొని పోరాట వ్యూహాన్ని రచించాయి.

## పాదసూచికలు - ఒకటవ అధ్యాయము

1. జె. సి. 1982, "తెలంగాణా పోరాట పాటలు - ప్రజల పాటలు." సృజన, పేజీ. 5
2. పై, ఈ వ్యాసాలే కాకుండా వీరి "భూమి తల్లి కడుపు పంట" సృజన (1982) వ్యాసం వారితోనూ, డా॥ కె. రామకోటి శాస్త్రి, డా॥ పి. వరవరరావు, బి. నరసింగరావు, గద్దర్, భూపాల్‌తోనూ జరిపిన ఇంటర్వ్యూలు ఈ అధ్యాయం రాయడానికి చాలా ఉపకరించాయి.
3. ఖండవల్లి లక్ష్మీరంజనం - ప్రజా వాఙ్మయం; తాళ్లావజ్ఝల శివశంకర శాస్త్రి, ఆడిదం రామారావు - పదవాఙ్మయం; మల్లంపల్లి సోమశేఖర శర్మ - అనాదృత వాఙ్మయం; వావిలాల సోమయాజులు - గేయ రచనలు; వేటూరి ప్రభాకర శాస్త్రి - మధురకవితలు; శ్రీ పాద గోపాల కృష్ణమూర్తి - దేశి సారసత్వం; తూమాటి దోణప్ప, నేదునూరి గంగాధరం, బి. రామరాజు - జానపద సాహిత్యం (వివరాలకు చూడండి, రామరాజు, 1958 : 2 పేజీ)
4. జె. సి. 1982, "తెలంగాణా పోరాట పాటలు - ప్రజల పాటలు", సృజన, పేజీ 5.
5. The roads are steep but it is not unusual sight to see women limbing up them effortlessly balancing heavy bundles on their heads. The delicacy of balance and perfect physical co-ordination, resulting from ages of practice, are reflected in their music and their dancing. Their rhythemic sence is highly developed; musical performance is characterized by case and skill. Martin Jeo, 1971, *Negro Work Songs*, P. 69.
6. "The spinner sings as she spins. In doing this she is not merely conforming to as established custom. She finds it hard to spin without singing. The song helps her to concentrate her attention on the manual task. That is its objective function."
   George Thomson, *the Human Essence*, P. 63.
7. సొంత సేకరణ
   హే........హే........హై
   కోటేసన్న హైసో
   పట్రడ్రం ,,
8. సొంత సేకరణ
   హే........హే........హై
   కోటేసన్న హైసో
   పట్రండ్రం ,,

ప్రం పట్టి ,,
లాగ్ర అన్నా ,,
పట్టీ లాగూ ,,
కేబుల్ పట్టి ,,
లాగీ గుంజూ ,,

బి. అట్లట్ల పొయ్యే హైసోస్
పోరీ సండ్లు ,,
నిమ్మా పండ్లు ,,
ఇట్లా పోయ్యే ,,
పోరీ సండ్లు ,,
తాటీ పండ్లు ,,

డ్రం(మ్మ) పట్టీ హైసోస్
లాగ్ర అన్నా ,,
పట్టీ లాగూ ,,
కేబుల్ పట్టీ ,,
లాగీ గుంజూ ,,

బి. గేజరు మామ హైసోస్
వచ్చీనాడు ,,
వచ్చీనాడు ,,
గేజర్ మామ ,,
అట్లావచ్చే ,,
గేజర్ మామ ,,
పచ్చికోని ,,
వాడి నోట్ల ,,

9. దాదాపు ఇరవై గజాల లోతు గల పెద్ద బావుల నుండి నీళ్ళు తోడడం తెలంగాణాలో ఇప్పటికీ ఉంది. తాటి మొద్దు మీద అడ్డంగా వేసి దాని మీద కర్రలు పేర్చి నిర్మిస్తారు. మోట గిలకపై 'దండెడ' అనే లావు తాడుని బొక్కెనకు, ఎడ్ల కాడికి కడతారు. ఇనప బొక్కెన రెండోవైపన నీళ్ళలోనికి రావడానికి చర్మంతో చేసిన తొండం ఉంటుంది. దీనికి, కాడికి మధ్యన సన్నని తాడు కడతారు. దీన్ని తొండపు తాడు అంటారు. బొక్కెన బావిలోనికి వెళ్ళినపుడు నీళ్ళు నిండుతాయి. ఎడ్లు మోట లాగడానికి దిగువ స్థలం 'గుంద్రంగా' ఉంటుంది. రెండెడ్ల కాడికి కట్టి పైకి, కిందకీ ఎడ్లతో సహా మనిషి నడుస్తుంటాడు. నిండు బొక్కెనని ఎడ్లు బరువుగా లాగేటప్పుడు పాట ఆగి పోతుంది. నీళ్ళు కాలవలో పడ్డాక ఎడ్లు మోట దారిలో వెనక్కి నడుస్తున్నప్పుడు మరో చరణం అందుకుంటాడు. వేకువ జామునే ఈ మోట పని ప్రారంభమౌతుంది. పై శ్రమ పద్ధతికి, వేకువజాము వాతావరణానికి అనుబంధంగానే మోటపాట ఉంటుంది. ఈ శ్రమలో పశువులుకూడా భాగస్వాములే.

10. జి. లింగారెడ్డి, ః 1980, "తెలంగాణా శ్రామికగేయాలు, సిద్ధాంతవ్యాసం (ఉస్మానియా) పే. 109

11. -పై-

12. -పై-

13. విరసం, 1977 తెలంగాణా పోరాట పాటలు (రెండవ సంపుటి) పే. 1

14. ఫామిలియా అంటే ఒక వ్యక్తికి చెందిన బానిసల మొత్తం అని అర్థం. ఇందులో ఆవ్యక్తి అతని భార్య పిల్లలూ అందరూ వస్తారు. దేవరాజు మహారాజు. 9-10-1977, "జానపద సాహిత్యం స్త్రీ బానిసత్వం" విశాలాంధ్ర, పేజి 5.

15. చాకలి స్త్రీలు దొర ఇంట్లో బట్టలు ఉతకడం, దొరసానుల కాన్పుల సమయంలో ఇండ్లు ఊడ్వడం, అలకడం, వంటి పనులు చేయాలి,

"వచ్చెనే సాకల్ది వానతుల్ల మీద
నిలిచెనే సాకల్ది నిండు పందిట్ల
సందుల్లు గొందుల్లు ఉడ్చింది
ముత్యాల ముగ్గులు వేయించి" కాన్పు చేయడం, ఇంట్లో పడకలు వేయడం, దీపాలు వెలిగించడం, దొరసానులకు కాళ్ళు పిసకడం మొ॥న పనులు మంగలి స్త్రీలు చేయాలి.

"దున్నపోతులకు కౌర్షం దుడె బర్రెలకు క్షౌరం
మొలక క్షౌరం దొరలకు మొలక్షౌరం తలక్షౌరం
తలల కంటి పోయాలి తడయక మునిమాపులో
దీపాలు వెలిగించి దిండ్లు పడకలు పరిచి
కాళ్ళు పిసికి మధ్య రాత్రి కదలాలి తన యింటికి"

(రాజారాం పాట)

ఇలాంటి పనులు మంగలివారు చేయాలి.

దొరలకు, దొరల ఇంట్లోని అతిథులకు నీళ్ళు కాచడం, వంటలు చేయడం, ఇతర గ్రామాల నుండి వస్తువులను తీసుకొనిరావడం, కుమ్మరివాళ్ళు నిర్వహించ వలసిన బాధ్యతలు.

"వందల కొలదిగా కుండలు వరుసగా చేసివ్వాలి
నిత్యం కావలసినన్ని నీళ్ళు చేది పెట్టాలి.-
వేడినీళ్ళు చేసి దొరల వాడుకలో నుంచాలి
వచ్చిపోయే అధికార్లకు వంటలొండి పెట్టాలి"

(సుద్దాల హనుమంతు పాట)

గడిలో వడ్లు దంచడం, పిండి విసరడం, చల్ల చేయడం మొ॥ న పనులు చేయడానికి శ్రామిక స్త్రీయి వారానికోకసారి వంతుల వారీగా వెళ్ళాల్సి వచ్చేది.

16. యెల్దండరఘుమారెడ్డి, 1979, పల్లెపదాల్లో ప్రజాజీవనం, పేజీ 146.

17. విసునూరు దేశముఖ్ రామచంద్రారెడ్డి పొలములో రైతు కూలీలు పొద్దుగూకులు పని చేయడమే గాక రాత్రిపూట పెద్ద లాంతరు తెచ్చి ఆకాంతిలో పని చేయాలి.

పసిపిల్లల తల్లులు బిడ్డలకు రొమ్ముకుడిపి వస్తాము పోనిమ్మంటే పోనివ్వడు, పైగా కమ్మరి ఎంకన్ని పిలిచి నూరు గొడ్డు గిన్నెలు తెప్పించి అందులో చనుబాలు పిండమంటారు. స్వేదము, రక్తము చాల దన్నట్లు ఆ పాలను పొలములో చల్లిస్తాడు. పనివిడిచి పోయేవాళ్ళను పొర్లించి కొడతాడు. గుర్రాన్ని కొట్టే రేబానాతో కొడతాడు. ప్రజల పాటల్లో వాడు మనిషి కాదు. మహిషం. అతని తల్లి బ్రహ్మ రాక్షసి. (పి. వరవరరావు, తెలంగాణా విమోచనోద్యమం పే. 20.)

18. ఈ నాట్లు వేయడంలో శ్రమ మూసలో పోసినట్లుగా ఒకే పద్ధతిలో (Monotonous) ఉంటుంది. చేతిలోని నారు తీసుకొని భూమిలో నాటడం, మళ్ళ తీసుకోవడం, మళ్ళ నాటడం ఒక్కొక్క అడుగు వెనక్కి వేస్తూ పోవడం జరుగుతుంది. ఈ విధముగా మొత్తం శరీరాన్ని వంచి పని చేయడం జరుగుతుంది.
19. సొంత సేకరణ.
20. కలుపు తీస్తూ పాడే పాటలు కలుపు పాటలు. వరి, జొన్న, మిరప మొ॥న పైరు మొక్కల్లో కలుపు మొక్కలు తీస్తారు. వీటినే కలుపులు, కలుపు తీతలు, పుదురు తీయడం అంటారు. వరిపొలాల్లో అవసరాన్ని బట్టి రెండు మూడు సార్లు కలుపులు తీస్తారు. వరి నుండి ఊదర గడ్డిని ఏరి వేయడం ప్రధానమైనది. వరిపొలంలో నుడమల లోతు నీరు ఉంటుంది. కాబట్టి కూర్చోవడానికి వీలుండదు. వరి పొలంలో కాళ్ళు బురదలో దిగబడతాయి. కలుపు తీయడానికి ఎలాంటి పనిముట్లూ ఉపయోగించరు. కేవలం చేతులతోనే తీస్తారు. వరి తప్ప తక్కిన మిరప, జొన్న మొదలైన వాటికి అవసరాన్ని బట్టి చిన్న చిన్న ఇనుప పరికరాలు వాడతారు.
21. యెల్దండరఘుమారెడ్డి, 1979, పల్లెపదాలలో ప్రజాజీవనం, పేజి, 146.
22. ఎల్లోరా, 1982, జానపద సాహిత్యం, పేజీ 266
23. -పై- పేజీ 267.
24. సేకరణ: భూపాల్, పాడినవారు: వెంకటమ్మ, గడ్డమల్లాయగూడెం. తా॥ ఇబ్రహీంపట్నం.
25. -పై-
26. తూమాటి దొణప్ప, 1975, జానపద కళాసంపద, పేజీ 186
27. జయధీర్ తిరుమలరావు, 16- 10-1978 "ప్రజల భావప్రకటనా రూపం"- పాట (రాజారాం పాటలు)" ఆంధ్రభూమి (ఆదివారం)
28. సేకరణ: భూపాల్. పాడినవారు: వెంకటమ్మ, గడ్డమల్లాయగూడెం. తా॥ ఇబ్రహీంపట్నం.

29. జి. లింగారెడ్డి, 1980, "తెలంగాణా గ్రామికగేయాలు," సిద్ధాంత వ్యాసం (ఉస్మానియా) పే 33.
30. జయధీర్ తిరుమలరావు 20-3-1978, "ప్రజల భావ ప్రకటనా రూపం-పాట రాజారాం పాటలు," ఆంధ్రభూమి (ఆదివారం)
31. దున్నకుండా బీడుపెట్టిన భూమి.
32. శ్రమ విభజనకు గల సామాజిక ప్రాముఖ్యాన్ని మార్క్స్ కంటే ముందు ఫెర్గసన్ గుర్తించాడు. సరుకుల ఉత్పత్తి ఫలితంగా సాహిత్యం కూడా ఒక బృందానికి పరిమిత మయ్యింది. ఇది అసంకల్పిత ఫలితమే అయినా అది ఫలితమే. వర్తక వాణిజ్యాలు పెరగడంతో, సాహిత్యం ఒక వృత్తి అయింది. రచన ఒక సరుకూ అయింది. పరాయీకరణ (Alienation) విషయంలో మార్క్స్ చేసిన సిద్ధాంతానికి ఫెర్గసన్ ప్రతిపాదన ఒక సూచన లాంటిదని అనుకోవచ్చు. సమాజ జీవితంలో వర్తకం, పరిశ్రమ లాంటి మార్పులు ప్రవేశించి స్థిరపడ్డాక, అంతవరకూ సామాజిక జీవితంతో పెనవేయబడి ఉంటూ వచ్చిన మనుష్యులూ, వారి కళలూ, నైపుణ్యాలు సమాజ జీవితం నుండి ఊడ లాగినట్టుగా వేరుపడిపోతాయి. పరాయివైపోతాయి. షిల్లర్ అనే జర్మన్ మేధావి ఇలాంటి వాదమే చేశారు.

రమ, "సాహిత్య స్వాతంత్ర్యవాదం, సాహిత్య సిద్ధాంతాలు-ఉద్యమాలు" (వ్యాససంకలనం) సృజన, పేజి. 22.

33. తెలంగాణాలో వెట్టి చాకిరి కేవలం భూస్వాములకు అదనపు ఉత్పత్తిని చేజిక్కించు కోవడానికి ఉపయోగపడిన ఆర్థిక దోపిడీ రూపం మాత్రమే కాదు. అది ఒక సార్వత్రిక సామాజిక పీడనారూపం.
కె. బాలగోపాల్, 1982 (అక్టోబరు), "తెలంగాణా పోరాటం-ధనిక రైతాంగ వాదం," (తెలంగాణా విమోచనోద్యమ ప్రత్యేక సంచిక (సృజన, పే 93,
34. ఉత్పత్తి పని పద్ధతులు అభివృద్ధి పొందడంతో అనుకరణ నృత్యం శ్రమతో సంబంధాన్ని కోల్పోయి గణ సమాజ సంప్రదాయాలను తిరిగి చెప్పే వాహికగా సేవ చేస్తూ వినోదం వరకే పరిమితమవుతుంది.
35. శ్రమజీవి ఉత్పత్తి ఫలితాన్ని తన ఉత్పత్తి శక్తిని రెండింటినీ ఇతరులకు ధారపోస్తాడు. అంటే ఏ శ్రమ శక్తివల్ల, ఏ శక్తివల్ల తాను మానవుడవు తున్నాడో ఆ శక్తినీ, శ్రమనూ రెండింటినీ ఇతరులకు ధారపోస్తున్నాడు.
36. జె. సి. 1982 (జనవరి), "భూమితల్లి కడుపు పంట" సృజన, పేజి. 7.

37. సురవరం ప్రతాపరెడ్డి 1944 ఆంధ్రుల సాంఘిక చరిత్ర, లో ఉదాహరించిన గేయాన్ని నేను 'ప్రజల భావ ప్రకటనా రూపంగా పాట' ప్రజా సాహితి, 1981, పేజి, 89 (తెలంగాణా పోరాట సాహిత్య సమీక్ష)లో పేర్కొన్నాను.
38. యెల్లందరఘమారెడ్డి, 1979, పల్లెపదాల్లో ప్రజాజీవనం, పే. 162.
39. సొంతసేకరణ.
40. దాశరథి రంగాచార్య, 1969, చిల్లర దేవుళ్ళు నవలలో ఈ పరిస్థితి వివరంగా వుంది.
41. జయధీర్ తిరుమలరావు, 1979, "గద్దర్ ఎర్రెర్రని ఖాకాలహోళి, నూతన, పేజి. 15.

# 2

# జమిా-షాసిస్ట్ వ్యతిరేకోద్యమ సాహిత్యం (1928-1944)

జమిందారీ, రైత్వారీ భూమిశిస్తు విధానాలు పరస్పర విరుద్ధమైనవి. ఒకటి పెత్తందారీ విధానం, మరొకటి పేరుకు ప్రజాతంత్ర విధానం. స్వభావంలో మాత్రం కాదు. కాబట్టి రైతులకు భూమి యజమానులకు పైరెండు విధానాలు ఉపయోగకరంగా ఉండేవి కావు. పన్నులు రాబట్టుకోవడం కోసం ఆంగ్లేయ ప్రభుత్వానికి మాత్రమే ఉపయోగపడుతుండేవి.

పన్నులు, వంతుల[1] పేరుతో రైతుల్ని నానారకాలుగా దోచుకున్నారు.

భూమిని సాగుచేసే రైతులకు, దేశ సాధారణ పురోభివృద్ధికి జమిందారులు గుదిబండలుగా తయారయ్యారు. ఈ విషయం ప్రభుత్వం గుర్తించికూడా ఏమీ చేయలేక పోయింది. శిస్తు వసూలు చేసే జమిందారుల ప్రయోజనాలు గుర్తించడం జరిగిందే కాని, అష్ట కష్టాలు పడి భూమిని సాగుచేసే రైతుల శ్రమ గురించి ఆలోచించలేదు. అందుకే అల్పసంఖ్యాకులైన జమిందారుల ప్రయోజనం ముందు అధిక సంఖ్యాకులైన ప్రజల ప్రయోజనాలను పట్టించుకోలేదు. ఇందుకు కారణం సైనిక తిరుగుబాటుదారులలో భూస్వామ్య వర్గం కుమ్మక్కవుతోందనే భయం ప్రభుత్వానికి ఏర్పడడమే. అంతే కాకుండా ఆంగ్లేయ ప్రభుత్వాన్ని ఎదిరించకుండా బలపరిచే ఒక తరగతి మద్దతు కావలసి వచ్చింది కూడా.

పన్నుల వసూలు విధానంలో మార్పు ధాన్యశిస్తు ధనశిస్తుగా మార్చారు. పారి శ్రామిక వస్తువుల దిగుమతి ప్రారంభించారు. పల్లె ప్రాంతాలలో పెట్టుబడితో కూడిన వ్యాపారం ఆర్థిక పరిధిలోకి రావడంతో రైతాంగం క్రమంగా దివాలా తీయడానికి ఆస్కారం ఏర్పడింది. వృత్తి పనులు నాశనం కావడం ప్రారంభమైంది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ చాలా త్వరగా అంతకు పూర్వం లేనంతగా దెబ్బతిన్నది. పాత ఆర్థిక విధానం నశించి కొత్త ఆర్థిక విధానం పుట్టడానికి మధ్యకాలంలో వ్యవసాయ రంగం మీద ఎక్కువ ఒత్తిడి పడింది. కౌలురేట్లు పెరిగాయి. శిస్తులు పెరిగాయి, పాత భూస్వామ్య వ్యవస్థ బదులూ, కొత్తగా ఏర్పడిన వలస పాలన వ్యవస్థ భారం రైతుల భుజస్కంధాలపై పడింది.

ఈ కాలంలో కరువులు అధికంగా ప్రబలాయి. అంటువ్యాధులు సంభవించాయి ప్రకృతి కలిగించిన బీభత్స సమయాల్లో ప్రజలకు ఏ రకమైన రక్షణ ఉండేది కాదు. కంపెనీ ప్రభుత్వం, బ్రిటిష్ ప్రభుత్వం చేసిన వ్యవసాయ సంస్కరణలు వలసరాజ్య విధానాలకు ఆటంకం జరగకుండా, భూస్వామ్య వర్గాన్ని భూస్వామ్య పెట్టుబడి దారు లుగా మార్చడానికి మాత్రమే పరిమితమైంది. ఇందువల్ల రైతాంగం ఇంకా పేదరికం లోకి నెట్ట బడ్డారు. ఈ విధమైన పరస్పర విరుద్ధమైన ఆర్థిక విధానాల పునాది మీద కొన్ని ఉద్యమాలు వచ్చాయి. వీటిని నడిపే సామాజిక శక్తులు అభివృద్ధి చెందాయి.

ఇరవయ్యో శతాబ్దిలో బ్రిటీషువారు భూమి పంపిణీ పద్ధతికి, పన్నుల భారానికి తెలుగు రైతాంగం తలవంచలేదు. బ్రిటీషు పరిపాలనా కాలంలో అనేకమైన రైతాంగ ప్రతిఘటనలు అసమ్మతి ఉద్యమాలు తలెత్తాయి. రైతులు పదేపదే భూస్వాములకు, రెవెన్యూ ఏజంట్లకు, వడ్డీ వ్యాపారస్తులకు, పోలీసులకు వ్యతిరేకంగా పోరాటం చేశారు.

1880 నుండి 1920 ప్రాంతాల్లో ఆంధ్ర ప్రాంతంలో రాజకీయ ప్రజా చైత న్యం ఆవిర్భవించింది. ఈ ప్రజా చైతన్యానికి ఉన్నత మధ్య తరగతి నాయకత్వం వహించింది. ఈ మధ్య కాలంలో గిరిజనులు కూడా ప్రతిఘటనోద్యమాలు జరిపారు.

## గిరిజన గీతాలు

మైదాన ప్రాంతం రైతు ఉద్యమాలలో వచ్చిన పాటల సేకరణే జరగలేదు. లిఖిత సాహిత్యంలో కూడా వీటి ప్రసక్తి అంతగా లేదు. అక్కడక్కడ కొన్ని పద్యాలు ఉన్నాయి. 1930 ప్రాంతం నుండి జరిగిన రైతు ఉద్యమాలలో వచ్చిన కొన్ని పాటలు మాత్రం కనిపిస్తున్నాయి.

ఈ ఉద్యమాల కన్నా చాలా ముందే తెలుగు ప్రాంతంలో ఎన్నో గిరిజన ఉద్య మాలు జరిగాయి. ఈ సందర్భంలో పాడుకున్న పాటలు లభించలేదు. కాని సుసర్ల

బాలేశు రాసిన కొన్ని పద్య రచనలు మాత్రం దొరికాయి. ఈ పద్యాలలో ఆనాటి గిరి జనుల స్థితి గతులు వారిమీద జరిగిన దౌర్జన్యాలు వర్ణించాడు. ఉదాహరణకు—

అన్ని డిపార్టుమెంట్లు అనుకూలమే గాని
ఫారెస్టు డిపార్టుమెంటు పరమ శత్రువు
అడివంత ప్రజలకు ఆధారమై వుంటే
అడివి గొట్టేసి రన్నాయము గాను
.... .... .... .... .... .... ....
మానులను పెంచియు మనుషులను చంపియు
ధనము సంపాదించెడి దారి ఇదయా [2]

మైదాన ప్రజల బాధలకు, గిరిజనుల బాధలకు కారణాలు వేరు. గిరిజనులకు అటవీశాఖ, మైదాన ప్రజలకు రెవెన్యూశాఖ యమకూపాల్లాంటివి. ఒకరికి భూమి, మరొకరికి అడవి జీవనాధారాలు. అవి వారి అజమాయిషీలో ఉండాల్సినవి. పన్నులు వసూలు పేరుతో ఈ బాధలు అధికమయ్యాయి.

జమిందార్లు, తాణాదార్లు అక్రమంగా ఆక్రమించుకున్న దిగువ భూములను గిరి జనులకు కౌలుకిచ్చి, అడవిపన్ను, కడపపన్ను, తగవు పన్నుల పేరుతో రకరకాలుగా డబ్బు వసూలుచేస్తూ వచ్చారు. ఇలాంటి అక్రమ పన్నుల వసూలు వల్ల గిరిజనులలో అసంతృప్తి రగిలింది. గిరిజనుల అడవి బతుకుల అసంతృప్తిలోంచి ఎన్నో తిరుగు బాట్లు ప్రారంభమయ్యాయి. అడవిలో కల్లుచెట్ల మీద చిగురుపన్ను, మొదలుపన్ను పెంచారు. అంతే కాకుండా నర్సీపట్నం నుంచి చింతపల్లి వరకు ఘాట్ రోడ్డు వేయ డానికి బ్రిటీష్ అధికారి సెబస్టిన్ గిరిజనులను క్రూరంగా హింసించాడు. 1802-1803 లో మొదటిసారిగా చోడవరం దగ్గర జరిగిన రంపపితూరి, అదిలాబాదులో రాంజీగోండు నాయకత్వంలోను 1879 సం॥లో, రంపచోడవరంలో రెండోసారి 1915-16 మధ్య లోనూ గిరిజన ప్రతిఘటనలు జరిగాయి. ఈ తిరుగుబాట్లు విజయవంతం కాకపోయి నప్ప టికీ ప్రభుత్వం కళ్ళముందుకు పోడు [4] లాంటి సమస్యలను తీసుకు రాగలిగారు. ఈ సమస్యలు పై పద్య రచనల్లో ప్రతిబింబించాయి.

గిరిజనుల ప్రతిఘటనల ప్రేరణతో వెలువడిన పాటలు ప్రజల్లో విపరీతమైన ప్రచారం పొందాయి. అల్లూరి మీద వచ్చిన పాటలో—

అల్లూరి సీతారామరాజు వయసు ఇరవదాడు
శరభ శార్దూలాది జంతుమూకలు
నిన్ను చూచినంతనే తొలగిపోవు

కోడె త్రాచులు స్వాగత మొసగిపోవు
దుష్ట గ్రహములు దరికి చేరరావు

అని సీతారామరాజుని భావించారు. "శ్రీరామచంద్రునే నిను పూజించును నీ మహిమతెన్న తరమా ఆ ఆదిశేషునికైన" అనే అతిశయోక్తిత్వాన్ని అంటగట్టారు.

పోరాటాల్లో పాల్గొనే ప్రజలకు అల్లూరి పేరు విప్లవ భావస్ఫోరకంగా మారింది. రానురాను ఉద్యమాలు పెరుగుతున్నకొద్దీ అతనిమీద ఎన్నో పాటలు, బుర్రకథలు, కథలు వెలువడ్డాయి. సీతారామరాజుని దారుణంగా హత్య చేసిన తరువాత ఆంగ్లేయ ప్రభుత్వం పట్ల కాంగ్రెస్ కమిటీ నిరసన తీర్మానాన్ని కూడా ప్రవేశపెట్టలేదు. అలాంటివాళ్ళు సైతం అల్లూరి పోరాటం పేరుని తమకు అనుగుణంగా వాడుకున్నారు.

నేటికీ ప్రతి ఉద్యమం అల్లూరి పేరుని వివిధ రీతుల్లో ఉపయోగించుకుంది.

## జమీ వ్యతిరేకోద్యమ సాహిత్యం

ఆంధ్ర ప్రాంతంలోని ఏడు, రాయలసీమలోని ఒక చిత్తూరు మొత్తం ఎనిమిది జిల్లాల్లో 563 జమీందారీలు ఉండేవి. ఇందులోని రైతాంగం నానా బాధలకు గురయ్యేవారు. మొదటిసారిగా 1928లో రాష్ట్ర స్థాయి రైతు సంఘం ఏర్పడింది. ఈనాం రైతు సంఘం (1933), ఆచార్య రంగా నాయకత్వంలో గుంటూరు జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం ఏర్పాటైంది.

ఈ నేపథ్యంలో చల్లపల్లి, మునగాల మొదలైన ఎన్నో జమీందారీల్లో ఉద్యమాలు నడిచాయి. అపుడు వెలువడిన పాటలు 'రైతు భజనావళి'లో అచ్చేసారు.

ఆంగ్లేయ ప్రభుత్వం చలువతో గుత్తా పెట్టుబడిదారీ వ్యాపారం ఎక్కువైంది. వీరికి సహకరించే దేశీయ వర్గం ఒకటి పెంపొందింది. చిన్న భూస్వాములు తమ కొడుకుల్ని దేశ విదేశాల్లో లాయర్లుగా, డాక్టర్లుగా తదితర వృత్తివిద్య ఉన్నత విద్య కోసం చదివించారు. ఈ వర్గం వారు సంస్కరణాభిలాషులు. జాతీయోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. వైజ్ఞానికంగా అభివృద్ధిచెందినట్లుగా ప్రజలు వీరిని అంగీకరించారు. వీరి నాయకత్వాన్ని ఆమోదించారు. సాహిత్య కళా రంగాల్లో వీరు సేవ చేశారు. 1940 వరకు తెలుగు సాహిత్యంలో కనిపించే అభ్యుదయ భావాలు వీరివే. ఈ కాలంలో వచ్చిన పాటలు శిష్టనాయకత్వంలో భాగమైన కవులే రాసారు. వారే పాడారు.

రానురాను మితవాద నాయకులు చాలా మంది జమీందారులతో సామరస్య ధోరణి కలిగి ఉన్నారు. రైతు బాంధవునిగా పేరొందిన ఆచార్య రంగా కూడా ఇలాంటి ధోరణే కలిగి ఉన్నాడని చాలామంది భావించారు. రంగా చివరకు గాంధీ ఆశయాలు గల

ప్రజారాజ్యం వరకు వచ్చారు. వేరొకవర్గం శ్రమజీవుల ఆధిపత్యంలోకి ప్రజారాజ్యం తేవాలని సంకల్పించుకున్నారు.

రెండో వర్గం వారు జమిందారీ వ్యతిరేక ఉద్యమంలోని కమ్యూనిస్టు భావాలతో శ్రామికవర్గ ప్రయోజనాలకు అనుగుణంగా పనిచేస్తూ వచ్చారు. తాలూకా, జిల్లా రైతు, రైతుకూలి సంఘాలు వీరి చేతికింద ఉన్నప్పటికీ నాయకత్వం మాత్రం ఆచార్య రంగా మొదలైన మితవాద నాయకుల చేతుల్లోనే ఉంది.

రైతాంగ ఉద్యమ లక్ష్యాలు, ప్రయోజనాలు నాయకత్వం ఆలోచనల మేరకే పరిమితమయ్యాయి. ఈ ఆలోచనా విధానాన్ని ప్రజలకు బోధించడానికి వీలుగా సాహిత్యాన్ని ఆశ్రయించారు. ప్రజలకు దగ్గరగా పోవడానికి పాటలే సరైన సాధనంగా భావించారు.

కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు ముందునుండే ఆంధ్రదేశంలో సామ్యవాద భావాలు వీచాయి. ఈ శతాబ్దపు ఆరంభం నుండి తెలుగు ప్రాంతంలో స్వాతంత్ర్యోద్యమ ప్రభావం పడుతూ వచ్చింది. దీనికి అనుగుణంగా శిష్టవ్యావహారికంలో అనేకమైన పద్యాలు, కీర్తనలు వెలువడ్డాయి.

* * *

1935-36లో ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైంది. ఇది జాతీయోద్యమంలో భాగం పంచుకుంటూ వచ్చింది. 1934లో భారత కమ్యూనిస్టు పార్టీని నిషేధించారు. అప్పటికే ఆంధ్రప్రాంతంలోని అనేక జిల్లాల్లో పార్టీ సభ్యులు రహస్యంగా పనిచేయడం ప్రారంభించారు. అదేకాలంలో మొదటిసారి వర్గ ప్రాతిపదికపై కార్మిక సంఘాల ఏర్పాటు జరిగింది. 1936లో "దత్తు-బ్రాడ్లీ థీసిస్" వచ్చింది. కాంగ్రెసులోని అతివాదులు, సోషలిస్టులు కలిసి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ స్థాపించారు. ఇందులో కమ్యూనిస్టులు కూడా చేరారు. ఈ కాలంలోనే ఆంధ్ర రాష్ట్రంలోని 'ప్రజా పునాది' గల సంఘాలను ఏర్పరచారు. అప్పటి రైతు సంఘాలు ఆచార్య రంగా నాయకత్వం కింద రెండు మూడు జిల్లాలలో మాత్రం ఉండేవి.

1937 జులై 3న ఇచ్ఛాపురం నుండి రైతు యాత్ర బయలుదేరింది. ఈ రైతు యాత్ర ఆంధ్ర రైతాంగం మీద చాలా ప్రభావం చూపింది.[5]

కమ్యూనిస్టులు అట్టడుగున ఉన్న వ్యవసాయ కార్మికుల్ని వర్గపరమైన సంఘాల్లో సంఘటితం చేయడం ప్రారంభించారు. రైతు కూలి సంఘాల్లో ఎనలేని కృషి చేస్తూ ప్రజలను చైతన్యవంతులుగా చేసే క్రమంలో కార్యకర్తలు గేయ సాహిత్యాన్ని సృష్టించవలసి వచ్చింది.

రైతాంగ ఉద్యమంలో రెండు వర్గాల పనితీరు, స్వభావాన్ని అనుసరించి రెండు రకాలైన పాటలు వెలువడ్డాయి. అయితే మొదటి దశలో వచ్చిన పాటలు ఈ రెండు వర్గాల వారికీ ఉపయోగపడ్డాయి.

1934 సం॥లో 'రైతు భజనావళి' అనే పాటల పుస్తకం మొదటిసారిగా వెలువడింది. 30 పేజీలతో ప్రారంభమై 125 పేజీలకు పెరిగింది. 15 సంవత్సరాలలో పన్నెండు ముద్రణలు పొందింది. "రైతు సేవాదళాలే కాకుండా కాంగ్రెస్ ప్రచార నాయకులు ఇతర నాయకులు కూడా రైతు భజనావళిని ఆదరించిరి. శరణుజొచ్చిరి. దీనికొక గొప్ప కారణం కలదు. రైతాంగపు అవసరాలేకాక హృదయపు ఆవేదననూ, ఆశయమునూ భజనావళి కొంతవరకు ప్రతిబింబించింది. ప్రజ్వలింపజేసింది. ప్రోత్సహించింది".[6] ఈ రైతు భజనావళి ఆంధ్రదేశంలోనే కాక బర్మా మొదలైన ప్రాంతాల్లో ఉపకరించింది.[7]

జమీ వ్యతిరేకోద్యమంలో వచ్చిన ఈ పాటలను ప్రముఖంగా నెల్లూరి వెంకట్రామానాయుడు, న్యాయపతి నారాయణమూర్తి, గౌతు లచ్చన్న, వల్లంపాటి చెంచురామయ్య, నన్నపనేని వెంకటసుబ్బయ్య, అల్లూరి అప్పారావు మొదలైనవారు ఎక్కువగా పాడేవారు.

ఈ భజనావళిలో 'ప్రజల పాటల త్యాగయ్య' అని ప్రసిద్ధిపొందిన గరిమెళ్ళవారి "అన్యాయ కాలంబుదాపురించినపుడు అందరమూ మేలుకోవాలండీ" లాంటి పాటలు ఎక్కువగా ఉన్నాయి. 'మాకొద్దీ తెల్ల దొరతనం' బాణీలో 'మాకొద్దీ జమీందార్ల పొందు' లాంటి ఎన్నో జమీ వ్యతిరేకోద్యమ గీతాలను నెల్లూరు రామానాయుడు[8] రాశారు.

నెల్లూరి వెంకట్రామానాయుడు బహుముఖ ప్రజ్ఞాశాలి. గ్రాంధిక భాషలో పద్యాలు రాస్తూ, మరో వేపు ప్రజా బాణీల్లో పాటలు కూడా రాశారు. ఈ పాటలు ఆయనే సభల్లో పాడేవారు. అవి చాలా ప్రచారం పొందాయి. ఎరుకల సోది, భజన వరుసలు మొదలైన అనేక బాణీల్లో పాటలు రాశారు. తిరుపతి ఎస్టేటు మీద, కట్టెలపై పన్ను 'పుల్లరి'కి వ్యతిరేకంగా జమీందారుల దౌర్జన్యాలు, రైతుల బాధల వంటి ఎన్నో సమస్యలపై పాటలు, పద్యాలు రాశారు. ఈ పాటలన్నీ జమీ వ్యతిరేకోద్యమం కోసం ప్రారంభమైన 'జమీన్ రైతు'[9] పత్రికలో అచ్చు అయ్యాయి. ఈ పత్రికకు వెంకట్రామనాయుడు సంపాదకులుగా పనిచేశారు.

ఈయన పాటల్లో జమీందారీ వ్యతిరేకత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రజలకు ఆ భావనని ప్రబోధరూపంగా బోధించే లక్షణం ఎక్కువగా కనిపిస్తుంది. అన్ని రకాల సమస్యలను పాటల్లో ప్రతిబింబించారు. మొదటినుండీ ఆయనకు కాంగ్రెసూ, గాంధీల అభిమానం ఎక్కువ. కొన్ని సామ్యవాద భావాలు కనిపించినా ముఖ్యంగా కమ్యూనిస్టుల

(రష్యా, చైనా ఉద్యమాలు) పట్ల ద్వేషం ఎక్కువ. ఈ లక్షణాలు ప్రతిబింబిస్తూ పాటలు, పద్యాలు రాశారు.[10]

శ్రీశ్రీకన్నా ముందే-1933 నుంచి సామ్యవాద భావాలతో అభ్యుదయ గీతాలు రాసిన శెట్టిపల్లి వెంకటరత్నం గురించి చెప్పుకోవలసి ఉంటుంది. వీరు "రైతు సత్తా చెప్ప రణభేరీ మోగింది రండోయి! రైతులూ" అని ఆహ్వానిస్తూ "ఆగునా జీవాలు సాగునా లోకాలు రాజుగా మనమెంచి రైతుగొల్వకపోతే దేశాలు తలయెత్తునా! దాస్యపున్ పాశాలు బాపేడునా?" అని సవాలుచేస్తూ "జయభేరి మ్రోగింది ఓ తెల్గురైతా-జయ గేయములు పాడ సాగిరమ్మింకా" అనే గొప్ప పాటలు రచించి తానే ఎలుగెత్తి ప్రజంకోసం పాడారు. సామ్యవాద సిద్ధాంతం, అలాంటి ఆచరణాత్మక కృషి నుంచి శెట్టిపల్లి గీతాలు వెలువడ్డాయి. ఇలన్ని 'కామ్రేడ్ శెట్టిపల్లి, అనేవారు.[11]

ఈయన జాతీయ భావాలతో, గాంధీ సిద్ధాంతంతో రాజకీయ జీవితాన్ని ప్రారంభించారు. 1930-32 శాసనోల్లంఘనం చేసి జైలుశిక్ష అనుభవించారు. జైలునుండి వచ్చిన తరువాత సోషలిస్టు అయ్యాడు. 1936 లో కాంగ్రెసు, తరువాత కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరారు. కాంగ్రెసులోని మితవాదుల్ని, నిరంకుశత్వపు పెద ధోరణుల్ని నిరసించారు. ఆ ధోరణుల్ని ఖండిస్తూ పుస్తకాలు రాశారు.

విద్యార్థి ఉద్యమాల్లో శెట్టిపల్లి ఒక శక్తిగా వ్యవహరించారు. రైతు సభల్లో రచయితగా, కవి, గాయకునిగా తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చారు. ఇరవైనాలుగేళ్ళ వయస్సులోనే చాలా పుస్తకాలు రాశారు.[12] యువకునిగా ఆనాడు శెట్టిపల్లి రాసిన పాటలు అతని మరణం (25వ ఏట టైఫాయిడ్‌తో 1939 జులైలో మరణించాడు) తరువాత కూడా ప్రజల నాల్కల మీద నాట్యం చేశాయి. శెట్టిపల్లి పాటలు రైతు నినాదాలుగా వెలువడ్డాయి. రైతు యాత్రల్లో, ఊరేగింపుల్లో, సభల్లో ప్రజలే పాడుకొనేవారు. ఎందుకంటే ఆ పాటలు వారి చైతన్యానికి గీటురాళ్ళుగా పనిచేశాయి. అతని పాటల్లో రైతుల దీనత్వాన్ని చిత్రించలేదు. ప్రతిఘటనని మాత్రమే ఎలుగెత్తి చాటాయి. ఆ ప్రతిఘటన నుండి విజయానికి దారితీసే మార్గంలోంచి ఆ పాటలు వెలువడ్డాయి. అందుకే ఆ పాటలు ప్రజల నోళ్ళలో గూడుకట్టుకున్నాయి. - ఉద్యమాన్ని చల్లార్చగలిగినా ఆ పాటల ఉధృతాన్ని ఆపలేకపోయారు.

ఈ కాలంలో పాటలు రెండు రకాలుగా వచ్చాయి. ఒకటి. రాత పాటలు (లిఖిత గేయాలు), రెండు. నోటి పాటలు (మౌఖిక పాటలు).

రాత పాటలు జమీన్ రైతు, నవశక్తి, ప్రభ మొదలైన పత్రికల్లో పాటల సంకలనాల్లో ప్రచురితమయ్యాయి. వీటిలో గ్రాంథిక వాసనలు ఉండేవి. ఇవి పద్య ఛందస్సుకు దగ్గరైన రూపాన్ని ఆసరా చేసుకొని రాసినవి. ఈ పాటల్లో దేశ

స్వాతంత్ర్యం, వ్యక్తి విముక్తి, పేద, ధనిక సాధారణ రాజరమ్యం, సంస్కరణవాద భావాలు వస్తువుగా చోటు చేసుకున్నాయి. కొంతమంది పద్యాంలోనే ఈ కొత్త భావాలను వెలిబుచ్చారు.[13] గురజాడ దేశి సాహిత్యం[14] ముత్యాల సరంఛందస్సు అనే ఆధునిక లిఖిత కవిత్వంలోకి తెచ్చాడు. ఈ ఛందస్సు మౌఖిక రూపం కన్నా భిన్నమైనది. ఇక్కడ ఛందస్సుని మాత్రల దృష్ట్యా చూస్తే రెండూ ఒకటే. కాని ధ్వని సంపుటాల దృష్ట్యా చూస్తే వేరు వేరుగా ఉంటుంది. అదే విషయాన్ని వెల్చేరు నారాయణరావు ఇలా చెప్పారు—

"ఈ ఛందస్సు లిఖిత గేయ సాహిత్యంలో ప్రయత్నసిద్ధంగా పడుతుంది. ఇందులో అర్థం ముందు సంకల్పితమైన తర్వాత దానికి ఛందో వ్యవస్థలో వాడబడిన భాషా ఒకటి కావు. అంటే ఆలోచనకీ, పద్య నిర్మాణం పూర్తికీ మధ్య విలంబం ఉంది. ఆ కారణం చేత పద్యంలో ఛందోగత ధ్వనిసంపుటాలు, భాషాగత పదాంశాలు సంవదించే అవకాశం తక్కువ".[15] ఈ విధంగా కొత్త సమాజంలో, కొత్త భావాలను వ్యక్తం చేయడానికి మౌఖిక సంప్రదాయ రీతిలో చెప్పడానికి కొంతమంది కవులు తమ కవిత్వ మార్గాన్ని ఎన్నుకున్నారు.

దేశి ఛందస్సులో 'రాసిన' పాటలు నోటి పాటల్లా పాడుకోడానికి వీలుకాదు. ఎందుకంటే వాటికి నిర్మాణరీత్యా ఒక క్రమపద్ధతి ఉంటుంది. పత్రికల కోసం రాసే చాలా మంది కవులు ఈ 'కూర్పు' పద్ధతి పాటిస్తారు. పద్ధతిలో భాషా పదాల కూర్పుతో చరణాలు ఏర్పడి, గేయం కవి అనుకొన్న నిర్మాణాన్ని సంతరించుకుంటుంది. మొత్తం గేయంలో భావం క్రమంగా పెరుగుతుంది. ఈ పాటకు ఒక మొదలు, ముగింపు ఉంటుంది. గ్రాంథిక పదాలు, సంస్కృత సమాసాలు శిష్టభావాలతో నిండి ఉంటాయి. ఈ పాటలు శిష్టులు (చదువుకున్న మధ్యతరగతి) రాస్తారు. ఇవి అచ్చుకోసమే నిర్దేశింపబడతాయి. వాటి పరిమితి పాఠకుల వరకే ఉద్దేశింప బడుతుంది. శ్రోతల దాకా రాదు. ఈ రాత పాటల్లో సామూహిక గాన లక్షణం కొరవడుతుంది. మాదిరి దరువులూ, వరుసలూ చెప్పినప్పటికీ ప్రజలు తమ సొంత పాటల్లా మమేకం పొందలేరు. ఇలాంటి పాటలు జమీ వ్యతిరేకోద్యమంలోని వివిధ దశల్లోనూ వచ్చాయి. స్వాతంత్రోద్యమ ప్రభావంతో అనేక పాటలు వెలువడ్డాయి. కీర్తనలూ, దరువులూ తదితర దేశీ ఛందస్సుతో అధిక సంఖ్యలో రాత పాటలు వచ్చాయి. ఇవి పత్రికల్లో పుస్తకాల్లోనే ఉండిపోయాయి. వీటిలో ప్రజలు (వస్తువు అవసర రీత్యా) పాడుకోవాలనుకున్నప్పుడు, తాము పాడుకునే పద్ధతికీ, తమ అవసరానికి అనుగుణంగా మార్చుకొనేవారు. అప్పుడు మాత్రమే పాడుకోవడానికి వీలవుతుంది.

రాత పాటల స్వభావం కన్నా కొంత భిన్నంగా నోటి పాటలు ఉంటాయి.

ఈ పాటలు పేర్చబడతాయి. ధ్వని సంపుటాలు పదాంశాలుగా మారతాయి. ప్రజా పాటలు మౌఖిక రూపంలో ప్రచారం పొందుతాయి. ఇవి చాల వరకు ఆశువుగా వెలువడతాయి. ధ్వనికి, ధ్వనితో పేర్చే లయకు అనుగుణంగా పదాలు అప్రయత్నంగా పడుతాయి. ఇక్కడ నిర్మాణంలో పేర్పు ముఖ్యమైన అంశం. ఈ స్వభావం పనిపాటల నిర్వహణలోంచి వస్తుంది. ఇవి రాగయుక్తంగా పాడుకోడానికి అనువుగా ఉంటాయి. అక్షరాల పొందిక దెబ్బతిన్న తావులుంటాయి. మొదలూ, ముగింపూ ఎక్కడయినా ఉండవచ్చు. ప్రజలు వాడే పదాలు, భావనలు అసంకల్పితంగానే పడతాయి. ఇలా పాట నిర్మించగలగాలంటే ఆ ప్రజలలో ఒకరిగా ఉన్నప్పుడే సాధ్యమవుతుంది[16]. అంతటి శ్రమ, పరిశీలన, లేదా శిక్షణ పొందిన తర్వాత గాని ప్రజలపాట రాయడానికి వీలవుతుంది. అలాంటి పాటల్ని మాత్రమే ప్రజలు తమ సొంతగా భావించి, అతికొద్ది మార్పుల్ని చేసి తమ పాటలుగా పాడుకొంటారు. ఈ మార్పులు పాడటం వల్లే సాధ్యం అవుతుంది. రాగంతోనే పాటకు ఒక స్వరూపాన్ని కల్పిస్తారు.

ఈ విధంగా 1930-40 ప్రాంతాల వరకు రాత పాటలు అధిక సంఖ్యలో వచ్చాయి. ప్రజలలో ప్రచారం చేయాలనుకున్న భావాలు ఇమిడ్చిన పాటలు రైతు భజనావళి, తదితర గేయ సంపుటాల్లో ఎక్కువగా వెలువడ్డాయి. రాత పాటల్లో

ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా
సామ్రాజ్య వాదంబు సమసిపోవంగా
ధనిక వాదం ఇంక దగ్ధమై పోవ[17]

అనే తుమ్మల వెంకటరామయ్య పాట,

నూటికి ఎనభై రైతు జనానికి కూటికి దిక్కేది
ఆర్థిక మాంద్యం ముంచేస్తుంటే అడిగే దిక్కేది[18]

అని నెల్లూరు రామానాయుడు రాసిన పాటల్లో కనిపించే "సామ్రాజ్యవాదం," "ధనిక వాదం" "దగ్ధమైపోవ" "ఆర్థిక మాంద్యం" మొదలైన పదాలు ప్రజల పాటల భాషకు దూరమైనవి.

ఇలాంటి ఎన్నో వందల పాటల్లో రైతాంగం దయనీయమైన స్థితిని చిత్రించడానికే ప్రాధాన్యం ఇచ్చారు. 1933వ సంవత్సరంలో ఏలూరులో రెండో రాష్ట్రజమీన్ రైతుమహాసభ ఆచార్య రంగా అధ్యక్షతన వివిధ జమీందారీ ప్రాంతాల్లోని రైతుల కనీస కోర్కెల ప్రణాళిక తయారు చేశారు. ఈ ప్రణాళికలోని కోర్కెలే పాటలుగా పాడుకున్నారు[19]. ఈ కనీస కోర్కెలే ఆనాడు రైతాంగ ఉద్యమం లక్ష్యాలుగా భావించవచ్చు. ఈ కనీస కోర్కెలలో రైతు కూలీల కోర్కెలు లేవు. ఉన్నప్పటికీ అవి పాటలలోకి ఎక్కలేదు. ప్రధానంగా రైతుల ప్రయోజనాల వరకే ఈ కనీస కోర్కెలు

నిర్మాణం చేశారని గుర్తించడం అవసరం. ఎందుకంటే శ్రమజీవులైన రైతు కూలి ప్రజల జీవితంలోంచి వచ్చిన పాటలు ఎక్కడా నమోదు కాలేదు. మరోవైపు యుద్ధ కాలంలో కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యంలో జరిగిన ఫాసిస్టు వ్యతిరేకోద్యమంలో కూడా వెలువడిన పాటలు ఈ కోవకే చెందుతాయి.

## ఫాసిస్టు వ్యతిరేక సాహిత్యం

జర్మనీ దేశంలో 1933లో హిట్లరు అధికారానికి వచ్చాడు. అప్పుడు ప్రజా స్వామ్యాన్ని రక్షించుకోవాలా లేక భయంకరమైన ఫాసిస్టు విధానం కింద నలిగిపోవాలా అనే సమస్య ఏర్పడింది. సోవియట్ యూనియన్, దాని మిత్రదేశాలు ప్రజాస్వామ్య శక్తులను ఫాసిజానికి వ్యతిరేకంగా సంఘటితం చేసే యత్నాలు ప్రారంభించాయి.

1936 నుండి 39 వరకు ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ వివిధ రంగాలలో ప్రజలకోసం పనిచేసింది. ప్రజలతో నిత్యనూతన సంబంధాలు ఉంచుకుంది. ప్రజా సంఘాలను విస్తృత పోరాటసంస్థలుగా పెంపొందించింది. రహస్య జీవితం గడుపుతూనే యుద్ధవ్యతిరేక ప్రచారం కొనసాగించింది.

అంతవరకు రహస్యంగా ఉన్న కార్యకర్తలు మిత్రపక్షాల ఐక్యసంఘటనవల్ల బహిరంగంగా వచ్చి ప్రజలతో కలిసి పనిచేసే అవకాశం కలిగింది. సామ్రాజ్యవాద దాడి జరిగితే ఆ దాడినుండి రక్షించుకునే మార్గాలను, పద్ధతులను కార్యకర్తలు ప్రజలకు చెప్పారు. ఇందుకోసం ప్రజారక్షణ దళాలను నిర్మించారు. మహిళలకు ప్రత్యేకమైన శిక్షణ శిబిరాలను ఏర్పాటుచేశారు. ఇంతకాలం కమ్యూనిస్టు సానుభూతిపరులుగానూ, కార్యకర్తలుగానూ, ఉన్న కళాకారులు, రచయితలకు ఒక్కసారిగా స్వేచ్ఛ లభించినట్లయింది. యుద్ధవ్యతిరేక ప్రచారంకోసం వెనువెంటనే కార్యరంగంలోకి దూకారు. బహిరంగ సభలూ, కరపత్రాలు, పుస్తకప్రచురణల ద్వారా యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగించారు. కళాకారులు బుర్రకథలు, నాటకాలు, పాటలు వగైరా సాంస్కృతిక కార్యక్రమాలను చేపట్టింది.

అలాంటి వాతావరణంలో కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు తెలుగు దేశంలో ఇదివరకులేని ఒక కొత్త సాంస్కృతిక చైతన్యాన్ని కలిగించారు. సామాన్య రైతాంగంలో, రైతుకూలీలతో మమేకమై పనిచేసేవారికి ప్రజా కళారూపాల అవసరం ఏర్పడింది, అప్పటికే ప్రజల బాణీల్లో పాటలురాసి, పాడి వినిపించే సంప్రదాయం ఉంది. అతివాద కార్యకర్తలు చాలామంది రహస్య జీవితంలోకి వెళ్ళారు. బ్రిటిషు యుద్ధ ప్రయత్నాలను వ్యతిరేకిస్తూ మదరాసు జాతీయ కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా చేసింది. ఈ సమయంలోనే తిరిగి జమిందార్లు తమ ఎస్టేట్లలో దౌర్జన్యకాండకు దిగారు.

పన్నులూ, శిస్తుల వసూళ్ళకోసం ప్రజలపై నిర్బంధాన్ని విధించారు. ఈ కాలంలో ప్రజా కార్యకర్తలు ఎన్నో పాటలు కట్టి ప్రజలలో ప్రచారాన్ని ముమ్మరం చేశారు. పార్టీని నిర్మించడం, రైతాంగంలో చైతన్యం కలిగించడం ఈ రెండు అంశాలు ఏక కాలంలో ఆచరణలో పెట్టవలసి వచ్చింది. ఒకవైపు సామ్యవాద భావాలుగల పాటలు (ఎర్రజెండా, రష్యా, కార్మికశక్తి మొ॥ వి), మరోవైపు జమిందార్ల చర్యలూ, పన్నులూ, శిస్తులూ, రైతు దైన్యాన్ని ప్రతిబింబించే పాటలు వచ్చాయి.

మరోవైపు "దేశద్రోహ చర్యలను అణచుదాం రండిరా! గాంధి దేశభక్తులమై దేశసేవ చేయుదాం"[20] అంటూ ఆచార్య రంగా ఆధ్వర్యంలోని కార్యకర్తలు, కవులు కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా పాటలురాసి ప్రచారం చేశారు.

**కరువు పాటలు :** బెంగాల్, రాయలసీమ, పలనాడు మొ. ప్రాంతాల్లో కరువు విలయతాండవం చేసింది. ప్రజలు తిండికి మలమల మాడారు. బ్లాకు మార్కెట్ పెరిగింది. ధరలు అందుబాటులో లేవు. ఈ సమయంలో కరువు మీద అనేకమైన పాటలు వచ్చాయి. కరువు బాధలను దానికిగల అంతర్జాతీయ కారణాలను ఈ పాటల్లో వివరించారు.

ఈ కరువులు ప్రకృతి సిద్ధమైనవి కావు. యుద్ధ కారణంగా పెట్టుబడిదారులు కల్పించిన కృత్రిమ కరువులు. అందుకే కరువు విషాదాన్ని పాటల్లో వివరించి కరువు ఫండుకు డబ్బు, ధాన్యం వసూలు చేశారు. కవులూ, కళాకారులు ప్రజల్లో పాటలు పాడి వినిపించారు. వి. శ్రీకృష్ణ రాసిన 'అన్నా చెల్లెలు' పాటలో కరువుకి జవాబుగా భూమి సమస్యని పరిష్కారంగా చూపారు. భూమికోసం రైతు కూలీలు ఏకం కావాలని భావించారు. ఆ రకంగా బెంగాల్ కరువుని కూడా ఆంధ్ర దేశపు రైతుని చైతన్య పరచడం కోసం పాటల్లో పాడుకున్నారు. ఈ కరువు పాటల్లో ఆనాటి పేదల దయనీయ స్థితి చిత్రితమైంది.

ఫాసిస్టు వ్యతిరేక సాహిత్యంలో ఆ కాలంలో వెలువడిన కరువు పాటల్ని, సాధారణ చైతన్య గీతాల్ని, మహిళా చైతన్య గీతాల్ని ఒక భాగంగా చూడాలి. మదరాసు, విశాఖలపై జపానీయులు బాంబు దాడులు జరుపుతారనే భయం సర్వత్రా వ్యాపించింది. ఈ కాలంలో కళాకారులు రాజకీయ కార్యకర్తల కన్నా ఎక్కువ కృషి చేశారు. ప్రజలకు బాసటగా నిలిచారు. అందుకే అప్పట్లో ఎన్నో విలువైన పాటలు, కళారూపాలు[21] వచ్చాయి. కళాకారునికి నేరుగా ప్రజలతో సంబంధం ఉండేది. ఏది రాసినా, పాడినా ప్రజల కోసమే. ఈ పరిస్థితి ఒక్క తెలుగు దేశానికే పరిమితం కాదు. మన దేశంలో బెంగాలులోనూ[22] అమెరికాలోనూ[23] ఇలాంటి ఎన్నో పాటలు వచ్చాయి.

ప్రతి గ్రామంలోనూ ఫాసిస్టు వ్యతిరేక శిబిరాలు ఏర్పడ్డాయి. పిల్లలకు, పెద్దలకు విద్య నేర్పుతూ రాజకీయాలు బోధించేవారు. ఎన్నో బాలల సంఘాలు ఏర్పడ్డాయి

వాటికోసం ప్రత్యేకంగా పాటల పుస్తకాలు వెలువడ్డాయి. ఆ పాటలు కూడా ఆంధ్ర ప్రాంతం మొత్తం మారుమ్రోగాయి. యుద్ధ వివరాలను, ప్రభావాలను యువకులు దళాలుగా ఏర్పడి ప్రజల్లో ప్రచారం చేసేవారు. కొన్ని వేలమంది ఈ కార్యక్రమంలో పాలు పంచుకొన్నారు. ఈ కాలంలో తెలుగునాట రాజకీయ రంగంలో ఒక కొత్త అధ్యాయం ఆరంభమైంది. ఇదే అభ్యుదయ యుగారంభం. ఆ కాలంలో తెలుగు ప్రాంతంలోని భూస్వామ్య నియంతృత్వం తన ప్రతాపాన్ని కొంత అణచి పెట్టుకుంది.

ఏ కొద్దిపాటి అభిరుచి ఉన్నవారైనా పాటలు రాశారు. అందులో రాత పాటల కన్నా ఎక్కువగా నోటి పాటలే కనిపిస్తాయి. ఏ కొద్దిపాటి పాటలు పాడవచ్చిన వారైనా గొంతెత్తి ఈ పాటలు పాడేవారు. ఈ పరిస్థితుల్లో కృష్ణాజిల్లా దివి తాలూకాలో కీ॥శే పెండ్యాల నాగేశ్వరరావు, పరుచూరి రామకోటయ్య దేశభక్తిని పురి కొలుపుతూ యువజన సభలలో, వైజ్ఞానిక కార్యక్రమంగా బుర్రకథ కార్యక్రమాలను ప్రారంభించారు. 1943 జనవరి ప్రాంతంలో బొంబాయిలో అఖిలభారత కమ్యూనిస్టు పార్టీ మహా సభ జరిగింది. ఆ మహాసభకు వివిధ రాష్ట్రాల నుండి దళాలను ఆహ్వానించారు. ఆ సభల్లో కోగంటి, ముక్కామల, రాజారావు తదితరుల ప్రదర్శనలు ప్రశంసలుపొందాయి.

బొంబాయి వెళ్ళి వచ్చాక ఎన్నో బుర్రకథ దళాలు ఏర్పడ్డాయి. అప్పుడే ఆంధ్ర ప్రజా నాట్యమండలికి అంకురార్పణ జరిగింది. రాజకీయ ఇతివృత్తాలను తీసుకొని ఎన్నో నూతన కళా రూపాలను సృష్టించారు. 1943 జూన్ విజయవాడలో కమ్యూనిస్టు పార్టీకి అనుబంధమైన ఒక వైజ్ఞానిక శిక్షణ శిబిరం ఏర్పడింది. దీనికి ముందే కృష్ణా జిల్లాలో ఫాసిస్టు వ్యతిరేక శిక్షణ శిబిరం నిర్వహించారు. కొత్తగా ఎన్నో పాటలు, కళారూపాలు తయారైనాయి. బుర్రకథలు, కోయవేషం, చెంచులు, గెరిల్లా కళారూపం, హిట్లరు పరాభవం వీధి భాగవతం మొదలైనవి వీటిలో ప్రధానమైనవి. కొన్ని వందల సార్లు ఈ వీధి భాగవత ప్రదర్శన జరిగింది. లక్షల మంది ప్రజలు ఈ ప్రదర్శనను చూశారు. ప్రదర్శనగానే ఇది ఎక్కువ ప్రాచుర్యం పొందింది. ఇలాంటి ప్రాచీన కళారూపాలను మొదటిసారిగా ప్రజానాట్యమండలి కళాకారులు వాడుకొన్నారు. ఐతే ప్రక్రియా రూపంలో మార్పు చేయకుండా వస్తువుని మార్చుకొన్నారు. సంస్కృత పదాలు, గ్రాంథిక భాషా ధోరణిలోంచి బయట పడలేకపోయారు. ఈ ప్రదర్శన సంప్రదాయ వాదులను సైతం తలలూపించింది. అందుకు కారణం ప్రదర్శన పకడ్బందీగా ఉండటమే.

## మహిళా చైతన్య గీతాలు

ఇదే కాలంలో ప్రజల నిత్య జీవిత సమస్యలను పరిష్కరించడానికి కృషి

చేయడం జరిగింది. ప్రజలలో నిత్య నూతన సంబంధాలు నెలకొల్పుకొని కార్యకర్తలు అన్ని రంగాలలోకి చొరబడ్డారు. కార్యక్రమంలో పాల్గొనే ప్రజల సంఖ్య కూడా పెరిగింది. చాలా రోజులు రహస్యంగా ఉండటం వల్ల విద్యార్థి, మహిళా వర్గాల్లో అంతగా పనిచేసే అవకాశం లభించలేదు. అందుకే దొరికిన ఈ సమయంలో స్త్రీలలో చైతన్యం కలిగించడానికి తీవ్రమైన కృషి సలిపారు. అందుకే ప్రజా సంఘాల నిర్మాణంలో భాగంగా మహిళా సంఘాలను ఏర్పాటు చేశారు. అంతకు ముందు నిశబ్దంగా ఉన్న సామాజిక సంస్కరణోద్యమాన్ని పునరుద్ధరించారు-మరింత శక్తిమంతంగా.

వీరేశలింగం, గురజాడల స్మారక సభలు జిల్లా స్థాయిలో ఏర్పాటు చేశారు. ఆ సభల్లో సామాజిక రుగ్మతలుగా మారిన మౌఢ్యం, ఆచారాల పేరుతో సాగే మూర్ఖత్వాన్ని నిరసించారు. కట్నాలతో నిమిత్తం లేని కులాంతర వివాహాలను ప్రోత్సహించారు. వితంతు వివాహాలు జరిగాయి. సభల్లో, సమావేశాల్లో స్త్రీలు పురుషులతో సమానంగా పనిచేయడం జరిగింది. ముఖ్యంగా వైజ్ఞానిక కార్యక్రమాల్లో పాల్గొన్న స్త్రీలలో జాగృతి కలిగింది. 1944లో కృష్ణాజిల్లా మహిళా సంఘం సంపాదకత్వంలో "స్త్రీల పాటలు" అనే పాటల పుస్తకాన్ని ప్రచురించారు. స్త్రీలు, పురుషులు కలిసి రాసిన పాటలను సంకలనం చేశారు. స్త్రీల గురించి మాత్రమే రాసిన పాటలను ఇందులో చేర్చారు. స్వాతంత్ర్యోద్యమంలో, జమీన్ రైతు ఉద్యమాలలో గాని, ఇతర ఉద్యమాలలో గాని మహిళల గురించి ప్రత్యేకమైన శ్రద్ధ ఎవరూ తీసుకోలేదు. సాహిత్యపరంగా వారిని ప్రోత్సహించడం జరగలేదు. 'రైతుకూలి రాజ్యం' నినాదం ఇచ్చిన కాలంలో కూడా రైతు కూలీలలో సగభాగమైన మహిళలకు ప్రత్యేక కార్యక్రమం ఏదీలేదు. ఐనప్పటికీ ఉద్యమాల్లో వారు తమ కర్తవ్యాన్ని నెరవేర్చారు. అలాంటి వారిలో సానేపల్లి గున్నమ్మ ఒకరు. ఈవిడ మందసా ఎస్టేటులో ఫారెస్టు అధికారులు, ఎస్టేటు ఉద్యోగులు, పోలీసులు కలిసి చేసే దౌర్జన్యాలను ఎదిరించింది. ఆ సమయంలో వారు జరిపిన కాల్పుల్లో గున్నమ్మ తన ప్రాణాలు అర్పించింది. గున్నమ్మలాంటి వీరనారులను మహిళా సంఘాలవారు మరచిపోకుండా ఆమె పేరుతో ప్రేరణ పొందారు.[24] ఆమె మీద ఎన్నో పాటలు రాశారు. వృత్తి గాయకులు నేటికీ ఒక గాథని పాడుతూ ఉంటారు. (చూ. అనుబంధం)

పై సంకలనంలోని పాటలన్నీ ఎక్కువగా మధ్యతరగతి స్త్రీలలో చైతన్యం తెప్పించడం కోసమే పరిమితమయ్యాయి. ఇందులోని రచయితలు, రచయిత్రులు కూడా ఎక్కువగా మధ్య తరగతికి చెందినవారే స్వాతంత్ర్యోద్యమంలో మధ్య తరగతి స్త్రీలు ఎక్కువగా పాల్గొనలేదు. కాని ఆ వర్గం వారి స్త్రీల పాటల బాణీలలో పాటలు ఎక్కువగా వెలువడినాయి. యుద్ధ కాలంలో రష్యా దేశానికి చెందిన తాన్యా, జోయా

అనే వీరనారుల పేర్ల చైతన్యానికి మారుపేరుగా వాడుకున్నారు. కొమర్రాజు అచ్చమాంబ మొదట మహిళా సాంస్కృతిక దళాలను నిర్వహించారు. వీరు బతుకమ్మ నృత్యం, కోలాటం, నాటు మంత్రసాని నాటకం, సామాజిక గీతాలు మొ॥నవి ప్రదర్శించారు. ఈ దళంలోని స్త్రీ కళాకారులు ఎంతో క్రమశిక్షణతో కార్యక్రమాలు నిర్వహించారు. బుర్రకథలు పాడుకున్నారు. జముకుల కథ బాణీలో పాడుకున్నారు. ఈ పాటల్లో శ్రమ జీవులైన స్త్రీలను కలుపుకు రావడానికి ఎక్కువ ప్రయత్నాలు జరగలేదు. అందుకు కారణం నాయకుల భార్యలే ఈ మహిళా సంఘాలలో ప్రధాన పాత్ర వహించడం ఒక కారణంగా చెప్పవచ్చు.[25]

దేశ స్వాతంత్రోద్యమం గానీ, ఆంధ్రలో జరిగిన ఆంధ్ర మహాసభల కార్యక్రమాల్లో గానీ స్త్రీలకు ఒక ప్రత్యేక ప్రతిపత్తి లేదు ఏ కొద్దిగా కనిపించినా అది పురుషుని హోదాను ఆసరాగా చేసుకొని వచ్చిందే. ఆచార్య రంగా నాయకత్వంలో జరిగిన జమీ వ్యతిరేకోద్యమంలో కూడా స్త్రీలకు ఎలాంటి ప్రత్యేకమైన గుర్తింపు లేదు. రాను రాను మహిళా ఉద్యమం మధ్యతరగతి వరకే పరిమితమైన దృష్ట్యా ఆ పాటల బాణీలు, ప్రబోధం ఆ వర్గం వరకే పరిమితమయింది. "స్త్రీల పాటలు" పుస్తకం రెండు మంగళ హారతులతో ముగుస్తుంది. "పంటలు మిక్కుటముగా పండించు పతికి తోడై కోతలు పెంచి తిండి కొరతను తీర్చుమమ్మా/మంగళ హారతులివిగో మానినీమణి నీకు"[26] అనే చరణాల్లో ధనిక రైతు కుటుంబాలలోని స్త్రీల వరకే ఈ చైతన్య భావవీచికలు అందినాయని తెలుస్తోంది. అక్కడ కూడా "పతికితోడై" అనడం జరిగిందే గాని పతితో సమంగా పని చేయమని చెప్పలేదు.

ఈ మహిళా సంఘాలు రాజకీయ కార్యక్రమాలను స్త్రీ శ్రమజీవుల వరకు తీసుకు పోయాయో లేదో తెలియదు. కాని సాహిత్యపరంగా వారికి దగ్గరగా పోలేదని చెప్పవచ్చు. వీరు కేవలం సాంస్కృతిక ప్రదర్శనల్లో ప్రేక్షకులుగా ఉండేవారు. అంతేగాని ఆ కళాకారుల కార్యక్రమాల్లో భాగస్వామ్యం వహించలేదు. తమకు తాము కట్టుకున్న పాటలు కూడా ఏవీ నమోదు కాలేదు. శ్రమ సంబంధమైన బాణీలలో పాటలు రాయలేదు.

ఈ విషయం పురుష రైతు కూలీల పాటలకు కూడా వర్తిస్తుంది. పురుషుల శ్రమ సంబంధమైన బాణీలలో కాకుండా శ్రమ దూరమైన బాణీలలోనే రైతుకూలీ పాటలు కనిపిస్తాయి. ఫాసిజం వ్యతిరేక స్వభావం ఈ పాటల్లో ఎక్కువగా కనిపిస్తుంది. కాని కేవలం ఫాసిస్టుల ఓటమి సోషలిజానికి దారితీయదు. సోషలిజానికి ఈ ఫాసిస్టుల ఓటమి తోడ్పడుతుంది. అంతేగాని ప్రత్యామ్నాయంగా ఉండదు. సామ్యవాద భావజాలం ఫాసిస్టు వ్యతిరేక సాహిత్య కళారూపాల్లో అంతగా ప్రతిబింబించలేదు.

స్త్రీల పాటలు రాసిన కవులే రైతుకూలి పాటలు రాశారు. కోగంటి, సుందర, ముక్కామల నాగభూషణం, మిక్కిలినేని, కొనకళ్ళ వెంకటరత్నం, విద్వాన్ ప్రయాగ కోదండరామశాస్త్రి, వి. కృష్ణ మొదలైనవారు ఎక్కువగా రాశారు. ఈ పాటల్లో చక్కటి శిల్పం కనిపిస్తుంది. వీరిలో చాలామంది గాయకులు కూడా. అందుకే పాటలు చాలా ప్రచారం పొందాయి. వివిధ సంకలనాల్లో కూడా ఇవి చోటు చేసుకున్నాయి. ప్రజల అజ్ఞానానికి, మూఢనమ్మకాలకు, అభివృద్ధి నిరోధక కట్టుబాట్లకు వ్యతిరేకంగా జరిగిన పోరాట నేపథ్యంలోంచి ఈ పాటల్ని పరిశీలించాలి. అప్పుడే ఈ పాటల స్వభావాన్ని తెలుసుకోగలం.

ఈ పాటలు వెలువడిన మూడేండ్ల తరువాత కొన్నింటిని తెలంగాణా పోరాటంలో పాడుకోవడం గమనించవచ్చును. మరి కొన్నింటి బాణీలను మాత్రమే తీసుకొన్నారు. మరికొన్ని పాటలను కొద్దిమార్పులతో ఉపయోగించుకొన్నారు. ఈ మార్పులు తెలంగాణా ప్రజలు చేసుకొన్నవి. కొన్ని పాటలు రాసిన కవులే మార్చి ఆ ప్రజలకు అందించినవి కొన్ని ఉన్నాయి. ఇలా ఒక లక్ష్యంతో ప్రజలకోసం వెలువడిన పాటలు ప్రజల మరో లక్ష్యానికి ఎంతగానో ఉపయోగపడ్డాయి.

1928 నుండి రైతులు, రైతుకూలీల సంఘాలు ఏర్పడిన తరువాత ఎన్నో పాటలు వెలువడ్డాయి. శ్రీశ్రీకన్న, అభ్యుదయ రచయితల సంఘం స్థాపనకన్న చాలా ముందే శెట్టిపల్లి వెంకటరత్నం లాంటి ప్రజాకవులు ఎన్నో విలువైన పాటలు రాశారు. జాతీయ కాంగ్రేసు పార్టీ జమీ వ్యతిరేకోద్యమంలో తనదంటూ ఎలాంటి సాహిత్యం సృష్టించలేదు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి అనుబంధించిన నాయకులు, కవులు ఆతరువాత కమ్యూనిస్టు పార్టీలోకి చేరడం వల్ల ఆపార్టీ సాహిత్యం అంటూ ప్రత్యేకంగా పేర్కొనలేం.

పై రాజకీయ నేపథ్యానికి ప్రభావితమైన కొంతమంది రచయితలు సంస్కరణ భావాలను, అభ్యుదయభావాలను వ్యక్తంచేశారు. పాత సాహిత్య సంప్రదాయాలను విడనాడి కొత్త సంప్రదాయాలకు కట్టుబడి పోయారు. శ్రీ శ్రీ ఇత్యాదులు భావకవిత్వ ప్రభావం నుండి బయటపడి కొత్త కవిత్వాన్ని రాశారు. ఇలాంటి వారిమీద ఆంధ్రదేశపు రాజకీయ వాతావరణ ప్రభావం అధికం. వీరంతా అక్షరాస్యకవులు. ఈ దశాబ్దాల్లోనే [1940-50] తెలుగునేల అన్నిరకాల రాజకీయ ఉద్యమాలు (దేశ స్వాతంత్ర్యోద్యమం, రెండో ప్రపంచయుద్ధం, వర్గసంఘర్షణ) చవిచూసింది. ఈ ఉద్యమాలకనుగుణంగా సాహిత్యం తన రంగూ రుచీ మార్చుకొని ప్రజల తరపున వకాల్తాపుచ్చుకొంది.

ఈ కాలంలో వేలాది పాటలు వెలువడ్డాయి. పాటల మూటల కాలంగా భావించినా ఇవి సాహిత్యంలో ఒక ధోరణికి ప్రత్యేక ప్రాతిపదిక కల్పించలేక పోయాయి.

జాతీయోద్యమంలో వచ్చిన పాటలకన్నా ఇవి రాశిలోనూ, వాసిలోనూ వస్తువులోనూ బాణీలోనూ ప్రజలకు దగ్గరగా ఉన్నాయి.

సారాంశం ఏమంటే ఆచార్య రంగా మొ॥ భూస్వామ్య వర్గం నాయకత్వంలో జరిపిన రైతాంగ ఉద్యమంలోంచి రాశ పాటలు వెలువడ్డాయి. ఈ పాటలు ఆ నాయకత్వానికి ప్రతిబింబంగా చెప్పవచ్చును. ఇవి శ్రమజీవుల పాటలు కాలేకపోయాయి.

కాంగ్రెసుతో భుజం భుజం కలుపుతూ అతివాదులుగానూ, సోషలిస్టులుగానూ, నిషేధించబడిన కమ్యూనిస్టుల చొరవతో నడపబడిన 'రైతుకూలీ సంఘం ఉద్యమాలు' చాలా వచ్చాయి. వీటిని అనుబంధించి ప్రజాసామాన్య బాణీలలో కొన్ని నోటి పాటలు వచ్చాయి. ఇవి ప్రజల పాటలకు దగ్గరగా ఉన్నాయి. కాని అవి పూర్తిగా ప్రజా సాహిత్య, స్వభావాన్ని సంతరించుకోలేక పోయినప్పటికీ వాటిని ప్రజలు తమ సొంతం చేసుకున్నారు.

ఆ స్వభావం పాటల్లో చేరడానికి ప్రజలను నడిపించే పార్టీ, దాని ఆశయాలు ఒక నిర్దిష్ట స్వరూపం కలిగిన నిర్మాణం తెలుగు ప్రాంతంలో ఏర్పడిన తరువాత సాధ్యమైంది. అలాంటి పోరాటం ఆంధ్ర ప్రాంతంలో కాకుండా తెలంగాణాలో వచ్చింది.

## పాద సూచికలు

1. భూమిమీద పండిన పంటలో కొంతభాగం వంతులప్రకారం గ్రామసిబ్బంది (పురోహితుడు, పంచాంగ బ్రాహ్మడు, చాకలి, మంగలి వృత్తులవారు, కరణం, మునసబు మొ॥న 20 రకాలవారు) కి పంచాలి. మిగిలిన దాంట్లోంచి రాజభాగం (పన్ను) పేరుతో ప్రభుత్వానికి ఇస్తాడు. ప్రతి గ్రామం దాని పరిస్థితులనుబట్టి, గ్రామ సిబ్బంది అవసరాలనుబట్టి వంతులవారీగా ఇవ్వాలి. ఇందులోనూ రైతును బలవంతపెట్టి, మోసంచేసి వసూలుచేస్తారు.
   గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, 1944, మన జమీందారీలు, పే. 13.
2. పిరాట్ల శివరామకృష్ణ, 1982, "తెలుగు గిరిజన గీతాలు" సిద్ధాంతవ్యాసం (ఉస్మానియా విశ్వవిద్యాలయం)
3. 1915, 1916 లలో మరొక గిరిజన ప్రతిఘటనోద్యమం జరిగింది.

హెమన్‌డార్ఫ్ మాటల్లో ఈ పోరాటం **"But was successful and prolonged defiance of law and order by armed groups of malcontents and bandits. This revolt spread over the hilly area of Vishakhapatnam and East Godavari Agencies."**
**V. Raghavaiah,** 1971, **Tribal Revolts, P.** 34

4. **The restriction placed by the forest officials on the wastefull cultivation of "podu" Forest rules and restrictions which are still an eye sore for the tribal people as well as former inhabiting villages bordering on reserved forests, throughout the country.**
**V. Raghavaiah,** 1971, **Tribal Revolts, P.** ౭౪.

5. ది ట్రిబ్యూన్ అనే లండన్ పత్రికలో ఏ. జి. స్పార్క్ **"Biggest Hunger in History"** అని రాసింది. జమీన్ రైతు, (2. 9. 1938), పే 4.
కంభంపాటి సత్యనారాయణ, 1961, విశాలాంధ్ర (ప్రత్యేక సంచిక) పే 14.
6. గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, 1971, మనకిసాన్ వెంకటసుబ్బయ్య, పే 68.
7. ఆచార్య రంగా (సం) 1936, "ముందుమాట" రైతుభజనావళి.
8. నెల్లూరి వెంకట్రామానాయుడు 1918 నుండి పొట్లపూడిలో పొణకవారి కుటుంబ వ్యవహారంపై పెత్తనంచేస్తూ కరణీకం చేసేవాడు. జమీందార్ల దౌష్ట్యాలకు ఆయన ప్రత్యక్ష సాక్షి అయ్యాడు. 1937 ప్రాంతంలోనే జానపదగేయాలు సేకరించారు. ఆయా బాణీల్లో పాటలు రాశారు.
9. 1929 అక్టోబరు 19 న నెల్లూరు జిల్లా రైతుసంఘం ఏర్పడింది. రెండేళ్ళవరకు వెంకటగిరి రైతాంగం ఎవరూ కలిసిరాలేదు. వాళ్ళను కలుపుకురావడానికి పత్రికకావాలి. అందుకే జమీన్ రైతు ప్రారంభ సంచికను 2. 3. 1930 నాడు తీసుకువచ్చారు. అప్పటినుండి ఆ పత్రిక జమీందారీ విధానానికి వ్యతిరేకంగా పనిచేస్తూ వచ్చింది. అందులో ఎన్నోపాటలూ, పద్యాలూ ప్రచురించారు. ఈ పాటలు ఉద్యమప్రాంతాల్లో ప్రచారంపొందేవి. జమీ వ్యతిరేకోద్యమ సాహిత్య రథంగా పేరుపొందింది.
10. నెల్లూరి వెంకట్రామానాయుడు, 1980, జమీన్‌రైతు స్వర్ణోత్సవ సంచిక (1930-1980) పే 141-142.
11. **N. G. Ranga,** 1939, **Revolution in Andhra Literature, (Com. Settipally's Commemoration volume)-Andhra Ryta-**

nga Grandhamala, Gudiwada, Indian Kisan's Tribute, P 11.

12. మేల్కొన్న భారతీయ మహిళ, విప్లవ విద్యార్థులకో సందేశం, జ్యోతిర్మయి (పాటలు) మొ॥ వి.

13. బంధకవికేసరి పత్తిగొడుపు రాఘవరాజు, (కూలోడు), శ్రీమాన్ ఇనగంటి పున్నయ్యచౌదరి, (రైతుల అగచాట్లు). ఈ రచనలు రైతు భజనావళి, 1949, లో వచ్చాయి.

14. వెల్చేరు నారాయణరావు, 1978, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, పే75.

15. -పై -పే 78.

16. ప్రజల నుడికారం, భాష, భావ వ్యక్తీకరణ తరతరాలుగా వస్తున్న సంస్కృతే, శ్రమజీవన విధానం, భౌగోళిక పరిస్థితులవల్ల సంక్రమించిన విజ్ఞానం మొ॥ అంశాలు ప్రజలతో కలిసిపోయిన వారిపాటల్లో ప్రతిబింబిస్తాయి.

17. తుమ్మల వెంకటరామయ్య "ఎర్రజెండా", కంభంపాటి సత్యనారాయణ; (1983)

18. నెల్లూరి వెంకట్రామానాయుడు, 1980, జమీన్‌రైతు, స్వర్ణోత్సవసంచిక (1930-1980) పే 79.

19. ఇష్టము వచ్చినయపుడు రేట్లను హెచ్చించుట మానాలి/ కష్టము వచ్చినచోట్ల రేటులను క్రమముగ తగ్గించాలి/ ప్రమాదముంటే పంటలుచెడితే రిమిష నిప్పించాలి/ జమీను రేటులు రైతులవారితో సమానమనిపించాలి/ జమీప్రదేశపు జలాధరముల మరమ్మత్తు చేయించాలి/ కోర్టులలోని డిక్రి పొందకయే కూడదు ఆస్తిజప్తు./ పట్టుబడి ఇవి రయితుల హక్కుని ప్రకటించవలెనండీ/ రయితు సీటుకు జమీందారులను రావద్దని చెప్పండీ.
కవిపేరు తెలియదు, 1940, "జమీన్ రైతులఘోష" రైతుభజనావళి, పే 14.

20. వేగి అప్పల్నాయుడు, పత్రిక కత్తిరింపు 'జమీన్‌రైతు' పత్రిక ఆఫీసులో లభించింది.

21. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో దేశవ్యాప్తంగా ఫాసిస్టులకు వ్యతిరేకంగా ఎంతో మంది కవులు పాటలు రాశారు. భారతీయ ప్రజానాట్యమండలి ఎనిమిదివందల కొత్తపాటలను, యాభై రెండు కళారూపాలను తయారుచేసింది. ఇందులో సుమారు యాభై పాటలు ప్రభుత్వం నిషేధించింది.

22. కమ్యూనిస్టుపార్టీ బలంగా ఉన్న అమెరికాలోను, ఫాసిస్టు వ్యతిరేక సాహిత్యం చాలా వచ్చింది. అందులో పాటల్ని ముఖ్యంగా చెప్పుకోవాలి. పాటకి సంగీతా న్నిచ్చే వాద్యాల్ని ఆయుధాలుగా భావించారు. ఊడీ గాథరీ అనే గాయకుడు తన

గిటారుమీద "this machine kills Facists" అని రాసుకున్నాడు. అంతే కాదు నిరూపించాడుకూడా. యుద్ధకాలంలో కమ్యూనిస్టులు ఫ్యాక్టరీల్లో, గనుల్లో పనిచేసే కార్మికులకోసం ప్రత్యేకంగా ఎన్నో పాటలురాసి ప్రచారంచేశారు.
**"The idealization of the folk song by the communist party paralleled that of the Nazl movement in Germany"**
**R. Sergi Denisoff, 1971, The Great Day Comming, P. 5**

23. ఈ దశలోని సాంస్కృతిక రంగం వివరాలకుగాను ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్య మండలి ప్రత్యేకసంచిక (1974), 'కృష్ణ' గారి ప్రజానాట్యమండలి జ్ఞాపకాలు (సృజన ప్రచురణ), 1984 మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, 1974, "ప్రజా నాట్యమండలి ఉజ్వల చరిత్ర" చూడండి ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి ప్రత్యేక సంచిక. 1942లో బొంబాయిలో జరిగిన అఖిలభారత జాతీయ కమ్యూ నిస్ట్ పార్టీ మహాసభలో కోగంటి గోపాలకృష్ణయ్య కోయవేషం ఆకట్టుకొంది.

24. అస్త్రవిద్యలందు ఆరితేరాలి
శస్త్రాన్ని చేబూని సాముచేయాలి
ఝాన్సీ వలె పోరాడి కీర్తిదేవాలి
గున్నమ్మ వలె నిలిచి గుండెలీయాలి

ముక్కామల నాగభూషణం, 1944, "సామాన్య మటమ్మా" స్త్రీలపాటలు, ప్రజాశక్తి, పే 25.

25. కమ్యూనిస్ట్ పార్టీ లలితకళలను పెంపొందించడం కోసం మహిళలకు పిలుపు నిచ్చిన సమయమది. ఆ సమయాన్ని పురస్కరించుకొని దేశాభ్యుదయాన్ని కాంక్షించే పెద్దలు తమ భార్యలను బిడ్డలను పార్టీ ఆదేశానుసారంగా గౌరవంగా పంపించిన కాలమిది.
వీరమాచనేని సరోజినిదేవి, 1974, "ప్రజానాట్యమండలిలో మహిళల గర్వించ దగిన పాత్ర" ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి ప్రత్యేకసంచిక, పే 29.

26. సుంకర సత్యనారాయణ, 1944, "మంగళహారతి" స్త్రీలపాటలు, పే 29

# 3

# ఉద్యమ సాహిత్యం

## ఆంధ్రమహాసభలు-వ్యాప్తి-చైతన్యం

## (1920-1944)

20వ శతాబ్దం ముందంతా శ్రమజీవులకు సంబంధం లేని ఉద్యమాలే. ఈ శతాబ్దంలోనే ప్రజలు తమ బతుకుకోసం ఒక సైద్ధాంతిక లక్ష్యంతో ముందుకొచ్చారు. ఈ లక్ష్యసాధనకి ప్రారంభంలో ఉద్యమస్థితి ఉంటుంది. ఇది విద్య, భాష, సంస్కృతి మొ॥న ఉపరితల అంశాలకి పరిమితమై ఉంటుంది. ఆ తరువాత ఒక రాజకీయ స్వరూపం పొందుతుంది.

మార్పుకోసం సామాజికంగా సాధారణ శక్తులనుంచి బయటపడే సంచలనమే ఉద్యమం. ఈ సంస్కరణ ఉద్యమాలు పాలకుల అంగీకారంతో వచ్చాయి. అర్ధాంగీకారంతో జమిందారీ వ్యతిరేకోద్యమం వచ్చింది. ఉద్యమాలు చేజారి పోతున్నాయనుకున్నపుడల్లా అణచివేత ఉంటుంది.

తెలంగాణాలోనూ, ఆంధ్రప్రాంతంలోనూ ఈ సంస్కరణోద్యమాల నుండి జనించిన శక్తే ఉద్యమాల్ని తీవ్రతరం చేశాయి. 1944 ఆంధ్ర మహాసభల కాలం వరకు సంస్కరణదృష్టే అధికం. దీని స్వభావంలోనే ప్రజాపునాది ఉండదు. ప్రజల క్రియాశీల పాత్ర ఉండదు. పెట్టుబడిదారీ స్వభావం, మధ్యతరగతి మేధావుల నాయకత్వం కింద మౌలిక మార్పులకోసం కాకుండా ఉపరితల మార్పులకోసం జరిగే విస్తృత సాంఘిక సన్నివేశాన్ని ఉద్యమంగా భావించవచ్చు.

ప్రపంచవ్యాప్తంగా ఇరవయ్యో శతాబ్దాన్ని ఉద్యమాల యుగంగా పేర్కొనవచ్చు.

స్వాతంత్ర్యోద్యమం, ప్రపంచ యుద్ధాలు, రష్యా సోషలిస్టు విప్లవం మొదలైనవి తెలంగాణా ప్రజలమీద ప్రభావం చూపాయి. హైదరాబాదు సంస్థాన పాలకులు ఆంగ్లేయ సామ్రాజ్యాధిపతులకు మొదటి ప్రపంచ యుద్ధ కాలం నుండి ఆర్థికంగా, సైనికంగా మద్దతునిచ్చారు. తెలంగాణా ప్రజలపై యుద్ధ భారం తడిసి మోపడైంది [1] ధరలు పెరిగాయి. వ్యవసాయం దెబ్బతిన్నది. అంటువ్యాధులు ప్రబలినాయి. దొరలు, వడ్డీ వ్యాపారస్తుల చేతిలోకి ఆస్తి మార్పిడి జరిగింది.

ప్రజల ప్రత్యక్ష పాత్ర లేకుండానే జాతీయ కాంగ్రెసు ఉద్యమాన్ని నడిపింది. వీరి మితవాద ధోరణికి వ్యతిరేకంగా యుగాంతర్, అనుశీలన్, గదర్ పార్టీలు తీవ్రవాద పంథాలో పనిచేశాయి. 1916లో తిలక్ 'హోంరూల్ లీగ్' స్థాపించాడు.

ఈ పరిస్థితుల్లో నైజాం రాజు 1919లో బాబె హుకుమత్ (ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్) ఏర్పాటు చేశాడు. విద్యాధిక వర్గాన్ని తృప్తిపరచడంకోసం నామ మాత్రపు సంస్కరణలు[2] చేపట్టాడు.

ఆంధ్ర ప్రాంతంలో వీరేశలింగం మొదలైనవారి ఆధ్వర్యంలో పాలకుల అంగీకారంతోనైనా కొన్ని మత సామాజిక సంస్కరణలు జరిగాయి. అలాంటి సంస్కరణలకు తెలంగాణాలో స్థానం లేకపోయింది. పత్రికలు, పుస్తకాల ప్రచురణకి కూడా స్వేచ్ఛ లేదు. ప్రచురణాలయం పెట్టుకోవాలన్నా ప్రభుత్వం అనుమతి అవసరం.

1921లో 'హైదరాబాద్ స్టేట్ రిఫామ్స్ అసోసియేషన్' సంస్థను, రాజ్యాంగ సంస్కరణల కోసం స్థాపించారు. ఈ సంస్థ ఒక మహాసభ జరపడానికై ప్రయత్నించింది. ఆ సంస్థకు ప్రభుత్వ అనుమతి దొరకకపోగా రాజకీయ సమావేశాలు జరపరాదని "ఫర్మానా" 'ప్రభుత్వ ఆజ్ఞ' జారీ చేశారు. 1923లో మళ్ళ మహాసభ జరుపుకోవడానికి అనుమతి అడిగారు. కానీ, మునుపటికన్నా కఠినమైన "53వ గస్తీ"[3] జారీ కావడంతో గ్రంథాలయ వార్షికోత్సవాలు, వర్తక సంఘ సభలుకూడా జరగడానికి వీలు లేకపోయింది.

ఆనాటికే తెలంగాణాలో గ్రంథాలయోద్యమం ప్రారంభమయింది. ఆంధ్ర ప్రాంతంలో ఆంధ్ర మహాసభలు ఏర్పాటు చేశారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి (1900), శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం (1901) మొదలైన సంస్థలు కొమర్రాజు లక్ష్మణరావు, మునగాల రాజానాయుని వెంకట రంగారావు కలిసి నైజాంలో తెలుగు భాష, తెలుగు సంస్కృతి వ్యాప్తి చేయడానికి కృషి చేశారు. ఈ కాలంలోనే ఒకవైపు ఆంధ్ర ప్రాంతంలోనూ, మరోవైపు మహారాష్ట్ర ప్రాంతాల్లోనూ విద్యాధికులు ఇటువంటి ఉద్యమాల్ని ఎంతో ముందుకు తీసుకుపోయారు. కానీ తెలంగాణాలో ఆంధ్ర

ప్రాంతంలాగా కొత్త మధ్యతరగతి వర్గం ప్రత్యేక లక్షణాలతో రాలేదు.

కాని తెలుగువాళ్ళకు సాంస్కృతిక రంగంలో అన్యాయం జరుగుతున్న దృష్ట్యా 1921లో అతిమితవాద దృక్పథంతో "ఆంధ్రజన సంఘం" స్థాపన జరిగింది. 1923లో ఏర్పరచిన ఉపనియమావళిలో గ్రంథాలయాలు, పాఠశాలల స్థాపన, విద్వాంసులను గౌరవించడం, తెలుగు భాష ప్రచారం, తాళపత్ర గ్రంథాలు, శాసనాల సంపాదన ఆ సంస్థకి ముఖ్య లక్ష్యాలుగా పెట్టారు. నీలగిరి[4], తెలుగు పత్రిక[5], ఆంధ్రాభ్యుదయం [6], సుజాత[7], గోలుకొండ[8] మొదలగు పత్రికలు భాషా సంస్కృతి ప్రచారానికి కృషి చేశాయి.

ఆంధ్రజన సంఘం పక్షాన కొన్ని చిన్న పుస్తకాలు ప్రకటించారు. ఈ పుస్తకాలలో ప్రభుత్వ విధానాన్ని విమర్శించకుండ చట్టంలో ఉన్న విషయాలే రాసి వాటినే అమలుజరిపే ప్రయత్నం చేశారు. క్రమంగా ఈ సంస్థ అస్పృశ్యతా నివారణ, వితంతు వివాహాలు మొదలైన సంస్కరణలను చేపట్టింది. ఇక్కడి మితవాదులను దేశ స్వాతంత్ర్యోద్యమం, సహాయనిరాకరణోద్యమం, ఖిలాఫత్ ఉద్యమం, శాసనోల్లంఘనము మొదలైన ఉద్యమాలు ప్రభావితం చేశాయి. ఈ ప్రభావంతో తెలంగాణాలోకూడా గ్రంథాలయోద్యమం పేరుతో రాజకీయ కార్యకర్తలు, యువకులు పనిచేశారు. నైజాం ప్రభుత్వ నిర్బంధ శాసనాలను ఈ గ్రంథాలయాలు అతిక్రమించాయి. ఆనాటి తెలంగాణా రాజకీయాలలోని ముఖ్య కార్యకర్తలు గ్రంథాలయోద్యమంతో అంతో ఇంతో సంబంధం ఉన్నవారే.

శ్రీమతి పద్మజానాయుడు, ఫజలుల్ రహమాన్ మొదలైన వారి నాయకత్వంలో 1930 ప్రాంతంలో "స్వదేశీలీగ్" పేరుతో ఒక ఉద్యమం బయలుదేరింది. బహిరంగ సభలు ఏర్పాటు చేసి దేశీయ వస్తు ప్రబోధాన్ని బోధించారు. ఇది జాతీయోద్యమ ప్రచారానికి తోడ్పడింది. దీని ప్రభావం జిల్లా స్థాయి వరకే పరిమితమై, పరిమిత స్థాయిలో మాత్రమే సంచలనం కలిగించింది.[9]

## ఆంధ్ర మహాసభలు - పద్య రచనలు

జాతి, భాష, ప్రాంతీయతా భావన అటు ఆంధ్ర ప్రాంతంలోనూ ఇటు తెలంగాణాలోనూ పెరిగిపోయింది. ముస్లింల పాలనలో తెలంగాణా సోదరుల హీనస్థితిని ఖండించారు. తెలుగువాళ్ళు ఐక్యం కావాలనే భావం కవుల్లో పెరిగి పోయింది.

తెలుగు బిడ్డా! కళ్ళు తెరచు కోలేవా
ఉత్కళంబని కొంత ఊడి పోయినది
నైజామని కొంత నడిచి పోయినది[10]

ఇప్పుడంతా ఏక ఖండం కావాలని వందలాది గేయాలు వచ్చాయి.

తెలంగాణాలోని కవులు కూడా ఇలాంటి భావననే వెలుపరించారు. ఈ కోరిక వెనక నైజాం వ్యతిరేకత ఉంది. ఈ కవులు ఎక్కువగా మధ్య తరగతికి చెందిన వారే. వీరు ఎక్కువగా సంస్కరణాభిలాషులు. వీరిలో గ్రంథాలయోద్యమం ముఖ్యమైనది. దీనికి శ్రీకారం చుట్టింది. అక్కడ ఇక్కడా జమిందారీ వర్గాలే!

గ్రంథాలయోద్యమ సభల్లో జాతి, భాష, సంస్కృతాలను కీర్తిస్తూ కావ్య పఠనం చేశారు.

> కదకు నూరూర గ్రంథాలయంబైన
> స్థాపింపు డయ్య విద్యార్థులార!
> ప్రతి మండలమున పత్రికా రాజముల్
> ప్రచురింపు డయ్య విద్వాంసులార![11]

అని ఉద్బోధించారు. ఈ దశలోనే దాశరథి తన కలంగళం విప్పాడు. మహారాష్ట్రీయుల, కన్నడిగుల పెత్తనం అతనికి సహించలేదు. చాలా పద్యాలు రాసాడు. తరువాత 1944 ఆంధ్రమహాసభలో ప్రజల బాణీలో పాటలు రాసి ప్రజల మధ్య ప్రచారం చేసాడు. ఆ పాటలు ఇంకా వాళ్ళకి గుర్తే. రానురాను మళ్ళీ పద్య రచనలకే, పండిత రచనలకే అంకితమయ్యారు.

ముస్లిం మత వివక్షత వల్ల ముల్కీ కానివారికీ, విద్యార్హత లేనివారికీ ఉద్యోగాలు దొరికేవి. ఈ కారణాల వల్ల ఉన్నత వర్గాలకు చెందిన విద్యాధికుల్లో అసంతృప్తి చెలరేగింది. ఈ అసంతృప్తి భాష, సంస్కృతి పేర్లతో బయటపడింది.

తెలుగువారి పుర్వోన్నతి కీర్తించబడింది. ముస్లిం రాజులకు వ్యతిరేకంగా పోరాడిన సర్వాయి పాపడు, బళ్లారి కొండత్రాయుడు, సదాశివరెడ్డి, సోమనాద్రి మొదలైన వారి గాథలను మళ్ళీ పాడుకున్నారు. జాతిని ఆలంబనగా చేసుకొని పద్యాలు, గేయాలు ఇంకా అనేక ప్రక్రియలు వచ్చాయి. ప్రజలలో ఈ భావాన్ని కలిగించింది ఉన్నత వర్గానికి చెందినవారే. ఐతే అధిక సంఖ్యలో నున్న శ్రమజీవులకు ఈ వర్గం వారి అసంతృప్తీ, ఆందోళనల గురించి ఎక్కువగా తెలియదు. వాక్ సభా స్వాతంత్ర్యాన్ని అరికట్టిన "53వ గస్తీ" ప్రభావం గ్రామీణ ప్రజల మీద ఏ మాత్రం పడలేదు. ఎందుకంటే గ్రామాల్లోని దొరలు అంతకన్నా భయంకరమైన ఉత్తర్వులు 'నోటిమాట' ద్వారా అమలు పరచేవారు. ఉన్నత తరగతి సంబంధించిన పై భావనలు గేయాల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

ఒకవైపు చదువుకొన్న వర్గం తమ కోర్కెలను వ్యక్తం చేస్తుంటే మరోవైపు రైతాంగం బాధలను గ్రామీణ ప్రాంత కవులు ఏదో ఒక రూపంలో ప్రకటించారు.

రైతాంగంలో ఒక రైతుగా రైతు బాధలను తరచి చూసిన కవి గంగుల శాయిరెడ్డి. 1936 కు ముందు నుండే 'కాపుబిడ్డ' కావ్యంలో పద్య రచనలు వెలువరించారు. అనాటి

గ్రామాధికారులు భీమస్వరూపులై
పెక్కుటక్కుల వెతల్ బెట్టుచుండ
వ్యాపార వర్గంబులా పూర్తి ధూర్తులై
లాభంబు పూర్తిగా లాగుచుండ
పాలకోద్యోగులు పట్టాభిషిక్తులై
చిప్పముంతల పాలు సేయుచుండె.[12]

రైతు అమాయకునిలా ఉంటే సరిపోదు. అన్ని విషయాలు తెలుసుకోవాలి. చైతన్య రహితునిగా ఉండకూడదు. నీకు నీవే ముందంజ వేయాలి అంటూ ఎవరు నీకు సహాయం చేయగలవారు? అని రైతుని ఈ కావ్యంలో ప్రశ్నించారు.

దాశరథి, కాళోజి, గడియారం రామకృష్ణశర్మ మొ॥ కవులు చాలామంది నైజాం వ్యతిరేక భావాలతో, ప్రజల పక్షాన నిలిచి కవిత్వం రాశారు.

శ్రీశ్రీ రాసిన "నేను సైతం" కవితకు పేరడీగా మహా భావకవి బుచ్చి పినవీరారెడ్డి 1936లోనే ఒక కవిత రాశారు.

కుచ్చుటోపీల్ పెట్టుకొని
పట్టు షేర్వానీలు తొడిగి
నేను సైతం ముల్కినంటూ గర్వపడతాను[13]

ఈ కవితలో వ్యంగ్యం గోచరించినా అది నూటికినూరుపాళ్ళు వాస్తవంగా ఉంది. కుచ్చుటోపీలు, పట్టుషేర్వానీలు వేసుకోవడమే కాదు. యుస్లింలలా మాట్లాడ్డమే కాదు, తెలుగు వాడినని చెప్పుకోవడం కూడా నామోషీగా భావించే కాలమది. ఎప్పుడైతే ఉద్యోగాలు కూడా వారి కళ్ళముందు నుండే ఎగిరిపోసాగాయో అప్పుడే వారు కళ్ళు తెరిచారు.

పద్యాల్లో కోర్కెల్ని వ్యక్తం చేయడమంటే, చదువు కొన్న పండితులను దృష్టిలో పెట్టుకొని రాయడమే. వారి ప్రచారోద్దేశ్యం కూడా అదే. సాధారణ ప్రజలకు గ్రంథాలయాలతో నిమిత్తం లేదు. ఆంధ్ర మహాసభల మొదటి దశలో ఇలాంటి ప్రచారావసరం ఎక్కువగా కలిగింది. రాను రాను ఇష్టంగానో, అయిష్టంగానో ప్రజా సమస్యలనుకూడా తీసుకొని తీర్మానాలు చేయవలసి వచ్చింది. ప్రజల జీవితం నిప్పులమీద పెనంగా మారిపోతున్నది ఎన్నో బాధలు పడుతున్నారు. భూమి బలవంతంగా కోల్పోవడం జరుగుతూ ఉంది.

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత కాలంలో వచ్చిన ఆర్థికమాంద్యం వల్ల కలిగిన ప్రజల కష్టాలు ఈ కవులను కదిలించలేదు. ఇన్ఫ్లుయెంజా, ప్లేగు, మలేరియా జ్వరాలతో ప్రజలు పడిన విపరీతమైన బాధలను కవులు వస్తువుగా తీసుకోలేదు. కాబట్టి పద్య రచనల్లో నిజమైన ప్రజా సమస్యలు, జీవిత చిత్రణ అంతగా స్థానం పొందలేదు. పోరాట కాలంలో పద్యాలలో కొన్ని రచనలు వచ్చాయి. కాని వాటిని అచ్చుకోసం కాకుండా పాడి వినిపించి ప్రజలను ఉత్తేజితుల్ని చేశారు. ఆ పద్యాలను ఎలుగెత్తి గీతాలుగా పాడేవారు.

## ఉద్యమ చైతన్యం

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం అంతర్జాతీయ పరిస్థితులపై ఎంతో ప్రభావం చూపింది. ప్రజాస్వామ్య దేశాలు, ప్రజా వ్యతిరేక దేశాలు రెండుగా విడిపోయాయి. స్వాతంత్ర్యోద్యమం కొత్త ఊపును అందుకొంది. గాంధీజీ ఆజ్ఞానుసారం హైదరాబాదులో వ్యక్తిగత సత్యాగ్రహం మొదలైంది.

హైదరాబాదు స్టేట్ పొలిటికల్ కాన్ఫరెన్సు విద్యార్థుల్లో, యువకుల్లో అసంతృప్తి పెంచింది. దేవులపల్లి వేంకటేశ్వరరావు, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి మొదలగు వారు చురుగ్గా ఆంధ్ర మహాసభల కార్యక్రమాల్లో పాల్గొంటూ వచ్చారు.
స్వాతంత్ర్య సంపాదనకు ప్రజా సమీకరణే మార్గం కాగా స్టేటు కాంగ్రెసు ప్రజల చురుకైన పాత్రనీ, అలాంటి కార్యక్రమాలకీ దూరంగా ఉంచింది. ఈ పరిస్థితిలో స్టేట్ కాంగ్రెస్, ఆంధ్ర మహాసభ, ఆర్య సమాజ్, కామ్రేడ్స్ అసోషియేషన్ మొదలైన సంస్థల్లోని విద్యార్థులు, యువకులు చాలామంది కమ్యూనిస్టులుగా మారారు.

**విద్యార్థి యువకుల చైతన్యం :** హైదరాబాద్ స్టేట్‌లో ప్రజలకు ఎలాంటి పౌర హక్కులు లేవు. పైగా నిర్బంధాలు ఎక్కువ. అలాగే చైతన్యవంతులవుతున్న విద్యార్థులపై కూడా ఎన్నో అదనపు ఆంక్షలు విధించారు.

మొత్తం సంస్థానంలోనే విద్యాలయాలు చాలా తక్కువ.[14] సంస్థానంలో ఏ విద్యార్థి కూడా రాజకీయాలలో పాల్గొనకూడదు. సాంస్కృతిక, సామాజిక కార్యకలాపాల్లో జోక్యం చేసుకోకూడదు. బహిరంగ సభల్లో ఉపన్యసించకూడదు. విద్యార్థులకు ఎలాంటి స్వేచ్ఛ ఉండేదికాదు. ఆ కారణంగా 1920 ప్రాంతాలనుండే విద్యార్థులు చురుగ్గా ఉద్యమాల్లో పాల్గొన్నారు.

మొదటిసారిగా 1938లో యూనివర్శిటీ విద్యార్థులు "వందేమాతరం" ఉద్యమం లేవదీశారు. విశ్వవిద్యాలయ అధికారులు వందేమాతరం గీతం పాడినందుకు 1200 మంది విద్యార్థులను బహిష్కరించారు.[15]

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలను నిషేధించడం వల్ల యువకులు ఆంధ్రమహాసభల కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు. వందేమాతరం ఉద్యమానికి చాలామంది ముస్లింలు తమ మద్దతు తెలిపారు.

వందేమాతరం ఉద్యమంలో బహిష్కరణకు గురైన విద్యార్థులు నాగపూర్‌లో చదువు పూర్తి చేసుకొని, కొత్త భావాలతో సంస్థానంలోకి తిరిగివచ్చారు. వారికి కాంగ్రెస్ ఎలాంటి కార్యక్రమం ఇవ్వలేదు. ఎవరికి వారు తమ గ్రామాలకు వెళ్ళి పోయారు. సామ్యవాద భావాలు గల వారికి ఒక వేదిక కావాలనీ, అది రైతు సంఘంగా ఉండాలనీ నిర్ణయించుకొన్నారు. 1940లో ఆంధ్రప్రాంతంలోలాగా ఒక "కిసాన్‌సభ" ఏర్పాటు చేయాలనుకొన్నప్పుడు ప్రభుత్వం తీవ్రమైన అభ్యంతరం తెలియజేసింది. మళ్ళి ఆంధ్ర మహాసభల్లో చేరి వీరు గ్రామీణ రైతాంగంలో పనిచేయడానికి ఉపక్ర మించారు. మరికొంతమంది "కామ్రేడ్స్ అసోసియేషన్" అనే సంస్థను (1939) ఏర్పాటు చేసి ఆహార సమస్య, కరువు, యుద్ధ వ్యతిరేకత భావాలతో కార్యకర్తలు చురుగ్గా పనిచేశారు. కాని ఆంధ్ర ప్రాంతంలోలాగా పాటలు రాలేదు.

ఎనిమిదవ చిలుకూరు ఆంధ్రమహాసభ (1941) రావి నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆంధ్రమహాసభ ప్రజావేదికగా మారడానికి పునాదులు పడ్డాయి. సభ్యత్వ రుసుం రూపాయి నుండి పావలాకి తగ్గింది. ఇందులో రైతాంగ సమస్యలు ప్రధానంగా చర్చించారు. ఇదే ఏడాది 'అఖిల హైదరాబాదు విద్యార్థి సంఘం' ఏర్పాటయింది. మొదటిసారి హిందూ ముస్లిం విద్యార్థులు కలిసి ఎన్నికల ప్రణాళికను ప్రకటించారు. చివరకు ప్రజాతంత్ర భావాలుగలవారే విజయం పొందారు. విద్యా విషయక సమస్యలతో పాటుగా సామాజిక సమస్యలను తమ పరిధిలోకి తీసుకున్నారు. ఈ వాతావరణంవల్ల ఏర్పడిన చైతన్యాన్ని కమ్యూనిస్టులు ప్రజా ఉద్యమంగా మలచడంలో సఫలమయ్యారు.

కామ్రేడ్స్ అసోసియేషన్‌తో ప్రారంభం నుండి దగ్గరి సంబంధాలున్న రావి నారాయణరెడ్డి, బద్ద యెల్లారెడ్డి మొదలైనవారు ఆంధ్రమహాసభను తమ చేతుల్లోకి తీసుకున్నారు. ఈ సంస్థలోని చాలామంది యువకుల మద్దతు యువ నాయకత్వానికి లభించింది.

ఆంధ్రమహాసభ 1943 నాటికి తెలంగాణాలో చాలా ప్రాంతాల్లోకి తన కార్య కలాపాలని విస్తరించింది. తొమ్మండుగురు సభ్యులతో కూడిన స్టేట్ కమిటీ ఏర్పడింది. నల్గొండ, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, హైదరాబాద్‌లలో తాలూకా కమిటీలు ఏర్పడ్డాయి.

ఈ సందర్భంలో 1944లో 11వ ఆంధ్రమహాసభ జరిగింది. ఇది రైతాంగ,

ప్రజా సమస్యలని ప్రధానంగా చర్చించడం వల్ల అది గిట్టని అనేక వర్గాలవారు విడి పోయారు. వీరు పోటీ ఆంధ్ర మహాసభ పెట్టారు.

కాంగ్రెస్ భావాలు గలవారు, మితవాదులు ఒక్కటై పోటీ ఆంధ్ర మహాసభ నెలకొల్పారు. మొదట్లో వీరు తమని 'నాన్ పార్టీ'గా చెప్పుకున్నారు. వీరు నిర్వహించిన మడికొండ పోటీ మహాసభలో విసునూరు దొర రామచంద్రారెడ్డికి స్వాగత సన్మానం చేశారు. ప్రజా వ్యతిరేకులు ఆ సభలో సపరివారంగా ఆతిథ్యం స్వీకరించాడు. రెండో మహాసభ జరిపాక అది నామరూపాలు లేకుండ పోయింది.

పోటీ మహాసభ ఆదర్శాలను పద్యలు పాటలుగా రాసి ప్రచారం చేశారు. వీటిలో జాతీయ, రాష్ట్రీయ భావాలు అధికం. "ఆదర్శం! ఆదర్శం! ఆంధ్ర మహాసభ దాదర్శం భారతదేశం స్వతంత్ర మగుటకు/ భారత జాతీయత సుస్థిరముగ/ పాదు కొలిపిన మన ఆంధ్ర మహాసభ/ బాధ్యతగల జాతీయ సంస్థయను[16] ఈ పాటలో జాతీయ కాంగ్రెసు ఆదర్శాలను ఆలపించారేగాని తెలంగాణా ప్రజల సమస్యలను పట్టించుకోలేదు. హిందూ ముస్లిం స్థూలఐక్యతని కోరారు. అధిక ధరలు, వెట్టి మొ॥ సమస్యలపై పాటలు వెలువరించ లేదు.

ఈ సభల నాయకత్వం ఉన్నత వర్గం వారిదే. పై విషయాన్ని ఈ గేయంలో స్పష్టంగా చూడవచ్చు "కార్మికులా పాడి ఆవు, కార్మికులా కల్పతరువు/ పేదవారి పెన్నిధి, పెద్దవారి చుక్కాని[17] ఈ పెద్ద నాయకులు మితవాద సంస్కరణలకే పరిమితమయ్యారు.

మితవాద భావాలు గలవారి ఈ పాటలను స్థూలంగా పరిశీలించి చూస్తే ప్రజల పాత్ర ఏమీలేకుండానే ప్రజల సమస్యలను పరిష్కరిస్తామని చెప్పినట్లుగా ఉంది. 1945 నాటికి ఆంధ్ర మహాసభ నాయకత్వం క్రింద దౌర్జన్యం చేసేవారికి వ్యతిరేకంగా ప్రజలు ఐక్యమయ్యారు. కొన్నిచోట్ల ఉద్యమాలు కూడా లేచాయి. ఈలాంటి ఉద్యమాలను నిర్వహించిన ఆంధ్ర మహాసభ పేరును కాంగ్రెస్ కార్యకర్తలు కూడా ఉపయోగించు కున్నారు. ఆ క్రమంలోనే "లంచగొండి తనము మాన్పి, కించబాపి మన్నించుచు రైతు మాడ్చు భూస్వామికి శిక్షలిడెడ్ మహాసభ" అనే భావాలను కూడా వ్యక్తీకరించారు. అయితే ఈ భావాలను వ్యక్తీకరించే గేయాల్లో అందుకు తగిన గాంభీర్యం లేదు. నినాదాలుగా మాత్రమే మిగిలాయి. అదే గేయంలో "మాడపాటి హనుమంతరాయు కృషి/ మన కాదర్శంబగు నండీ!/ వాడ వాడలను మన జాతీయత/వరుస ప్రబోధంబు చేయండి"[18] అనే జాతీయత, మితవాద నాయకుల ఆదర్శాలను ప్రధానంగా ప్రబోధించడం జరిగింది.

ఈ విధంగా వీరు మౌలిక ప్రజా సమస్యల పట్ల సానుభూతి మాత్రమే

చూపించారు. ప్రజల పక్షాన నిలిచి పని చేయలేదు.

## ప్రజల సంఘం

విద్యాధికులు, ఉద్యోగులు వీరి సాంస్కృతిక సమస్యలకు కట్టుబడిన ఆంధ్ర మహాసభ ప్రజా రాజకీయ సభగా మారింది. పదకొండవ ఆంధ్ర మహాసభ ముందు నుండే కుతకుతలాడే రైతాంగం సభ్యులయ్యారు. అప్పటినుండి ఆంధ్ర మాహాసభ సంఘం అయింది. సంఘం కార్యకర్తలు రకరకాల రూపాల్లో గ్రామీణ రంగంలో పని ప్రారంభించారు. ప్రజల ఆర్థిక రాజకీయ సాంస్కృతిక సమస్యల కోసం కృషిచేసారు. స్థానిక సమస్యల మీద ఉద్యమాలు నిర్మించారు. సంస్థాన రాజకీయాలను తెలియజేసి చైతన్యవంతుల్ని చేసారు, ఈ దశలో వెట్టి, వంతులు, హక్కులు, లేవీ, నిర్బంధాలు మొదలైన సమస్యలపై ప్రజలను ఏకతాటి మీదికి తెచ్చారు.

తెలంగాణాలో ఆర్య సమాజం పాత్ర విస్మరించరానిది. సంస్థ ధార్మిక పరమైన దైనప్పటికి పనితీరు వల్ల రాజకీయ స్వభావం వాటిల్లింది. వీరు నిర్వహించిన సత్యాగ్రహాల ప్రభావం చాలా ఉంది. ప్రార్థనల రూపంలో ఎన్నో పాటలు వెలువడ్డాయి. ఊరూరా వీటిని ప్రచారం చేశారు. సుద్దాల హనుమంతు లాంటి ప్రజా కవులు మొదట ఆర్య సమాజీయులే. ప్రజల సంఘం కార్యక్రమాల పట్ల ఆకర్షితులై ఇందులోకి వచ్చారు. తదుపరి చురుకైన కార్యకర్తలయ్యారు. ఐతే బ్రహ్మ సమాజ సాహిత్యం లాగే ఆర్య సమాజ సాహిత్యం తనదంటూ ఒక ప్రత్యేకతని నిలుపుకోలేదు.

ఆంధ్రమహాసభ ప్రజలలో వేళ్ళు తన్నుకొంటూన్న సమయంలో కార్యకర్తలు దాని ఆశయాలను ఊరూరా ప్రచారం చేయవలసి వచ్చింది. చదువురాని పల్లెప్రజలకు అందునా రైతాంగానికి ఆంధ్రమహాసభ లక్ష్యాలను వివరించి చెప్పడానికి పాట తప్ప మరొక సాధనం అందుబాటులో లేదు. ఆంధ్రమహాసభల చీలిక వల్ల కూడా ఈ ప్రచారాన్ని ఉధృతం చేయవలసి వచ్చింది. ఇలాంటి దశలో చదువుకొన్న వర్గంలోని కవులు దాశరథి, వట్టికొండ రామకోటయ్య, డాక్టరు అల్వాల వెంకయ్య, కొమరగిరి నారాయణరావు మొదలైనవారు కమ్యూనిస్ట్‌ల నాయకత్వంలో జరిగిన ఆంధ్రమహాసభకి అనుగుణంగా పనిచేశారు. ప్రజాతంత్ర భావాలు కలిగిన చాలమంది పోటీ సంఘంలో చేరలేదు. పైగా ఖమ్మంలో జరిగిన 12వ ఆంధ్రమహాసభకి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేశారు. ఎన్నో పాటలు రాసి పాటల పుస్తకాలు అచ్చువేసి ప్రచారం చేశారు. ఈ సందర్భంగా వేసిన కరపత్రాన్ని దాశరథి పాటలుగా రాసి మౌఖికంగా ప్రచారం చేశారు(చూ. అనుబంధం).

"తక్తాలు రాస్తే ధాన్యం ఇవ్వకంది/ లైసెన్సులను ఇస్తే లంచాలను ఇవ్వకండి. ధాన్యశాసనాన్ని తెలియకుండా/ దండుగులకు లోనై తంటాలు పడకండి[19]" అనీ "ఆంధ్రమహాసభ నేడు-అన్ని ఇబ్బందులను తొలగింపగా నీకు-తోడు నీడగా నుండె[20]" ప్రజా ప్రభుత్వంబు త్వరలోన పొందంగ నుండే బయలుదేరి-ఆంధ్రసభలో జేరు[21]" అనీ కవులు ప్రజలకు ఉద్బోధించారు. లక్షలాది మంది ప్రజలు అండ దండలు ఉన్న ఆంధ్రమహాసభకు నారాయణరెడ్డి గార్డుగా, ఎల్లారెడ్డి నడిపే డ్రైవరుగా ప్రజాశక్తి జీపుతో బయలుదేరుతుంది. ఈ సభ "ప్రజల కష్టములను దీర్చ-పదియు రెండు మజిలీ దాటి/ పల్లె పల్లెలన్ని గడచి-బయలుదేరి పోవుచుండే"[22] అని వారు వర్ణించారు.

ఖమ్మంలో జరిగే 12వ ఆంధ్ర మహాసభకు వరంగల్, నల్గొండ జిల్లాలలో మారుమూల గ్రామాల నుండి ప్రజలు ఊరేగింపుగా తరలారు. ప్రతి ఊరిలో ఆగి ఆంధ్ర మహాసభల మీదా, వెట్టికి వ్యతిరేకంగా కార్యకర్తలు పాటలు పాడేవారు.

ఈ ఊరేగింపు[23]లోకి ప్రజలు సద్ది మూటలు, పాలూ పెరుగు తీసుకొని సంఘానికి ఇచ్చేవారు. ఇలా పెరిగి పెద్దదైపోయిన ఊరేగింపులు జనగామ ప్రాంతాన్ని తాకినప్పుడు-

ఎన్నడైన వినము కనమన్న-విసునూరు దొరవా
రున్న హక్కులు సాగనీయడన్నా
పిన్న పెద్దలు ఆడవారలు-ఎన్నిపనులను చేసిననుగా
నన్నమునకైనను పోనివ్వక-తన్నుచుండు రిదెంత-
యిట్టి దొరలకు అండగా నిలిచీ-నాన్ పార్టీవారు
పెట్టినారు సభను యింకొకటి
వెట్టిచాకిరి యెప్పటివలె సాగించవలెనని
వట్టి మాటలు చెప్పి మిమ్ము బుట్టలోపల వేసుకొందురు[24]

అని నాన్ పార్టీలోని దొరలు ప్రజలను ఏదో విధంగా నమ్మించి బోల్తా కొట్టిస్తారు. కాబట్టి వారి మాటలు నమ్మవద్దని పాటలు రాశారు. నాన్‌పార్టీవారు కూడా కొన్ని పాటలను ప్రచారం చేశారు కాని అవి లభించలేదు.

ఆంధ్రమహాసభ చీలిపోవడం వల్ల బాధపడడం కన్నా నిరసించడమే ఎక్కువగా జరిగింది. ఎందుకంటే అలా చీలిపోవడానికి తగిన కారణాలు ఏమీ లేవు "ప్రజల బలానికి భయపడు సంఘం నాన్ పార్టీగా వెలసింది" అలా ఏర్పడ్డ నాన్‌పార్టీ గురించి-

హడావిడిగా అరవై వేలని
అబద్ద సభ్యుల చేర్చింది

దొరలకు బలమును కూర్చింది.
పేదసాదల బాధలు తేర్చే ప్రజాసేవకులు చూచి ఓర్వక
అబద్ధ నిందలు మోపింది.
దొంగ ప్రచారం చేసింది.[25]

ఆంధ్రమహాసభ తాలూకా సంఘాలు గ్రామ సంఘాలుగా రూపు దిద్దుకొంటూన్న సమయంలో కూడా ఈ పోటీ సంఘం ప్రజలకు అడ్డంకమైంది. కానీ అప్పటికే ప్రజలు 'సంగాన్ని' తమ శరీరంలో ఒక భాగంగా చేసుకొన్నారు. సంఘ సభ్యులను రక్షించు కోవడం, ఐక్యంగా ఉండడం నేర్చుకొన్నారు. ఈ ఐకమత్యం ఎంతటిదంటే పోటీ సంఘం పెట్టిన ఒక వ్యాపారస్థుడి పొలం పనులకు స్త్రీలను పోనివ్వలేదు. అతని దగ్గర నిత్యజీవితావసర వస్తువులను కొనలేరు. సంఘం అతణ్ణి సంఘ బహిష్కరణ చేసింది. ఐతే ఈ సంఘ బహిష్కరణకు ప్రజలు—

పిల్లల్లేని వానిల్లు పీరీల కొట్టం గానమ్మా
బాలల్లు లేని వానిల్లు బంతులవాడ గానమ్మా[26]

పిల్లలు లేనితనాన్ని కూడా ఒక కారణంగా ఎత్తి చూపారు. కేవలం నాయకత్వం కోసం, కొద్దిమంది ప్రజల ప్రయోజనం కోసం ఉద్యమాలలో స్థాయిని బట్టి సంఘాలు ఏర్పడు తుంటాయి. కొన్ని సంఘాలు ప్రజలను ముందుకు తీసుకుపోతాయి. కొన్ని వెనక్కి తీసుకుపోతాయి. అలాంటి సంఘాల మీద ప్రజలు తమ అభిప్రాయాల్ని పాట రూపంగా పాడుకొంటారు. ఇంగ్లీషులో కూడా ఇలాంటి పాట ఒకటుంది.[27]

"సంఘ బహిష్కరణ" అన్నది పనుల నిరాకరణే. కోతకొచ్చిన పొలానికి పనికి పోకుంటే అతని చేను ఎండిపోతుంది. ధాన్యం చేతికి రాదు. ఆర్థికంగా నష్టపోతాడు.

పోటీ సంఘం పెట్టినందుకే కాకుండా ఇతని తాకట్టుపెట్టుకొని ఎక్కువ వడ్డీ, వసూలు చేసేవాడు. అంతే కాకుండా నాగు మిత్తి పేరుతో రైతుల్ని పీల్చిపిప్పిచేసేవాడు.

## వడ్డి నాగు మిత్తి పాటలు

ఆంధ్రమహాసభ వడ్డి, నాగు, మిత్తి సమస్యని ప్రత్యేక సమస్యగా గుర్తించలేదు. కాని ప్రజలు మాత్రం తమ పాటల్లో దీని భయంకర స్వరూపాన్ని వ్యక్తం చేశారు.

నైజాం ప్రభుత్వం ఏర్పరిచిన బరూచా కమిటి రిపోర్టులోనే అప్పు - వడ్డీల గురించిన భయానక వాస్తవాలు ఉన్నాయి. వీటిని పాటల్లోకూడా చూడవచ్చు.

1) కుప్పనూర్చినాడమ్మ చంపమాకు
రైతు, అప్పులన్ని తీర్చినాడమ్మ ,,
భూస్వామి వాకి సాకి ,,
సావుకారి సిల్లర పద్దు ,,
ప్రభువుల పన్ను రంది ,,
పనివాండ్ల బాదర బంది ,,
.... .... .... .... .... ....
శోకాన్ని ధరించునమ్మా ,,
లోకాన్ని బతికిచ్చునమ్మా ,,

2) నాగుమిత్తిలో పడకు రైతన్నా
నీవు ఆగమైపోతావు కూలన్నా
నాగు యనగా పాములే
బల్ నల్ల త్రాచు పాము
మిత్తి యనగా చావే
మిత్తి దేవర యముడు
పెద్దలందు కొరకె
ఈ పేర్లు పెట్టినారు

1) రైతు పండించిన పంట అప్పులు తీర్చడానికి సరిపోయింది. పన్నులు కట్టడానికి పెళ్ళిళ్ళు, చావులూ చేయడానికి, వ్యవసాయం ప్రారంభించడానికి, ఊరి పెద్దలు వేసే జుర్మానాలు తీర్చడానికి రైతులు అప్పుల పాలయ్యేవారు. ఇలా అప్పుల పాలైనా కుటుంబ సభ్యులు ఎంత పని చేసి పంట తీసినా అది వారి జీవనభృతికే సరిపోయేది కాదు. సరిగ్గా ఇలాంటి పరిస్థితే ఇంగ్లీషులోని 'ఫార్మర్ ఈజ్ ది మాన్'[30] అనే పాట పల్లవిలో ప్రతిబింబిస్తుంది.

భూమి శిస్తుల కోసం పుస్తెపోగులనమ్ముకోవడం జరిగింది. ఒకసారి డబ్బు కోసం తాకట్టుపెట్టిన వస్తువు. భూమీ వడ్డీ వ్యాపారస్థుల సొంతం అయ్యేది. అలా భూమి కోల్పోయి భూస్వామి దగ్గర పాలేర్లుగా చేరేవారు. ఇలా డబ్బు రూపేణా వడ్డీలకు తీసుకొని జీవితాలను నాశనం చేసుకున్నారు.[31]

ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడిన ఆర్థిక సంక్షోభం వల్ల అసలే వెనుకబడిన తెలంగాణా రైతాంగం మరింత కుంగిపోయింది. పాత అప్పులు, శిస్తులు, పెరిగి పోయాయి. కౌలుదార్లు, వడ్డీ వ్యాపారస్థుల చేతుల్లోకి రైతుల భూమి, ఆస్తి వెళ్ళిపోయింది.

రైతు కట్టవలసిన భూమి శిస్తుకు ఆరురెట్లు ఎక్కువగా రుణభారం పెరిగింది. 1940లో వడ్డీవ్యాపార చట్టం', రుణపరిష్కారచట్టం' 'భూమి అన్యాక్రాంత నిరోధక చట్టం' ప్రభుత్వం ప్రవేశపెట్టింది. అన్ని చట్టాల వలె ఇవికూడా అసలు సమస్యను పరిష్కరించకపోగా, ఆచరణలో పెట్టలేక పోయింది.

నాగుమిత్తి : రెండోపాటలో పేర్కొన్నట్లుగా డబ్బు రూపంలో కాకుండా ధాన్యరూపంలో అప్పు ఇచ్చేవారు. ఈ పద్ధతినే నాగుపద్ధతి (నాగు) అంటారు. దీనిమీద శ్రమజీవులు ఎన్నో దశాబ్దాల నుండి పాటలు కట్టుకున్నారు. పోరాటానికి ముందు పాడుకున్న రెండో పాటలో 'నాగు' పట్ల నిరసనని వ్యక్తంచేశారు. రైతు, శ్రమ జీవుల బాధల్లో రుణబాధని ఒకటిగా భావించారు. ఆంధ్రమహాసభల చైతన్యం పెచ్చిన తరువాత అప్పు, నాగుని ప్రత్యేకంగా గుర్తించారు. అప్పుడు మాత్రమే నాగు అంటే నాగుబాముని, మిత్తి అంటే చావు అనే అర్థాలు ప్రజలకు స్ఫురించాయి. అందుకే వాటి జోలికి వేళ్ళకూడదని పాటల ద్వారా ప్రచారం చేసుకున్నారు.

నాగు తీసుకొన్న ధాన్యాన్ని నెలకు గాని, ప్రతి మూడు నెలలకు 'పెచ్చు' కలిపి చెల్లించాలి. ఆ పెచ్చును కూడా అదనంగా ధాన్యం రూపంలో ఇవ్వాలి. ఈ నాగు పద్ధతి తెలంగాణా అంతటా వాడుకలో ఉన్నది.

విసునూరు దొరమాత్రం ఈ నాగు పద్ధతికి సరికొత్త రూపం ఇచ్చాడు. తన ధాన్యం కొట్లలో ముక్కిపోయినా ధాన్యాన్ని, లేదా తన దగ్గర ఎక్కువగా ఉన్న ధాన్యాన్ని గడపకింత అని పంచేవాడు పంటల కాలంలో అసలు ధాన్యం, పెచ్చు ధాన్యం కలిపి కల్లం లోంచే పట్టుకు పోయేవారు. ఇలా ఇచ్చిన ధాన్యానికి ఒక లెక్క ఉండేది కాదు. దొర మనుషుల ఇష్ట ప్రకారం తీసుకొనేవారు. ఈ రెండు రకాల పద్ధతుల వల్ల ఎన్నో వేల కుటుంబాలు పేదరికంలోకి దిగజారి పోయాయి. ఈ స్థితినే పాటలుగా పాడుకోవటం జరిగింది. ఈ కింది పాటలో కుటుంబంలోని సభ్యులు ఒక్కొక్కరు ఒక్కో పాత్రగా వచ్చి తమ అభిప్రాయాలు చెబుతారు. రైతు తన బాధలను 'నాగు మిత్తి' పాటలో పూస గుచ్చినట్లుగా వారికి తెలుపుతాడు. (చూ అనుబంధం).

చెల్లెలు : "పంట ఏదిరా అన్నయ్యా పడిపుట్లు ఏవిరా అన్నయ్యా"

అంటే

అన్న : "కలుపుగూళ్ళకు, విత్తనాలకు, కౌలుకు, నౌకర్లగాసం
ఇంటి ఖర్చు, పెంట ఖర్చు లెక్కచూడుము చెల్లెలా
ఇది నిక్కమైనదే చెల్లెలా-
నాగు మిత్తి జాగుసేయక-ఎవరిబాకి వారి కిచ్చితి
ఏమనందును చెల్లెలా-నేనేమి జేసితిని చెల్లెలా!

1942-45 ప్రాంతంలో ఆహారధాన్యాలు, వ్యవసాయ సరుకుల ధరలు పెరిగినట్లు భావించారు. కానీ చిన్న రైతులు, మధ్యతరగతి రైతులకు మాత్రం లాభించలేదు. ఆహార పదార్థాలతో బాటు అన్నిరకాల వస్తువులకు ధరలు పెరిగాయి. ఇందువల్ల దొరలు మరింత లాభాలు గడించారు. రైతులు మరింత పేదరికం పాలయ్యారు. దీని మూలంగా ధనికులైన వడ్డీ వ్యాపారస్థుల వడ్డీ వ్యాపారశక్తి అనేక రెట్లు ఇనుమడించింది.[49] ఈ విషయాన్ని ప్రజలు చక్కగా గుర్తించారు. "పెరిగి పోయినావారు-ఈ రీతిగా పెరిగారు/ తరిగిపోయినావారు రైతన్నా-ఈ తీరుగా తరిగారు కూలన్నా" అందుకే నాగుమిత్తిలో పడకు నీవు ఆగమైపోతావు." అని హెచ్చరించు కున్నారు. చివరగా తండ్రి అంటాడు——

పక్కయింటి పాపరాయుడు
నిక్కముగా పదికొట్లు నింపెను
బిక్కమొగ మిక ఏల వేసేవు
చక్కమార్గము నెరుగవైతివి
పరులపాలై పోయెరా నీపాటు పాడైపోయెరా!

అని తండ్రి కొడుక్కి అసలు వాస్తవాన్ని చెబుతాడు. ఇక్కడ పాపారాయుడు దొర వర్గానికి చెందినవాడు. అతనికి పదికొట్లు (ధాన్యం నిలువ చేసుకునే ప్రదేశాలు) నిండాయి. ఇతనికి పదిపుట్లు కూడా రాలేదు. వచ్చిందేదో అప్పులకే పోయింది దీనికి కారణం తండ్రికి కూడా తెలియదు, కొడుకుని "చక్కని మార్గం తెలుసుకోలేక పోయావు" అంటాడు. ఇదీ ఆనాటి రైతుల చైతన్యం. "పాటు" (శ్రమ) పరాయీకరణ చెందిందని మాత్రం తెలుసు కున్నారు. కానీ అందుకు వ్యవస్థాపరమైన కారణాలను గురించి తెలుసుకోలేకపోయారు.

"లోటుపాటును తెలియనైతిని, కూటికి కరువయ్యెనిక" అని బాధ పడతాడు. అప్పుడు తండ్రి తన అనుభవాన్ని జోడించి ఆలోచిస్తాడు. గ్రామ పరిధిలో దీనికి జవాబు చెప్పగలవారూ, అలా జరగకుండా చూడగలవారూ ఎవరో తెలిసిపోయింది. "తగువు లాడగ తగదు మనకిక - సంఘ పెద్దలు కలుప మనకిక" అనే నిర్ణయానికి వచ్చారు.

మొదటి నుండి కూడా ఆంధ్ర మహాసభల వేదిక నుండి గానీ, కార్యకర్తలు గానీ ప్రత్యేకంగా అప్పు రాక్షసిని గుర్తించి ప్రజలకు కనువిప్పు కలుగజేయలేదు. ఆ పని ప్రజలే ముందు నిలబడి చేసారు. అప్పు బాధ కేవలం రైతాంగాన్నే కాదు గ్రామంలో అన్ని రకాల వృత్తి పనివారినీ అనునిత్యం పట్టి పీడించింది. దొరలను

గడీల్లోంచి పంపిన తరువాత ప్రజలు చేసిన మొదటి పని తాకట్టు కాగితాలను చింపి కాల్చివేశారు. తరతరాల తమ బానిసత్వానికి ఆ కాగితాలే కారణంగా భావించారు. తమ కుటుంబానికి సంబంధించిన వస్తువులూ, పశువులు, భూమిని మళ్ళీ సొంతం చేసుకున్నారు. ఇది ప్రజల తక్షణావసరంగా సంఘం గుర్తించింది.

1943 ముందు చేసిన ఆంధ్ర మహాసభల తీర్మానాల్లో ఋణభారం, వడ్డీ, దోపిడీ మొదలైన విషయాలను గుర్తించక పోగా కేవలం పన్నులే అధికంగా ఉన్నాయని భావించారు. రైతు ఇబ్బందిగా భావించిన ప్రతి సమస్యను "పన్ను మాఫీ" ధోరణి లోంచి పరిష్కారాన్ని చూశారు. [33]

సంగం ఏర్పాటు చేసిన రాత్రి బళ్ళలో, [34] మీటింగుల్లో, కార్యకర్తలు చెప్పే విషయాలు రానివాళ్ళకు పాటలుగా కట్టి పాడి వినిపించే వారు. పశువులు కాసే దగ్గరో, పానిపాటల దగ్గరో, గూడాలలోనో వినిపించే ఈ పాటలలో తాము తెలుసుకున్న రాజకీయ విషయాలు, దోపిడీ పద్ధతులు ఎక్కువగా ఉండేవి.

గద్వాల ఒక చిన్న సంస్థానం. ఇక్కడ కూడా నజరానాల పేరుతో విపరీతంగా డబ్బులు వసూలు చేసేవారు. కార్తీక - మాఘ మాసాల్లో కవి పండిత సన్మాలు జరిగేవి. ఈ ఖర్చు కొసం "పండిత పన్ను" పేర ఎనభై వేల రూపాయలు వసూలు చేసేవారు.

నైజాం సంస్థానంలో మొదటి దశలో నెలకొల్పిన ముద్రణా యంత్రాల్లో ఒకటి గద్వాల్లో ఉంది. ఇక్కడ పన్నులు కట్టినా ప్రజలకు అర్థం కాని రాత సాహిత్యం, 'కావ్యాలు' అచ్చయ్యేవి.

1939లో జరిగే పండిత సన్మానాలకు రైతు ప్రతినిధిగా గడియారం రామకృష్ణ శర్మ గారు వెళ్ళారు. 'వినతి'ని పద్యాలలో సంస్థానాధీశులకి సమర్పించారు. (చూ. అనుబంధం) అందులో—

రాజుగారింటి పెండ్లి బైరాగి తిండి
ఉన్నతోద్యోగులింటి పుత్రోత్సవాలు
అర్థివానికి భిక్ష ఈ అన్నిటికిని
పెట్టుబడిదారుడు మా నిరుపేద రైతు [35] అని రైతుల దీన పరిస్థితిని

వర్ణించాడు.

రాజుగారింటి పెండ్లికీ, బిచ్చగాడికి వేసే భిక్షానికీ రైతే పండించాలి. అలాంటి రైతు దీనాతిదీనంగా బతుకుతున్నాడని గుండెలకు హత్తుకునేలా వర్ణించాడు.

ఆనందం కలిగించే పన్నునే సంస్థానాధీశులు సత్కరిస్తారు. ఈ సత్కారం కోసం ప్రజల మీద పన్నులు విధిస్తారు. ప్రజలకు దూరమైన సాహిత్యాన్ని సృష్టించే "పండిత శ్రేష్ఠు"లకు ప్రజల డబ్బుతో సత్కారం జరిగేది. ఈ విధంగా గ్రంథాలు రాసే కవులు, గ్రంథ ప్రచురణకోసం ప్రజలకు అదనపు ఆర్థిక భారాన్ని కలిగించారు. 1940లో మల్కాపురం పదవ ఆంధ్ర మహాసభలో పండిత పన్నుకు వ్యతిరేకంగా తీర్మానించారు.

ఆళ్వారు స్వామి, బద్దం ఎల్లారెడ్డి పండిత పన్నుకి వ్యతిరేకంగా కార్యక్రమం తీసుకుని గద్వాలలో పర్యటించారు. రైతులతో పన్ను కట్టకుండా చేయగలిగారు. పండిత సాహిత్యానికి వ్యతిరేకంగా ఆళ్వారు స్వామి లాంటి ప్రముఖ రచయిత నడుం కట్టడం గమనార్హం !

ప్రజల జీవితంలో భాగమైన, ప్రజా సమస్యల పరిష్కారం కోసం చేసిన పోరాటంలో పాల్గొవడం వల్లనే ఆ తరువాత ఆయన "ప్రజల మనిషి"గా, ప్రజా రచయితగా రూపుదిద్దుకోగలిగారు.

సుద్దాల హనుమంతు. కొమరగిరి, రామాంజనేయులు, ఆలువాల వెంకయ్య మొ॥ కవులు ప్రజల పాటలు ఎలా ఉంటే బాగుంటుందో, ఎలా ఉండాలో ఆళ్వారు స్వామితో చర్చించేవారు. సూచనలు తీసుకునేవారు.

రాత రూపంలో భావాలు వెలిబుచ్చే పండితులకి చేసే సన్మానాలకి వ్యతిరేకంగా ప్రజలు గద్వాల సంస్థానంలో విజయం సాధించారు. ఈ విషయం తెలంగాణాలో రాబోయే ప్రజా సాహిత్య విజయానికి సంకేత గీతంగా భావించవచ్చు. [36]

మొదటి దశలో మధ్య తరగతికి చెందిన విద్యార్థి, యువకులకు సంబంధించిన పట్టణప్రాంత పరిమిత ఉద్యమాల్లో పాటల అవసరం లేకపోయింది. ఆంధ్రమహాసభల్లో వేదికల పైనుండి పద్యాలు, గేయాలు చదివి వినిపించారు.

తెలంగాణా రైతాంగ సమస్యలను ఉపరితలంనుండి మాత్రమే చూసిన దాశరథి, వట్టికోట, అల్వాల, కొమురగిరి లాంటి కవులు ఒక దశవరకు ఆంధ్రమహాసభతో కలిసి పనిచేశారు. వీరు రాసిన ఆంధ్రమహాసభ గీతాలు కార్యకర్తల్ని ఉత్తేజపరిచాయి. ప్రజలే కార్యకర్తలైనప్పుడు మాత్రం వీరి పాటలు ఉపకరించలేదు. ఈ కవులు ప్రజల పట్ల, ప్రజా ఉద్యమాలపట్ల కొంతవరకు మాత్రమే ఆసక్తి కనబరిచారు.

ఆంధ్ర మహాసభలో చేరడంవల్ల ప్రజలకు శాసనాలకు, ఫర్మానాలకు అర్థం తెలిసింది. ఆంధ్ర మహాసభ ప్రజల సభగా మారినప్పుడు అది ప్రజల భాషలో

"సంగం" అయింది. అప్పటినుండి ప్రజలే సంగంమీద పాటలు కట్టుకున్నారు. ఈ పాటలు గ్రామ, తాలూకా, జిల్లా స్థాయిల్లో ప్రాంతాన్నిబట్టి ఎక్కడికి అక్కడ వచ్చాయి. ఇందులో సంగంలో చేరమని ఉద్బోధించడమే కాకుండా ఆ ప్రాంతంలోని స్థానిక సమస్యలు కుడా ఎప్పటికప్పుడు చేప్పుకునేవారు. "చదువులెందుకురా! రాజ్యమేల్తారా?" అని దొరలు ఈసడించుకొన్నా, సంగం కార్యకర్తలు నడిపిన రాత్రి బడులు ఎంతో కీలకమైన పాత్ర వహించాయి. ఆ బడుల్లో చెప్పిన పాఠాలే ఆ తరువాతి కాలంలో దొరలను గద్దెదించి ప్రజల రాజ్యం ఏర్పాటు చేయగలిగాయి.

నిజాం ప్రభుత్వం రచయితల మీద నిఘా ఉంచగలిగింది. పుస్తకాలను, పత్రికలను నిషేధించగలిగింది. (చు. అనుబంధం II) కాని ప్రజల ఆలోచనల్ని, పథకాల్ని, కార్యక్రమాల్ని అరికట్టలేక పోయింది. నిజానికి దొరల కట్టడిలో, కనుసన్నల్లో అన్ని రకాల నిషేధాలు, నిర్బంధాలు ఉండేవి. కానీ సంగం రంగంలోకి వచ్చినప్పటి తర్వాత ప్రజల నాలుకలే ముద్రణాలయమైంది. కలమైంది, కాగితమైందీ. దాన్ని నిషేధించే చట్టం ఏదీ లేకపోయింది. దాన్ని అడ్డడానికి ఏ శక్తీ చాలలేదు. దొరల గుండాలు, వారి ఆయుధాలు ఏవీ ఆపలేకపోయాయి. ఈ మూల పాడితే ఆ మూల కొన్ని వందల కంఠాలు ఎలుగెత్తాయి. పాడినవారెవరో, పాడకుండా ఎలా చేయాలో ప్రజావ్యతిరేక శక్తులకు తెలియలేదు.

## పాదసూచికలు

1. 1914 జులై మొదలుకొని 1918 డిశంబరు వరకు నైజాం రాజు, బ్రిటిషువారి యుద్ధ ఖర్చులకుగాను, 1,53,00,000 రూపాయలు విరాళంగా ఇచ్చాడు. ఇవేగాక యుద్ధకృషి కింద, 1,64,00,000 రూపాయలు సమర్పించారు. హైదరాబాదు సమస్య. పే. 31

2. శాసనసభలో ఎన్నుకొనబడే సభ్యుల సంఖ్య హెచ్చించడం, కొంత ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వడం, ఓట్ల నియమాలను ఏర్పరచడం మొదలైనవి. ఇవి 1909లో బ్రిటిషు ఇండియాలో ప్రవేశపెట్టిన 'మింటోమార్లే' సంస్కరణల్లాంటివి.

3. బయటివారెవరూ సంస్థానంలో జరిగే సభలు, సమావేశాల్లో మాటాడకూడదు. ఒకవేళ ప్రభుత్వం సభకు అనుమతిస్తే తాలుకుదారు అక్రమం అనుకున్న విషయాలను మాట్లాడకూడదు. సక్రమం అనుకున్న విషయాన్నే మాట్లాడాలి.

సభలకు ముందే జిల్లా అధికారితో పర్మానాలు ఒప్పించుకోవాలి. సభాధ్యక్షుడు తాలుకుదారు ఆజ్ఞప్రకారం నడుచుకోవాలి. మాడపాటి హనుమంతరావు, 1940, తెలంగాణా ఆంధ్రోద్యమం (రెం.భా), పే. 23.

4. 1922-25 ప్రాంతం మధ్య నల్లగొండనుండి వారపత్రికగా వెలువడింది. దీని సంపాదకులు సబ్నవీసు నరసింహారావు.

5. 1938-39 ప్రాంతాల్లో సికిందరాబాదు నుండి మాసపత్రికగా వెలువడింది. దీని సంపాదకులు రాచమళ్ళ సత్యవతిదేవి.

6. 1923 నుండి హనుమకొండ నుండి మాసపత్రికగా వెలువడింది. దీని సంపాదకులు కోకల సీతారామశర్మ.

7. 1927-30 మధ్యలో హైదరాబాదు నుండి మాసపత్రికగా వెలువడింది. దీని సంపాదకులు పసునూరు నరసింహ వర్మ, గడియారం రామకృష్ణ శర్మ.

8. 1925 నుండి హైదరాబాదు కేంద్రంగా అర్ధ, వార, దిన పత్రికగా వెలువడింది. దీని సంపాదకులు సురవరం ప్రతాపరెడ్డి.

9. కోదాటి నారాయణరావు, "తెలంగాణ రాజకీయోద్యమాలు" (ఆళ్వారుస్వామి (1956) లో) పే. 198.

10. శ్రీ శ్రీనివాస సోదరులు, 1940, ఆంధ్రరాష్ట్రము, దేశోద్ధారక ప్రెస్. తెనాలి; పే. 12.

ఈ ఉద్యోగులు కొత్తవారిని సంస్థానంలోకి రానిచ్చేవారుకాదు. ఎలాంటి పత్రికలు, పుస్తకాలు రాకుండా తనిఖీ చేసేవారు. స్త్రీలను సైతం తనిఖీ పేరుతో శోధించేవారు. ముస్లిం స్త్రీలను కూడా తనిఖీ చేసేవారు.

11. శేషాద్రి రమణకవులు (1) "నిజాం రాష్ట్ర ప్రశంస", ఎల్. ప్రేమ్‌సాగర్, (1979)

12. గంగుల శాయిరెడ్డి, 1937, కాపుబిడ్డ (వ్యవసాయ పద్యకావ్యం), పే. 54.

13. తెలుగుతల్లికి
స్వస్తిచెప్పి
దేశభాష'ని ఉర్దూ నేర్చి
నేను సైతం ముల్కినంటు గర్వపడుతాను.
తెలుగుబిడ్డని చెప్పుకోకా
మతము మతమని గోలపెడ్తూ

నేను సైతం ముల్కీనంటూ గర్వపడతాను
మహాభావకవి బుచ్చి వేంకటకవి, 6-7-1936, గోలకొండ పత్రిక

14: ఉస్మానియా విశ్వవిద్యాలయం ఒకటే ఉండేది. ఐదు ఇంటర్మీడియేట్ కళాశాలలు, ఒక డిగ్రీ కళాశాల మాత్రమే దానికి అనుబంధించి ఉన్నాయి. అంతేగాకుండా 31 ఉన్నత పాఠశాలలు 105 మాధ్యమిక పాఠశాలలు, 4000 ప్రాథమిక పాఠశాలలు మాత్రమే ఉండేవి.

15. ఇందులో 350 మంది ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు, 310 మంది గుల్బర్గా ఇంటర్మీడియెట్ కళాశాల విద్యార్థులు, 120 మంది మహబూబ్‌నగర్ హైస్కూలు విద్యార్థులు, 70 మంది సిటీ కాలేజి, హైదరాబాదు విద్యార్థులు, 350 మంది వరంగల్ కళాశాల విద్యార్థులు ఉన్నారు. వీరేగాక బీదర్ తదితర ప్రాంతాల విద్యార్థులు కూడా బహిష్కరింపబడ్డారు.

16. యల్లాప్రగడ, 31-4-1945, జాతీయగేయాలు, ఆంధ్ర జాతీయ యువజన సంఘం ఖమ్మం మెట్టు, పే. 9.

17. - పై - పే. 10.

18. - పై - పే. 12.

19. వట్టికొండ రామకోటయ్య, 1945, ఆంధ్రగేయాలు, ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని, హైదరాబాద్, పే. 3.

20. - పై -

21. - పై -

22. - పై - పే. 16.

23. ఈ ఊరేగింపులు తెలంగాణా రైతు యాత్రలుగా ఉండగా ఆంధ్ర మహాసభలను "అతి గొప్ప రాజకీయ తిరునాళ్ళు"గా ప్రజలు భావించారు. ఈ సభలకు బండ్లమీద కూడా ప్రజలు వచ్చారు. ఆ బండ్లకు ప్రభలుకట్టి ఎద్దుల మెడల్లో గంటలుకట్టి అలంకరణలు చేసేవారు.

24. కొమరగిరి నారాయణరావు, 1945, ప్రబోధగేయాలు, ప్రజాప్రచురణాలయం, పేజీ 4.

25. సొంతసేకరణ.

26. ఈ పాటలో పిల్లలులేనితనం వారుభావించే ఒక విశ్వాసం దాన్ని వారిక్కడ

[illegible]లిపోయాయి. సున్నితమైన భావాలు ప్రస్ఫుటంగా [illegible]లుగా [illegible]స్తాయి.
సొంత సేకరణ

27. Take the two old parties, mister
No difference in them I can see
But with a former-Lasor party
We could set the people free
Sarge Denisoff (?) Sir ga a Scng of Social Significarce P. 77

28. ములువంచ రఘుమారెడ్డి. 1979. పల్లెపదాలలో ప్రజాజీవనం, పే. 169

29. సొంతసేకరణ.

30. The farmer is the man, the farmer is the man
Live on credit till the fall;
With the interest rate so high, it is a wonder he do not die
For the mortgage man's the one who gets it all
John Greenway, 1971, Folk Songs of Protest, P. 213.

31. S. M Bharucha, 1937, Agricultural Indebtedness IN H E H Nizam's Dominion, P. 41.

32. సొంతసేకరణ.

33. జేరు దావుల పన్నులు లేసివేయడం (నాల్గవ మహాసభ), ఎరువుల, విత్తనాల, ఏర్పాట్లు "ఐదవమహాసభ" మొత్తం ధారా మాఫీ కావాలి (ఐదవ మహాసభ) నీటిపన్ను సరసంగా నిర్ణయించాలి. నీరు ఉపయోగిస్తేనే పన్ను లేసుకోవాలి. (ఆరవ మహాసభ), పన్నుల తగ్గింపు విచారణ కమిటీ ఏర్పాటు చేయాలి. (ఎనిమిదవ మహాసభ) బరాయిందా పన్ను మాఫీ చేయాలి (తొమ్మిదవ మహాసభ), చౌక ఇనుప దుకాణాలుఏర్పాటు చేయాలి. గిట్టుబాటు ధరలు చెల్లించాలి (పదవ మహాసభ) అని తీర్మానాలు చేయడం జరిగింది·

43. తాలెలయి లెల్లాయిలో/ ఆంధ్రసంఘంలో చేరండయో/ పగటిపూటను పనులు చేసి/ రాత్రి పూట చదువుకుంటే/ వట్టిపగుల గొడ్డారయో/

35. గడియారం రామకృష్ణ శర్మ (1980), పాంచజన్యం, పే. 5.

36. జయధీర్ తిరుమలరావు, 31-1-85, 'ప్రజాసాహిత్యానికి నాందీగీతం' ఉదయం, (దిన) పే. 3.

# 4

# పోరాట సాహిత్యం

కార్మికుల్లా రైతులు త్వరగా సంఘటితం కాలేరు. తమకైతాము ఒక సిద్ధాంతం ప్రకారం పోరాటాలు నిర్వహించలేరు.

శతాబ్దాల భూస్వామ్యం రైతాంగాన్ని అభివృద్ధి చేయలేదు. పైగా క్షీణింప జేసింది. హైదరాబాదు సంస్థానంలో వర్తకులపై ఆదాయం పన్ను విధించలేదు. ఆ భారాన్ని కూడా రైతు మీదే వేసారు. ప్రభుత్వానికి, దొరలకు ఆదాయం కావలసి వచ్చిన ప్రతిసారీ భూమి శిస్తు పెరుగుతూ వచ్చింది.

ప్రభుత్వం ఆసామి సిక్మి ఆక్టు [1944] ప్రకటించాక భూస్వాములు (పట్టాదార్లు) కౌలుదార్లను ఎన్నో కష్టాలకు గురి చేసారు. కౌలురేట్లు ఇష్టం వచ్చినట్లు పెంచారు. సాగు భూములనుండి, రైతు వ్యవసాయం చేసే కౌలుభూమి నుండి రైతుని బలవంతంగా వెళ్ళగొట్టారు. దీన్నే 'బేదఖలీ' అంటారు. 1857 లో తెలంగాణాలో ఒక సారి ఇలాగేజరిగింది. ఐతే ఈసారి బేదఖలీ చేస్తుంటే ప్రజలు చూస్తూ ఊర్కోలేదు. దొరలను, వారి గుండాలను ఎదిరించారు. ఈ ప్రతిఘటనలకు సరైన నాయకత్వం లేదు. ఇవి తాత్కాలిక ప్రతిఘటనలు మాత్రమే. ఇలాంటి వాటిల్లో మొంద్రాయి, ధర్మాపురం ప్రతిఘటనలు చెప్పుకోదగినవి.

ఇంతకాలంగా నల్లగొండ జిల్లాలోనే భూమిపోరాటాలు మొదట జరిగాయని చాలా మంది భావించారు. కానీ అప్పటికే నాటి వరంగల్ జిల్లాలోని చాలా ప్రాంతాల్లో భూమి పోరాటాలు జరిగాయి. క్రోధావేశులైన రైతులు దొరలను చంపివేసిన సందర్భాలూ [1930] లో ఉన్నాయి.

ఈ సందర్భంలో మొంద్రాయి గ్రామంలో పోరాడిన లంబాడీలు వారి భాషలో

పాటలు కూడా వెలువరించుకొన్నారు. కళ్ళముందు జరిగిన ఆ పోరాటాన్ని చుట్టుప్రక్కల ప్రజలు స్ఫూర్తిగా తీసుకొన్నారు.
ఈ పాట ఆ సందర్భంలోనిదే.

మొండ్రాయి గ్రామాన జూడు
జారాతు తానూను బట్టి
వందలాది ప్రజలు వలవల ఏడ్వంగ
నిలబెట్టి కాల్చిరి రన్నో[2]

మైదుం చెరువుక్రింద 30 ఎకరాల మాగాణి భూమి ఉంది. దాన్ని ఎన్నో ఏళ్ళుగా సాగుచేస్తున్న లంబాడీలను వెదళ్ళు చేయించడానికి దొరలు ప్రయత్నించారు. పోలీసుల సాయం తీసుకొని దొరలు వారి గుండాలతో సహా మొండ్రాయికి వచ్చారు. ఆ విషయం తెలిసిన లంబాడీ స్త్రీలు, పురుషులు, పిల్లలతోసహా భూమిని కాపాడుకోవడం కోసం మడిలోనే పొయ్యిలు పెట్టుకొని రోకళ్ళు పట్టుకొని కాపలా కాశారు.

అంతకుముందే ఆప్రాంతంలో స్త్రీలు పాడుకొన్న "చేను కాపలా మనమే యుండే/ చేలో పందలు పడవు, పశువులెన్నడూ రావు/ వేగంబున మీరు లెండి/ వెనకబడియున్న స్త్రీలను వెంటేసుకొని రండి[3] 'పాటని అక్షరాలా నిజం చేశారు. మగవాళ్ళు రాళ్ళకుప్పలు పోసుకొని నడుముకు వడిశెలలు కట్టుకొని దొరల గుండాలతో తలపడ్డారు. ఈ విషయం తెలుసుకొని చుట్టుపట్ల గ్రామాలనుండి నాలుగైదు వేలమంది ప్రజలు లంబాడీలకు సహాయంగా వచ్చారు. ఆ సమయం బాగులేదని దొరతనం వెనుదిరిగి వెళ్ళిపోయింది. రెండు నెల్ల తరువాత ఒక అర్ధరాత్రి లంబాడీ తండాపై, మళ్ళీ దాడి చేసి, కాల్పులు జరిపి ప్రజలను చిత్రహింసల పాలుచేశారు. ఐనప్పటికీ వారు భూమిని వదిలిపెట్టలేదు.

## ధర్మాపురం లంబాడీల ప్రతిఘటన

ఆంధ్రమహాసభల ప్రభంజనం అప్పుడప్పుడే తెలంగాణా మారుమూల గ్రామాల్లో వీస్తూన్నది. తరతరాలుగా అడవుల్ని నరికి, బావుల్ని తవ్వుకుని వ్యవసాయంచేసే భూములను కబ్జా[స్వాధీనం] కోసం ప్రయత్నించి రాఘవరావు దొర మొదటిసారి విఫలుడయ్యాడు. ప్రజలు పిట్టలను కొట్టే వడిశెళ్ళతో గుండాలను ఎదుర్కొన్నారు.

రెండోసారి గుండాలను, పోలీసులను తీసుకొని ధర్మాపురం నలువైపులా చుట్టుముట్టారు. ఈసారి కూడా లంబాడీలకు సహాయంగా వేలాదిమంది ప్రజలు చుట్టుపట్ల గ్రామాలనుండి బడిసెలు, వడిశెళ్ళు పట్టుకొని వచ్చారు. అప్పుడు కూడా వారి కుట్ర ఫలించలేదు.

ఇలాంటి పరిస్థితిలో దొరలంతా విసునూరి దొరవారి ఇంట్లో సమావేశమయ్యారు. చుట్టుపక్క గ్రామాలలోని నాయకులను అరెస్టుచేసి ధర్మాపురంలో 144 సెక్షనుపెట్టి బేదఖలీకి పూనుకోవాలనుకున్నారు. చివరికి ధర్మాపురం తండా పై దాడిచేసి తండా గుడిసెలన్నిటిని తగులబెట్టి, తిన తిండి కట్టుబట్ట లేకుండా చేశారు. స్త్రీ పురుషులను హింసించారు. పన్నెండేళ్ళ బాలునితో సహా ఎనిమిది మందిని సజీవదహనం చేశారు.[4]

పై రెండు లంబాడీ గ్రామాల బేదఖలీ ప్రతిఘటనల వల్ల తేలిన విషయం ఇది—అంతకు ముందులా భూస్వాముల దౌర్జన్యాలు సాగడం కష్టమైంది. అన్యాయాల్ని ఎదుర్కొవడానికి ఎలాంటి పిలుపులు ఇవ్వకున్నా ప్రజలు తమకు తామే వచ్చి సహాయం చేశారు. లంబాడీలు అల్ప సంఖ్యాకులు-చిన్న చిన్న తండాలుగా ఉండేవారు. చుట్టుపక్కల పల్లె ప్రజలతో వారికి అంతగా సంబంధ బాంధవ్యాలు లేవు. అయినప్పటికీ కష్ట సమయంలో చుట్టుపక్కల ప్రజలు ఎంతో సహకరించారు. ఈ సంఘటనల తర్వాత లంబాడీ వీరులు చాలామంది పోరాటంలోకి కలిసివచ్చారు.

*మల్లారెడ్డిగూడెం పోరాటం* : మల్లారెడ్డి గూడెంలో ప్రజలు సాగుచేసుకొనే ఆరు వందల ఎకరాల బంజరు భూమిలో పండిన పంటనంతా లెవీగా ఇవ్వాలని దొరలు పట్టు బట్టారు. దాంతో ప్రజలు ఎదురుతిరిగారు. భూమి నుండి రైతులను బేదఖలు చేయించాలని తాహశీల్దారుని, పోలీసులను తీసుకొని వచ్చాడు. ఆ గ్రామంలో 25 శాతం ముస్లింలు ఉండేవారు. ఘోషా పాటించే ముస్లిం స్త్రీలు తమ ఇండ్లలో సంఘ నాయకుల సోదాకు సమ్మతించలేదు.

అందువల్ల పోలీసులు దౌర్జన్యానికి దిగారు. ప్రజలు ప్రతిఘటించారు. స్త్రీలు రాళ్ళందిస్తుంటే పురుషులు వడిసెళ్లతో దాడి ప్రారంభించారు. కాని పోలీసులు దొంగ చాటుగా కాల్పులు జరిపారు. గురవమ్మ, తొండమ్మ, అండాళమ్మ అనే ముగ్గురు స్త్రీలు, అప్పిరెడ్డి, ముంగి వీరయ్య అక్కడికక్కడే మరణించారు.

ఆ విధంగా స్త్రీలు కూడా పురుషులతోపాటు వీరమరణం పొందారు. నైజాం నవాబు కిరీటం రక్తసిక్తమై కాంతివిహీనమవడం ప్రారంభమైంది.

మేళ్ళచెరువు, ఎర్రపాడు, నాసికల్లు, పాత సూర్యాపేట మొదలైనచోట్ల బేదఖలీ వ్యతిరేకంగా ప్రజలు పోరాటాలు చేశారు. బేతవోలు, బక్కవంతులగూడెం, ములకల గూడెం మొదలగుచోట్ల దొరల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు వెల్లువలా రాసాగాయి.

మాచిరెడ్డిపల్లె[5], ఆకునూరు[6] మొదలైనచోట్ల ప్రజలమీద ప్రభుత్వోద్యోగులు పోలీసులు జరిపిన ప్రతిఘటనలు ప్రజలకు ప్రేరణ ఇచ్చాయి.

భూస్వాములు ఇలాంటి దాడులు చాలాచోట్ల చేశారు. పోలీసులు దొరల గడీల్లో కేంపులు ఏర్పాటు చేశారు. వాలంటీర్లను, సంఘ నాయకులను పట్టి ఇవ్వాలిందిగా ప్రజలను నానా బాధలకు గురిచేశారు. ప్రజలను సంగంనుండి వేరుచేయడానికి నానా రకాల ఒత్తిడులు చేసుకొన్నారు. లెవీ ధాన్యం ఇవ్వక్కర్లేదని, సంగానికి రాజీనామా చేస్తా మని నయాన భయాన కొందరితో ఒప్పించుకున్నారు. ఈ పరిస్థితుల్లో—

ఎక్కడిది యమపాతకే
ఎక్కడిది పాపిష్టిదే
పిచ్చికుక్కల రీతి వచ్చారు తెలంగాణ
కెక్కడి దొర దండురే
ఊరిలో క్యాంపులను వేసి
ఊరి ప్రజలందరిని బట్టి[7] - చిత్రహింసలు చేశారు. అయితే, ప్రజలు భయపడి వెనుకంజ వేయలేదు. ఇదే కాలంలో పాలక వర్గం ప్రజలలో సంఘంపట్ల గల విశ్వాసాన్ని వమ్ముచేయడానికి ప్రయత్నించింది. ప్రభుత్వం మంచిదేనని దొరలు చెడ్డవారు అనే భావన కలిగించడానికి నల్లగొండ జిల్లాలో బెరారు యువరాజు పర్యటన ఏర్పాటు చేశారు. ఆ సందర్భంలో కొన్ని పాటలు వచ్చాయి.

వీర పత్నుల కీర్తి
వేయి రూకల నిచ్చి
మరిపించ జూతువే
మా వీర సంస్కృతిని
ఎంత చౌకాయెనోయీ యువరాజా!
ఎన్నటికి మరవమోయీ యువరాజా![8]

ఈ యువరాజు పర్యటనను నైజాం ప్రభుత్వం కావాలని ఏర్పాటు చేసింది ప్రజలలో రాజభక్తి నశించిపోతున్నదనీ, ప్రభువుకి-ప్రజలకీ మధ్య దూరం ఏర్పడిందనీ పోలీసులు రిపోర్టు ఇచ్చారు. ఈ రిపోర్టు (ఫైలు నం. 4/ఎస్.పి.ఎ/56) ఆధారం చేసుకొని పర్యటన ఏర్పాటు చేశారు. ప్రజాకవులు ఈ పర్యటన వెనుకగల అంతర్యాన్ని పాటలద్వారా బట్టబయలు చేశారు. ఈ పర్యటన వల్ల ఫలితం కనిపించకపోవటంవల్ల పోలీసులు కొన్ని నెలలపాటు దాడులు కొనసాగించారు. సంగం ఒకడుగు వెనక్కివేసింది. దొరలు మళ్ళ గ్రామాలకు రావడానికి ప్రయత్నించారు. ప్రజా వ్యతిరేక శక్తులు కొంత ధైర్యాన్ని పొంది. దౌర్జన్యకాండకు దిగాయి. ఈ సమయంలో ప్రజలు ఊర్కోలేదు.

ఇంతకు మించిన యమలోకం
లేదు లేదురా రైతా

ఎందుకురా నికృష్ట జీవితం
ఎందుకురా రైతా
అందరు కలిసి ఎదిరించాలిదే
ముందుకురారా రైతా[9]

అనే పాటను ప్రచారం చేసుకొన్నారు. అప్పుడు ప్రజలకు కావలసింది ఐకమత్యం. ఆ పరిస్థితుల్లో "ఐకమత్యమే బలం/అందినదే ఆయుధం/చేకొని వేగమె నైజాం/చెనటుల పరిమార్చరా" అని పాడుకొన్నారు.

పాలన పేరిట పల్లెపల్లెలో
జరిగే పాపం చాలింక
రక్షణకై ఏర్పడ్డ బలగమే
చేసే భక్షణ చాలింక[10] — అంటూ కాళోజీ ఎన్నో గేయాల్లో తమ ఆవేదనని వెలిబుచ్చారు. ఈ దశలో పార్టీ కార్యకర్తలు ఎక్కువగా ఇతర కవులు రాసిన పాటలను, తమకు అనుగుణంగా ఉన్న పాటలను పాడుకొన్నారు. అందులో కాంగ్రెసు వారు, సానుభూతిపరులు రాసిన పాటలు కూడా ఉన్నాయి.

మారువేషాలతో వచ్చిన పోలీసులను, ప్రజా వ్యతిరేక శక్తులను ఈసారి ప్రజలు వదిలిపెట్టలేదు. ఎలాంటి సూచనలు లేకుండానే తమ కోపాన్నీ, కసినీ ప్రదర్శించారు. ప్రజా శత్రువులను ప్రజలే ఎదుర్కొన్నారు. మొండికేసినవారిని తమకు అడ్డులేకుండా చేసుకొన్నారు. ఈ వార్తలు పాకిపోయి ప్రజల్లో మళ్ళీ చైతన్యం పెరిగింది.

ఈసారి పోరాట రూపంలో కొద్ది మార్పు సంభవించింది. రహస్య కార్యక్రమాలు ఎక్కువయ్యాయి. ఈ కార్యక్రమాల్లో ప్రజలుకూడా పాల్గొన్నప్పటికీ వాటిని రహస్యంగానే నిర్వహించడం జరిగింది. పోస్టర్లు వేయడం, సంఘ వ్యతిరేక శక్తుల్ని ఉత్తరాల ద్వారా హెచ్చరించడం, కరపత్రాలు పంచడం మొదలైన పనులు చురుగ్గా చేశారు. "పట్టరా పడిశాల కొట్టరా తొలిదెబ్బ పరిగి పిట్టల మంద - పారిపోవాలి" అని పాడుకొన్నారు. ఇప్పుడు ప్రతిఘటించడం కాదు దెబ్బ తప్పించుకోవడం, దెబ్బతీయడం అనే స్థితికి వచ్చారు. "పంట ధ్వంసం చేయు పందులవిగోరా/బాకునా, బల్లాన - పగల జీరుమురా/ముందు కురికురికి పందులన్నిటిని/మందేసి కొట్టరా - కంది కాయోలె" పందులు గుంపులుగా కలిసి వచ్చినపుడు కూలీలు రైతులు కూడి కేకలేస్తే క్రూర మృగముల గుండె జారిపోతుంది. పటపటా ఈ దాస్యబంధాలు తెంచి స్వాతంత్ర్యాన్ని పొంది జాతీయ గీతాలు పాడాలని నిర్ణయించుకున్నారు. ఇలాంటి గీతాలతో రణభేరి మోగించారు! ప్రజలు ఈసారి గతంలా కాకుండా పరిస్థితులు విషమించినప్పుడు కలిసి

కట్టుగా ఎలా ఉండాలో నేర్చుకొన్నారు. విడివిడిగా పాడుకొనే పాటలు సామూహిక గీతాలయ్యాయి.

## లెవి వసూళ్ళు

యుద్ధనిధి పేరుతో ప్రభుత్వం రైతాంగంపై మోపిన అదనపు భారమే లెవి. పంట పండినా పండకపోయినా ఎకరానికి ఇంత ధాన్యం కట్టాలని ఆజ్ఞ జారీ అయింది. గ్రామాధికారులు, తహసిల్, రెవెన్యూశాఖ ఉద్యోగులు లెవీ పేరుతో రైతుల్ని నిలువునా దోచారు. రైతులు నల్ల బజారులో ధాన్యం కొని లెవి కట్టారు. కొలతల్లో, తూకంలో ఎన్నో అక్రమాలు జరుగుతుంటే సంగం కార్యకర్తలు రంగ ప్రవేశం చేయక తప్ప లేదు.

లంచాలు పెట్టి భూస్వాములు లెవి నుండి తప్పించుకునేవారు. గిడ్డంగుల్లో ధాన్యం దాచి ఎక్కువ రేట్లకి అమ్ముకునేవారు. ఈ సమయంలో కమ్యూనిస్టు పార్టీ దొరల గిడ్డంగుల్లో ఉన్న ధాన్యాన్ని వశపరుచుకోవాలని, నల్ల వ్యాపారుల్ని, లంచగొండుల్ని శిక్షించాలని సూచించింది. ఈ సూచనల స్ఫూర్తిని పాటలు ప్రతిబింబించాయి.

రెండో దశలో ఆంధ్రమహాసభ, నల్గొండజిల్లా కమ్యూనిస్టు పార్టీలు సంయుక్తంగా కరపత్రం (1946) వేశాయి. లెవి ఇవ్వడం బహిష్కరించాలని, ప్రజలే ధాన్యం పంచాలనీ, అందుకోసం ఆహార కమిటీలు ఏర్పడాలని కోరారు. అంతేకాదు "అందినదే ఆయుధంగా చేసుకోవాలి. ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించాలి" అని ప్రకటించారు.

ఈ లెవీ వ్యతిరేక పోరాటంలో శ్రమజీవులు, రైతులు కలిసికట్టుగా వచ్చారు. లెవీ వ్యతిరేకంగా చాలా పాటలు వచ్చాయి. కాని ఆ వెనువెంటనే అది నైజాం వ్యతిరేక పోరాటంగా మారడంవల్ల నోటి పాటలు కనుమరుగు అయ్యాయని ప్రజాకవి రాజారాం ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. కాని 12వ ఆంధ్రమహాసభ సందర్భంగా వేసిన 'ప్రబోధగేయాలు' పుస్తకంలో ఆలువాల వెంకయ్య రాసిన 'ఆంధ్రమహాసభ కరుగు దెంచండీ' అనే పాటలో 'లెవీ ధాన్యం బివ్వవరెనన్నా' అన్నాడు. మొదట్లో లెవీగా ఇచ్చిన ధాన్యం ప్రజలకు ప్రభుత్వం మళ్ళీ పంపిణీ చేస్తుందని భావించారు. కాని ప్రభుత్వం అలాంటి కార్యక్రమాలు ఏదీ అమలుపరచలేదు. పైగా లెవీల పేరుతో దౌర్జన్యంగా అక్రమ వసూళ్ళు ప్రారంభించారు. ప్రభుత్వం, భూస్వాములు కుమ్మక్కై ఈ వసూళ్ళు చేయించారు. ప్రభుత్వాధికారులకు దొరల గూండాలు సహాయం చేసేవారు. ప్రజలు దొరల గూండాలను ప్రతిఘటించినప్పుడు ప్రభుత్వాధికారులు పోలీసులను పిలిపించేవారు.

అలాంటి సమయంలో ప్రజలు 'లెవీ ఇవ్వం' అనే నిర్ణయానికి వచ్చారు. ఈ నిర్ణయానికి రావడానికి చాలా కారణాలున్నాయి.

లెవీ ధాన్యం ఇవ్వ మంటున్నా సర్కారువారికి
లెవీ గొల్చితే కరువు పోదన్నా
కరువు నాపెడి పద్ధతిది యని
గంపెడాశను బెట్టి ధాన్యం
పేదకెళ్ళకి లేకిని రైతుకు
తెచ్చిపెట్టిరి కాటకంబును[13]

ప్రజలు, కార్యకర్తలు లెవీ ఇవ్వకపోవడమే కాదు, మొత్తం ధాన్య కొలతలు ఆపారు. భూస్వాముల మిగులు ధాన్యాన్ని కంట్రోలు ధరకు ప్రజలకు ఇవ్వాలని పోరాడారు. అందుకోసం తమ ఐక్యశక్తిని చూపాలని నిర్ణయించుకున్నారు. సంగం వారికి అండగా నిలిచి, నిరాశ, నిస్పృహ పారద్రోలి, చైతన్యవంతమైన కార్యక్రమాన్ని ఇవ్వగలిగింది.

కరువు కొట్లు తిప్పించు లాగన్నా -
ఈ ప్రభుత్వమ్మును
మెడవకను మన మడుగవలెనన్నా
కరువు కొట్లను బెట్టి బీదల
జరుగుబాటుల దెలిసికొని ప్రతి
సరుకు స్వల్పపు ధరల కిచ్చియు
కరువు బాధల తొలగద్రోయుడు[14] అని ఒకవైపు ప్రభుత్వాన్ని కోరారు. మరోవైపు "అధికాహారోత్పత్తిని జేసి/ఆహార కొరతదీర్చి/రైతుకూలీలార యిపుడూ/రండీ ముందునకు వేగ"[15] పంటలు బాగా పండించాలని భావించారు.

ఆ తరువాత "తిండిదొంగ ఎగుమతీల త్రిప్పికొట్టి వేయునండి/కరువు ప్రాంతములకు నిపుడె సరుకు పంపజేయునండి" అని ఖమ్మం ఆంధ్ర మహాసభ తీర్మానించింది. సేల్ సొసైటీల ఏర్పాటు జరిగింది. రైతులను సభ్యులుగా తీసుకొన్నారు. "ఈసడించుక బీద ప్రజలను-దోచేవారి నందరిని/యే వేసమున నున్నప్పటికీ-తీసి చూపించంగ వచ్చు"[16] ఇది పన్నెండో మహాసభ తీర్మానంగా ప్రజలకు పాటరూపంలో పాడి విని పించారు. ఖమ్మం సభ ఉత్తేజంతో, గ్రామ సంగాలు ఏర్పాటయ్యాయి. తిండిదొంగలు పాలక వర్గాలవారే. వారిని ఎదిరించడం కష్టం. అందుకు ముందుగా ప్రజలు ఐక్యంగా నిలబడాలి. అక్రమ నిల్వలను బయటకు తీయాలి. ఈ కార్యక్రమం మొదట విసునూరు దొరతల్లి నివసించే కడవెండిలోనే ప్రారంభమైంది.

ఇది చూసి నాయకులమీద, ప్రజలమీద దొరలు దొంగ కేసులు పెట్టి చైతన్యాన్ని అణచడానికి ప్రయత్నించారు. కాని వారి ఆటలు సాగలేదు.

ప్రజా చైతన్యం

దౌర్జన్యాలు పెరుగుతున్నకొద్దీ అట్టడుగు జనం సంగంపట్ల ఎక్కువగా ఆకర్షితులయ్యారు. సంగం ఏర్పాటుకు కలిసింది చుట్టుపక్కల గ్రామాలలో బహిరంగ సభలు ఏర్పాటయ్యాయి. గ్రామాలలో సభలు జరగడం అప్పటినుండే మొదలయింది.

వేళ్ల తన్నుకుపోయిన భూస్వామ్య దోపిడిని ఎదిరించే సత్తువ ప్రారంభంలో సంగానికి లేదు. రానురాను ప్రజలే దానికి అనంతమైన శక్తిని, పుష్టిని చేకూర్చారు. సంగం ప్రవేశించిన కొత్తలో దేవరుప్పుల గ్రామంలో తోటకూర మల్లయ్యకు, ఖోనగిరి వీరయ్యలకు ఒక వ్యవహారంలో దొర గూండాలు తమ కోర్టులో జరిమానాలు విధించారు. ఆ డబ్బు రెండురోజుల్లో చెల్లించాలని షరతు పెట్టారు. వారి దగ్గర కాణీ కూడా లేదు. సమయం దగ్గర పడుతున్నది. ప్రజలు సంగం నాయకులతో ఈ విషయం చెప్పాలన్నారు. మరి కొందరు సంగాన్ని ఏర్పాటు చేసుకొని ఇలాంటి అన్యాయాలను అరికట్టాలన్నారు. అపుడు మడిపడగ, నీర్మాల గ్రామంలో సంగం ఏర్పాటు అయింది. బాధితులు అక్కడికి వెళ్ళి సంగంలో చేరి చీటి తీసుకొని వచ్చారు. వాయిదానాడు దొర బంట్లు జరిమానా డబ్బు అడగ్గానే వారు సంగం సభ్యత్వ చీటీలు చేతికిచ్చారు. దొర గూండాలు ఆశ్చర్యపడి, జరిగిన సంగతిని విసునూరు దొరకు చెప్పుకొన్నారు. సరిగ్గా ఇలాంటి సంఘటనలే అమెరికా కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన పోరాటాల్లోనూ, రష్యా విప్లవంలోను ఉన్నాయి. అంతేకాదు ఈ సంఘటన సందర్భంగా పాటలు కూడా వచ్చాయి.

అంతకుముందే విసునూరు ప్రాంతంలో ప్రజలు దొరల అక్రమాలకు వ్యతిరేకంగా, వెట్టికి, బేదఖలీకి వ్యతిరేకంగా ఉద్యమాలు చేపట్టారు. ఇందులో ముఖ్యంగా చెప్పుకోవలసింది పాలకుర్తి సంఘటన.[19] భూస్వాములు నిర్బంధాల్ని అధికం చేశారు. కార్యకర్తలపై తప్పుడు కేసులు బనాయించారు. ప్రజా చైతన్యాన్ని అణగదొక్కడానికి మొదటినుండీ ఉన్న గుండాలను పెంచారు. గుండాల సైన్యం ఒకటి తయారైంది. ప్రజలమీద ఈ గుండాల దాడులు ప్రారంభమయ్యాయి.

ఈ పరిస్థితిలో మిగతా సామాన్య రైతులనుంచి లెవీ ధాన్యాన్ని నిర్బంధంగా వసూలు చేయడంకోసం విసునూరి దొర రెవిన్యూ అధికారులను తీసుకొని వచ్చాడు దానిని ప్రజలు వీరోచితంగా ప్రతిఘటించారు. కడవెండిలో విసునూరు దొరకు సంబంధించిన 800 బస్తాల ధాన్యాన్ని ప్రజలు అధికారులకు చూపారు. కాని అధికారులు

కూడా దొరతో కలిసిపోయాడు. ప్రజలు చీఫ్ సెక్రటరీ గ్రెగ్‌సన్‌ను కలుసుకొన్నారు. అంతే కాకుండా దొరకు సంబంధించిన ఇతర ధాన్యం కొట్లన్నింటినీ అధికారులకు చూపారు. ఆరువేల బస్తాల దాన్యం రేవీ కింద అధికారులు తీసుకుపోక తప్పలేదు. ఈ సంఘటన తరువాత విసునూరు దొర రెచ్చిపోయాడు. కడవెండిలో జరిగిన పరాభవం తన దొరతనానికే పరాభవంగా భావించాడు.

కడవెండిలో ప్రజలు సంగం కార్యాలయం దగ్గర కలుసుకొని కార్యక్రమాలు నిర్ణయించుకొనేవారు. ఇది సహించని దొర తన గూండాలని కడవెండికి పంపాడు. వీరు ఊరేగింపు తీసిన కార్యకర్తల్ని చూసి భయపడ్డారు. మాటువేసి తుపాకులతో కాల్చారు. ఆ కాల్పుల్లో దొడ్డి కొమరయ్య అక్కడికక్కడే చనిపోయాడు. విసునూరు దొర ధాన్యం అక్రమ నిలువల్ని వెలికి తీసి చూసిన వారిలో ఆయన ఒకరు.

## దొడ్డి కొమరయ్య మరణం

చనిపోవడానికి ముందు కొమరయ్యకు ప్రజల్లో అంతగా గుర్తింపులేదు. చనిపోయిన తరువాతనే గొప్ప వీరునిగా కీర్తింపబడ్డాడు. తెలంగాణ రైతాంగ పోరాటానికి అతని పేరు పర్యాయ పదంగా మారింది. ముఖ్యంగా అతనిమీద వచ్చినన్ని పాటలు ఏ పోరాట వీరునిమీదా రాలేదు. ఊరేగింపులు, సభలు, పత్రికలు అతణ్ణి ప్రశంసించాయి. ముఖ్యంగా ప్రజలు కలుపులు, నాట్లు, కోతలు, దంపుళ్ళు, చుట్టకాముడు మొదలైన రూపాల్లో అతడిమీద పాటలు పాడుకున్నారు. శ్రమజీవులలో అతడు ఒక భాగమయ్యాడు. తెలంగాణా పోరాటానికి సంబంధించి ప్రజలను ఇంతగా కదిలించిన వ్యక్తి మరొకడు లేడు.

జానపద నాయకులుగా పేరుపొందిన సర్వాయిపాపడు, బల్లూరి కొండల రాయుడు మొదలైనవారి ప్రతిఘటనలకు ప్రజలతో సంబంధం లేదు. అందులో ప్రజలు భాగస్వాములు కాలేదు. కాని వృత్తి గాయకులు వారి వీరోచిత కార్యాలను పౌరాణిక అంశాలతో కలిపి అద్భుత కార్యాలను కల్పించి, జోడించి పాడతారు. ప్రజలు వీని వినిని ఆనందిస్తారు. ఈ రకంగా ఈ వీరులు వృత్తి గాయకుల గానం వరకే పరిమితమై ఉన్నారు. కాని ప్రజలు పని పాటల్లోకి చేరలేదు.[20]

కొమరయ్య ప్రజలలో ఒక భాగంగా జీవించాడు. ఎన్నో శతాబ్దాల నుండి భూస్వాముల వల్ల బాధలు పడుతున్న కొన్ని లక్షల మందిలో కొమరయ్య ఒకడు. అంతేకాదు విసునూరి దొర చంపించిన సుమారు వందమందిలో ఇతను కూడా ఒకడు. చనిపోయినవారిలో చాలామంది శ్రమజీవుల కుటుంబాలకు చెందినవారే. మిగిలిన వారిలో కొందరు దొర బంధువులు ఉన్నారు. ముఖ్యంగా దొర మేనమామ పడిశాల వెంకటరెడ్డి

ఒకరు. అలాంటి ప్రముఖులను సైతం హత్య చేయించి బయటపడడానికి వేల రూపా యలు లంచాలు పెట్టాడు. లంచాలు పెట్టడానికి ఆయన తల్లి జానమ్మ దగ్గర డబ్బు అప్పుగా తీసుకొన్నాడు. తిరిగి ఆమెకు అప్పు చెల్లించలేక కడవెండి, మరో మూడూళ్ల ఆమెకు సమర్పించాడు. ఆమె ఆ నాలుగూళ్ళ ప్రజలను మరింతగా కష్టాల పాలు చేసింది. జానమ్మ అప్పటికే 70 సం॥ల ముసలమ్మ. ఆమె తన సొంత న్యాయస్థానం నడిపించేది. ఆమె రౌడీలు కేసులు తెచ్చేవారు. ప్రజలమీద రోజూ కొన్ని వందల రూపా యల జరిమానాలు విధించి, వసూలు చేసేది. ఆమె న్యాయస్థానం ఎ.నోన్ని ప్రత్యేక తలతో ఉండేది.[21]

అలాంటి ఊరిలో సంగం ప్రవేశించడమే కాదు, ప్రజల జీవితాల్లో ఒక గొప్ప మార్పు తెచ్చింది. అంతకు ముందున్న కట్టుబాట్లు, భూస్వామ్యనీతి అన్నీ పటాపంచ లయ్యాయి. మరో మాటలో చెప్పాలంటే సంగం వచ్చి ప్రజలలో తెచ్చిన మార్పు కన్నా భూస్వాముల విధానంలో పెద్దమార్పు తెచ్చింది. సంగం వల్ల మొట్టమొదటి తాకిడికే వారు తల్లడిల్లిపోయారు. వెట్టిచాకిరి, న్యాయస్థానాలు, సుఖాలు అన్నీ మరుగు పడిపోయాయి. శతాబ్దాలుగా అమలులో ఉన్న విధానం కొన్ని మాసాల్లోనే ఎగిరి పోయింది. అలాంటి పరిస్థితుల్లో ప్రజల్ని మళ్ళ తమ కాళ్ల దగ్గరకు రప్పించుకోవ డానికి బేదఖలీ కార్యక్రమాన్ని చేపట్టారు. మరింత దౌర్జన్యపూరితమైన చర్యలు ప్రారంభించారు.

సంగం, మొదట ప్రజలను సంఘటిత పరిచింది. స్త్రీ, పురుషులను సభ్యులుగా చేర్చుకొంది. ఇన్నాళ్ళుగా దాగిన వారి బలం, తెలివి, నేర్పు అన్నీ సంగం వల్ల బయట పడ్డాయి. తమ దుర్భర జీవితాల నుండి విముక్తి పొందడానికి సంగంలో చేరడమే కర్త వ్యంగా భావించారు.

ఇలాంటి నేపథ్యంలో కొమరయ్య ప్రజలతో కలిసి సంగం కార్యకలాపాల్లో పనిచేయడం మొదలు పెట్టాడు. సంగంలో ఒకడయ్యాడు. సంగమంటే ప్రజలు. ఆ ప్రజా చైతన్యంలో కొమరయ్య భాగమయ్యాడు. అంతే కాదు వాలంటీరుగా ముందుకు వచ్చాడు. తన కులం, వృత్తి, అన్నీ మరచిపోయి భూస్వామ్య వ్యతిరేకత అనే పోరా టంలోకి దూకాడు. అలాంటి సమయంలో కొమరయ్య మరణం అందరినీ కదిలిం చింది. అతనికి తాకిన తుపాకి దెబ్బలు ప్రజలు తమకు తాకినట్లే భావించారు. అలాంటి మరణం రేపు తమకే సంభవించవచ్చు. కాబట్టి అలాంటి మరణం కన్నా వీరమరణమే మేలని భావించారు. అతని మరణాన్ని వీరమరణంగా భావించారు. అతనిలో తమని తాము చూసుకొన్నారు.

సంగం చేపట్టిన కార్యక్రమంలో కొమరయ్య మరణం ఒక మలుపుగా కానీ, సాయుధ పోరాటదశకు 'తెరఎత్తడం' గా కానీ భావించవచ్చు. కానీ జరిగిన వాస్తవ పరిస్థితిని, నాటి గ్రామాలలోని ప్రజల చైతన్యాన్ని, దొరల ఆలోచనా విధానాన్ని, నైజాం ప్రభుత్వపు ప్రజా వ్యతిరేక పాత్రని కప్పదాటు వేసేదిగా ఉండకూడదు.

సంగం పోరలకు వ్యతిరేకంగా చేపట్టిన కార్యక్రమాల్లో జరిగిన ఎన్నో దౌర్జన్య సంఘటనల్లో కొమరయ్య చావు కూడా ఒకటి. అంతకు కొన్ని మాసాల కిందే పదవెండి దగ్గరలో ఉన్న ధర్మాపురంలో ఎనిమిది మంది లంబాడీలను సజీవదహనం చేశారు. ఎంతో మందిని ఎంకిచ్చకాలకు కట్టి కొట్లించి చిత్రవధ చేశారు. ఆ విధంగా ఎంతోమంది మరణించారు. కాని ఇలాంటి సంఘటనలు జరిగే కాలానికి ప్రజలలో అంతగా చైతన్యం పెరగలేదు. అంతేకాదు ఈ పోరాటాలు ప్రాపక్తకాల (**Spontaneous**) పోరాటాలు కాబట్టి నిర్మాణాత్మకంగా ప్రజల సమీకరణ జరగలేదు. చైతన్యం ఉన్నా అది ఒక క్రమశిక్షణతో సమాయత్తం కాలేదు. దానికి ముఖ్యంగా నాయకత్వం లేదు. అందువల్ల దౌర్జన్యాలు జరిగిన వెంటనే ఎదిరించే పరిస్థితిలో ప్రజలు లేరు ప్రతిఘటనలకు కొనసాగింపు లేదు. కాని పోరాటాల ప్రేరణ, కసీ మాత్రం ప్రజల గుండెల్లో నిల్చిపోయింది. దానికి కొనసాగింపు చర్యగా దొడ్డి కొమరయ్య మరణం సంభవించింది.

పాలకుర్తి కేసులో దొరలు అపజయం పొందారు. ఐలమ్మ భూమి కోసం ప్రజలు గూండాలకు ఎదురువచ్చి పోరాడారు. విసునూరు దొరకి సంబంధించిన కొన్ని వందల పుట్ల దొంగ ధాన్యాన్ని పట్టించారు. ఈ సంఘటనలన్నీ వరుసగా జరిగాయి. పైగా కడవెండికి సంగం వచ్చి జానమ్మగారి ఆటలు సాగనివ్వలేదు. అందుకే విసునూరి నుండి గూండాలు వెళ్ళి కడివెండి ప్రజలను భయభ్రాంతుల్ని చేయాలనుకొన్నారు. కాని మరొక విధంగా జరిగింది. సంగం ఇచ్చిన చైతన్యంతో ప్రజలు తమ ఐకమత్యాన్ని చూపడానికి మాత్రమే నినాదాలిస్తూ ఊరేగింపుగా బయలుదేరారు. కానీ ప్రజలు తమపై దాడి చేయడానికే వస్తున్నట్లుగా గూండాలు భావించి, కాల్పులు జరిపారు. ప్రత్యేకంగా కొమరయ్యనే చంపాలని కాల్పులు చేయలేదు. కేవలం ఆత్మరక్షణ కోసం కాల్పులు జరిపారు. అది అనుకోని విధంగా కొమరయ్య మరణానికి దారితీసింది.

అప్పటికప్పుడే గూండాల కాల్పుల గురించి చుట్టుపట్ల గ్రామాలకు తెలిసిపోయింది. వేలాదిమంది పరుగెత్తుకుంటూ వచ్చారు. ఎన్నో ఏండ్లనుండి గూడుకట్టుకొన్న కోపం, కసి ఒక్కసారిగా బద్దలైంది. ధర్మాపురం, మొండ్రాయి మొదలైన చోట్ల జరిగిన మారణకాండలా కాకుండా ప్రజలు కసి తీర్చుకోవడానికి పూనుకున్నారు. ప్రజా వెల్లువ ఎలాంటి ఆలోచన లేకుండా దొరగడీని చుట్టుముట్టింది.

గడిలోని గూండాలను గడ్డివాములో వేసి భస్మం చేయడానికి ప్రజలు తయారయ్యారు. కానీ పార్టీ నాయకులు అది సరియైన చర్య కాదని నిరాకరించారు. పోలీసులు గూండాలపై చర్య తీసుకుంటామని నచ్చచెప్పి ప్రజల్ని అక్కడినుండి పంపివేశారు. తరువాత గూండాలను తీసుకుపోయి విసునూరు దొరకు క్షేమంగా అప్పజెప్పారు. గడిని చుట్టుముట్టి, దానికి నిప్పంటించడానికి ప్రయత్నం చేసారని, అనుముల రాంరెడ్డి అనే గూండాకు మాత్రం తాగించారని సంగం నాయకులపై ఆరు కేసులు పెట్టారు. దానితో ప్రజలు నీరుగారి పోలేదు. పైగా అప్పటినుండి పోలీసులను తమ శత్రువులుగా భావించారు.

ఈ చర్య యువకులను ఉద్రేకపరిచింది. కడవెండి చుట్టుప్రక్కల గ్రామాల్లో దొరల వ్యవసాయం పనులను ఆపు చేయించారు. సంగనాయకులపై వారంటులతో పోలీసులు వస్తే, పిల్లాజెల్లలతో సహా అందరూ అడ్డుపడ్డారు. సంగాన్ని గుండెల్లో దాచుకొన్నట్టుగానే సంగం నాయకులను కూడా దాచుకున్నారు. భూస్వామి ఆస్తులను కాపాడడానికి పోలీసుల కాపలా తప్పనిసరైంది. కాపలా పోలీసులకు ఊళ్ళో మంచినీళ్ళు కూడా పుట్టలేదు. ఈ విధంగా ఆ గ్రామంలో సంగం విసునూరు దొరను సంఘ బహిష్కరణ గావించింది. ఇలాంటి పరిస్థితి చాలామంది దొరలకు, జాగీర్దారులకు ఎదురైంది. ఈ విషయం సింహగర్జన (1951) నవలలో లక్ష్మీకాంతమోహన్ వివరంగా రాశారు.

శవపరీక్ష తరువాత దొడ్డి కొమరయ్య మృతదేహాన్ని చుట్టుప్రక్క గ్రామాల్లో ఊరేగించారు. వేలాదిమంది ఊరేగింపులో పాల్గొన్నారు. ఎలాంటి పరిస్థితుల్లోనూ దొరలకు తలవంచమనీ. సంగం కోసం బలిదానాలు చేస్తామని దొడ్డి కొమరయ్య పేర శపథాలు చేశారు.

కడివెండి గ్రామ కార్యకర్తలపై, చుట్టుపట్ల గ్రామాలకు చెందిన నాయకులపైన కేసులు పెట్టి (మోహన్‌రెడ్డి, నల్లా నరసింహులు, లింగయ్య, ముత్తిలింగం మొదలైన నాయకులను) అరెస్ట్ చేసి చిత్రవధలు చేశారు. వీరిలో కొందరికి బెయిల్ మంజూరు కాని కేసుల్లో ఇరికించారు.

కొమరయ్య బలిదానం తరువాత ప్రజలలో ముఖ్యంగా బేదఖళుల కోసం, భూమి కోసం, పోరాడే రైతాంగంలో ఆగ్రహం పెల్లుబికింది. ఈ ఆగ్రహావేశాలు గాంచి ప్రభుత్వాధికారులు గ్రామాలకి రావడమే మానుకున్నారు. గ్రామాల్లో రాజకీయ సభలు, సమావేశాలు ఎక్కువయ్యాయి, అన్ని సభల్లో నాయకులు కొమరయ్య వీరమరణాన్ని గురించి ప్రసంగించారు. ప్రజలు పాటలు పాడారు. వేదికల మీద, అతనిపై వచ్చిన పాటలు ప్రజలకు ఎంతో ఉత్సాహాన్ని కలిగించాయి.' దొడ్డి కొమరయ్య జెండాలా'

అనే నినాదం ప్రదర్శనలకి, ఊరేగింపులకి ఊపిరయింది. సభలా, సమావేశాల్లో అతని మీద పాటలు కొలిమి తిత్తులయ్యాయి. ఆ విధంగా తెలంగాణా మొత్తం మీద ఒక రాజకీయ ప్రాముఖ్యం గల వ్యక్తిగా అతని పేరు బయటపడింది.

అంతకన్నా ఎక్కువగా ప్రజల జీవితంలోనూ, వారి సాహిత్యంలోనూ ప్రధానమైపోయాడు. బావుల దగ్గర, పొలాల్లో పనిపాటల్లో ఆయన జీవించాడు. కొమరయ్య పేదరైతు కూలీ జనానికొరకు చేసిన త్యాగాన్ని చూసి స్త్రీలు కూడా ఉత్తేజితులైనారు. తమ విప్లవ హృదయాలతో ఆ అమరజీవికి జోహార్లు పలికారు.

అన్ని గ్రామాలలోనూ, స్త్రీలు ఊరేగింపుల్లో నడచి, సమావేశాలు చేశారు. కొమరయ్య పాటను కోలాటంలో పాడి, ఆయన జీవితాన్ని అభినందించారు. ఆయన అడుగుజాడల్లో నడుస్తామని శపథం చేశారు. అంతేకాదు వెట్టి వ్యతిరేకపోరాటంలోంచి వచ్చి ఆ పోరాటంలోనే మరణించిన కొమరయ్య మీద వాస్తవ సంఘటనలు జోడించి ప్రజలు పాటలు పాడుకొన్నారు. కడవెండికి, తెలంగాణాకు దూరంగా ఉన్న మధ్యతరగతి కవులు కొమరయ్యపై వాస్తవికతకు దూరమైన కవితలు, పాటలు రాశారు.

పోటీలో పాల్గొంటున్న రాజకీయనాయకులు, చరిత్రకారులు, పరిశోధకులు ఎన్నో పుస్తకాలు రాశారు. వీటన్నిటికన్నా గొప్పగా ఒక "రాజకీయపత్రం' ఉన్నంత స్పష్టంగా ఉన్న ఈ పాటలో అతని మరణాన్ని గురించి కడివెండి ప్రజలు 'అమరజీవి దొడ్డి కొమరయ్య' పాటని, 'కడవెండి పాట'నీ (చూ. అనుబంధం) పాడుకొన్నారు.

## బందగీ-కొమరయ్య

దొడ్డి కొమరయ్య మరణంకన్నా చాలా ముందే విసునూరి దొర అఘాయిత్యాలను బందగీ ప్రజలకు తెలియచేశాడు. అందువల్ల బందగీని విసునూరి దొర గూండాలు పట్టపగలే బలిగొన్నారు. ఏళ్ళుగా దొరలతో పోరాడి, కోర్టుకు వెళ్ళి తన భూమిని గెలుచుకున్న బందగీ తెలంగాణా ప్రజల మొదటి ప్రజానాయకుడు. అతని వీరమరణం ప్రజలను ఎంతో కలిచివేసింది. అప్పుడు వాళ్ళు ఆగ్రహాన్ని వెలిబుచ్చలేక దిగ మింగాల్సి వచ్చింది. అప్పటి పరిస్థితుల్ని, అతని మీద తమకున్న సానుభూతినీ, కలగలిపి అతని మీద పాటలల్లుకున్నారు. ప్రతి సంవత్సరము బందగీ సమాధి దగ్గర జరిగే ఉర్సు (తిరునాళ్ళ)కి హాజరై పూలమాలలువేసి తమ గౌరవాన్ని తెలుపుకున్నారు[22] దాన్ని దొరలు అరికట్టలేకపోయారు.

సంగం అడుగు పెట్టినప్పటినుండి బందగీని ప్రజలు తలుచుకోవడం మొదలైంది. ఒకనాడు బందగీ వేసిన బాటని ఆ నాడు ప్రజలు నిజంగా గుర్తించారు. ఏ నాయకుడైనా

ఆ చుట్టు ప్రక్కల గ్రామాలకు వస్తే బందగీ సమాధిని తప్పక దర్శించేవారు. ప్రజలు కొత్త అవసరాలకు అనుగుణంగా మరోసారి బందగీ మీద పాటలు పాడుకొన్నారు. మధిర ప్రాంతంలో ఉండే పట్టికొండ రామకోటయ్య వంటి కవులు సైతం గేయాలు రచించారు. ఆంధ్ర ప్రాంతంలో బందగీ చరిత్రని బుర్రకథలుగా ప్రచారం చేశారు. "మృత్యుంజయులు" నవలలో బొల్లిముంత శివరామకృష్ణ బందగీ ప్రసక్తి తెచ్చారు. తెలంగాణాలో బందగీ చరిత్ర ఒక సాధారణ రైతు చరిత్ర. బందగీ చేసిన పోరాటం రైతాంగపు పోరుబాట. దొరల మీద బందగీ సాధించిన విజయం చిన్నదే కావచ్చు. కాని, దొరతనం బలహీనమైనదని నిరూపించింది. దొరలు కేవలం దౌర్జన్యంగా మాత్రమే పెత్తనం చెలాయించగలరని తెలిసిపోయింది. కాని ఆ దౌర్జన్యాన్ని ఎలా అరికట్టాలో తెలుసుకొనే చైతన్యం అప్పటికింకా లేదు.

అలాంటి చైతన్యం వచ్చేసరికి కొమరయ్య మరణం సంభవించింది. వ్యక్తి చైతన్యం కన్నా సామూహిక చైతన్యం గొప్పది. వర్గపోరాటానికి కావలసింది సామూహిక చైతన్యమే. ప్రజలలో ఒకడిగా, ప్రజల కోసం మరణించినవాడి చావు, అతను ఏ ధ్యేయం కోసం పని చేశాడో, ఆ ధ్యేయాన్ని నెరవేర్చగలుగుతుంది.

ప్రజలలో చైతన్యం కలిగించడానికి సంగం నాయకులు కాకతీయుల పరాక్రమాన్ని వర్ణించలేదు. రుద్రమదేవి శౌర్యాన్ని కీర్తించలేదు. ఎందుకంటే వీళ్ళెవరూ ప్రజలకు సంబంధించిన వారు కారు. ప్రజలు తమ వీరుణ్ణి తామే గుర్తుంచుకొంటారు. ప్రజల చరిత్రలో ఒక భాగంగా ఆ వీరులు సజీవంగా ఉంటారు. ఈ చరిత్ర మౌఖిక చరిత్ర. సంఘం నాయకులు ఆకస్మాత్తుగా బందగీ పేరు తలవలేదు. కార్యకర్తలు ప్రజలతో కలిసిపోయి పనిచేసినప్పుడే వారిజీవితపు లోతుల్లో దాగిన సంఘటనలూ, తిరుగుబాట్లూ కనిపిస్తాయి. ప్రజావీరులూ కనిపిస్తారు. ఈ విధంగా బందగీని రంగంలోనికి తేవడానికి ప్రజలే కారకులయ్యారు. మౌఖిక రూపంలో ప్రజలు బందగీ బాటని పదిల పరిచారు. ఆ చరిత్రని సంగం నాయకులు మళ్ళీ మౌఖిక రూపంలోనే కొత్తగా ప్రజల ముందుంచారు. ఈ సారి బందగీ జిందగీ ప్రజలను నడిపించే సాధనమైంది.

1946 జూన్‌లో కొమరయ్య మరణం తరువాత రెండు నెలలకే ఆంధ్రమహాసభని, కమ్యూనిస్ట్ పార్టీని ప్రభుత్వం నిషేధించింది. అయినప్పటికీ వాటి కార్యకలాపాలు ఎక్కువైనాయి. నల్లగొండ జిల్లాలోని చాలా ప్రాంతాల్లో పోలీసుల సహాయం లేనిదే ప్రభుత్వం నడవలేకపోయింది. రెవెన్యూ, ఎక్సయిజు, మొదలైన శాఖలు పనిచేస్తున్నాయా లేదా అనే అనుమానం వచ్చింది.

ఈ చారిత్రక నేపథ్యంలో కొమరయ్య వీరమరణాన్ని చూసినప్పుడు మనకు చాలా విషయాలు తెలుస్తాయి.

కడివెండిలో జరిగిన భూస్వామ్య వ్యతిరేకపోరాటం చాలా కాలం నుండి జరుగుతున్నది. అది జనగామ తాలుకా, నల్లగొండ జిల్లా పోరాటంలో ఒక భాగం.

విసునూరు దొర చాలామంది తన వ్యతిరేకుల్ని హత్య చేయించడం, లూటీలూ చేయించడం జరిగింది. సంగం నాయకత్వంలో ప్రజలు ఒక్కటై నిలిచారు. అలాంటి సమయంలో కొమరయ్య హత్య జరిగింది. రైతాంగ పోరాటానికి ముందు జరిగిన కొమరయ్య హత్య పోరాటం ఉధృతంగా వ్యాప్తి చెందిన తరువాత వీరమరణంగా మారింది. ప్రతిఘటనకు ముందు జరిగిన కొమరయ్య హత్య ఆ తరువాత వీరమరణంగా మారడానికి ఆస్కారమైంది.

దొరల ఇళ్ళలో సైతం జరగనంత వైభవంగా అతని దినకర్మలు చేశారు. ఏడ్పులకు బదులుగా అతని మీద పాటలు పాడారు. ఆ పాటల ద్వారా తమని తాము ఓదార్చుకున్నారు. రోజూ సాయంత్రం జరిగే సమావేశంలో తమకు తాము ఉత్సాహం తెచ్చుకోవడానికి దొరలకు వ్యతిరేకమైన పాటలు పాడుతూ కొమరయ్య వీరమరణాన్ని జత చేశారు.

కొమరయ్య మీద చాలా పాటలు వెలువడడానికి కారణం విసునూరి దొరే. అతని అకృత్యాలు కూడా రైతాంగాన్ని ముఖ్యంగా గ్రామిక స్త్రీలను చాలా కదిల్చివేశాయి. కొన్ని పాటల్లో దొరవారు స్త్రీలకు చేసిన అన్యాయాలన్నీ ఏకరువు పెట్టారు. నాట్లలో, కలుపులో పాటలు పాడుకున్నారు. దొర, దొరతనం పోయినప్పటికీ ఈ నాటికీ ఆ పాటలు పాడుకుంటున్నారు. క్రూరత్వానికి మారుపేరైన విసునూరి దొర చేతిలో చావడం కూడా, కొమరయ్యపై ఎక్కువ పాటలు రావడానికి ఆస్కారమైంది.

కొమరయ్య హత్య తరువాత వెంటనే ప్రజలకు పార్టీ వేరే కార్యక్రమాన్ని ఇవ్వలేక పోయింది. నాయకత్వం దొరలపై ప్రతీకారచర్యలను చేపట్టలేదు. సాయుధులు కండని నామమాత్రంగానైనా తెలపలేదు. గ్రామాలలో అజ్ఞాతంగా ఉంటూ ప్రజలను నిర్మాణయుతంగా సంఘటిత పరచడానికి మాత్రమే పూనుకొన్నారు. కాబట్టే కొమరయ్య పేరుని సంగం చాలాకాలం వాడుకోవలసి వచ్చింది. అతనిమీద ఎక్కువ పాటలు రావడానికి ఇదికూడా ఒక కారణం.

ప్రజల కళ్లముందే ప్రజల కార్యకర్తను దారుణంగా హత్యచేశారు. అందుకే "జోహారు జోహారు నీ వీరమరణమును మరువలేమయా" అని పాడుకొన్నారు. ఎలాంటి ఆయుధాలు లేకుండా సాయుధులైన రౌడీలను ఎదుర్కోవడానికి ధైర్యంగా వెళ్ళిన కొమరయ్య మరణం ప్రజలకు ఒక ఆయుధమైంది. "కొమరయ్య జిందాబాద్" అనే నినాదాలూ, "అమరజీవివి నీవు కొమరయ్య, అందుకో జోహార్లు కొమరయ్యా" అనే వందలాది పాటలు ప్రజల్లోంచి వచ్చాయి.

తెలంగాణా రైతాంగ పోరాటంలో కొమరయ్యమీద పాటలు చాలా విస్తృతంగా రావడమే కాదు, అన్ని రకాలైన పాటలు పాడుకొన్నారు.

పాటలే ఎక్కువగా వచ్చాయి కాని అస్తవ్యస్తమైన రాజకీయ పరిస్థితులవల్లా, విరామం లేకపోవడం వల్లా కొమరయ్యమీద కళారూపాలు రాలేదు.

కొమరయ్య వీరమరణాన్ని మితవాదులు, కాంగ్రెస్‌వారు మామూలుగా భావించారు. రయ్యత్, గోలుకొండ, మీజాన్ మొదలైన పత్రికల్లో ఫోటోలు, ప్రత్యేక వార్తలు, గేయాలు వచ్చాయి. అంతేగాని దొరలు, ప్రభుత్వం కలిసి పన్నిన లెవి కుట్రలో ఎదురుతిరిగిన ప్రజలలో ఒక భాగంగా కొమరయ్య మరణాన్ని చూడలేదు. కొమరయ్య మరణానికి కారణభూతుడైన దొర గురించి వ్యతిరేకంగా మాట్లాడిన వ్యక్తులు, పత్రికలు చాలా తక్కువ.

## వాలంటీర్లు

గ్రామాల్లోకి సంగం ప్రవేశించాక హిందూ ముస్లిం శ్రమజీవులు ఒక ఐక్య వేదిక మీదికి వచ్చారు. సంగం వచ్చి "కులమతాల కుళ్లులేని సమతే మన మతమన్నది."[23] సంగం కార్యక్రమాల్ని ప్రచారం చేయడానికి, దొరల దౌర్జన్యాలను ఎదుర్కోవడానికి వాలంటీర్లను ఏర్పరచారు. శ్రమజీవుల కుటుంబాలనుండి వచ్చిన వాళ్ళే ఎక్కువగా వాలంటీర్లుగా పనిచేశారు. వీరే ఆ తరువాత సైనికులుగా, దళ కమాండర్లుగా పనిచేశారు.

మొదట్లో వాలంటీర్ల మీద అధిక బాధ్యత ఉండేది. అందువల్ల "వాలంటీరులారా మీరందరు వినండి, ప్రాణాలనర్పించి పైకి నడవండి"[24] అని పాటలు కట్టారు. సంగం కార్యక్రమాల్ని పాటలరూపంలో పెట్టి వీరు గాయకులుగా మారారు. అప్పన్న, సుద్దాల హనుమంతు, రాజారాం మొ. ప్రజాకవులు మొదట వాలంటీరులే. 'వాలంటీరులారా' అనే పాటని రాజారామే రాశాడు. పై కవులు "మీ పల్లె రక్షణ మీపై కలదు. మీ ఇంటి రక్షణ మీదేను సుమ్మీ" అంటూ, "దెబ్బలకు జైలు కంటే భయపడకండి"[25] అంటూ పాటల్లో ప్రబోధించారు.

ఏడేళ్ళ పిల్లవాని మొదలు డెబ్బైఏళ్ళ ముసలివాళ్ళ వరకు వాలంటీర్లుగా పనిచేశారు. తరువాత బాలల కోసం వాళ్ళే బాలసంగాలు ఏర్పాటు చేశారు. ఆ తరువాత మహిళా సంగాలు', 'గుతుపల సంగం' ఏర్పాటయ్యాయి.

## స్త్రీల చైతన్యం

ఊరూరా పంచాయితీ కూటమి నేర్పరిచింది. రాత్రి పాఠశాలలెనో

రాణింపజేసింది. రైతుకూలి మహిళా సంఘాలను నిర్మించింది.[27]

స్త్రీలలోని అజ్ఞానాన్ని పోగొట్టి వారిని సంగం కార్యక్రమాల్లో దింపడానికి ప్రయత్నాలు జరిగాయి. వెట్టిచాకిరి మొదలైనవి రద్దు కావడంవల్ల శ్రమజీవులలో చాలా ఉత్సాహం పెరిగింది. వెట్టి రద్దు కావడంవల్ల వారికి కొంత సమయం దొరికింది. మహిళా సంఘాలు ప్రత్యేకంగా ఏర్పాటు కాకున్నప్పటికీ స్త్రీలలో చైతన్యం కలిగించేందుకు కొన్ని ప్రయత్నాలు జరిగాయి. అందులో భాగంగానే "మహిళలంత మహిళ సంఘమందు చేరాలీ/బానిసత్వ మంతరింప పాటుపడాలి-చెల్లీ-బాగుపడాలి" అని ప్రబోధించారు.

ఆంధ్ర మహాసభ నాయకత్వంలో పురుషులవలె స్త్రీలు ముందుకు రాలేదు.[28] సంఘం గ్రామాల్లోకి రావడంతో స్త్రీలపాత్ర ఎక్కువగా లేదు. వచ్చిన తరువాత తక్కువగానే పాల్గొన్నారు. వెట్టిచాకిరికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో స్త్రీలు పురుషులతో సమానంగా వచ్చారు.

ఎన్నో ఏళ్లుగా స్త్రీలను నానాహింసలకు, దౌర్జన్యాలకు గురిచేసిన భూస్వాములను ప్రతిఘటించే క్రమంలో కొన్నిచోట్ల స్త్రీలు వెల్లువలా కలిసివచ్చారు. ఆ దశలో ఆనాటి తెలంగాణా భౌతికావసరాల వల్ల మాత్రమే కలిసి రావడం జగిగింది. అంతేగాని ఆంధ్ర ప్రాంతంలో లాగే పాటలద్వారా, ప్రత్యేకమైన కార్యక్రమాల ద్వారా స్త్రీలను ఒక సంఘటిత శక్తిగా మలచలేదు, మహిళా సంఘాల ఏర్పాటుకూడా ఎక్కువగా జరగలేదు. ఐనప్పటికీ మొదటిసారిగా ధర్మారం లంబాడీలు పురుషులతో సమానంగా దొరల గూండాలను తరిమికొట్టి, పోలీసులను ఎదిరించి తమ భూమిని కాపాడుకున్నారు. ఎన్నో పోరాటాల్లో స్త్రీలు తమ పాత్రని అమోఘంగా నిర్వహించారు.

వారు ఎదుర్కొన్న ప్రతిఘటనలూ, దౌర్జన్యాలూ నవలల్లో, కథల్లో ప్రముఖ సంఘటనలుగా[29] రాయడానికి చాలాకాలం పట్టింది. కాని ప్రజల పాటలకు అంత వ్యవధి అక్కరలేకుండా వెనువెంటనే వీరోచితకృత్యాలు పాటలుగా మారి ప్రచారం పొందాయి. పోరాటానికి స్ఫూర్తినిచ్చాయి. అయితే ఇలాంటి పాటలు తమకు తామే కట్టుకున్నారు పాడుకున్నారు.

## నూతన చైతన్యం-సాహిత్య కళారూపాలు

తెలంగాణాలో మితవాద నాయకత్వం జరిపిన సాంస్కృతికోద్యమంలో ప్రజా సంస్కృతికి చేసిన సేవ ఏ మాత్రం లేదు. పైగా భూస్వామ్య విధానానికి తమ సానుభూతినీ, మద్దతును ఇచ్చారు. ఆ పరిధిలోకి చేరిన సాంస్కృతిక సమస్యలనే చేపట్టారు. నైజాం వ్యతిరేక భావనని ఎక్కువగా కనిపించనివ్వకుండా జాగ్రత్తపడ్డారు. ప్రజా

సంస్కృతికోసం దోహదపడే రాజకీయాలను సంస్థానంలో అభివృద్ధిపరచలేదు.

ప్రజాబలం లేని నాయకత్వం ఆంధ్రమహాసభలో చేసిన తీర్మానాలను ప్రభుత్వం ఏమాత్రం గుర్తించలేదు. పైగా పెడచెవిని పెట్టింది. మధ్యయుగాలనాటి వెట్టిచాకిరిని రద్దు చేయలేకపోయింది. కానీ ఆంధ్రమహాసభలకు ప్రజోద్యమ స్వభావం వచ్చిన కొద్దిరోజులకే ప్రభుత్వం వెట్టిచాకిరిని, పంతులను నిషేధించింది. ప్రభుత్వ ఆజ్ఞల్లాగే ఇది కాగితాలమీదే ఉండిపోయింది. కానీ ప్రజలే దీన్ని పోరాటం ద్వారా రద్దు చేసుకున్నారు. ఈ విధంగా ఎన్నో సమస్యలను ఐక్య ఆచరణాత్మక కృషి ద్వారా రద్దు చేసుకోగలిగారు.

కొత్త రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలకు అనుగుణంగా జరిగే ఉద్యమంవల్ల భూస్వామ్య సంస్కృతిలో మెల్లమెల్లగా మార్పు వచ్చింది. అంటే భూస్వామ్యానికి పట్టుగొమ్మ ఐన నైజాం ప్రభుత్వ పతనానికి మార్గం ఏర్పడింది. తెలంగాణాలో భూస్వామ్యం దౌర్జన్య విధానాలతో కొనసాగుతూనే ఉంది. కాని అది అప్పటికే బలహీనమైపోయింది.

ఈ పాత భూస్వామ్య ఆర్థిక, రాజకీయ సంస్కృతీ రూపాలకు, విదేశీ సామ్రాజ్యవాద ఆర్థిక, రాజకీయ సంస్కృతులు కలిసి ఏర్పడిన వర్గాలకు వ్యతిరేకంగా ప్రజాశక్తుల సమీకరణ జరిగింది. పై రెండు వర్గాలలో భూస్వామ్య వర్గమే అన్ని రంగాలలోను ప్రధానపాత్ర వహించింది. తెలంగాణాలోని భూస్వామ్య ఆర్థిక రాజకీయ సంస్కృతులకు వ్యతిరేకంగా ప్రజాశక్తులు పనిచేయ ప్రారంభించాయి.

భారతదేశంలో ఆంగ్లేయ సామ్రాజ్యవాదులు కాలు నిలదొక్కుకోవాలంటే భూస్వామ్య వర్గాల బలంతో నిలబడిన సంస్థానాధీశుల అండ ఉండాలి. ఈ సంస్థానాధీశులకు సామ్రాజ్యవాదుల చేయూత కావాలి. కాబట్టి ప్రజాశక్తులకు ప్రధాన శత్రువు భూస్వామ్య విధానమే. ఎందుకంటే ఇది ప్రజలను అనుక్షణం అణగదొక్కాలని ప్రయత్నించింది.

ఈ క్రమంలో కొంతమంది మితవాదులు పాఠశాలల స్థాపననీ, గ్రంథాలయ స్వాతంత్ర్యోద్యమాన్ని సైతం వ్యతిరేకించారు. పైగా అణచివేయడానికి నానా రకాల ప్రయత్నాలు చేశారు.[30]

రెండవ ప్రపంచ యుద్ధంలో ప్రజాశక్తులకు విజయం కల్గింది. ఈ నేపథ్యంలో భాగమైన నూతన ప్రజాస్వామిక భావాలతో తెలంగాణాలోని ప్రజాశక్తులు ముందుకు నడిచాయి. అభివృద్ధి పథం వైపు నడిపించే రైతాంగ, శ్రమజీవుల వర్గం చైతన్యవంతమైన క్రమంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన అణిగిపోతున్న ప్రజా సాహిత్య

సంస్కృతులకు బలం చేకూరింది. ఈ కొత్త పరిస్థితిలో ఆంగ్లేయులకు, భూస్వాము లకు వ్యతిరేకంగా అది తన వేళ్ళు పాతుకొని విస్తరించింది. పాత భూస్వామ్య విధా నాలను ప్రజలే నిరాకరించి, రద్దు చేశారు. ప్రజలతో కూడిన పార్టీ నాయకత్వం రూపొందించిన విధానాలను, కార్యాచరణను అమలు చేశారు. ఈ విధంగా కొత్త సంస్కృతి ఏర్పడింది. ఇది ఆనాటి సాహిత్య కళారూపాల్లో స్పష్టంగా కనిపించింది. దీన్నే నూతన ప్రజాస్వామిక సంస్కృతి అనవచ్చు.

## వైజ్ఞానిక దళాల ఏర్పాటు

సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంలో భాగంగా, స్వాతంత్ర్య పోరాటంలో ఒక మలుపుగా ప్రజలకోసం కళలను తీర్చిదిద్దడానికి అఖిల భారత ప్రజానాట్యమండలి ఏర్పడింది.[31] అందులో భాగంగా కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలు ఎక్కువగా జరుపుతున్న ఆంధ్ర పార్టీ తన కళాకారులతో ఆంధ్ర ప్రజానాట్యమండలిని ఏర్పాటు చేసింది. ఆంధ్ర ప్రాంతంలో ఫాసిస్టు వ్యతిరేకోద్యమం ప్రబలంగా నాటుకొంది. అందుకే మొదటిసారిగా కళారూపాలను ఆ అవసరానికి ఉపయోగపడేట్టుగా తయారు చేశారు. అంతేగాని దేశ ప్రజలను వర్గపోరాటానికి సిద్ధం చేసే ప్రధాన లక్ష్యంతో కళా రూపాలను తయారుచేయలేదు. పార్టీ చేపట్టిన ఆయా ఉద్యమాలకు అనుగుణంగా కళారూపాల సృజన జరిగింది. ఈ కళాకారులలో ఎక్కువగా మధ్యతరగతి కుటుంబా లకు చెందినవారే ఉన్నారు. ఈ ప్రదర్శనలు ప్రజలను ప్రేక్షకులుగానే ఉంచాయి. ఈ కళారూపాలను మంచి నేర్పుతో, శిక్షణ పొందిన కళాకారులు నిర్వహించేవారు. ఈ కళాకారుల బృందాలను వైజ్ఞానిక దళాలుగా వ్యవహరించేవారు. ఈ దళాలకు ఆంగ్లేయ ప్రభుత్వం ఎలాంటి అడ్డంకులు పెట్టలేదు. చట్టబద్ధంగానే ఈ ప్రదర్శనలు జరిగేవి. చాలా రకాలయిన కళారూపాలను తీసుకొని ఎంతో వైవిధ్యంతో ప్రదర్శనలు ఇచ్చారు.

తెలంగాణాలో కమ్యూనిస్టుపార్టి పని చేయడం మొదలుపెట్టి నప్పటి నుండి తమదంటూ ఒక రచయితలసంఘాన్ని, సాంస్కృతికసంస్థలను ఏర్పాటుచేసుకోలేదు. ఖమ్మం మహాసభల వరకు పాటలే ప్రధానంగా వెలువడ్డాయి. ఆంధ్రమహాసభలు 'సంగం' గా మారిన తర్వాత ప్రజలు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. ప్రజలకు సభల వివరాలుతెలియజెప్పడం అప్పుడు అవసరమైంది.

ఖమ్మం సభలో ఎక్కువగా సాంస్కృతిక ప్రదర్శనలు చోటుచేసుకున్నాయి. ఆంధ్రప్రాంతం నుండి ఎంతోమంది కార్యకర్తలు హాజరయ్యారు. సభానంతరం రోజూ సాంస్కృతిక ప్రదర్శనలు జరిగేవి. కార్యకర్తల సమావేశంలో కళారూపాల

ప్రదర్శన, చర్చలు జరిగేవి. ఆ మహాసభ వేసిన మూడోకరపత్రంలో భారత, చైనా సోవియటు చిత్రప్రదర్శన, బుర్రకథలు, నాటకాలు, నాట్యం మొదలైన వైజ్ఞానిక ప్రదర్శనలు ఉంటాయని ప్రకటించారు. (చూ. అనుబంధం).

ఆ సభల్లోనే హుజూర్‌నగర్ తాలూకానుండి వెళ్ళిన రామాంజనేయులు ఆధ్వర్యంలో 'వెట్టిచాకిరి' నాటిక ప్రదర్శించారు[32]. బహుశా తెలంగాణాలో ఇదే మొదటి కళారూపం కావచ్చు. ఇలాంటి కళారూపాలను మధ్యతరగతి నుండి వచ్చిన కళాకారులు, సంఘం నాయకులు తయారు చేశారు. ఈ కాలంలో ఇంకా ఎలాంటి కళారూపాలు వచ్చాయో తెలియదు.

ఈ వెట్టిచాకిరి నాటికను జిల్లా నాయకులైన దొడ్డా నర్సయ్య మొదలైన కార్యకర్తలు ప్రదర్శించారు. నాటికలోని విషయం పరిచితమైనదే కనుక అప్పటికప్పుడు (**Extempore**) అవసరాన్నిబట్టి సన్నివేశాలను, సంభాషణలను చేర్చారు. నాటిక ప్రదర్శనలో ఎలాంటి అలంకరణ (మేకప్) లేదు. ఖమ్మం ఆంధ్రమహాసభలో వైజ్ఞానిక ప్రదర్శనలు డా॥రాజారావు నిర్వహించారు. నాటకాలను, కళారూపాలను మొదట ప్రతినిధుల సమావేశంలో చూసిన తర్వాత ఎన్నిక చేసేవారు. వెట్టిచాకిరి లాంటి నాటికలు జిల్లా నాయకులు ప్రదర్శించినప్పటికీ సభలో వేయడానికి అనుమతి లభించలేదు. ఇక ప్రజలు తమకు తాము తయారుచేసుకున్న కళారూపాల ప్రదర్శన అక్కడ సాధ్యంకాలేదు. ప్రజాకళారూపాలు సభల్లో ప్రదర్శనయోగ్యంగా ఉండవని నిర్వాహకులు భావించారు.

ఆంధ్ర ప్రజానాట్యమండలి ప్రదర్శనలు సాధారణ ప్రజలందరికీ వర్తించేవిధంగా ఉన్నాయి. తెలంగాణా నుండి వెళ్ళిన కళాకారులు ఎక్కువగా ప్రాంతీయ, స్థానిక సమస్యలను తీసుకువెళ్ళారు. పోరాటం ప్రారంభానికి ముందు జిల్లా నాయకత్వం అరుదిచిని బట్టి వైజ్ఞానిక కళా ప్రదర్శనలు జరిగేవి. జిల్లాకేంద్రం నుండి తాలూకా స్థాయికి సంగం ప్రచారం కాజొచ్చినప్పుడు కొన్నిచోట్ల సంగనాయకులే ప్రత్యేకంగా కళారూపాలను తయారు చేసుకొన్నారు. సూర్యాపేటలో దొరికిన కొన్ని వివరాలను బట్టి సాంస్కృతిక, వైజ్ఞానిక ప్రదర్శనల గురించి కొంత చర్చించడానికి అవకాశం లభించింది.

## సూర్యాపేట వైజ్ఞానికదళం

సూర్యాపేటలో మొదటి నుండి వర్తక సంఘం చురుగ్గా కార్యక్రమాలను నిర్వహించింది. ఆంధ్రమహాసభ నల్లగొండ జిల్లా కమిటీ కార్యాలయం నల్లగొండలో కాకుండ సూర్యాపేటలోనే ఏర్పాటుచేశారు, ఆ సభలకు వెళ్ళిన జిల్లా నాయకులను స్థానిక వర్తక గుమాస్తాల సంఘం తమ వార్షిక సభకు ఆహ్వానించారు. ఆ సభలో

సాంస్కృతిక కార్యక్రమాలు జరిపే ఆనవాయితీ ఉండేది. ఆ సభకు హాజరైనవారిలో తిరునగరి రామాంజనేయులు కూడా ఉన్నారు. ఇదివరకే సంఘం పాటలు పాడే గాయకునిగా ప్రజలకు చిరపరిచితుడు. ఒక గాయకుడు ఆ సభలో శాస్త్రీయ సంగీతాన్ని ఆలపిస్తున్న సమయంలో ప్రజలు తిరునగరి పాటలు పాడాలని కోరారు. ఆ కోరిక మేరకు ఆ గాయకుడు తన గాత్రాన్ని ఆపి, తిరునగరిని పాడమని కోరారు. ఆయన తనకు వచ్చిన నాలుగు 'సంగం' పాటలు పాడారు. ప్రజలు ఇంకా పాడమని ఉత్సాహంగా కోరారు కాని తిరునగరికి అంతకన్నా ఎక్కువ పాటలు రావు. అందుకే ఆయనకి వెంటనే కొత్తపాటలు కట్టుకోవలసిన అవసరం ఏర్పడింది.

వారికి హరికథతో కొద్దిగా పరిచయం ఉండటం వల్ల తాలూకా నాయకులైన వెదిరె రాజారెడ్డి హరికథచెప్పమని సూచించారు. అదివిని ప్రజలు చప్పట్లు కొట్టారు. ఇక హరికథ చెప్పక తప్పలేదు. ఖద్దరు లాల్చీ, పైజామా, గాంధీ టోపీ ఇవే అప్పటి దుస్తులు. కండువాని నడుంకి బిగించి ఎవరో అందించిన చిటికలు అందుకొని అమాంతంగా హరిదాసుగా మారిపోయారు. ప్రజల అభిరుచి తెలిసిపోయింది. అందుకే 'కష్టజీవి' బుర్రకథని హరికథగా అప్పటికప్పుడు మార్చి చెప్పారు.

బుర్రకథకి ఇద్దరు వంతలు కావాలి. హరికథను ఒక్కరే చెప్పవచ్చును. ఒకే వ్యక్తి అనేక పాత్రలుగా మారిపోతాడు. కథ, గానం, నటన ఇవి ప్రధానంగా ఉంటాయి. బుర్రకథలోని వంతలు ప్రశ్నించడం ద్వారా కథ పెరిగుతుంది. హరికథలో వంతల ప్రశ్నను తానేవేస్తూ తానే జవాబు చెబుతాడు. ఐతే చక్కటి లయ జ్ఞానంగల తిరునగరి బుర్రకథలోని కొన్ని దృశ్యాలను హరికథలోనికి అప్పటికప్పుడు మార్చి వేశారు. కథావిషయాన్ని హరికథ పద్ధతిలో మిశ్రమంచేసి చెప్పారు.

'కష్టజీవి' బుర్రకథలో జమిందార్ల దౌర్జన్యాలు భరించలేక ప్రజలు ప్రఘతిటిస్తారు. జమిందారు పట్నం పారిపోతాడు. ఈ కథలో విషయమే హరికథ రూపంలో ప్రజలు వినడానికి ప్రధానకారణం. కాగా కథాపద్ధతికి అనుగుణంగా చక్కగా పాడి ఆడగల నేర్పు మరో కారణమైంది.

ఈ విధంగా మత ప్రచారం కోసం వినియోగపడే భూస్వామ్య కళారూపం ప్రజల అవసరం కోసం ఒక కొత్తరూపం ఎత్తింది. ఐతే ఆనాడు రైతాంగ శ్రమజీవులు ప్రేక్షకులు కారు. సూర్యాపేట తాలూకా కేంద్రంలో ఈ సాంస్కృతిక అభిరుచి మధ్య తరగతివారికే ఎక్కువ. వీరి కోసం మాత్రమే కష్టజీవి హరికథగా మారింది.

అయితే ఆ సంఘటనతో ఈ హరికథా రూపం మరుగున పడిపోలేదు. ఇంకా ఎక్కువగా ప్రజల అభిమానం చూరగొన్నది.

దసరా సందర్భంగా సూర్యాపేటలో తొమ్మిది రోజులు దేవీనవరాత్రి ఉత్సవాలు జరుపుతారు. ప్రతిరోజు ఒక సాంస్కృతిక కార్యక్రమం ఉంటుంది. గాత్ర సంగీతమో, హరికథో ఏదో ఒక కార్యక్రమాన్ని పెద్దపెద్ద పండితులతో ఏర్పాటు చేసేవారు. ఈ ఉత్సవాల్లో కష్టజీవి హరికథ కూడా చేరిపోయింది. మిగిలిన పండితులను సన్మానించి నట్లుగానే రామాంజనేయులుని కుడా సన్మానించారు. అంటే భూస్వామ్య కళారూపాలతో కష్టజీవి హరికథ పోటీపడింది.

ఏది ఏమైనప్పటికి భూస్వామ్య కళారూపంలోకి ప్రజల వస్తువు చేరడంవల్ల ఆ కళారూపానికి ప్రజల ఆదరణ లభించింది. మిగితా పౌరాణిక హరికథల కన్నా ఈ హరికథను వినేందుకు ప్రజలు అత్యధిక సంఖ్యలో హాజరయ్యారు. ఈ కథకుని మీద సంప్రదాయ పౌరాణికులు కన్నెర్రచేయడం జరిగిందే కాని అసలు కారణాన్ని వాళ్ళు గుర్తించలేకపోయారు. ఆ కాలంలో కథని అలా ప్రచారం చేయడం తప్పని సరైది. సంగం సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించలేని గ్రామాలలో ఈవేదికను ఉప యోగించుకున్నారు. దొరల గుండాలు, అధికారం ఎక్కువగా లేని గ్రామాల్లో కష్టజీవి బుర్రకథగానే చెప్పారు.

జిల్లా నాయకులు గ్రామాల్లో ఎక్కువగా పర్యటించిన సందర్భాల్లో వివిధ రాజకీయాలను ప్రచారం చేయవలసిన అవసరం ఏర్పడింది. అటువంటి సమయంలో జిల్లాలో వైజ్ఞానిక దళాల అవసరం ఏర్పడింది, జిల్లా కేంద్రాలలోనూ, తాలూకా స్థాయిలోను వైజ్ఞానిక దళాల ఏర్పాటు చెదురుమదురుగా జరిగింది. సూర్యాపేటలో మాత్రం చాలా మంది కళాకారులు కలిసి వైజ్ఞానిక దళంగా ఏర్పడ్డారు. కమ్యూనిస్టులు కాని నరసింహారావు, కవీ,సంగీత కారుడు డా॥ అలువాల వెంకయ్య, కథా రచయిత ఆవుల పిచ్చయ్య, గాయకుడు, బుర్రకథానాయకుడు వోరుగంటి రంగయ్య మొదలైన వారు ఒక వేధిక మీద చేరారు, వీరిలో చాలమంది రచనలు హైదరాబాదు నుండి వెలువడే 'మిజాన్' పత్రికలో ప్రచురితమయ్యాయి. కానివైజ్ఞానికదళం ఏర్పడిన తరువాత ప్రజలలోనే మౌఖిక ప్రచారం జరిగింది. మొదట ఈ కవులు ఎక్కువగా డ్రామా, సినిమా బాణీల్లో పాటలు రాశారు. ఈ తర్వాత జిల్లా నాయకుల సలహాలతో ప్రజల పాటల బాణీలు తీసుకొన్నారు. ఈ నాయకులు ప్రజల భాషగురించి, పాటలు వుండవలసిన తీరు గురించి చెప్పేవారు.

వివిధ ప్రాంతాల్లో బుర్రకథలు చెప్పే దళాలు తయారయ్యాయి. ఈ దళాలు తాలూకా స్థాయిలో కథలు చెప్పేవి స్థానిక కళాకారులు పాటలు పాడేవారు. ఈ విషయాన్ని, ఆళ్వారుస్వామి తమ 'గంగు' నవలలో రాశారు. రామన్నపేటలో జరిగిన సభల్లో ఉపన్యాసాలే కాకుండ పాటలు, పద్యాలు చదివారనీ అవి ప్రజలను చైతన్య

వంతులను చేసేవిగా ఉన్నాయని రాశారు. ఈ దళాలకు ప్రజలు విరాళాలు వసూలు చేసి ఆర్థిక సహాయం అందించేవారు.

మరోవైపు స్థానిక సమస్యలను జోడించి ప్రజలు తమకు అనువైన రూపంలో పాటలను కళారూపాలను కట్టుకున్నారు. అలాంటి వారిలో తోట్ల మల్సూరు, అడ్లూరి అయోధ్యరామకవి, సుద్దాల హనుమంతు, రాజారాం మొదలైన వారు కార్యకర్తలుగా పనిచేస్తూ సాంస్కృతిక దళాలను ఏర్పాటు చేసుకున్నారు.

నైజాం ప్రభుత్వం ప్రజా ఉద్యమాలను అణచివేయడానికి తీవ్ర నిర్బంధాలను అమలులో పెట్టింది. దొంగకేసులు పెట్టి జైలుకు పంపింది. అప్పుడు ఈ కళాకారులు ప్రభుత్వ వ్యతిరేక చర్యలను ప్రచారం చేశారు. కథలను ప్రదర్శించడంకన్న పాటలలోనే ఈ ప్రచారం ఎక్కువగా కొనసాగింది. ప్రదర్శనల ద్వారా కాక పాటల ద్వారా ప్రచారం ఎక్కువైంది. నాయకులు రహస్యంగా దాక్కున్న దశలో ఆ నాయకుల భావాలను ప్రజల పాటల్లో వినిపించారు. స్థానికంగా చిరపరిచితమైన కళారూపాల్లో ఈ ప్రచారం ప్రారంభమైంది. ప్రభుత్వం పోలీసులతో ప్రజల మీద దాడికి సిద్ధమైనపుడు ప్రజలు తమ ఆస్తులను, ఆడవారినీ కాపాడుకోవడానికి సిద్ధమయ్యారు. కార్యకర్తలతో సహా కళాకారులు సైతం రహస్య జీవితంలోకి వెళ్ళడానికి తయారయ్యారు.

ఆంధ్రమహాసభలు కలిగించిన చైతన్యం వల్ల తెలంగాణా మొత్తం మీద జరిగిన బేదఖలీ పోరాటాల్లో అన్ని జాతుల, కులాలవారు కలిసివచ్చారు. ముఖ్యంగా ఎన్నో ఏళ్ళనుండి అణగదొక్కబడిన రైతాంగ స్త్రీలు ఎక్కువ చొరవ, ధైర్యంతో ముందుకు వచ్చారు, ఆ తరువాత ఈ కారణంగా పోలీసు, దొరలు వారిపై దౌర్జన్యాలు జరిపారు. ఐనప్పటికి పాలకుర్తి ఐలమ్మ లాంటి వారి ధైర్యసాహసాలు చూసి ఉత్సాహం తెచ్చుకున్నారు. ఈ కాలంలో సంగం వారికి చేయూతగా నిలబడింది.

లోగడ భక్తి పాటలు, వ్రత కథలు పాడుకునే స్త్రీలు నాట్లు, కలుపు కోతల్లో ఐలమ్మ మీద, సంగం మీద పాడుకోవడం ప్రారంభించారు. ఈ పాటలు పాత పాటల కన్న ఉత్సాహంగానూ, ప్రేరణ కలిగించేవిగానూ ఉన్నాయి. ఈ కొత్త పాటల వల్ల పని వేగం కూడా పెరిగింది. ఈ క్రమంలో పాట పనికీ, పోరాడటానికి ఏకకాలంలో పనిచేసింది.

వ్యవసాయం పనుల్లో పురుషుడికి సంగం పని తోడ్పడినట్లే స్త్రీలు పోరాటంలో పురుషులతోపాటుగా కలిసివచ్చారు. స్త్రీలు రాళ్ళందిస్తే పురుషులు వడిసెళ్ళతో కొట్టారు. సంగం వేదికల మీద, ఇతర కార్యక్రమాల్లో పురుషులు పాటలు పాడితే వ్యవసాయపు పనుల్లో, విరామకాలంలో (చుట్టకాముడు మొదలైన) పాటలను జీవితంలో ఒక భాగంగా

చేసుకొని పాడుకొన్నారు.

కొమరయ్య మరణంతో ప్రజల పాటలు ఊపునందుకున్నాయి. పోరాటంలాగే పాటకూడా వారి జీవితంలో ఒక భాగంగా మారిపోయింది. సంగం అనే దృక్పథం రైతాంగానికి కొత్తది. ప్రజల మధ్య ఐకమత్యం అవసరమై 'నేను' పోయి 'మనం' వచ్చింది. వస్తురీత్యా వ్యక్తిగతాలైన పాతపాటల్లో సమిష్టిభావం చేరడంతో అవి ప్రజల పాటలైనాయి. లోగడ దేవుని, దివ్యపురుషుని స్థానంలో 'సంగం' వచ్చింది. ఆ సంగాన్ని నడిపే ప్రధాన నాయకులు వచ్చారు. ఆ నాయకుల 'బోధనలు' పాటల్లో కెక్కాయి. పాటరూపంలో ఎక్కువగా మార్పురాలేదు. లోగడ వయ్యక్తిక వ్యక్తీకరణకి పరిమితమైన పాట సామూహిక ప్రచారానికి అంకితమైంది.

ఈ పాటలు మొదటిసారిగా భూస్వామ్య స్వభావాన్ని, నైజాం ప్రభుత్వ స్వభావాన్ని బట్టబయలు చేశాయి. అందిన ఆయుధంతో ఆత్మరక్షణ చేసుకొన్నట్లుగానే తమ రోజువారి శ్రమ వ్యవహారంలో పాటని ఆయుధంగా చేసుకొన్నారు. తనకుతాను, తమలోతాము ధైర్యాన్ని కూడగట్టుకోవడానికి, దౌర్జన్యాలను ప్రతిఘటించడానికి, పోరాడటానికి పాట ఒక సాధనమైంది.

ఈ దశలో పోరాట పాటలకు బీజం పడింది. వాటి స్వరూప స్వభావం ఆ తరువాత విస్పష్టంగా వికసించింది. అప్పటినుండి ప్రజల పాటలు పరాయీకరణ చెందడం తగ్గిపోయింది. భూస్వామ్య భావజాలంతో వచ్చిన పాటలు వినడం, పాడటం తగ్గిపోయింది. సంప్రదాయ సిద్ధమైన ఉర్సులు హిందూ, ముస్లిం 'శ్రమజీవుల' వేదికగా మారిపోయాయి. ఈ ఉర్సులు పార్టీ వేదికలయ్యాయి. ఈ విధంగా నూతన ప్రజాస్వామిక సంస్కృతికి బీజాలుపడ్డాయి. దీనికి అనుబంధంగా పాటలు, సాహిత్యం వెలువడింది.

## పాదసూచికలు

1. నల్లగొండలాగే వరంగల్లు జిల్లాలో కూడా భూస్వాములు రైతాంగాన్ని పట్టి పీడించేవారు. ఆంధ్రమహాసభ నాయకత్వం కింద ప్రజలు ఏకమై ఎన్నో విజయాలు సాధించారు. భూస్వామ్య విధానం నడిచిన గ్రామాల్లో రైతుల విజయచిహ్నంగా ఎర్రజెండాలు కదిలాయి. 1930 ప్రాంతంలోనే మధిర తాలూకాలోని కాఖ్యారి రాజేశ్వరరావు పెట్టే బాధలను భరించలేక ప్రజలు అతన్ని చంపేశారు.

పెరవెల్లి వెంకటరమణయ్య, 1946, వరంగల్ జిల్లా రైతు పోరాటాలు, ప్రజాశక్తి, బెజవాడ, పే 2.

వివరాలకు చూ. చౌడవరపు విశ్వనాథం, బి. మోహన్‌రెడ్డి, 1976, "జనగామ తాలూకా ప్రజల స్వాతంత్ర పోరాటాల వివిధఘట్టాలు "స్వాతంత్ర్య పోరాటంలో వరంగల్ జిల్లా."

2. సొంత సేకరణ.

3. సొంత సేకరణ.

4. కడవెండి లో కొండలరెడ్డి, దేవరుప్పలలో కే. శే. రాజారాం 2వ ఇంటర్వ్యూలో చెప్పారు. వివరాలకు స్వాతంత్ర్య పోరాటంలో వరంగల్ జిల్లా, 1976, పే. 74

5. ఈ గ్రామం జనగామ తాలూకాలోని చేర్యాలకు దగ్గరలో ఉంది. ఆంధ్ర మహాసభ చైతన్యంతో సంగం పేరుతో కాకుండా ఒక భజన సంఘం ఏర్పాటు చేసుకొని, దాని నీడన పోలీసు, పటేలు మొ॥ వారి దౌర్జన్యాలను ఎదిరించడానికి పూనుకొన్నారు. ఈ భజన సంఘం ఒక పాఠశాలను కూడా నడిపింది. 1946 జనవరిలో పోలీసులు ఎన్నో అరాచకాలు జరిపారు. ఊరిదొరలు మాఫీ ఐన లేవీ ధాన్యాన్ని మళ్ళీ వసూలు చేయడం ప్రారంభించారు. పోలీసులు నిద్ర పోతున్న స్త్రీలను చెరిచారు. సామూహిక మానభంగాలు జరిగాయి.

6. మాచిరెడ్డిపల్లి బీదరు తాలూకాలోని కోహీరు రైల్వేస్టేషన్ దగ్గర ఉంది. ప్రతి ఎకరానికి 1 మణుగు లెవీ, 10 శేర్లు రబ్బీ ఖుష్ ఖరీది (volantary purchase) ఇవ్వాలన్నారు. మళ్ళీ వెంటనే దాన్ని మార్చి 20 శేర్లు ఖుష్ ఖరీదు ఇవ్వాలన్నారు. ఈ విధంగా ఎప్పటికప్పుడు తన ఇష్టం వచ్చినంత లేవీని వేస్తూ వసూలు చేస్తూపోయారు. ఇది భరించలేక స్త్రీ పురుషులంతా కలిసి అన్ని దౌర్జన్యాలకు కారకులైన అంచగొండి తహసీల్దారుకు దేహశుద్ధి చేశారు. ఆయన తాలూకా ఆఫీసుకువెళ్ళి పోలీసులను తీసుకొని మార్చి 1946 న వచ్చాడు. పోలీసులు ఎనిమిది మంది స్త్రీలను చెరిచారు. 16 మందిని అరెస్టు చేశారు. మాచిరెడ్డిపల్లి సంఘటనల మీద నిజ నిరూపణ కమిటీలు వేశారు. కానీ మాచిరెడ్డి పల్లి స్త్రీ పురుషుల సమైక్యపోరాటం ప్రజలను ఎంతగానో ఆకట్టుకొంది.

7. తిరునగిరి రామాంజనేయులు, 1972, తెలంగాణా పోరాట గేయాలు విశాలాంధ్ర, పే. 61.

8. కాంచనపల్లి చినవెంకటరామారావు, 1954, "యువరాజు పర్యటన", అరుణ

9. సుంకర సత్యనారాయణ, 1972, మా భూమి, పే. 45.

10. కాళోజి,1967, "చాలింక" నా గొడావ, మిత్రమండలి, పే. 26.
11. సొంతసేకరణ. ఈ పాటలో కొంతభాగం (విరసం) తెలంగాణా పోరాటపాటలు మొదటిభాగం పే. 5. లో ఉంది.
13. వట్టికొండ రామకోటయ్య, 1945, "కరువుపాట" ఆంధ్రగేయాలు, పే.24
14. - పై - పే. 11
15. - పై - పే. 17.
16. సొంతసేకరణ.
17. సంగం అంటే ఏమిటి? అది గ్రామాలలో చేసిన పనేమిటి? ఏ విధంగా చేయ గలిగింది. అనే విషయాల్ని గ్రామస్తుల మాటల్లోనే రచయిత 'ఓనమాలు' నవలలో చిత్రించారు. రచయిత : మహీధర రామమోహన్‌రావు (1956)
18. **Oh, you can't scare me**
**I am shrinking to the Union**
**I am striking to the Union**
**I am striking to the Union**
**Joe Martin**, 1971, **Negro Work Songs P.** 27
19. ఐలమ్మా, ఆమె భర్త, కొడుకులు చాలాకాలంగా సంగంలో పనిచేస్తున్నారు. అదిచూసి ఐలమ్మ స్వాధీనంలోనున్న నాలుగు ఎకరాలలో కష్టపడి పండించిన పంటను దౌర్జన్యంగా స్వాధీనపరచుకోవాలని విసునూరుదొర ప్రయత్నించాడు. 1944 ఏప్రిల్ నెలలో ఆంధ్రమహాసభ కార్యకర్తలు పాలకుర్తి చేరారు. గ్రామ ప్రజలుపంటకోయగా ఈ కార్యకర్తలు దాన్ని ఇంటికి చేర్చారు. పోలీసులు నాయకులను అరెస్టు చేశారు. కేసులు పెట్టారు. ఇవి ఏళ్ళతరబడి నడిచాయి.
20. సర్వాయి పాపడు మొ॥వారు ప్రజల కష్టనష్టాలతో ప్రమేయంలేని వీరోచిత కార్యాలు సలిపారు. వారి ప్రతిఘటనలో ప్రజల సామూహిక పాత్రలేదు. ఏ కొద్దిగా ఉన్నప్పటికి అది ఆ వీరుల సొంతానికే ఉపయోగపడింది. అలాంటి సంఘటనలు జరిగినప్పుడు ప్రజలు ప్రేక్షకులుగానే ఉన్నారు. కాబట్టి వారిమీద పాటలు విన్నపుడు కూడా ఆ పరిధి దాటి వెళ్ళలేదు.
21. మిజాన్, 25-7-1946, "కడవెండి స్థలపురాణం" పే. 3
22. దేవులపల్లి వెకంటేశ్వరరావు, 1945, జనగామ ప్రజల పోరాటం, మే. 9
23. సొంత సేకరణ. రాజారాం రాసిన పాట
24. సొంతసేకరణ

25. సొంతసేకరణ

26. సొంతసేకరణ

27. సుద్దాల హనుమంతు, 1983, "సంగం పాట", సుద్దాల హనుమంతు పాటలు, పే 11.

28. మితవాద నాయకత్వంలో జరిగిన ఆంధ్ర మహాసభలకు అనుబంధంగా మహిళా సభలు జరిగాయి. అధ్యక్షురాండ్రలో చాలామంది అధ్యక్షుల సతీమణులే. వీరు ఎక్కువగా నగర, మధ్యతరగతి స్త్రీల ప్రయోజనాల మేరకే ఆలోచించారు.

29. i. పోలీసులను ఎదుర్కోవడానికి ఆత్మరక్షణ కోసం, కర్రసాము, ఎదురుదాడి పద్ధతులు స్త్రీలు అవలంబించిన రీతిని మహీధర రామమోహనరావు ఓనమాలు (1956) లో వివరించారు.

ii. అమీన్ ముకుందరెడ్డి సూరమ్మ భర్తను పోలీసులకు అప్పగించి ఆమెను బలాత్కరించబోతాడు. ఆమె కేకలేస్తుంది. పదిమంది స్త్రీలు ఒకపెట్టున వచ్చి ఆమెను విడిపించి అమీన్‌ను కట్టేస్తారు. అతని రివాల్వర్ లాక్కుంటారు. మహీధర రామమోహనరావు (1962) 'మృత్యువు నీడల్లో' ఒక సంఘటన.

iii. వాలంటీర్ల కవాతు గురించి రాయడమే కాకుండా, స్త్రీలు కారంముంతలు ఉపయోగించిన పద్ధతి, గర్భిణీస్త్రీలు సైతం దళాల నిర్మాణంలో పాల్గొనడానికి ముందుకు వచ్చిన విషయం బొల్లిముంత శివరామకృష్ణ (1947) మృత్యుంజయులు నవలలో వివరించారు.

iv. రజాకార్ల దాడిని స్త్రీలదళం తిప్పికొట్టిన ఉదంతం లక్ష్మికాంత మోహన్, 1951, సంహగర్జనలో రాశారు

30. కొలనుపాక గ్రామంలో ప్రజానీకం సహకారంతో గ్రంథాలయ భవనం రెండు మాసాల్లో నిర్మించారు. జాగీరు పోలీసులు ఆ భవనాన్ని 1940 లో స్వాధీన పరచుకొని దానికి సీలువేశారు. పాఠశాల భవనం స్వాధీనపరచుకొన్నారు. మరికొంతమంది గ్రామంలో పాఠశాల స్థాపనను వ్యతిరేకించారు. తమ పిల్లలను మాత్రం బయటి గ్రామాలకు పంపి చదువు నేర్పించారు.
ఆరుట్ల రామచంద్రారెడ్డి, 1981, తెలంగాణా పోరాటస్మృతులు, పే. 23

31. **"Art has lost touch with the experiences of the masses and well-wish paid the penality of extrinction. One ther hand**

**the people failed to develop their art and make it an inspiring expression of their struggle for freedom and were, to the extent, hampered in the very development of their struggle."**

**Sudhi pradhan (Ed.)** 1971, **Marxist cultural movement in India. Chronicles and Documents** (1936-47). **P.** 126.

32. స్థూలంగా దీనికథ : రోజ్‌నాంచా (రిపోర్టులు) తీసుకుపోయే గ్రామవెట్టి ప్రతి రోజు అమీనుకు కట్టెలమోపు ఇవ్వాలి. ఇలా ఇవ్వలేనినాడు ఎన్నో బాధలు పెట్టేవాడు. సంగంలో చేరిన తరువాత కట్టెలమోపుకు బదులు తన రొండిలో జాగ్రత్తగా దాచిన చెకుముకి సంచిలో దాచిన సంగం చీటిని చూపుతాడు. వెట్టి వాడు సంఘంలో చేరడమా ? అని అమీన్ ఆశ్చర్యపోతాడు. అప్పటినుండి అతడు వెట్టిచేయడు.

33. సుంకర సత్యనారాయణ, కష్టజీవి. పే. 16

# 5

# నైజాం-భూస్వామ్య వ్యతిరేక పోరాట సాహిత్యం (1946-1948)

మతత్వాన్ని రెచ్చగొట్టి ప్రజా చైతన్యాన్ని అణచాలని చూశారు. తద్వారా దోపిడీ వ్యవస్థను రక్షించుకోగలమనుకున్నారు. కాశీం రజ్వీ ఏర్పాటుచేసిన రజాకార్లు గ్రామాలపైబడి లూటీలు ప్రారంభించారు.

రజాకారు విజృంభణవల్ల అన్ని రకాల ప్రజలు ఒకే వేదికపైకి రాకపోయినప్పటికీ ఒక సాధారణ లక్ష్యంతో పనిచేయడానికి ముందుకు వచ్చారు. కాంగ్రెసు, కమ్యూనిస్టులు, వారి సానుభూతిపరులు తాత్కాలికంగా రాజకీయ విభేదాలు మరచి ఒక్కటయ్యారు. ఒకరు రాసిన పాటలు మరొకరు ప్రచారం చేశారు. కాంగ్రెసువాళ్ళు రాసిన పాటల్లో కమ్యూనిస్టుల సైద్ధాంతిక ప్రభావం చోటుచేసుకొంది. కమ్యూనిస్టేతర కవులు కూడా తెలంగాణా స్వేచ్ఛకోసం తాత్కాలికంగా వారి భావజాలాన్ని పాటలరూపంగా ప్రచారం చేశారు.

మనిషి మనిషీ నడుము కట్టాలి
కట్టి
మన శత్రువును కూలగొట్టాలి
యెర్ర
జెండాలు యింటింట కట్టాలి। అన్న దాశరథి, లోగడ భూమి పోరాటాల్లో చనిపోయిన రైతాంగ వీరులను తలుచుకోవాలని వారు నిలిచి పోరినచోట హిందూ ముస్లింలు ఐకమత్యంతో కలిసి తెలంగాణా సంకెళ్ళు తెంపేయాలని కోరారు. అంతే గాకుండా "ప్రజల రాజ్యమ్ము స్థాపించ వేగమే రావాలి" అని ప్రకటించారు. అప్పటికే

కమ్యూనిస్టులు 'తెలంగాణాలో ప్రజారాజ్యం'[2] అనే నినాదాన్ని ఇచ్చారు. అయితే దాశరథికి "ముక్కోటి ఆంధ్రులను ముక్కలుగా చేసిన తెల్లదొరలను సాగనంపాలి వారి తొత్తు రాజుల తోలివేయాలి"[3] అన్నదే ఈనాటికే ప్రధాన ఆశయం. జాతీయవాద ప్రభావంతో ఉపజాతీయవాద ఉద్యమాన్ని కోరారు. అందుకోసం కమ్యూనిస్ట్ భావ జాలాన్ని మాత్రం ఉపయోగించుకొన్నారు.

నైజామును కాపాడుతామన్న రజాకారులపైకి ముసలమ్మలుకూడా దండెత్తి వస్తారని అదిచూసి నైజాం తారెత్తి పోతాడని భావించారు. "అరుణ పతకాల కట్టగ లేవండీ, గ్రామాల నాక్రమించగ ముందుకురండీ"[4] అన్న పాటలో నైజామును గద్దె దింపడం ప్రధానమైన విషయమైనప్పటికీ గ్రామాలను ఆక్రమించండనడానికి ఉన్న అర్థం వేరే. దొరలను నైజాము తొత్తులుగా భావించారు. ఈ తొత్తుల అధికారాన్ని నిర్మూలించడానికి, ప్రజల అధికారం ఏర్పరచడానికి మాత్రమే గ్రామాలను ఆక్రమిం చాలని చెప్పుకొన్నారు. అందుకోసం మాత్రమే "భేరిని కొడుదాము లెండోయ్ నైజాము/ ఘోరీని కడుదాము రండోయ్" అని పాడుకొన్నారు.

అంతకుముందు స్థానిక పోరాటాలు వేటికవి ప్రాప్తకాలం (Spontaneous) గా వచ్చాయి. కాని నైజాం వ్యతిరేక పోరాటం మాత్రం తెలంగాణా అంతటా ఒక వెల్లువగా వచ్చింది. నైజాం ప్రభుత్వ యంత్రాంగం ప్రారంభించిన సాయుధ దాడిని తిప్పికొట్టా లన్న ప్రజల వాంఛ ముందుకు వచ్చింది. ఏ పార్టీ ప్రమేయం లేకుండానే ప్రజలు తమ చేతికి దొరికిన ఆయుధాలతో ప్రతిఘటనకు సిద్ధపడ్డారు. నిజాం స్థానంలో ప్రజా స్వామిక ప్రభుత్వం ఏర్పాటు కావాలనుకున్నారు.

నిజాం నిరంకుశత్వం
నిర్మూలంబయ్యేదాకా
యెక్కడిదోయ్ శాంతెక్కడిదోయ్!
కమ్యూనిస్టూ కాంగ్రెసంతా
చెయ్యీ చెయ్యీ గల్పారు చెరియొకదారీ పోకుండా
విప్లవరథమే నడపాలి[5] అని భావించారు.

అన్ని రకాల వర్గ ప్రజలూ, భారత ప్రభుత్వమూ, హైదరాబాదు సంస్థానం భారతదేశంలో విలీనం కావాలని కోరాయి. ప్రజాతంత్ర శక్తులన్నీ అందుకు అను గుణంగా ఉద్యమాలు కొనసాగించాయి. ఆంగ్లేయ ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ ముస్లిం భూస్వామ్య పాలన పోవాలని హిందూ భూస్వామ్య వర్గం ఆశించింది.

నైజాం నిరంకుశపాలన అంతమై దాని స్థానంలోనే బాధ్యతాయుత ప్రభుత్వం

ఏర్పడాలని మాత్రమే. సంస్థానంలోని భూస్వామ్య వర్గాలూ, ధనిక రైతాంగం కోరు కున్నాయి.

వెట్టి, దోపిడీ నిర్బంధవసూళ్లు, లెవీ సేకరణ రద్దుచేసుకోవడానికి గ్రామీణ పేదలు 'దున్నేవాడికి భూమి' కావాలని కోరారు. వేతనాలు మెరుగుపడాలని కార్మికులు కోరారు. ఈ కాలంలో నైజామూ, దాని అనుచరవర్గం ప్రజలకు ప్రధాన శత్రువు.

అంటే వివిధ ప్రజావర్గాలమధ్య కొన్ని వైరుధ్యాలున్నాయి. ఈ పరిస్థితిలో శ్రమజీవులూ, మధ్యతరగతి రైతాంగం పునాదిగా నిలిచి నైజాముకు వ్యతిరేకంగా పోరాడాయి. స్థానిక సమస్యలు, వ్యక్తిగత ప్రయోజనాల కారణంగా భూస్వామ్యవర్గం, మధ్యతరగతి రైతులు మరికొన్ని వర్గాలు పోరాటానికి సహకరించాయి.

హింసా భూస్వామ్యవర్గంలో అత్యధిక భాగానికీ, నైజాం వర్గానికీ ఉన్న సంఘర్షణలు రజాకారు దాడి రూపంలో ప్రతిఫలించాయి. ధనిక రైతాంగం అటు రజాకారు ప్రభుత్వదాడిని తట్టుకోవాలి, ఇటు ప్రజలమీద తన భూస్వామ్య అధికారాన్ని నిలబెట్టుకోవాలి. అయితే ప్రజల అండదండలు లేకుండా రజాకారు పీడ వదిలించు కోవడం కష్టం. రజాకారు దాడిని ప్రతిఘటించడంతోపాటు ప్రజలు భూస్వామ్య పెత్తనాన్ని కూడా నిర్మూలించడంకోసం నడుం కడుతున్నారు. ఆ సమయంలో మధ్యతరగతి భూస్వాములకు ఎటు చేరాలో ఒక సమస్య అయింది. అందుకే చాలా కుటుంబాలు దొరల్లాగే గ్రామాలు వదిలిపెట్టాయి. ఇక ఎటూ వచ్చి రంగంలో నిలి చింది అటు రజాకార్లూ ఇటు ప్రజలు. పెద్ద భూస్వాములూ, మరికొన్ని ప్రజా వ్యతిరేక శక్తులు రజాకారు క్యాంపులలో చేరిపోయాయి. అలాంటి సమయంలోనే "ఓ భూస్వాము లారా"[6] అనే పాట వచ్చింది.

మొత్తానికి గ్రామీణ రైతాంగంపై భూస్వామ్య పెత్తనం పట్టుసడలింది. ప్రజలు తమ సమస్యలను తామే చర్చించుకోవడానికి, పరిష్కరించుకోవడానికి అనువైన వాతా వరణం ఏర్పడింది. ఈ క్రమంలో ప్రజా కవులు తమ నెత్తిన రుద్దిన భావజాలాన్ని విదిల్చుకొన్నారు. తత్కాల సమస్యలను తీసుకొని పాటలుగా పాడుకొన్నారు. అంతే కాదు పార్టీ ఇచ్చిన కార్యక్రమాలు సైతం పాటలుగా రూపెత్తాయి.

ఊరూరా తిరిగి కార్యక్రమాన్ని పంచాలి. ప్రజలకు పార్టీ ఆదేశాలు తెలపాలి. ప్రజలను ఆదర్శవంతులను చేయాలి. ప్రజలను అణిచే మిల్టరీని ఎదుర్కోవాలి. అని పార్టీ కార్యక్రమాన్ని ఇచ్చింది. ఈ కార్యక్రమాన్ని అనుసరించి నాయకులు ఉపన్యా సాలు ఇచ్చేవారు. ఆ పద్ధతిలోనే కార్యకర్తలు, కవులూ పాటలు వెలువరించారు.

కర్రా పక్తి లాగెసేయ్
కద్వా గడ్వా కాసేసేయ్
పిర్కి పందలే కాకుండా
అందరొక్కటై యుండాలి
కల్లా కపటం లేకుండా
కట్టు గంతా యుండాలి
చెట్టూ పుట్టా బట్టకా
చేసి ఒక చోటుండాలి
బీదా బిక్కల బెంచుతూ
కల్సి మెల్సి యుండాలి[7]

ఈ విధంగా రాజకీయ కార్యక్రమానికి, రాజకీయ పత్రాలకు గేయరూపమిచ్చారు. అలాంటి పాటలు ఎక్కువగా కార్యకర్తలూ, కేడరు (పార్టీ అధికారికంగా నియమించిన వ్యక్తి) కవులూ రాశారు. వాటిని మళ్ళ సాధారణీకరించి, ప్రజల భాషలోకి తర్జుమా చేసి ఆ పాటలోని భావాన్ని స్థానికంచేసి పాడుకున్నారు.

## స్థానిక సమస్యలు - పాటలు

మొత్తం సంస్థానంలో ప్రజల పోరాటం వినా గత్యంతరం లేదనే భావనకి వచ్చారు. అన్నిరకాల పార్టీలు దెబ్బకుదెబ్బ అనే ఆలోచనకి వచ్చాయి. గ్రామాల్లో పరిస్థితి దారుణంగా మారింది. రజాకార్లు భూస్వాములకు తోడుగా నిలిచారు. పోరాట క్రమంలో ఏర్పాటు చేసుకొన్న గ్రామ కమిటీలను రూపుమాపాలని ప్రయత్నించారు. లేవీ తదితర పన్నులు కట్టడం మానేసిన ప్రజల్ని కేసుల్లో ఇరికించి పోలీసులు డబ్బులు గుంజారు. కనిపించినవారి ఆస్తులనల్లా కొల్లగొట్టారు. కోళ్ళూ, మేకలూ లాక్కున్నారు. అవసరమైనంత ధాన్యాన్ని తీసుకొని మిగతాని కాల్చివేశారు. ఇలాంటి చర్యలు మొత్తం సంస్థానంలో సాధారణమై పోయాయి. తెలంగాణాలో మరీ శ్రుతిమించి రాగాన పడ్డాయి. గ్రామాలకు గ్రామాలే కాలబెట్టి సామూహిక దహనకాండ జరిపారు. "నరలోకపు జాగిలమ్ములు గొలుసు త్రెంచుక"[8] గ్రామాలపై విరుచుకుపడ్డాయి. ఇలాంటి దాడులు ఎన్ని జరిగాయో లెక్కలేదు వీటిని ఎవరూ నమోదు చేసినట్టులేదు. కొన్ని ముఖ్యమైన సంఘటనల్ని రాజకీయ నాయకులు రాసిన పుస్తకాలలో కూడా పేర్కొనలేదు. ఆ దాడులలో వీరోచితంగా మరణించిన వీరుల వివరాలు లెక్క తేలలేదు. అందుకే ఓ కవి-

లెక్కెంతో చెప్తారా
మీరివరంగా చెప్తారా

రఘునాధపెల్లి అడవుల్లో
కాల్చిచంపిన వీరుల
లెక్కెంతో చెప్తారా—అని ప్రశ్నించాడు.

వెలుగులోకి రాని కొన్ని పోరాటాలు, వీరుల స్మరణ ప్రజల పాటల్లో చోటుచేసుకున్నాయి. వీరుల గురించే కాకుండా ప్రజా శత్రువులైన రజాకారు నాయకులమీదా, పోలీసు అధికార్లమీదా పాటలు కట్టుకొన్నారు.

దుష్టులను కసితో, కోపంతో తిట్టుకోవడం ప్రజల పాటల్లో సర్వసామాన్యమైన లక్షణం. విసునూరు రామచంద్రారెడ్డి, అతని తల్లి జానమ్మ, జన్నారెడ్డి, ప్రతాపరెడ్డి మొదలైన దౌర్జన్యపరులమీద ఎన్నో పాటలు కట్టుకోవడం తెలిసిందే.

నైజాం సర్కారోడా
నాజీల మించినోడా
యమబాధలు పెడితివి కొడుకో

నైజాం సర్కారోడా[9] —అని నైజాం మీద ఒక పాట అసన్య ప్రచారంలోకి వచ్చింది. ఈ పాట తెలంగాణా నలుమూలల మారుమోగింది. ఈ పాటకు కొన్ని వందల అనుకరణలు వచ్చాయి. ఇందులో నైజాంకు బదులుగా స్థానికంగా ఉన్న ప్రజా శత్రువులను చేర్చారు.

మోతుకూరి అమీనోడా
మూరేటి గడ్డపోడా
మా పానం తింటివి కొడుకో

మోతుకూరి అమీనోడా—అంటూ సాగే పాటలో నైజాంకు బదులు మోత్కూరు అమీను చేసిన ఘోరకృత్యాలను పాడుకున్నారు. ఆ విధంగా ఒక్కొక్క ఘోరకృత్యాన్ని ప్రత్యేకంగా పాటగా కట్టుకొన్నారు.

అయితే ఇలాంటి పాటలు స్థానికమైనవి కావడంవల్ల సంస్థానంలోని ఇతర ప్రాంతాల్లో ఎక్కువ ప్రచారం కాలేదు. అనుకరణలే కాకుండా ప్రజలు తమకు తోచిన విధంగా వేల సంఖ్యలో పాటలు కట్టుకొన్నారు. అలాంటి వాటిలో జిల్లా, తాలూకా, ఊరిపేరు అన్నీ వివరంగా పొందుపరిచారు.

నైజాం రాష్ట్రమందు సోదరా
నల్లగొండ జిల్లాయందు
తాలూకా భోనగిరి తాహతు ఆలేటిలోన
గుండ గూడెం పటేలు గూడెం ప్రజలంతా

సిద్దెంకి టంగుటూరు ప్రజలంతా
సిద్ధమై నిలిచినారు
జయజయ ధ్వనులతోడ ఈ ప్రజలు
జయభేరి మ్రోగించగా
పాపపు అమీను పైరింగు చేయదలచి
విషపు కుట్రలు పన్నెరా[10]

సిద్దంకి, టంగుటూరు గ్రామ ప్రజలపై కాల్పులు జరిపిన పోలీసు అమీనుపై వచ్చిన పాట ఇది.

ఓరోరి నైజమోడా! ఓరోరి మిలిటిరోడా!
పొంగేల పోతివోరి! కుంగేది సత్యమోరి!
మాదు అక్క చెల్లెళ్ళను! నీచాతి నీచముగాను
నిలబెట్టి చెరిచిరోరి నిక్కంబు చూడరోరి
సీతమ్మపేటవద్ద పన్నెండుమంది నీదు
ఫాసిస్టు మిలిటిరోళ్ళ పంపాము నరకపురికి
పాపంబు పండెనోరి నైజాం మిలిటిరోడా! *

అక్కలను, చెల్లెండను చెరిచినందుకు ప్రజలు సీతమ్మపేట వద్ద పన్నెండుమంది మిలిటరీ వాళ్ళను చంపి ప్రతీకారం తీర్చుకున్నారు. ఇలాంటిదే తెలకపల్లి యాదగిరి పాట. ఈ పాటవల్ల ఒక వీరుని చిరునామా తెలియడమే కాకుండా ప్రజల భావ వ్యక్తీకరణ పద్ధతీ, భాష తెలుస్తున్నది. తొండ్రాయి, మొండ్రాయి, తిరుమలగిరి వద్ద మొండి పోలీసులతో జరిగిన పోరాటాన్ని వర్ణిస్తున్నది. ఆ పోరాటంలో యాదగిరి మొండి గుండెతో బల్‌దండిగా పోరాడట!

కోటపాటి దాడి యాదన్నా
బల్ ఖేషుగా చేసావు యాదన్నా
అందుకో జోహారు యాదన్నా

నీ పేరు నిలబెడతాము యాదన్నా[11] అని పాడుకొన్నారు. జోహారు తెలిపే పాటలవల్ల స్థానిక పోరాటాలే కాకుండా ఆ పోరాటంలో మరణించిన వీరుల గురించి కొన్ని వివరాలు కూడా తెలుస్తున్నాయి.

మంట మండేటి గడ్డివాముల్లో కాళ్లు చేతులు కట్టి విసిరారు. వేలాది మందిని జైళ్ళలో నింపారు. పోలీసు క్యాంపులు ఊళ్ళో చేరాయి. కొన్ని ఊళ్ళకు ఊళ్ళే క్యాంపులుగా మారాయి. ఐనా 'రణ భేరి మ్రోగింది. రావోయి మొనగాడ! అనే పాడుకున్నారు.

ఆంధ్ర వీరులు బాలచంద్రులై లేవాలి
వీరమాంబలు రుద్రమాంబలై రావాలి అని ఓ కవి పాడితే మరోకవి—
ముసలమ్మలు ముసలయ్యలు లేచారు
వారి చేతికందిన కర్ర బడితలే పట్టారు * పాడాడు.

ఈ కాలంలోనే మీర్జా ఇస్మాయిలు (ఆగస్టు 1946-మే 1947) ప్రధాన మంత్రిగా పనిచేశాడు. ఈ కాలంలో జరిగిన దౌర్జన్యాలకు ఇతనే కారణమని తలంచి అందుకు వ్యతిరేకంగా ఎన్నో పాటలు పాడుకున్నారు. ఉదా-

కొండకోనలో ప్రజాకోయిలపిట్ట కూక్రూ మంటుంది
కూత ఘనముగా వేస్తుంది
జయమ్మనాదని మిర్జా ఇస్మైల్ జంబలు దూసింపా
బాకుల్ బల్లెల్ పట్టుకురండి పడేసి కోస్త నంటండూ *

బాలెంల గ్రామంలో సంఘ నాయకుడు మట్టారెడ్డిని, అనంతరెడ్డిని నిద్రిస్తుండగా కాల్చిచంపారు. పోలీసులపై ద్వేషం, నాయకులపట్ల భక్తి పెరిగింది. దహన సమయంలో మట్టారెడ్డి భార్య భర్త పేరుతో చేసిన ప్రతిన తెలంగాణా స్త్రీలలో ఉత్సాహం కలిగించింది. ఈ సంఘటనపై స్త్రీల పాటల బాణీలో చాలా పాటలు వచ్చాయి.

ఈ స్థానిక పాటలలో నిర్దుష్టమైన బాణీ, స్వరూపం ఉండదు. ఐతే ప్రజల భావన మాత్రం ఒకేరీతిగా ఉంటుంది. బాణీకూడా ఆ ప్రాంతానికి పరిమితమై పరిచితమై ఉంటుంది. పదాలు, పాట నిర్మాణం చాలా సులభంగా ఉంటుంది.

అంతేకాదు, ఈ పాటలవల్ల అట్టడుగు ప్రజల పోరాటం పట్ల వారి అభిప్రాయాలు, ఆలోచనలు తెలుస్తాయి. ఈ విధంగా ప్రజల చరిత్రకు ఈ పాటలు సాక్ష్యాధారాలుగా నిలుస్తాయి. నిజానికి ఇలాంటి వెలుగు చూడని సంఘటనలెన్నో ఉన్నాయి. ముందు ముందు ఈ ప్రజల చరిత్ర, స్థానిక పోరాటాల చరిత్ర తవ్వి తీయాల్సిన అవసరం ఉంది.

పైన పేర్కొన్న పాటలలో ఉన్న మోతుబ్బరు అమీను దుర్మార్గాలు, ఊదర బాంబు పాత్ర, సిద్ధంకి, టంగుటూరు ప్రజలపై జరిగిన కాల్పులు, రఘునాధపల్లి కాల్పులు, సీతమ్మపేటలో మానభంగాలు, ఈ మిలిటరీవాళ్ళను చంపడం, పాటతో ప్రజాశత్రువుని నిర్మూలించిన వాస్తవాల వంటి సంఘటనలు వెలుగు చూడలేదు. అట్టడుగు వర్గాలకు సంబంధించిన చరిత్ర తవ్వి తీయడానికి ఇలాంటి పాటలు ఎంతగానో ఉపయోగ పడతాయి. ప్రజలు కట్టుకొన్న పాటల్ని మూలసామగ్రిగా తీసుకొని ప్రజలు నిర్మించు కొన్న చరిత్రను వెలికితీయవలసి ఉంది. అందుకోసం స్త్రీలు, వృద్ధుల పాత్ర కూడా

పరిగణనలోకి తీసుకొని చూడాలి.

## పోరాటంలో వృద్ధులు - పాటలు

ఈ పోరాటంలో పాలుగొనే పసివాళ్ల మొదలు పండు ముసలివాళ్ళ వరకు జీవిత వాస్తవికతను తెలుసుకున్నారు. ప్రత్యక్షంగా పోరాడలేని వృద్ధులు పోరాడేవారికి దీవెనలు ఇవ్వడమే కాకుండా ఎన్నో రకాలుగా తమ జీవితానుభవాలనూ, విజ్ఞానాన్ని అందించారు. పోరాటంలో అరవై ఏళ్ళకు పైబడ్డ ఎంతోమంది. ముసలివారు ప్రాణాల్ని అర్పించారు. అంతేకాదు వందలమంది వీరయోధులను రక్షించారు. ఎన్నో త్యాగాలు చేశారు. పోరాటంలో వృద్ధులు నిర్వహించిన పాత్ర గురించి కొన్ని పాటలు ఆసక్తి కరమైన విషయాల్ని వెల్లడిస్తున్నాయి. పోరాట సమయంలో పాట ఎలాపుట్టిందో దానికి వృద్ధుల దోహదం ఎలాంటిదో ఈ కింది సంఘటన ద్వారా గమనించవచ్చును.

ఒక ఊళ్ళో రజాకార్లకు ఆశ్రయమిచ్చిన దొర గడి మీదకి ప్రజలు దాడి చేశారు. ఆ దాడిలో పిల్లలూ, పెద్దలూ అందరూ కలసికట్టుగా పాల్గొన్నారు. ఒక చిన్న దళం ప్రజలకు మార్గదర్శకత్వం వహించింది. రజాకార్లు ప్రజలపై కాల్పులు సాగించారు.

అయినా ప్రజలు ఎదురు నిలబడి గడి తలుపులను బద్దలు కొట్టారు. కొందరు రజాకార్లూ, గూండాలూ గడిమిద నుండి ప్రజలపై రాళ్ళూ, రప్పలు వేశారు. మరి కొందరు తలుపులకు అడ్డంగా నిలబడి బడితలతో ప్రజలను అడ్డగించారు. వారిని ఎలా ఎదుర్కోవాలో ప్రజలకు పాలుపోలేదు. చేతికర్ర ఆసరాతో అక్కడ నిలబడ్డ ఒక ముసలమ్మ అదిచూసి-

"వెయ్ వెయ్ వేయరదెబ్బ దెబ్బకు దెబ్బ వెయ్ వెయ్" అంటూ ఆవేశంతో తన చేతిలోని కర్రను నేలకు కొట్టింది. ప్రజల చేతులో ఉన్న బడితెలు అవే పదాలను పల్లవిగా అందుకొన్నాయి. ప్రజల్లో ఉత్సాహం పెల్లుబికింది. "వేయ్, వేయ్ దెబ్బకు దెబ్బ" అనేది ఒక నినాదంగా మారి ఆ ప్రాంతమంతా మారుమ్రోగింది. ప్రజల ధైర్య సాహసాలను చూసి దళసభ్యులు కూడా తుపాకులను బడితెలుగా పట్టుకొని గడిలోనికి ప్రవేశించారు.

ఆ దాడిలో ప్రజాకవి సుద్దాల హనుమంతు ప్రత్యక్షంగా పాల్గొన్నారు. ఆ దాడినే ప్రేరణగా తీసికొని, ఆ పదాలనే, పల్లవిగా, ఆ ప్రజలనే వీరులుగా, ప్రజాశక్తిని పాటగా మలిచాడు. ఈ పాటకు ఏ బాణీ మాతృకకాదు, వీరోచితమైన ఈ సన్నివేశమే పాటకు పల్లవినీ, పరుగులెత్తే పదాల్ని సమకూర్చింది. ప్రజాకవి ఓవైపు పోరాడుతూనే

మరోవైపు ఆ పోరాటపు లయతో పాటని అల్లారు.

లేరా లేరా! రారా! వేగమే
రైతా! కూలీ! రాష్ట్రారెడ్డి
కుర్మా గొల్లా కుమ్మర కమ్మర
చాకల మంగల హరిజన గిరిజన
నడవర ముందుకు నడుంబిగించి
కొడవలి కటారి గొడ్డలి చిల్ల
బాకూ వడిశెల బర్శి తుపాకి
చేకొని రణములో దూకర జైయని
నరకర ఎగబడి పొడవర తెగబడి
ఏటుకు ఇద్దరు, పోటుకు ముగ్గురు[12]

పైన పేర్కొన్న దాడిలో కొడవలి, కటారీ, గొడ్డలి, చిల్లా, బాకు, వడిశెల, బర్శి, తుపాకీ, ఛురిక మొదలైన ఆయుధాలను ఉపయోగించారు. స్త్రీలు కొడవళ్ళు పట్టుకొని కదిలిరాగా, తమ వృత్తిపరమైన పరికరాలను ఆయుధాలుగా చేసుకొన్నారు.

ఎత్తిన ఆయుధమెపుడు దించమని
శపథముచేసి శతృమూకలను
చెండాడర-నీ కందినదే వజ్రా-
యుధమగు నిల [13]

ఆ ఆయుధాలతో రాక్షసపాలన విధ్వంసంచేసే వరకూ ఎత్తిన ఆయుధం దించమని ప్రజలు శపథం చేశారు. "నీ కందినదే వజ్రాయుధమగు" నని కవిగా భావించారు. నిజానికి ఆచరణలో వాళ్ళ పరికరాలను వజ్రాయుధంకన్న గొప్పగానే ఉపయోగించారు. 'శత్రుమూక', 'వజ్రాయుధం' మొదలైన కొన్ని పదాలు తప్పించి మిగిలిన పదాలు, భాషా, వ్యక్తీకరణా అన్నీ ప్రజలవే. పోరాటంలో పాల్గొనడమే కాకుండా పోరాట బాణీలను కూడా వృద్ధస్త్రీలు పోరాటానికి అందించారు. ఈ విధంగా వారి పాత్ర తెలుగు సాహిత్యంలో చిరస్మరణీయంగా నిలిచిపోయింది.

*ఊదరబాంబు సంఘటన*: సూర్యాపేట తాలూకా గ్రామాల్లోని స్త్రీలను చెరచడానికి ప్రయత్నించిన రజాకార్ల ఆటలు ప్రజలు సాగనివ్వలేదు. రజాకార్లు ఒక భూస్వామి గడిలో రెండో అంతస్తులో దూరి తలుపులు బిగించుకొని కిటికీలగుండా ప్రజల మీద కాల్పులు సాగించారు. గడి గోడలనే మాటుచేసుకొని దళ సభ్యులు ఎదురు

కాల్పులు సాగించారు. కానీ లాభం లేకపోయింది. రజాకార్లు ఎత్తుపై ఉండడం వల్ల సులభంగా కాల్పులు కొనసాగించగలిగారు. గ్రామస్థులంతా గడిచుట్టూచేరి యెన్నో రకాలుగా ఆలోచించినా లాభం లేకపోయింది. సమయం మించిపోతున్నది. రజాకార్లకు సహాయంగా పోలీసులు రాకముందే అంతుతేల్చుకోవాలని ఊరిబయట సెంట్రీలను ఉంచారు. అప్పటికి దొరకుటుంబం నౌకరూ గడి బయటికి వచ్చారు. వారిని ప్రజలు క్షమించి వదిలివేశారు. కాని దొర ఇంకా రజాకార్లను విడిపించాలనే ప్రయత్నంలో ఉండడం వల్ల ప్రజల్లో పట్టుదల పెరిగిపోయింది. అప్పుడు ఆ ప్రజలోని ఓ పండు ముసలి "ఇంకా చూస్తున్నారేమిరా? ఊదరపెట్టి అదరగొట్టక!" అని కేకేసింది. వెంటనే యెండుమిరపకాయలు, గడ్డిలోవేసి గడిచుట్టూ పొగపెట్టారు, దాంతో రజాకార్లు మిరప కాయల ఘాటును భరించలేక లొంగిపోయారు. ప్రజలు వెంటనే ఒక బండెడు వరిగడ్డిని కిందపరచి. రజాకార్లను ఆయుధాల్ని అందులో వేయమన్నారు. ఈ విధంగా జంతు వులను పట్టుకోవడానికి ఉపయోగించే ఊదరపొగను రజాకార్లను పట్టుకోవడానికి ఉపయో గించారు. అట్టడుగు వర్గానికి చెందిన ఒక స్త్రీ మాత్రమే పరిస్థితుల కనుగుణంగా సలహా ఇవ్వగలిగింది. ఆ తరువాత అనేక సందర్భాలలో ఈ 'ఊదరబాంబు' ఎత్తుగడను అనుసరించారు. [14]

తమకు తెలిసిన విజ్ఞానాన్ని శత్రువుని మట్టిగరపించడానికి ఉపయోగించారు. మిలటరీలో గ్యాస్ బాంబ్, టియల్‌గ్యాస్ షెల్ లాంటివి. కాని ప్రజలు ఈ రకమైన ఊదరబాంబులు కనుక్కున్నారు. ఈ ఊదరబాంబు ప్రశస్తి ఎన్నో పాటల్లోకెక్కింది. పత్రికల్లో బాక్సు కట్టిన వార్తలుగా ప్రచురితమయ్యాయి. అయితే ఈ ఊదరబాంబు శత్రువుని హడలగొట్టడానికే కాకుండా ప్రజలలో ఎంతో ఆత్మవిశ్వాసాన్నీ, బలాన్నీ చేకూర్చింది. ఆచరణలో ఊదరబాంబు ప్రభావాన్ని చూసి పొందిన అనుభూతి ఆ ప్రజలకు మాత్రమే ఉంది. దాన్ని గురించి విన్న ఆంధ్రప్రాంతపు కవులు, రచయితలు[15] ఒకరిద్దరు ఆ విషయం పాటల్లో ప్రస్తావించారు. ఈ ఊదరబాంబు ప్రభావాన్ని ఒక అసాధారణ చారిత్రక పరిస్థితిలో పాటగా మలిచి ప్రజలను చైతన వంతుల్ని చేశారు.

రజాకార్లు ఆధునిక ఆయుధాలతో అరబ్బు సైనికులతో గుర్రాలమీద, మోటారు వాహనాలమీద, లారీలమీదా దాడి ప్రారంభించినపుడు ప్రజలకు ఏంచేయాలో తెలియలేదు, అలాంటి సందిగ్ధావస్థలను ప్రజలెలా ఎదుర్కొన్నారు? అలా ఎదుర్కోవలసి వచ్చిన పరిస్థితులేమిటి? ఆ పరిస్థితులలో ప్రజలు ఎలా ఉత్తేజితులయ్యారో మనకు పుస్తకాల్లోనూ, చారిత్రక పత్రాల్లోనూ ఎక్కడా లభించదు. అలాంటి పరిస్థితిని కేవలం ప్రజల పాటల్లోనే చూడగలం. ఆ పరిస్థితిని నమోదుచేసిన ఘనత ప్రజల పాటలకే దక్కుతుంది.

ప్రజల చరిత్రను ప్రజలో, ప్రజాకవులో నమోదు చేస్తారు. ఇప్పటి వరకు పార్టీ నాయకులు చాలామంది చాలా పుస్తకాలు రాశారు. కానీ ఎక్కడా ఇలాంటి విషయాలను లోతుగా చర్చించలేదు.

పోరాటంలో అన్నలతోపాటు చెల్లెళ్ళూ వచ్చారు. తల్లులూ, అత్తలూ తమ కూతుళ్ళను, కోడళ్ళను అడ్డుపెట్టకుండానే పోనిచ్చారు. చెరచబడ్డ స్త్రీలను ఎవరైనా అవమానించినప్పుడు వృద్ధస్త్రీలు అడ్డుకున్నారు. అలాంటి ఆలోచనలకు తావివ్వలేదు. బాధితులను కంటికిరెప్పలా చూసుకున్నారు. ఎన్నో సేవలుచేసి, మానసికంగా, శారీరకంగా వాళ్ళను మళ్ళీ మనుషులను చేశారు. తరతరాలుగా నెత్తిన పద్దిన పాత భూస్వామ్య విలువలను ఆచరణాత్మకంగా దూరం నెట్టారు. అంతేకాదు. తమకు తెలిసిన వైద్యాన్ని, చిట్కాలను [16] ఉపయోగించి ఎన్నో ప్రాణాలను కాపాడారు.

*పాటతో ప్రజాశత్రు నిర్మూలన* : ఎంతోమంది. వృద్ధస్త్రీలు, దళాలకు కర్తవ్యాన్ని తెలియజేసే పాటలు అప్పటికప్పుడు కట్టి వాళ్ళను కర్తవ్యోన్ముఖులుగా చేశారు. నల్లగొండ ప్రాంతంలో ఎలమంద దళం ఎంతో పేరుమోసింది. ఎన్నో వీరోచిత కార్యాలు చేసింది. కానీ ఆ ప్రాంతానికి చెందిన ఒక భూస్వామి దళాలకు ఎక్కువ చందాలు ఇచ్చి, వారిని మంచిచేసుకున్నాడు. తాను ఎలాంటి అక్రమాలకు పాల్పడటం లేదని చెప్పుకున్నాడు. కాని నిజానికి అతని ఆగడాలకు అంతులేదు. రజాకారు వచ్చి అతని గడిలోని మకాం చేసేవారు. దొర గుండాలు ప్రజలను ఎన్నో బాధలకు గురిచేశారు. అది సహించని ప్రజలు ఆ ఊరి దొర గురించి దళానాయకులతో ఎన్నోసార్లు చెప్పుకున్నారు.

ఇలాంటి పరిస్థితిలో ఒకరోజు సాయంకాలం రెండు మూడు దళాలు కలిసి సమావేశం కావడానికి ఆ ఊరు వచ్చాయి. దళాలురాగానే ప్రజలు వంటలు ప్రారంభించారు. స్నానాలకు నీళ్లు తెచ్చారు. తమ ఇళ్ళలో ఉన్న సామాగ్రిని వంతుల చొప్పున ఇచ్చారు.

ఆ రాత్రి సమావేశం గంభీరంగా జరుగుతున్న సమయంలో స్త్రీలు సాము హికంగా పాడుకున్న పాట దూరం నుండి వినిపించింది. అందులో ప్రధాన గాయకురాలి బోసికంఠం ప్రత్యేకంగా ఉంది. ఆ పాటలో దొరపేరూ, దొరల గూండాల పేర్లూ, నైజాం నవాబు పేరూ, రజాకారు. నాయకుని పేరూ, దళనాయకుడు ఎల్లమంద పేరూ వినరావడం వల్ల ఆ పాట దళసభ్యుల్ని ఆకట్టుకొంది. భోజనాలకు లెమ్మని కబురువచ్చినా ఎవ్వరూ కదలలేదు. పాటని శ్రద్ధగా విన్నారు.

నైజాం తాలూక ఉయ్యాలో
నలగొండ రాజ్యాన ఉయ్యాలో

నలగొండ రాజ్యాన ఉయ్యాలో
ఊరూ ఉప్పలపాడు ఉయ్యాలో
ఆ ఊరిలోన ఉయ్యాలో
దొరోడు దుష్టుడు ఉయ్యాలో *

అంటూ ప్రారంభమైన ఆ పాటలో దొరకూ, రజాకార్లకూ ఉన్న దగ్గరి సంబంధం, ఆ సంబంధాన్ని మరిచి దళాలు అతని దౌర్జన్యాలను సాగనివ్వడం తమ గ్రామ ప్రజల ఖర్మ అని వ్యంగ్యంగా విమర్శించింది. దళాలను కాపాడేది ప్రజలు. ఆ ప్రజలను రక్షించి ప్రజావ్యతిరేక శక్తులను దళాలు మట్టుపెట్టాలి. అన్నిచోట్ల అలా జరుగుతుండగా ఆ ఊళ్ళో మాత్రం దొర విచ్చలవిడిగా తన గూండాలతో స్వైరవిహారం సాగించడం ఎందువల్ల జరుగుతోంది అని ప్రశ్నించింది. లోగడ దొర చేసిన దౌర్జన్యాలవల్ల ప్రాణాలు పోగుట్టుకున్నవారి కథలను చెప్పింది, ప్రజలను బాధపెట్టిన రీతులను తెలియజేసింది. ఆ దొర గూండాల పేర్లతోసహా వాళ్లుసాగించిన జులుమును వేలెత్తి చూసింది. ఇలాంటి దుష్టకార్యాలను చేసిన వాళ్ళను శ్రీరాముడు చంపేశాడని, శ్రీకృష్ణుడు మాత్రం శిశుపాలునికి నూరు అవకాశాలు ఇచ్చాడని, తమ ఊరి దొర చేసిన నూరుతప్పులు ఎప్పుడో అయిపోయాయని ఆమె వాపోయింది. ఆమె దొరను మాయల ఫకీరుతోపోల్చింది. అతని దగ్గర ఏడుతూటాల వెండిరైఫిలూ, సగం తూటా సన్న రైఫిలూ (రివాల్వర్), పంచలోహాల పదునుకత్తి ఉన్నందువల్ల దళాలు భయపడి ఏమీ చేయలేక పోతున్నాయేమోనని భావించింది.

మాయలఫకీరు బాలనాగమ్మను కష్టపెట్టినందుకు ఆమె కొడుకు బాలవర్ధిరాజు వాడి ప్రాణాలు తీసినటుగా ఎంతోమంది బాలనాగమ్మల ఉసురుపోసుకున్న దొర ప్రాణాలను తీయడానికి చాలామంది బాలవర్ధిరాజులు ప్రజలలో ఉన్నారని ఆమె విశ్వాసాన్ని ప్రకటించింది. కృష్ణుడు చేయలేని పనిని రేపు ప్రజలు చేస్తారని హెచ్చరించింది. దొర ప్రాణాన్ని ఎలా తీయాలోకూడా ఆమె ఆ పాటలో సూచించింది.[17]

జోరుగా సాగుతున్న వృద్ధురాలి పాట చటుక్కున ఆగిపోయింది. వింటున్న దళాలు, దళాలను చూస్తున్న ప్రజలు ఆశ్చర్యపోయారు. కాసేపటికి ఎవరో వచ్చి, దొరల గుండాలు చాటుగా వచ్చి సమాచారం సేకరిస్తున్నట్టు చెప్పారు. అందువల్లనే పాట ఆగిపోయిందని తెలిసింది. దొరను మట్టుపెట్టక తప్పదని దళ సభ్యులు అక్కడి కక్కడే నిర్ణయించుకున్నారు. నిర్ణయం తీసుకున్న తర్వాత దళం ఆ పాట పాడిన అవ్వను పిలిపించుకొంది. ఆమె ఆ పాటను ఎన్నో రోజులుగా పాడుతోంది. అదే పాటను స్త్రీలు కలుపులో, నాట్లలో పాడేవాళ్లు. ఆ పాటని దొరల గూండాలు పాడకూడదని

నిషేధించారు. అయితే ఊళ్ళోకి దళాలు వచ్చాయి. గనుక ఆమెకు కొంత ధైర్యం వచ్చింది. ఆవేదన, కసి పెల్లుబికి ఆమెకు తెలియకుండానే అప్పటికప్పుడు ఆశువుగా ఆ పాట వెలువడింది.

ఆ ముసలవ్వ సూచించిన విధంగానే తెల్లవారిన వెంటనే గడిమీద దాడి జరిగింది. దాడి జరుగుతున్న సమయంలో ఏవో కొన్ని శబ్దాలవల్ల దొరకు అనుమానం వచ్చింది. రివాల్వర్, కత్తి దగ్గరగా పెట్టుకున్నాడు. ఈలోగా గడి తలుపుని పగులగొట్టి దళ సభ్యులూ, ప్రజలూ లోనికి ప్రవేశించారు. దొర నక్కుతూ, నక్కుతూ గోడదాటి పక్కనే ఉన్న గుడిసెలో జొరపడ్డాడు. గ్రామంలోని ప్రజలందరూ ఆ ప్రదేశానికి చేరుకున్నారు. దొర చేతిలో రివాల్వర్, కత్తి ఉన్నందువల్ల ఆ గుడిసెలోకి వెళ్ళడానికి ఎవరూ సాహసించలేదు. ఆ గుడిసెలో నివసించేవారు భయంతో హాహాకారాలు చేస్తూ, బయటకు వచ్చారు. దొర ఏ గుడిసెలో ఉన్నాడో, అతణ్ణి ఏ విధంగా పట్టుకోవాలో ఎవరికీ పాలుపోలేదు. ఏ గుడిసెలోంచి ఏ శబ్దం వస్తుందో అని అందరూ చెవులు రిక్కించి వింటున్నారు. రాత్రి పాటపాడిన ముసలావిడ ముందుకువచ్చి అక్కడున్న ఏడెనిమిది గుడిసెల్లో ఒక గుడిసెను చూపించింది. ఆ గుడిసెకు చుట్టూ ఉన్న గుడిసెలకు 'అగ్గిపెట్ట'మని నిశ్శబ్దంగా సైగచేసింది. ప్రజల కళ్ల మెరిశాయి. దళ సభ్యులు అడ్డంగా తల ఊపారు. ప్రజల ఆస్తిని నాశనం చేయకూడదని వాళ్ళ సిద్ధాంతం. కానీ అక్కడున్న ఆ గుడిసెవాసులు తమ గుడిసెలు కాల్చివేయడానికి నిశ్శబ్దంగానే ఆమోదం తెలిపారు.

ప్రజా పీడకుని ఘట్టం ముగిసింతర్వాత ఆమె పాటకు దొర మరణఘట్టం ఆదనంగా జతకూడింది. ఆ ముసలావిడ బతికినంతకాలం ఉయ్యాలపాటని అలాగే పాడుతుండేదని తెలిసింది. ఆ పాట కలుపులో, నాట్లలో తమ విజయాన్ని ప్రజలు గర్వంగా పాడుకున్నారు.

పోరాటంలో ఇలాంటి ముసలవ్వల పాత్రని, బేరీజువేస్తూపోతే ఎన్నో కొత్త విషయాలు తెలుస్తాయి. అంతేకాదు వీళ్ల మౌఖికంగా ఏన్నో పోరాట విషయాలను, పోరాటాన్ని తర్వాతి తరం వాళ్ళకు వర్ణించి చెప్పారు. ఆనాడు పాడుకున్న పాటలను కూడా వీళ్ల గుర్తుంచుకున్నారు. ప్రజల త్యాగాలను కీర్తించారు. అవ్వ పాట పాడిన పద్ధతి ఆశురచనగా చెప్పవచ్చు. తన మనసులోని భావాన్ని తన చుట్టూ వున్న స్త్రీలకు (శ్రోతలకు) చెప్పింది కానీ దళ సభ్యులు తమకే ఆ విషయం చెబుతున్నట్టుగా భావించారు.

ఇక్కడ రెండు ముఖ్య విషయాలు గమనించాలి. ఒకటి - ఈ వృద్ధ స్త్రీ వక్త కాదు. వ్యక్తిగా కూడా గుర్తింపులేదు. ఆమె గ్రామంలో ఒక భాగం. లేదా గ్రామానికి

ఒక సంకేతం. ఆమె బాధ అమెదికాదు; మొత్తం గ్రామానిది. సామూహికత ప్రజల పాటల లక్షణం అన్న నిర్వచనం ఇక్కడ స్పష్టంగా కనిపిస్తోంది. ఇక రెండవ విషయం ఆశురచన. పాట ఆశువుగా జీవితంలోంచి ఏలా తన్నుకవస్తుందో మనం ఇక్కడ గమనించవచ్చు. పండితులు చెప్పే ఆశు కవిత్వానికి ఒక శిక్షణ లేక అభ్యాసం ఉంటుంది. స్పందించకుండానే భావస్ఫోరకంగా పద్యం చెప్పగలరు. ప్రజల ఆశురచన దీనికి భిన్నమైంది. ఎక్కడో ఏదో ప్రేరణ లేనిదే పాట రాదు. పాట వచ్చినప్పుడు మాత్రం తమ బతుకులో భాగమైన శ్రమ పాటల బాణిలో తప్ప మరోవిధంగా రాలేదు. ఈ రెండు విషయాలు వృద్ధ స్త్రీ పాడిన పాటలో గమనించవచ్చు. ఈ విధంగా వృద్ధుల పాటలు దళాల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేయడమేకాకుండా, ప్రజా శత్రు నిర్మూలనకు ప్రత్యక్షంగా దోహదపడ్డాయి. ప్రభుత్వ పీడన పెరిగినకొద్దీ పాటల ప్రచారం కూడా ఎక్కువయింది.

## ప్రభుత్వ పీడన-పాటలు

దొరలు దోపిడిదార్లు
కరకు క్రౌర్యముబూని
పశువులా సైనికులా బంగళాల్లో మేపి
నైజాము తొత్తులయ్యి
ఉద్యమాలు నాశము చేస్తుండెరా[18]

ప్రజలపై జరుగే దాడులలో వ్యక్తులను కాకుండా మొత్తం గ్రామాలకు గ్రామాలనే పాశవికి హింసాకాండకు లోను చేశారు. దాదాపు అలాంటి ప్రతి సంఘటననూ వాటికి బాధ్యులైన వ్యక్తులను, ప్రదేశాలను ప్రజలు తమ పాటల్లో నమోదు చేశారు. పోలీసులూ, రజాకార్ల వెనుక ఉన్న దొరల పాత్రని బట్టబయలు చేశారు.

ఇలాంటి సమయంలో బేతవోలు గ్రామ ప్రజలంతా కమ్యూనిస్ట్ పార్టీ సూచన మేరకు జాతీయ జెండాను ఎగరేసారు. దొర గడిలోని పోలీసులు తప్పతాగి అక్కడికి వచ్చారు. ప్రజలు 'సంఘానికి జై' అంటూ నినాదాలు చేశారు. జయజయధ్వానాలతో ప్రజలు పాటలు పాడారు. సంఘ కార్యకర్తలైన పందిరి నర్సయ్య, మాతంగి మట్టయ్య లను పోలీసులు కాల్చివేశారు. వాళ్ల 'సంఘానికి జై' అంటూ నేలకొరిగారు. స్వతంత్ర భావాలను సహించని పోలీసులు స్వాతంత్ర్య పతాకాన్ని ఎగరవేసినందుకు ఎలాంటి సూచన లేకుండా కాల్పులు సాగించారు. రజాకారు, పోలీసుల జులుంకు వ్యతిరేకంగా కాంగ్రెస్, కమ్యూనిస్టులనే భేదం లేకుండా పాటలు రాశారు.

ఈ ప్రభుత్వము కిందను
ధన మాన ప్రాణ రక్షణ లేదురా
ఉద్యమాన్ని దోచుటకు
యుద్ధమే సాగించ
చావు ముందుకు వచ్చె
సంశయ భేదాలేలా?[19]

## యథాతథ ఒప్పందం

బాధ్యతాయుత ప్రభుత్వ భావపూర్ణ ప్రజాశక్తి
ఉద్యమంబునాపుట కభివృద్ధి నిరోధకత్వమున
సాధ్యపడదు వింటిరోయ్-భూస్వాములార
మాంద్యము వీడకుంటిరోయ్-భూస్వాములార[20]

1947 ఆగస్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యం లభించినా అందులోనే ఒక భాగమైన హైదరాబాదు సంస్థానానికి స్వాతంత్ర్యం రాలేదు. హైదరాబాదు సంస్థానం-ఇండియన్ యూనియన్‌లో చేరబోదనీ, స్వతంత్రంగా ఉంటుందనీ 1947 జూన్ పదకొండున నైజాం ఒక ఫర్మానా ప్రకటించాడు.

ఈ ప్రకటనని ప్రజలు అంతగా పట్టించుకోలేదు. కానీ కాంగ్రెస్‌వాదులు తీవ్రమైన విషయంగా తీసుకున్నారు. నిజాం హయాంలో బాధ్యతాయుత పరిపాలన ఏర్పడడం కొరకు మాత్రమే వారు కృషి చేశారు. కానీ ఆ లక్ష్యం నెరవేరకముందే ఈ ప్రకటన వెలువడటం వల్ల వారిలో అలజడి రేకెత్తింది. తమ సర్వ శక్తులను కేంద్రీకరించి ఇందుకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని లేవదీశారు.

కాంగ్రెస్ పార్టీ నిజాంతో యథాతథ ఒప్పందాన్ని చేసుకొని, నిజాం రాజు నిలదొక్కుకుని ప్రజలమీద అమానుష చర్యలు జరపడానికి వీలు కల్పించినట్లుగా ప్రజలు భావించారు. క్రూరమైన సంస్థానాధీశుల్ని, వేర్పాటువాదుల్ని ఏమీ చేయలేక ప్రజలను వారి చేతుల్లోకి వదిలినట్లుగా భావించారు. ఒక సంవత్సరపు యథాతథ ఒప్పందం కాలంలో నైజాం అటు ఐక్యరాజ్యసమితిలోనూ, ఇటు ఆయుధాల సేకరణలోనూ బలం పుంజుకొన్నాడు. మరింతగా రాక్షస చర్యకు పూనుకున్నాడు.
అదిచూసి ప్రజలు-

నచ్చదాయె మీ మదికి స్వేచ్ఛా విశాలాంధ్రలోన
తుచ్ఛ మ్లేచ్ఛ దొరల కాళ్ళు దుడచి కనుల కద్దుమనే

మచ్చికె పేడకుంటిరోయ్-భూస్వాములార మీరు
అచ్చాయనుట మానరోయ్ భూస్వాములార అని పాడుకొన్నారు.

యధాతధ ఒప్పందం తరువాత స్టేట్ కాంగ్రెస్ తన కొద్దిపాటి చురుకైన కార్యక్రమాలన్నిటినీ వెనక్కి తీసుకొంది.

నైజాం నుండి వెండి, బంగారం బయటకు పోరాదనీ, ఇండియన్ యూనియన్ నాణాలు హైదరాబాదు సంస్థానంలో చెల్లవనీ 1947 డిసెంబరులో శాసించాడు. విదేశాల నుండి ఆయుధాలు తెప్పించుకొన్నాడు.[21] అవి చాలక ఆయుధాల తయారీ కూడా ప్రారంభించాడు. తన స్వాతంత్ర్యాన్ని నిలుపుకోవడానికై ఎన్నో లక్షల రూపాయలు ఖర్చుపెట్టి ఒక ప్రచారసంస్థను ఏర్పాటు చేసుకొన్నాడు. రాష్ట్రం వెలుపలి ముస్లింలను కాందిశీకుల పేరుతో తీసుకవచ్చి రజాకార్లతో కలిపాడు. ముస్లింలు కానివారిమీద దాడి చేయించాడు.

ఇలాంటి సమయంలో నైజాం ప్రభుత్వం ప్రజలకు కొన్ని హక్కులు ప్రకటించింది. ప్రజలే పరమావధి అని, వారే తమ ఆశయమని దొంగమాటలు చెప్పింది. అది చూసి ప్రజలు-

మేకవన్నె హక్కు లిచ్చిందిరా
చాకచక్య మెంతో గలదిరా
అది నమ్మితే పోరాట మడుగంటురా-ఓరన్న
మన భూములే మంట గలియురా[22]

అని ప్రభుత్వం ప్రకటించిన హక్కుల స్వభావాన్ని బహిరంగ పరిచారు. ఈ మాటలు నమ్మి పోరాటం ఆపరాదని, పోరాటం ఆపితే తమ భూమి మంట గలుస్తుందని హెచ్చరించుకొన్నారు. ప్రతిఘటన కొనసాగించడానికి తీసుకున్న నిర్ణయం పాటలుగా రూపమెత్తింది.

## దళాల ప్రతిఘటన

రజాకారుదళాలూ, నిజాం సైన్యం కలసికట్టుగా చేసే దాడులను ప్రజలు ప్రతిఘటించారు. నిబ్బరాన్ని నిలబెట్టుకుంటూ గ్రామరాజ్యాలను ఏర్పాటు చేసుకున్నారు. ఈ విధంగా తెలంగాణాలోని సగభాగం వరకూ పోరాటం పాకిపోయింది. ఎన్ని వీరోచిత పోరాటాలు చేసినప్పటికీ, ఎంతోమంది ప్రాణాలు అర్పించినప్పటికీ, మొత్తం నిజాం ప్రభుత్వాన్ని తుడిచిపెట్టగల సుశిక్షితమైన పోరాట నిర్మాణ స్థాయి అప్పుడప్పుడే పెంపొందుతున్నది. దళాలు ప్రజా సైన్యంగా రూపొందడానికి అప్పటికి ఇంకా కొంత

కాలం పడుతుంది. అప్పుడే ఏ గ్రామంలో చూసినా "ప్రజలు దళాలుగా కూడాలోయ్, పోలీస్ కాంపులు చుట్టాలోయ్"[23] అంటూ దళాల నిర్మాణం కొనసాగించారు.

నల్గొండ, ఖమ్మం, వరంగల్, కరీంనగర్ జిల్లాలలో ప్రజలు తుఫానులై లేచారు. గ్రామాలు విముక్తమయ్యేకొద్దీ సజీవదహనాలూ, గ్రామదహనాలూ ఎక్కువ అయ్యాయి. విముక్త ప్రాంతాల్లో-

రగతమోడ్చి కష్టపడే రైతుకూలి అన్నలార
సందు దొరికే ముందు కురికి రండిరా-అదిగో
ముండమోసె నిజాము పాలనమ్మరా
పచేళ్ళు పట్టిగొట్టే పట్వార్ల పరుగుతీసె
దేశముఖులు దొరలు మాయమాయెరా ఓహో
మాసకమ్మలై ప్రజల వీడెరా
శిస్తుగట్టె చింతలేదు "లేనిగల్ల" లేనేలేదు
శాయిరి చెరలన్ని మంటగలిసెరా అదిగో
న్యాయమైన ప్రజల పాలనొచ్చెరా
రత్నగర్భయైన భూమి రైతుకూలి చేతికొచ్చె
దున్నువాని దేను భూమి సోదరా[24]

దళాలే కాకుండా ప్రజలు తమ శత్రువులని మట్టి గరిపించడానికి సిద్ధమయ్యారు. పోలీసుల రాక తెలిసి పాలు, పెరుగు, చల్లా కల్లూ నీళ్ళలో విషంకలిపి ఇండ్లలోపెట్టేవారు. అవి తాగగానే పోలీసులు మరణించేవారు. చేతుల్లో బరిసెలు పట్టుకొని సందు గొందుల్లో దాగి వారి డొక్కల్లో దించేవారు. ఆయుధాలను లాక్కునేవారు. "రైలుబాట తెంపితేను రైలుబళ్ళు బోల్తగొట్టు/రవ్వలాగ మెరపుదాడి చేయర-అబ్బో/రకరకాల ఆయుధాలు దొరుకురా[25] ఈ విధంగా ప్రజాయుద్ధ ఎత్తుగడల నన్నింటిని పాటల్లో పెట్టి విముక్తి పొందిన గ్రామాలలో ప్రజలను యుద్ధానికి సిద్ధం చేశారు.

"ఓ గెరిల్ల సైనికా/మోగె నదిగో యుద్ధభేరి/సాగిరమ్మ సైనికా"[26] అంటూ ప్రజల్లోని మెరికల్లాంటి యువకులను గెరిల్లా దళాల్లోకి ఆహ్వానించారు. "యుద్ధం ముందున్నది భేరీ మ్రోగుతోంది" అని భవిష్యత్తులో రానున్న సైనిక చర్యను ఊహించారా? అని అనిపిస్తుంది. కత్తులు దించుక పోయినా, నెత్తురు చేరులు పారినా, ఎత్తిన జెండా దించకూడదని ప్రతిజ్ఞ తీసుకొన్నారు. అంతేకాదు

తలుపు మలుపులు శీరి
బలుపు కర్రలు పట్టి

కొట్టవే ఒక దెబ్బ చెల్లెమ్మా
కణత పగిలేటట్లు అక్కయ్యా
చెడ్డెడు కారాన్ని గట్టిగా పట్టండి
కండ్లల్లో చల్లండి
కత్తితో పొడవండి
ఇంతైన భయమేల చెల్లెమ్మా
భయమేలనే అక్కయ్యా

తాము తినే కారాన్ని దుర్మార్గుల కళ్ళలో చల్లారు. తాగే పాలు, పెరుగులో విషం కలిపి ఉంచారు. తమ ఇండ్లకుగల తలుపుల్ని చీరి జలుపైన కర్రలు చేసి వాటినే ఆయుధాలుగా చేసుకున్నారు. తమ సర్వాన్ని త్యజించి, ప్రాణాల్ని పణంగా పెట్టి పోరాటంలో నిలబడ్డారు.

ప్రజా పోరాటాలు రజాకారు సైన్యాలను దెబ్బతీసే స్థితికి చేసుకొన్నాయి. కాని రజాకారు సైన్యాలు కూడా ఆధునిక ఆయుధాలతో ప్రజల దెబ్బను కాచుకొనే స్థితికి వచ్చాయి. ఆ పరిస్థితి అదే విధంగా కొనిసాగితే ప్రజాశక్తులు బలపడడానికి ఆస్కారం ఏర్పడేది. కాని అనేక కారణాల వల్ల ప్రజలలోని కొన్ని చిన్న చిన్న వర్గాలు రజాకారు పీడన నుండి ఏదో ఒక మార్గంలో విముక్తి కావాలనుకున్నాయి.[27]

కాంగ్రేస్ వర్గాలు సైనిక చర్య కోసం ఎదురుచూసాయి, అలాగే నైజాం వ్యతిరేక పాత్ర నిర్వహించే మధ్య తరగతి రైతాంగం కూడా సైనిక చర్య కోసం నిరీక్షించింది. నైజాం ప్రభుత్వం కమ్యూనిస్టులు స్థిరపడుతున్న పరిస్థితిని చూసి బెంబేలెత్తింది. ప్రభుత్వానికే కాదు గ్రామాల్లో పేరుమోసిన దొరలకు సైతం వణుకు పుట్టింది. ఈ పరిస్థితిని వర్ణించే పాటలో "నాప్రాణం వనుకుతా వున్నది-ఆపర మల్లయ్యో. బండారపు మల్లయ్య/జనగామ మార్గం బండి పోనియ్యర మల్లయ్య" అని నౌకరుకు చెబుతాడు. ఆ నౌకరు వింటాడో లేదోనని "ఇద్దరేసి పెండ్లాలను నీకు జేస్తర మల్లయ్య" అని ఆశ పెడ్తాడు. "కమ్యూనిస్టులు వస్తుండ్రు రాజ్యమెవరిదిరో మల్లయ్య/రజాకార్లు వస్తె రాజ్యం మనదిర మల్లయ్య" అని ఆశ పెడతాడు. కాని ఈ లోగా పాలేరు మల్లయ్య "సంగపోల్లు వస్తున్రు నేనెల్లిపోతను దొరో/నీ బండి నాకొద్దు సంగపోల్లు వస్తున్రు" అని వెళ్ళిపోతాడు. ఈ పాటలో భూస్వామి పట్టణానికి తరలిపోయే క్రమం ఉంది. ఇద్దరేసి భార్యలను చేస్తానని ఆశ పెడ్తాడు. ఇది భూస్వామ్య విలువ. ఈ పాటలో నాటి పరిస్థితి కళ్ళకు కట్టినట్టుగా ఉంది. (చూ. అనుబంధం)

ఈ లోగా కె. యం. మున్షీ నైజాంలో దౌత్యాన్ని సాగించాడు. ఈ దౌత్యం

ఫలించని పక్షంలో నైజాం వ్యతిరేక పోరాట శక్తులు బలపడతాయి. సంస్థానంలో అటు నైజాం యిటు కాంగ్రెసు రెండూ తుడిచిపెట్టుకు పోతాయి. అందుకని యధాతధ ఒప్పందం చేసుకోక తప్పిందికాదు. నైజాంకు రక్షణా, కాంగ్రెస్‌కు అధికార హస్త గతమూ అనే రెండు ప్రయోజనాలకు అనుగుణంగా బేరసారాలు సాగించారు. ఈ భావాన్ని ప్రతిబింబించే పాటలు పాడుతూ పోరాటానికి ఆయత్తమయ్యారు.

## సాయుధ దళ ఆరంభం

గుతుపలు పట్టుకొని ప్రతిఘటిస్తూ నిలిచిన 'గుతుపల సంఘం' ఆ తరువాత మైత్రయాత్ర సంఘంగా మారింది. ఈ దళాలు తమకు లభ్యమైన ఆయుధాలను సమ కూర్చుకొన్నాయి. రజాకార్లు చేసే బీభత్సంవల్ల గ్రామాల్లోని స్త్రీలందరూ ఒకే దగ్గర పడుకొనేవారు. మల్లారెడ్డిగూడెం మొదలైన గ్రామాల్లో స్త్రీలమీద జరిగిన అత్యాచారం తర్వాత స్త్రీలలో రజాకార్లమిద ద్వేషం పెరిగింది. తమకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రతిఘటించటానికి సమిష్టిగా ఎదుర్కోవడం ప్రారంభించారు. రజాకారులకు, నైజాం పోలీసులకూ ఎదురుగా ఎమ్రొమ్ములకు చేటలు కట్టుకొని వడిసెళ్ళతో పోరాడారు. ఇలా ప్రతిఘటించడం మొదలై పోలీసు దళాలపై దాడులు చేయడంవరకు వచ్చింది.

దళాల నిర్మాణం[28] ప్రజలకు ఆత్మ విశ్వాసాన్ని కలిగించింది. ఈ దళాలకు అన్నిరకాలుగా ప్రజలు సహకరించారు. రజాకార్ల దాడులను తట్టుకోవడానికి రాత్రులు ఊరుబయట గడిపేవారు. కొన్నిచోట్ల ప్రజలే గ్రామాలకు కాపలా ఉండేవారు. శత్రు వులమీద ప్రజల నిఘా వేయికళ్ళతో పని చేసింది. రజాకార్లు కేంపునుండి బయలుదేరే వార్త ఎన్నో మైళ్ళ దూరంలో ఉన్నా అంచలంచలుగా కబురు అందేది. కబురందిన వెంటనే దళాలు శత్రువు నెదుర్కోవడానికి సిద్ధమయ్యేవి. సిద్ధమవుతూ ఇలాంటి పాటలు గళాలెత్తి అందుకొనేవారు.

ఓయ్ - హోయ్ - హోయ్ - నైజాంహోయ్
ఓయ్ - హోయ్ - హోయ్ - కాశ్మీర్‌హోయ్

కొండల్లో - సింహాల్లా
లోయల్లో - ఉరుముల్లా
వంకరకొంకి - వరలోకత్తి
కండ్లకు గంతా - కారపుముంతా
కావడిబద్ద - రేవడిసుద్ద
రాయిరప్ప - తాళంకప్ప

గడగడలాడించే - వడిసేల
జంబియ, పేష్‌కష్ - బాకుతల్‌వార్
వందలు వేల్ - లక్షల కొలది
గబగబదూకిన - గజిబిజి నైజాం
 శే శే - రా రా
శే శే కనర రా పోరుకురారా[29]

ఈ దళాలకు సంబంధించిన పాటలు ఎక్కువగా సామూహిక స్వభావంకలవి ముఖ్యంగా వీటిలో "మార్చింగ్" పాటలు చెప్పుకోదగినవి.

తెలుగుతల్లి బిడ్డలం - తెలంగాణ వీరులం
మాతృదేశముక్తి కొరకు - పోరుసలుప కదిలినాం
తరతరాలనుండిమేము - సాగనంపదలచినాం
వెట్టిపనులు కట్టిపెట్టి - జబర్దస్తీ నెగరగొట్టి
స్వేచ్ఛగాను బ్రతుకుకొరకు - ఐక్యమయ్యి నిలిచినాం[30]

దళాలు అడుగులువేస్తూ అడుగడుగుకొకపదం చొప్పున పాటల్ని పాడుతూ కదిలేవారు. ఇవి వారికెంతో ఉత్తేజాన్ని కలిగించేవి తమను ప్రేరేపించే ఎలాంటి పాటనైనా మార్చింగ్ పాటగా మార్చుకోవటం జరిగింది. అలాంటిపాటే—

వేగరావోయి కర్షకా
వేగరావోయి కార్మికా
కాశింరజ్వీ కాల్చినా,
నాజీ నైజాం నరికినా
ఎదురుదెబ్బ దీసెదాం,
అదిరిపోవ తరిమెదాం[31]

ఈ పాటల్లో తమకు తాము ప్రేరణ కలిగించుకొనేవి కొన్ని ప్రజలకు ప్రేరణ కలిగించేవి. మరికొన్ని ఉన్నాయి.

నైజాము ప్రభుత్వ
నాయకత్వ రాక్షసత్వమున్
దాన్ని రూపుమాపకున్న
మనకులేదు సౌఖ్యమున్

అని ప్రజలను ఉద్దేశించి పాడేవాళ్ళు దళాలు గ్రామాల్లో ఉన్నప్పుడు వారికి ఉత్సాహాన్ని కలిగించడానికి ప్రజలు కూడ పాటలు పాడి విన్పించేవారు. దళాలు,

ప్రజలు కలసి ఉన్నప్పుడు వారి మధ్య భావ వినిమయాన్ని పాటలద్వారానే కొన సాగించేవారు. మొదటి దశలో ప్రజలకు సహాయసహకారాలు ఉన్నంత కాలం గ్రామదళాలకు అవసరాలు ఇట్టే తీరిపోయేవి. వందమంది ఉన్నప్పటికీ అప్పటికప్పుడు భోజనాలు ఏర్పాటు చేసేవారు. వారికి భోజనాలు పెట్టడం ప్రజలకు ఆనందదాయకంగా ఉండేది. ఈ పెద్దపెద్ద దళాలను కంపెనీదళాలు[32] అనేవారు. ఈ దళాలకు పోరాట నైపుణ్యం, వ్యూహనిర్మాణం తక్కువగా ఉండేది. ఇందులో గాయకులు ఎక్కువగా ఉండేవారు. ప్రజల్లో రాజకీయ ప్రచారం కొనసాగించే అవసరం ఉంది కాబట్టి ఈ దళాలలో అభిరుచిగల కొందరు సాంస్కృతిక కార్యకర్తలుగా పనిచేశారు.

## భూమి పంపకం

సంఘానికి సంకేతంగా ఎర్రజెండా ఎగిరింది. సంఘం పేరుమీద వచ్చిన పాటలు ఎర్రజెండా ఆక్రమించుకొంది. కొన్నివందల పాటలు ఎర్రజెండా పేరుమీద వచ్చాయి. ఎర్రజెండా ఎగిరిన చోట భూస్వామ్య పెత్తనం లేదనేవిషయం తేలి పోయింది.మొదట రెండు పార్టీలు ఐక్యంగా సంఘటితమైనప్పుడు ప్రతి ఇంటిమీద కాంగ్రెస్ జెండా, ఎర్రజెండా నిలిపారు.

హైదరాబాదు సంస్థానాన్ని భారతయూనియన్‌లో అధీనం చేయాలని కోరుతూ ఉద్యమం ప్రారంభించిన తొలిదశలో కాంగ్రెస్, ఆంధ్రమహాసభ కార్యకర్తలకు మధ్య కనిపించిన సహకారం కొద్దివారాలలోనే అదృశ్యమైంది.

నైజాంకు వ్యతిరేకంగా ఏర్పాటు చేసిన కొన్ని కాంగ్రెస్ దళాలు సరిహద్దు ప్రాంతాలైన మునగాల మొదలైన ప్రాంతాలకు తరలిపోయాయి. కోదాడని కేంద్రంగా చేసుకొన్నాయి. తరువాత ఆ దళాలలోని కొంతమంది కమ్యూనిస్టులతో కలసిపోయారు. ఒకవైపు కోదాటి నారాయణరావు మొదలైన వారి నాయకత్వంలో సరిహద్దు ప్రాంతాల్లో సాయుధ శిబిరాలు [34] ఏర్పాటు చేశారు. మరోవైపు సోషలిస్టులు కూడా ఏర్పాటు చేశారు. కేంపులతో తమకెలాంటి సంబంధం లేదని స్వామి రామానంద తీర్థ ప్రకటించారు[35] కాంగ్రెస్ లోని ఒక వర్గం సాయుధ శిబిరాలు ఏర్పాటు చేయగా మరోవర్గం ఆవిషయంతో తమకు ఎలాంటి సంబంధం లేదని చెప్పారు. ఒకవేళ సాయుధశిబిరాలు యేర్పరచిన పక్షంలో అప్పుడు వెలువడ్డ కాంగ్రెస్ ప్రబోధ పాటల స్వరూప స్వభావాలు కమ్యూనిస్టు పాటలతో పోల్చి చూస్తే పోరాట పాటకు సంబంధించిన కొన్ని విషయాలు తెలుస్తాయి.

ఆ పోలీసు దాడులను తిప్పికొట్టడానికి దళాలు ముందుకు వచ్చాయి. భూస్వాముల అదనపు భూములన్ను పంచే కార్యక్రమాన్ని చేపట్టాయి.

రైతులు సాగుచేసుకొంటున్న భూములనుండి భూస్వాములు బేదఖలు చేయడం ఆపుచేసిన తరువాత మళ్ళ ఆ భూములను రైతులు ఆక్రమించుకొన్నారు. ఎన్నో దశాబ్దాలుగా అక్రమంగా భూమిని కోల్పోయిన రైతులు తమ భూమిమీద అధికారాన్ని పొందడానికి ఎనలేని ఆసక్తి చూపించారు. అక్రమమైన బేదఖళ్ళనూ, దొరల ఆక్రమణలను రద్దుచేయాలి[63] అనే నిర్ణయానికి వచ్చారు. దాంతో వారి ఆనందం ఇనుమడించింది. ఆ ఆనందసమయంలో -

కలకలలాడే కనకము కురిసే తెలంగాణా భూమి
మా - - తెలంగాణా భూమి
పచ్చపచ్చని పైరుపండి పొరిగింది భూమి
వచ్చింది దున్నేవారికి భూమి
తెలంగాణాలోన, మా తెలంగాణలోన
మురికి పాలనకూలే దొరలంతా పారిపోయె
చెరవదిలింది, మెరిసిపోతుంది
తెలంగాణ భూమి మా తెలంగాణ భూమి
సాకి : . . ఓ. . . మేడిపట్టిన రైతు రాజా
మగసిరిగ తొడకొట్టరా
కూడు లేదను ఆర్తనాదము కూల్తుమని గర్జించరా
చివరి ఆసతో వచ్చు నైజాం చిత్రకుక్కల తరమరా
పట్టరా "బర్మారు" ప్రజల పాలనము నిలబెట్టరా[37] పాడుకున్నారు.

దాస్యశృంఖలాలలో బందీయైన భూమికి స్వేచ్ఛ లభించింది. తర్వాత రైతుకు కూడ లభించింది. భూస్వామ్య పాలన లేకపోయినప్పటికీ, వారి దౌర్జన్యాలు దూరమైనప్పటికి రైతాంగానికి నిజమైన విముక్తి, ఆనందం భూమి లభించినప్పుడే కలిగింది. అంతకు ముందు దొరల ఆధీనంలో ఉన్న బీడుపడిన భూమి చూసి రైతు ఎంతో బాధపడేవాడు. అతని కళ్ళముందున్న భూమి అతనిది కాదు. అలాంటి పరిస్థితిమారి రైతు చాలా ఏళ్ళ తరువాత సగర్వంగా తనభూమిలో తను పంట పండించుకోగలిగాడు. అలాంటి భూమిలో కనకం కురుస్తుంది. వెనకబడిన తెలంగాణా లోని భూమి పచ్చ పచ్చని పైరుతో నిండిపోతుందని భావించారు. ఈ పాటలో తెలంగాణా లోని మొత్తం భూమంతా దున్నేవాడికి లభించినట్లు భావించారు. నిజానికి నల్లగొండ, వరంగల్, ఖమ్మంలోని కొన్ని ప్రాంతాలలోనే భూమి పంపకం జరిగినపప్పటికీ, మొత్తం తెలంగాణాలో అలా వ్యాపిస్తుందనే నమ్మకాన్ని ఈ పాట సూచిస్తుంది. మురికిపాలన కూలిపోయింది. 'దొరలంతా పారిపోయారు. చెరవదిలిపోయింది. భూమి

మెరసి పోతుంది' అన్న చరణాలు భూమిపంపకాల తర్వాత రైతాంగంలో వ్యాపించిన ఆనందోత్సాహాలకి నిదర్శనం. దున్నే వాడికి భూమి లభించినప్పటికే నైజాంకుక్కలను "బర్మార్ల" తో ఎదిరించి ప్రజల పాలన నిలపెట్టాలని ఈ పాటల్లో హెచ్చరించారు. ఈ పాట భూమి పంపకాలు జరిగిన కొన్నివేల గ్రామాల్లో విపరీతమైన వ్యాప్తిని పొందింది.

పంచుకొన్న భూముల్లో రైతాంగం వెనువెంటనే వ్యవసాయ కార్యక్రమాన్ని ప్రారంభించారు. పొద్దంతా పొలాల్లో పనిచేసి రాత్రంతా రాజకీయ చర్చలు చేసేవారు భూమి పంచుకొన్న ఆనందం భూమిని నిలుపుకోవడానికి చేసే కృషిలో ఎంతోకాలం నిలువలేదు.

'దున్నేవానికి భూమి' అనే కార్యక్రమం వల్ల పంచాయతీ కమిటీల ముందు, కార్యకర్తల ముందు ప్రజలు ఎన్నో సమస్యల్ని తెచ్చిపెట్టారు. అందులో ముఖ్యంగా భూస్వాముల, రైతులనుండి ఆక్రమించుకొన్న భూములను చిన్న రైతులకు కౌలుకివ్వడమో, అమ్మడమో జరిగింది. అందువల్ల ఆ భూములను సొంతదారులకు అప్పగించడం సాధ్యం కాలేదు. ఇది కొంత అసంతృప్తికి కారణమైంది. అలాంటి వారికి వేరే భూములను పంచియిచ్చారు. భూముల పంపకం కార్యక్రమంలో ఎక్కడి సమస్యను అక్కడ ఏదో ఒక విధంగా పరిష్కరించుకోవడం జరిగింది. అంతేకాని రైతాంగాన్ని రాజకీయంగా విద్యావంతులను చేసి సమస్యలకు లోతైన పరిష్కారాలే ఎక్కువగా అనుసరించారు. ఈ అంగీకారాలు ప్రజాభిప్రాయానికి తలఒగ్గి ఉండేవి. ఒక విధంగా చెప్పాలంటే ప్రజాకోర్టుల్లో ఈ సమస్యలను పరిష్కరించుకోవడం జరిగింది. ఏది ఏమైనప్పటికీ భూస్వాముల మిగులు భూముల్ని ఆక్రమించుకోవడం కన్నా రైతు తను కోల్పోయిన భూమి పట్లనే ఎక్కువ మక్కువ చూపాడు. ఈ మక్కువే పోరాటాన్ని ఉధృతం చేయడానికి పనికి వచ్చింది.

ఉద్యమం తీవ్రమయ్యేకొద్దీ వ్యవసాయ కార్మికులు భూమి లేని పేదలకు భూమి కావాలన్న కోరిక బలీయమయింది. 500 ఎకరాల పైన గల భూముల స్వాధీనాన్ని రెండువందల ఎకరాలకు తగ్గించారు, 1948 కల్లా వంద ఎకరాల మెట్ట పది ఎకరాల మాగాణి గరిష్ట పరిమితిగా నిర్ణయించారు. ఈ విధంగా భూమి పంపకం పెరిగినకొద్దీ గరిష్ట పరిమితి తగ్గుతూ వచ్చింది.[38] రైతాంగంలో ఆనంధోత్సాహాలు పెల్లుబికాయి. కళారూపాల్లో ఇవి ప్రతిబింబించాయి.

## పోరుబాటలో సాహిత్య కళారూపాలు

ఈ దళాలు ఉదయం లేవగానే ప్రభాత భేరీల పేరుతో ఒకవైపు పాటలు విన

వస్తుంటే మరోవైపు శారీరక వ్యాయమం చేసేవారు. ఆయుధాల శిక్షణ పొందేవారు, విరామం దొరికినప్పుడు పాటలు పాడుకొనేవారు. రాత్రుళ్లు తప్పనిసరిగా పాటలు పాడే వారు. విశాల పరిధిగల ఇతివృత్తాలను చెప్పవలసి వచ్చినపుడు పాటల పరిధి సరిపోదు. అందుకే ప్రజా కళారూపాలను తీసుకొన్నారు. ఈ ప్రజా కళారూపాలను ఆయా రాజకీయ సామాజిక పరిస్థితుల కనుగుణంగా మలిచారు. దళ సభ్యులుగాఉన్న కళాకారులే ఉదయం రాజకీయ కార్యక్రమాలు నిర్వహించి రాత్రి కళా రూపాలను ప్రదర్శించేవారు. మొదట ఈ కళా రూపాలు దళాలకోసం ప్రదర్శించి మెరుగులు దిద్దుకొని ప్రజల మధ్య ప్రదర్శించేవారు. కళల పట్ల మక్కువ ఉన్న ప్రజలు ఈ దళాలతో కలిసిపోయి సాంస్కృతిక సైనికులుగా మారారు.

ఎప్పుడైతే కంపెనీ దళాలు గెరిల్లా దళాలుగా పునర్నిర్మాణమయ్యాయో అప్పుడు దళాలతో కళాకారులు కొంత దూరంగా ఉండవలసి వచ్చింది. వీరు పార్టీ మార్గదర్శకత్వంలో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. కాని రామాంజనేయులు, రాజారాం, హనుమంతులాంటి వాళ్లు చివరివరకూ దళాలతోనే ఉండి సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు.

కళా రూపాలలోని పాటలు కొన్ని విడిగా కూడా పాడుకొన్నారు. ఒక్కోసారి ప్రజలు కట్టుకొన్న పాటలు అవసరానుగుణంగా ప్రదర్శనల్లోనూ చోటుచేసుకొన్నాయి. ఈ విధంగా ప్రజల పాటలు ప్రచారం కావడమే కాకుండా ఆ పాటలలోని స్థానిక విషయాలు, విజయాలు ప్రచారం అయ్యేవి.

పోరాటం జరుగుతున్న సమయంలో పాటలు, ఇతర కళారూపాల నిర్మాణం గురించి ఎంతో అధ్యయనం చేయవలసి ఉంది. శత్రువు నెదుర్కొనటానికి చిన్న చిన్న వస్తువులు ఆయుధాలుగా మారినప్పుడు ప్రజల వాడుకలో ఉన్న చిన్న చిన్న పదాలే పాటలయ్యాయి.

పోరాటంలో పాల్గొన్న కొంతమంది కార్యకర్తలు తప్ప మిగిలినవాళ్ళంతా నిరక్షరాస్యులు. వీరే కాకుండా పోరాటానికి మద్ధతునిస్తూ దానిని నిర్వహించే ప్రజలు కూడ నిరక్షరాస్యులే. వారికి కావలసిన సాహిత్యాన్ని వాళ్ళే తయారుచేసుకున్నారు. వీటిలో నోటి పాటల స్వభావం నిండి ఉంటుంది.

కొన్ని సందర్భాల్లో అక్షరాస్యులైన కార్యకర్తలు, నాయకులు, ప్రజలకోసం సాహిత్యాన్ని సృష్టిస్తారు. దీనిలో రాత పాటల స్వరూపం కనిపించినప్పటికీ అవి వెలువడిన పరిస్థితులు రాజకీయ ప్రయోజనాల దృష్ట్యా మౌఖిక స్వభావం ఆ పాటలో వెంటనే చేరిపోతుంది. ఈ విధంగా రెండు రకాలుగా ప్రజల పాటలు వెలువడతాయి. ఈ రెంటికీమధ్య కొద్దితేడా ఉన్నప్పటికీ ఈ రెండూపోరాట సాహిత్యంగానే చెప్పవచ్చు.

దీర్ఘకాలంగా భూస్వామ్య విధానంలో మగ్గిన ప్రజలను విద్యా విజ్ఞానాలకు దూరంగా ఉంచారు. ఇంతకాలం వాళ్ళ సంస్కృతి వారిది కాకుండా పోయింది. తర తరాలుగా దాచిపెట్టిన విద్యా విజ్ఞానాలు వాళ్ళ అందుబాటులోకి వచ్చాయి. ప్రజలను విద్యావంతులుగా చేయటం నాయకుల విధి అయింది. పోరాటంలోకి వచ్చిన చాలా మందికి విద్య నేర్చుకోవటానికి వీలు కలిపించారు. సహజంగానే వాళ్లు తమ జీవితానికి ఉపయోగపడే విద్యా విజ్ఞానాలను, సాహిత్యాన్ని ప్రేమించారు, కాంక్షించారు. ఇలాంటి పోరాట దశల్లో రాజకీయ సంఘర్షణ, ప్రచారం అవసరం ఉన్న కవులు ప్రత్యక్షంగా స్పందించడం వల్ల పోరాట పాటలు వెలువడ్డాయి. పాత సమాజంలో ఒకరి ఆనందానికి పనిముట్టుగా బతికే ప్రజలు సొంత వ్యక్తిత్వంతో ఆలోచించినపుడు పాతభావాలు. భయాలు విడిపోయాయి. పాత సమాజం తమకు ఏమీ ఇవ్వలేదు. మోసం, దగా తప్ప. మొదట ఇలాంటి విషయాలు తెలుసుకొన్నారు. వర్తమానంలో సమాజం ఎలా మారాలో, మారుతుందో కూడా తెలుసుకొన్నారు. అలా తెలుసుకొన్నప్పటి నుండి వారు ప్రశ్నించ గలిగారు. అలా ప్రశ్నించడం వారికి ఆనందాన్ని, ఉద్రేకాన్ని కలిగించింది. వారిలో ఇదివరకు చల్లారిపోయిన ఉద్రేకం మళ్ళీ పరవళ్ళు తొక్కింది. ఈ అంశం పోరాటంలో లాగే వారి సాహిత్యంలో కూడా స్పష్టంగా కనిపిస్తుంది.

## పాట-విప్లవీకరణ

ప్రజల పాట సమాజ హృదయంలోంచి, పాత పాటల అనుభవాల నుంచి రూప మెత్తుతుంది. అలా రూపెత్తిన ప్రతిసారీ కొంత మార్పు చెందుతుంది. ఆ మార్పు కంటికి కనిపించేంత స్పష్టంగా ఉండకపోవచ్చు. కాని కొత్త సమాజావసరాలకు అను గుణంగా పాట మారినపుడు మార్పు చాలా కనిపిస్తుంది. ఈ మార్పునే 'విప్లవీకరణ' అంటాం. ఇది 'పోరాట పాట,కు అనివార్యంగా సిద్ధించే ఒక లక్షణంగా చెప్పవచ్చు. మళ్ళీ ప్రజలకు అందించడమనే అంశానికి అనుగుణంగా విప్లవీకరణ జరుగుతుంది. విప్లవీకరణ రెండు రకాలుగా జరుగుతుంది. ఒకటి. కేడరు, కార్యకర్తలు, కళాకారులు విప్లవీకరించడం. రెండు గ్రామజీవులైన ప్రజలు విప్లవీకరించడం.

## మొదటిరకం విప్లవీకరణ

ప్రజా పోరాటంలో ప్రజల కోసం పనిచేసే యంత్రంలో ఒక మరగా ఉన్న కార్యకర్తలు, కళాకారులు పోరాటం పట్ల తమకు గల మమేకాన్నిబట్టి పాటలు రాస్తారు. ప్రజలతో గల సంబంధాలనుబట్టి, రాజకీయ జీవితాన్నిబట్టి ఈ పాటల నిర్మాణం ఉంటుంది. ఏదీ ఏమైనప్పటికీ వీరు 'ప్రజల కోసం పాట' అనే ధ్యేయంతోనే పని

చేస్తారు. కొంతమంది పాటలు రాసినా అవి ప్రచారక్రమంలో మౌఖిక వ్యాప్తిలోకి మారతాయి. ఆ క్రమంలో పాటలో ఎన్నో మార్పులు చేర్పులు జరుగుతాయి.

ఇకపోతే పోరాట దశను బట్టి కవుల విషయ పరిజ్ఞానాన్నిబట్టి, వ్యక్తీకరించే తీరునుబట్టి ఉంటుంది. కవే గాయకుడైతే, ఒక రకంగా ఉంటుంది. కవి కళాకారుడైతే మరొక రకంగా ఉంటుంది. వీరి చేతుల కదలిక, ముఖంలో భావప్రకటన, అడుగులు వేసే తీరునుబట్టి పాట స్వరూప స్వభావాలు ఉంటాయి.

ఈ పాటలు ఎక్కువగా ప్రచారం చేయడం కోసం ఉద్దేశింపబడతాయి. ఈ పాటలకి సంస్థాగతమైన ప్రచార పద్ధతులు ఉపయోగిస్తారు. అచ్చులో కూడా రావడానికి అవకాశాలున్నాయి. ఈ విధంగా ఈ పాటలు పోరాటంలోనే కాకుండా బయటి ప్రపంచంలో కూడా వ్యాప్తి చెందుతాయి.

ఈ పాటలు ప్రత్యేకంగా ఆలోచించి రాయడం జరుగుతుంది. ప్రజల్లోంచి వచ్చిన వాళ్ళైతే పాడడం, రాయడం ఏక కాలంలో జరుగుతుంది. ఈ పాటల్లో పదాలుఏ రకొని వాడతారు. ఆర్థిక, రాజకీయ పదాలు ఎక్కువగా పడతాయి. అన్యదేశ్యాలని తెలిసినప్పటికి వాడతారు. అలాంటప్పుడు యతి ప్రాసల సవరింపులు కూడా చేయడం జరుగుతుంది. ఉదా: స్టెన్‌గన్‌కి వేరే పర్యాయపదం లేదు కాబట్టి, అలాగే ఉపయోగిస్తారు. కాబట్టి యథావిధిగా ఆ పదాన్నే వాడతారు. కాని ప్రజలు మాత్రం 'టెన్ను' అని మారుస్తారు. లేదా టెన్నులు, గన్నులు అని రెండుగా చేస్తారు. 'టెన్ను' పదం తెలియని ప్రజలు గన్నులనే అంటారు. చివరకు స్టెన్‌గన్ గన్ను మామూలు పదంగా మారుతుంది.

ఈ పాటలు "ప్రజలోంచి ప్రజలకి" కాకుండా, "ప్రజలలో ఒకరినుండి ప్రజలకు" అనే పరిధిలో ఉంటాయి. వీరు పోరాటంలో పాల్గొంటూ పాటలు రాస్తారు. ఈ వ్యక్తులు పార్టీలో ప్రజలలో గుర్తింపు కలిగిన వారు. వీరు రాసిన పాటలకు కూడా ఆ వ్యక్తి పేరుతో గుర్తింపు కలుగుతుంది. ఇలాంటి పాటలకు 'మౌఖిక పాటల లక్షణాలు' వర్తించవు. రచయిత పేరు తెలుస్తుంది. రాసిన కాలం తెలుస్తుంది. అచ్చులో వచ్చి ఉంటుంది. అందువల ఇది సాధారణ జానపద పాట పరిధిలోకి రాదు. అయినప్పటికీ ఇది పదహారణాల ప్రజల పాటగా చలామణి అవుతుంది. ప్రజల కోసం పనిచేసే క్రమంలో పాట కూడా ప్రజా స్వభావాన్ని పొందుతుంది. ఆ పాటని ఉపయోగించుకునే ప్రజలకు రచయితతో, బాణీలో సంబంధంలేదు. మౌఖిక వ్యాప్తిలో పాట ప్రచారం పొందుతుంది ఆలాంటి పాట ప్రజలలోనే జీవిస్తుంది. అచ్చులో దాని జీవితం నిక్షిప్తమైనా ప్రజల నోళ్ళలో అది సజీవంగా ఉంటుంది.

కవే గాయకుడైతే (poet - Singer) ఆ పాట బాణీని అలాగే ప్రచారం చేస్తాడు. అలాగే ప్రజాదరణ పొందుతుంది.

ఇకపోతే బాణీలో చాలా మార్పు వస్తుంది. ప్రజలకు సంబంధించిన బాణీ ఆ పరిధిలోనే చాలా మార్పు చెందుతుంది. వేదికనెక్కి పాడే పాటలకు ఒక వాతావరణం ఉంటుంది. గాయకుడు - శ్రోత పరిధి ఏర్పడుతుంది. వేదిక లేకపోయినప్పటికీ సమూహం కోసంపాడేపాటకైనా ఇదేవిధంగా ఉంటుంది.

ఈ పరిధిలో పాటలో లేని కొన్ని కొత్త లక్షణాలు చేరతాయి. పాట ధ్వనిలో మార్పు వస్తుంది. బాణీకి కొత్త ఉత్తేజం, ఊపు వస్తాయి. అడుగులు, చేతుల కదలికల ద్వారా ఎక్కువగా పాట భావం వెల్లడవుతుంది. ఈ దశలో పాట కేవలం 'గానం' వరకే పరిమితం కాదు. ఆ స్థాయిని మించి ఎదుగుతుంది. పోరాటకాలంలో ఇలాంటి పాటలే ఎక్కువగా వెలువడ్డాయి. అంతేకాదు మామూలు పాటలను అవసరం నిమిత్తం వేదికలమీద పాడినా వాటికే ఈ స్వభావం కలుగుతుంది. దీనికి ఉదాహరణగా సుద్దాల హనుమంతు, తిరునగరి రామాంజనేయులు పాటలను పేర్కొనవచ్చును. వీరు గాయకులు కూడా కావడం వల్ల సహజంగా ఈ స్వభావంతోనే పాటలు రాశారు.

ఈ పాటల్ని ప్రజల్లోంచి తీసుకొని తిరిగి ప్రజలకు అందిస్తారు. ఈ కవి గాయకులు సాధారణంగా ప్రజలలో ఒక భాగంగా ఉంటారు. వీరు ప్రజల నుండి ఎడంగా ఉండరు. ఆ కారణంచేత ఈ పాటలు కూడా ప్రజల పాటలే అవుతాయి. ఈ పాటలు ప్రజలకు చాలా అవసరపడ్డాయి. విని ఆనందిస్తారు. ఉద్రేకానికీ లోనవు తారు. అందులో తమ పోరాటమే ఉంటుంది కాబట్టి అవి తమ పాటలుగానే భావిస్తారు. అందుకే వాటిని మళ్ళీ పాడుకుంటారు. తాము కూడా ఆ గాయకుల బాణీల మాదిరిగానే పాడడానికి ప్రయత్నిస్తారు. సాధ్యంకాకపోతే నిస్సంకోచంగా మార్చేసి తమకు అనువైన గానరీతితో పాడుకుంటారు. అందుకే ఈ పాటలకు చాలా బాణీలు కనిపిస్తాయి.

## రెండోరకం విప్లవీకరణ

పనిపాటల్లో శ్రమజీవనంలో పాడుకునే పాటల్లో పోరాట వస్తువుని మాత్రమే పెడతారు. ఈ బాణీలో అంతగా మార్పు ఉండదు. ఎందుకంటే ఇది శ్రమక్రమం లోంచి వెలువడింది. ఇలా వెలువడిన బాణీని విరామకాలంలో పాడుకుంటే కొంత మారవచ్చు. అలాంటి మార్పు శ్రమజీవులే చెయ్యగలరు. ఈ పాటలో పదాలను కూరు స్తారు. శ్రమజీవులే ఈ పాటలను కూర్చడానికి అర్హులు. పాట నిర్మాణంలో మార్పు ఎక్కువగా ఉండదు. ఉదా : ఇలా విప్లవీకరించిన పల్లకిపాట.

ఈ పాటని వేదికమీద పాడడం కుదరదు. ఈ పాటలకు ప్రత్యేకంగా ఒక కవి,

గాయకుడు ఉండడు. ఈ పాటలు పాడే సమూహం, వినే శ్రోతలు ఎక్కువగా వెనుక బడిన వర్గాలవారే. దళితులే ఈ పాటల నిర్మాతలు.

పోరాట కాలంలో కూడా ఎవరూ ఈ పాటలను సంస్కరించ లేదు. ప్రజలను, కళాకారులు చేయడం కోసం సలహాలు ఇచ్చి సరైన దృక్పథం కల్గించే ప్రయత్నాలు చేయలేదు. అందుకే విప్లవీకరించిన పాటల్లో సైతం అద్భుతాలు. అనవసరమైన ఉప కథలు ఎన్నో చోటుచేసుకున్నాయి. కాని నాకు తెలిసినంతవరకు కార్యకర్తలు, కళాకారులు ఉయ్యాలపాటల్ని, రాత్రి విరామ కాలంలో చుట్టి కాముడు పాటగా పాడుకున్నారు.

ఇలా పాడుకోవడం వల్ల పాట పరాయీకరణ చెందినట్లుగా భావించకూడదు. పాట రూపాంతరం పొందినట్లుగా చెప్పు కోవాలి. దీన్నే విప్లవ రూపాంతరంగా చెప్పుకో వచ్చు. ఎందుకంటే ప్రజలు ప్రజల అవసరం కోసమే కేవలం (వాతావరణం మార్చి) మార్చుకొని పాడుకుంటారు. ఇలా పాడుకున్న పాట మళ్ళీ పనిపాటగా మారుతుంది. ఈ పనిపాటల్లో సైతం పోరాటవస్తువే ఉంటుంది. ఈ క్రమంలోనే ప్రజల శ్రమ సంబంధాలనుండి దూరమైన బాణీలు కొన్ని మళ్ళీ ప్రజలు తీసుకొంటారు.. ఉదా: "శ్రీ లక్ష్మి నీ మహిమలు గౌరమ్మ" అనే పాట బాణీని తీసుకొని ఇతివృత్తాన్ని మార్చుకుని స్త్రీలు పాడుకుంటారు. ఈవిధంగా పోరాటంలో కొన్ని బాణీలు మళ్ళీ వారికి చేరువవుతాయి. ఎవరికి సంబంధించిన బాణీలను వారు మళ్ళీ తమపరం చేసు కొంటారు. ఇలా రెండురకాల సందర్భాలో పాడుకునే పాటల్లో యెలాంటి మార్పులు చేర్పులు సంభవిస్తాయో పరిశీలించాల్సిన అవసరం ఉంది. ఇది కొంత ఆసక్తి కలిగిస్తుంది.

ఇకపోతే శ్రమజీవులు తమకై తాము కట్టుకున్న పాటల్ని కేడరూ, కార్యకర్తలు యెవరూ ఉపయోగించలేదు. ఈ పాటలకు తక్కువచోట్లే వారు శ్రోతలుగా మాత్రం ఉన్నారు. అలాంటి పాటలు వారిని చాలా కదిలించాయి. కాని ఈ పాటలజోలికి యెవరూ రాలేదు. సేకరణ కూడా జరుగలేదు. ఐనప్పటికి ఈనాటికి ఆ పాటల్ని తమకై తాము ఇంకా పాడుకుంటూనే ఉన్నారు.

తెలంగాణా పోరాటం రైతులకు సంబంధించింది కాబట్టి ఈ పాటల భాష, భావన వ్యక్తీకరణ, సమయ సందర్భాలు, వాతావరణం శ్రమజీవులందరికి ఒకటే. కాబట్టి మనం ఊహించగలేనంత మంది ఈ పాటలకు శ్రోతలుగా ఉన్నారు. కొన్ని దశాబ్దాలుగా ఈ పాటలు పచ్చగానే ఉన్నాయి.

'కలిక కామాక్షి' కథను (పే. 21) తమకు అనుగుణంగా మార్చుకొని పాడుకు న్నట్లే పోరాట కథలను, సంఘటనలను తమ పాటలో మిశితం చేసుకుంటారు. నాట్లు కలుపు, కోత పాటల్లో పనిని బట్టి కథ పెరుగుతుంది. సమయాన్ని బట్టి గానం

పునరుక్తి ఆగ్రుతుంది. ఈ పాటల్లో శిష్టులు భావించే శిల్పం పనిపించడానికి వీల్లేదు. పోరాట ఇతివృత్తం వాళ్ళని కదిలిస్తే పని త్వరగా సాగుతుంది. అవయవాలు, కండరాల చలనం వేగం పెరుగుతుంది. దానికనుగుణంగా పాట సాగుతుంది. ఇది సాధారణ కథలు పాడుకున్నప్పటికన్నా వేగంగా పని జరుగుతుంది.

పోరాటంలో ఉన్న ప్రజలు తాత్కాలిక అవసరాలకోసం సులభమైన పాటలను, కళారూపాలనూ వినడానికి ఆసక్తి చూపారు. వాటి ప్రేరణతో పోరాడడానికి ఉత్సాహాన్నీ, విజయం పొందడానికి విశ్వాసాన్నీ, తమ దీక్షని చెప్పుకోవటానికి సమైక్యభావాన్ని పాటల్లో వెలువరించుకొన్నారు. తమ ఇష్టాన్ని తామే పాటల రూపంలో వెలువరించుకున్నారు. ఇలా వెలువరించుకోవడంలో సాహిత్య ప్రమాణాలను ఏమాత్రం పరిగణనలోకి తీసుకోలేదు. వారికి కావలసినది తమ భావాలను సహచరులతో పంచుకోవటమే. తాము నిర్వహిస్తున్న మహత్తరమైన కార్యంలో విజయం పొందడమే వారు కోరుకున్నారు.

ప్రజాసాహిత్య కళారూపాలు మొదట ప్రజాదరణ పొందుతాయి. అలా ప్రజాదరణ పొందిన పాటలు సమష్టిపవుతాయి. అలా "సమిష్టి" అయిన పాటలు అనుభవమూ కళానిపుణతలతో ప్రమాణాలు పెంచుకుంటాయి. కళారూపాల స్థాయి పెరగడమంటే ఆ కళారూపాల ద్వారా మరింత బలంగా ప్రజలలో చైతన్యం కలిగించటమే.

లిఖిత ప్రక్రియలవలె మొదటే ప్రమాణాల స్థాయికి ఊహించి ఆ మేరకు నాలుగుగోడల మధ్య మెరుగులుపెట్టరు. ప్రజల్లో వ్యాప్తిచెందడం వల్లే ప్రమాణాలస్థాయి పెరుగుతుంది. కళాకారులైన ప్రజలు కళారూపాలను తీర్చిదిద్దుతారు. క్రమశిక్షణ వల్ల కళారూపాల స్థాయిని పెంచుతారు. ప్రదర్శనలో దొర్లిన తప్పులను గ్రహించి ఆ తరువాత ప్రదర్శనలో సరిదిద్దుకుంటారు. ఇలా రెండు రకాలుగా ప్రజలే కళారూపాల ప్రమాణాలను పెంచుకుంటారు.

ఒక ప్రాంతంలో ఉన్నతమైన కళావిలువలతో (భాష, భావ, వ్యక్తీకరణ) పాటలు, కళలు, ప్రచారంలో ఉన్నాయంటే ఆ ప్రాంత ప్రజలు ఎక్కువ చైతన్యవంతులై ఉండటమే కాకుండా ఇతరప్రాంతపు ప్రజలను చైతన్యవంతుల్ని చేయడానికి కళావ్యాప్తికి దోహదం చేస్తున్నారన్నమాట. అయితే ప్రమాణాల పెరుగుదలవల్ల అన్ని చోట్లా ప్రజల చైతన్యం పెరిగిఉంటుందని చెప్పలేం. సాంస్కృతికరంగంలో పనిచేసే కొంతమంది కార్యకర్తలవల్ల కళారూపాలస్థాయి పెరగవచ్చు. పోరాటం వ్యాప్తిచెందే కొద్దీ, పోరాటం తీవ్రతరమవుతున్నకొద్దీ - ప్రమాణాలస్థాయిలో కొంతభేదం ఉంటుంది. ఈ భేదాన్ని అధ్యయనంచేస్తే పోరాట సాహిత్యకళారూపాల గురించి కొన్ని కొత్త విషయాలు బయటపడతాయి.

తెలంగాణా పోరాటంలో నాయకులు, దళకమాండర్లు మధ్యతరగతికి చెందినవారు. దళసభ్యులు. కేడరూ, చాలావరకు అట్టడుగువర్గాలకు చెందినవారే. చదువుకొన్న కొంతమంది దళాలలో పనిచేసినప్పటికీ, ప్రజలతో పనిచేస్తూ, పూర్తిగా ప్రజలలో కలిసిపోయారు. 1946 చివరినుండి అలా కలిసిపోవడం తప్పనిసరైంది. కేడరు ప్రజలకు ముందుంటారు. వీరికి ఉన్నత ప్రమాణాలుగల సాహిత్యం పరిచయమై ఉంటుంది. ప్రజాసాహిత్యంలోని ఉన్నత ప్రమాణాలుగల వాటినే వీరు ఇష్టపడతారు.

సెంట్రల్ ప్రావిన్సు కమిటీ (కలకత్తా)వారు ఆంధ్రప్రాంత నాయకత్వానికిమార్గ దర్శక సూత్రాలను ఇచ్చేవారు. వీరి సూచనలమేరకు నిర్ణయాలుండేవి. ఈ నిర్ణయాలు పోరాటరంగంలోని దళాలకు మౌఖికంగా గాని సర్క్యులర్ల ద్వారా గానీ, అందేవి. ఈ నిర్ణయాలను ప్రజలకు కేడరు అందించేది. కొన్నిచోట్ల వీటిని పాటల ద్వారా ప్రచారం చేశారు. చాలాచోట్ల ప్రజలే కేడరు చెప్పిన విషయాలను పాటలుగా పాడుకున్నారు. ఈ పాటల ద్వారా విషయం పాకిపోయేది. అయితే ప్రజలకు అయిష్టంగా ఉన్న నిర్ణయాలను (తాటిచెట్లను నరకడం) కేడరు, పాటలద్వారా చెప్పలేదు. ప్రజలు పాడు కోలేదు. పైగా కాంగ్రెస్, కమ్యూనిస్టులుకలిసి ఉమ్మడిగా యిచ్చిన ఈ కార్యక్రమాన్ని ప్రజలు వ్యతిరేకించారు. ఆ తరువాత కల్లుచెట్లు అనవసరంగా నరికారని కాంగ్రెస్‌వారు కమ్యూనిస్టులపై పాటలురాసి ప్రచారంచేశారు[39] ప్రజలకు వ్యతిరేకమైన భావాలు ఉన్న ట్లయితే అవి త్వరగా మాయమైపోయేవి. రంగంలో నిలవగలిగిన పాటలకే ప్రమాణాలు పెరిగే అవకాశం ఉంటుంది. కేడరుకు ప్రత్యేకంగా సాహిత్యకళారూపాలు తయారుచేసి ఇవ్వలేదు.

కళారూపాల స్థాయి పెరగడానికి, అభ్యాసం పొందిన కళాకారులు, నిపుణులు కొంత దోహదంచేస్తారు. పోరాటపు అవసరాలు సాంస్కృతికరంగంలో పరిచయంగల నాయకత్వం ఉన్నచోట్ల ఈ సాహిత్య కళారూపాలస్థాయి పెరిగింది. స్థాయి పెరిగిన పాటలు కొన్ని చరిత్రలో స్థిరంగా నిలిచిపోయాయి. అలాంటివాటిలో కేవలం ప్రజల గుండెల్లోంచి దూసుకువచ్చినవి కొన్ని, కేడరు వెలువరించినవి కొన్నిఉన్నాయి.

అయిదేళ్ళ తెలంగాణా రైతాంగ పోరాటంలో మొదటిదశలో ఒకటి రెండు చోట్లతప్ప సాంస్కృతిక రంగంలో కేంద్రీకృత నాయకత్వం ఎక్కడాలేదు. భేదఖలీ పోరాటాలు, స్థానిక పోరాటాలు అప్పటికప్పుడు వెలువడినట్లే, సాహిత్యకళారూపాలు అలాగే వెలువడ్డాయి. అందువల్ల నాయకత్వం అజమాయిషీలో ఒక క్రమమార్గంలో పెట్టడానికి వీలులేకపోయింది.

సాహిత్య కళారూపాలు ఎక్కువగా ప్రజలే తయారు చేసుకొన్నారు. మిగిలిన కొన్ని కళారూపాలు కేడరు ప్రజలనుండి నేర్చుకొని మార్పులు చేర్పులతో మళ్ళీ ప్రజలకు అందించింది. ఇలా రెండురకాలుగా పోరాట సాహిత్య కళారూపాల సృజన జరిగింది.

ప్రజల జీవితాలను పరిశీలించకుండా ప్రజల సాహిత్యంతో పరిచయంలేకుండా ప్రజల పోరాటం, వాంఛితాలు ఏమిటో తెలియకుండా రాసిన కవుల రచనలు అక్షరాల్లో బందీలయ్యాయేకాని అవి వ్యాప్తి పొందలేదు. అలాంటి రచనలు కూడ సంఖ్యాపరంగా ఎక్కువ మొత్తంలోనే ఉన్నాయి. ఇవి మౌఖిక రూపానికి చెందకుండా ప్రజలభాషకి దూరంగా, ప్రజల అవసరాలకి ఎడంగా ఉండడంవల్ల రాసినవారు ఎంతటి నిపుణులైనా, పండితులైనా ఆ పాట ప్రజలను చేరలేదు. ఈ రాత పాటలకు ప్రయోజనం, భవిష్యత్తు లేకుండా పోయింది. ప్రజా కళాకారులకు సంగీత నృత్యాలతో కూడ పరిచయం ఉంటుంది. వారు సంగీతాన్ని ప్రత్యేకంగా ఎక్కడా ఉపయోగించరు. నృత్యంకూడా అంతే. సాహిత్యం, సంగీతం, నృత్యం (మాట, పాట, ఆట) ఈ మూడింటినీ ఏకకాలంలో ఉపయోగిస్తారు. ఈ మూడు వేర్వేరుగా కాకుండా సామూహికాంగా ప్రదర్శిస్తారు. నిపుణులైన వృత్తి కళాకారులు కూడా ఈ మూడింటి సహాయంతో కళాప్రమాణాల స్థాయిని పెంచుతారు.

పోరాటకాలంలో ప్రజాసాహిత్య కళారూపాలు పోరాటాన్ని పెంచేవిగా వచ్చాయి. కానీ, పోరాటానికి అతీతమైన స్వభావంతో రాలేదు. పోరాటానికి అవి ఆజ్యం పోశాయి. పోరాటం కొంగున భాస్వరమై మండాయి. ప్రజలలో పోరాట భావననీ, ఆకాంక్షనీ, ఇనుమడింపచేయడంలో ఎంతో ఉపయోగపడ్డాయి.

పోరాటకాలంలో పోరాట ప్రభావంతో చదువుకొన్న కవులు రాసినగేయాలు, కావ్యాలు, పోరాటానికి అందని దూరంలో వెలువడటమే కాకుండా పోరాట స్వభావానికి భిన్నంగా వెలువడ్డాయి. ప్రజల వర్గరాజకీయాలను ప్రజలకు దూరమైన కళారూపంలో చెప్పడం జరిగింది. అందువల్ల రైతాంగ పోరాటంలో అవి ఒక భాగం కాలేకపోయాయి. అంటే పోరాట అవసరాలకు అప్రయోజనంగా, అప్రదానంగా ఉండిపోయాయి. ఇవి ప్రజల విప్లవ పోరాటానికి లోబడిలేవు. కేవలం శ్రామికవర్గ రచనలు మాత్రమే పోరాటానికి లోబడి పోరాటాన్ని ముందుకు తీసుకుపోగలిగాయి. అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి, మొదలైన సంస్థల్లో మధ్యతరగతి రచయితల కృషి ఎక్కువగా ఉంది. తెలంగాణాలోని కవులు ఎవరూ అందులో సభ్యులు కాదు. పోరాటంతో సంబంధం ఉన్న కవులు వివిధ దశలలో తమ కర్తవ్యాన్ని నిర్వ

హించారు. (సుంకర మొదలైనవారు) పీరు తెలంగాణా సరిహద్దు ప్రాంతాలో పర్యటించి నాటకాలు వేశారు. ప్రజల జీవితాలుచూసి పాటలు పాడారు. సుంకర, వాసిరెడ్డితో కలిసి తెలంగాణా ప్రాంతం పర్యటించిన తరువాత 'మాభూమి' నాటకం రాశారు. ఈ కవులు పోరాటానికి అవసరమయ్యే పాటలు రాయడంలో సఫలీకృతులయ్యారు. దానికి కారణం ఆనాటి పోరాటంపట్ల వారి నిబద్ధతే అని చెప్పవచ్చు. ఈ కోవకిచెందిన కవులుతెలంగాణా నుంచి వచ్చిన వారితో పోరాటం గురించీ, గ్రామీణ జీవనం గురించి ప్రజల త్యాగాల గురించి ముచ్చటించి ఎన్నో ఆసక్తిదాయకమైనవిషయాలు తెలుసుకోనేవారు. పత్రికల్లోని రిపోర్టులు, వార్తలు చదివేవారు. రాజకీయ నాయకులతో చర్చలు జరిపేవారు. ఈవిధంగా ప్రజల ఆశయాలను, పోరాట ఉద్దేశాలను తెలుసుకొని పాటలు, కళారూపాలు వెలువరించారు.

## పాదసూచికలు

1. దాశరథి, 1946, తెలంగాణా విప్లవ గీతాలు, ప్రజాశక్తి, పే. 13.
2. 1945-46లోనే కమ్యూనిస్టు పార్టీ ఈ నినాదం ఇచ్చింది. 29-1-1946 నాటికే పుచ్చలపల్లి సుందరయ్య, విశాలాంధ్రలో ప్రజా రాజ్యం రాశారు. ఈ పుస్తకాన్ని ప్రజాశక్తివారు ప్రచురించారు.
3. దాశరథి, 1946, వీర తెలంగాణా, "తెలంగాణా విప్లవ గీతాలు," ప్రజాశక్తి. పే. 15.
4. దాశరథి, 1946, తెలంగాణా విప్లవ గీతాలు, ప్రజాశక్తి.
5. యన్. రావు, 1973, "నిజాం నిరంకుశత్వం," తెలంగాణా పోరాట గేయాలు, పే. 109. ధనిక రైతాంగానికి తమ వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకోవడానికి, స్వేచ్ఛగా ముందుకు సాగడానికి, భూస్వామ్య పెత్తనం అడుగడుగునా అడ్డు పడింది. ఈ విషయం శ్రీమతి స్వరాజ్యం గారితో చేసిన ఇంటర్వ్యూలో చెప్పారు.
6. సుద్దాల హనుమంతు, 1983, సుద్దాల హనుమంతు పాటలు, పే. 14.
7. యన్. రావు అక్టోబరు, 1947, నవయుగ (మాస పత్రిక)
8. శ్రీ శ్రీ. మహాప్రస్థానం, 1975, విశాలాంధ్ర, పే. 24,
9. విరసం, తెలంగాణా పోరాట పాటలు 1972, మొదటి భాగం, పే. 74. ఇందులో పేరు ఇవ్వలేదు. కవి యాదగిరి అని ప్రచారంలో ఉంది.

10. గోపాలకృష్ణ, (26-3-1978) "తెలంగాణా రైతాంగ పోరాటం నాటి సాహిత్యం" ఆంధ్రభూమి.

11. అజ్ఞాతకవి, 1972, తెలంగాణా పోరాట పాటలు, మొదటి భాగం, విరసం, పే. 34

12. సుద్దాల హనుమంతు, 1983, సుద్దాల హనుమంతు పాటలు, పే. 21.

13. పై- పే. 20.

14. పుచ్చలపల్లి సుందరయ్య, 1983, వీర తెలంగాణా విప్లవ పోరాటం-గుణ పాఠాలు, పే. 100.

15. మహీధర రామమోహనరావు గారితో మాట్లాడినప్పుడు ఊవర బాంబు గురించి తమ నవలలో రాసినట్టుగా చెప్పారు.

16. రజాకార్లకు వ్యతిరేకంగా పోరాడిన స్త్రీలను చెరిచి మర్మాంగాలలో గుర్రపు వెంట్రుకలను కత్తిరించి పోసిన సందర్భాలలో అరటి పండుతో అలాంటి అపాయాలనుండి తప్పించారు. ఈ విధంగా ఎన్నో రకాలుగా పోరాటంలో ఆటు పోట్లకు తమ అనుభవాన్ని ఉపయోగించారు.

17. దొర గుండాలు రోజు ఉదయం 11 గం॥ లకు స్నానం చేయడానికి ఊరి బయట ఉన్న బావికి పోతారు. అప్పుడు దొర వడ్డీలకు ఇచ్చిన కాగితాల లెక్కలు చూసుకుంటూ ఉంటాడు. ఆగది రెండో అంతస్తులో ఉంది. ఏమాత్రం అలికిడి అయినా అతడు తుపాకులు అందుకుంటాడని అందుకే అతనికి ఎలాంటి సమయం ఇవ్వకుండా గడి ద్వారాన్ని ముట్టడించి లోనికి వెళ్ళి కాల్పులు సాగించాలని చెప్పింది.

18. తిరునగిరి రామాంజనేయులు, 1973, "పిలుపు," తెలంగాణా పోరాట గేయాలు, పే. 23.

19. -పై- పే. 24.

20. సుద్దాల, 1983 సుద్దాల హనుమంతు, పే. 24.

21. (ఎ) చూ. వందేమాతరం వీరభద్రరావు, వందేమాతరం రామచంద్రరావు, 1949 హైదరాబాదుపై పోలీసు చర్య
(బి) ఆంధ్రపత్రిక (దిన), 2-12-1948.

22. తిరునగిరి రామాంజనేయులు, 1973, తెలంగాణా పోరాట గేయాలు, పే. 21.

23. -పై- పే. 27.

24, -పై- పే. 28.

25. -పై- పే.22.
26. -పై-
27. కమ్యూనిస్టు పార్టీ కమిటీ సమీక్ష (నల్లగొండ), నైజాం వ్యతిరేక పోరాటం, పే. 22.
28. "కమ్యూనిస్టుల వర్గవిభజన, దళంగా వ్యవహరింపబడుతుంది. ప్రతి దళంలో ఉండే 15 మంది సభ్యులలో ఒకరు ఆర్గనైజరు, ఒకరు కెప్టన్, మరొకరు అసిస్టెంటు కెప్టన్‌గా ఉంటారు. ప్రతి దళానికి కొన్ని గ్రామాలు కేటాయింపబడి ఉంటాయి. దళాధిపతులు తమ ఆధీనంలోని నిర్ణీత విధానానుసారం సంఘాలు స్థాపిస్తూ తమ కార్యకలాపాలను తాలూకా అధికారులకి, వారు జిల్లా అధికారులకీ వివరంగా తెలుపుతుంటారు."
వందేమాతరం వీరభద్రరావు, వందేమాతరం రామచంద్రరావు, 1949, హైదరాబాదుపై పోలీసు చర్య, పే. 83.
29. కోగంటి గోపాల కృష్ణయ్య, తెలంగాణా పోరాట గేయాలు, పే. 101.
30. విరసం, 1977, తెలంగాణా పోరాట పాటలు (రెండో భాగం) చివరి పేజి
31. విరసం, 1972, తెలంగాణా పోరాట పాటలు, మొదటి భాగం, పే. 1.
32. దళాల ఏర్పాటు కొన్ని గ్రామాలలో మొదటి పార్టీ ఏర్పాటు చేసింది. మరికొన్ని గ్రామాలలో సంఘ సభ్యులే దళాలుగా ఏర్పడ్డారు. మొదటి దశలో ఇలా ఏర్పడిన దళాలలో అరవై, డెబ్బై మంది ఉండేవారు. వీటిని 'కంపెనీ దళాలు' అనేవారు.
33. పుచ్చలపలి సుందరయ్య, 1983, వీర తెలంగాణా విప్లవ పోరాటం-గుణపాఠాలు, పే. 90.
34. (ఎ) రావు రాజేశ్వరరావు, 1975, "నైజాం వ్యతిరేక పోరాటం," కోదాటి నారాయణరావు షష్ట్యబ్ది సంచిక, పే. 147.
(బి) ఆనాటి లిఖిత ఉత్తర ప్రత్యుత్తరాలు. (చూ. అనుబంధం.)
35. "సరిహద్దు ప్రాంతాలలో జరిగే సంఘటనలకు స్టేట్ కాంగ్రెసుకూ ఎట్టి సంబంధమూ లేదు. అది స్టేట్ కాంగ్రెస్ కార్యక్రమం కాదు. మా ఉద్యమం బొత్తిగా అహింసపై ఆధారపడి యున్నది."
పేరు తెలియదు, హైద్రాబాదు సమస్య, పే. 147.
36. పుచ్చలపల్లి సుందరయ్య, 1983, వీర తెలంగాణా విప్లవ పోరాటం-గుణపాఠాలు, పే. 155.

37. తిరునగిరి రామాంజనేయులు, 1972 "తెలంగాణా భూమి," తెలంగాణా పోరాట గేయాలు పే. 64.

38. కమ్యూనిస్టు పార్టీ, కమిటీ సమీక్ష (నల్లగొండ) నైజాం వ్యతిరేక పోరాటం, పే. 34.

39. అపాయమెరుగని గొండ్లను బట్టి
చెవ్వులు ముక్కులు నరికి తాటి
గొలలు కోసి ముస్తా జటల నరికి
వాళ్ళ నానా హింసలు బెట్టి

సేకరణ- మేదుగుల బుచ్చయ్య, రయిగాని పేట

# 6

# సాయుధ పోరాట సాహిత్యం

## (సైనిక చర్య - పోరాట విరమణ)

## (1948-1951)

పోరాటకాలంలో తీరిక సమయం అంతగా లభించదు. అసలు పోరాటం నిత్య కార్యక్రమం అయిపోయింది. అంటే పోరాటమే వారికి మిగిలిన పని. పని పాట అనే ప్రయోగం ఈ దశలో వచ్చిన పాటలకు చక్కగా నప్పుతుంది. అందుచేతనే పాటలు తక్షణం తయారయ్యాయి. పాటకోసం ఆలోచించడం, కుస్తీ పట్టడం ఉండదు. సహజంగా అనుభవమే పాటగా దొర్లిపోతుంది. ఆ పాటకు కళాస్థాయికంటే ప్రబోధస్థాయి, వర్ణనస్థాయి అధికంగా ఉంటాయి. ప్రాచీన ఆదిమ గీతాలలో ఉండే నిసర్గత ఈ దశ లోని పాటలలో మనకు వ్యక్తమవుతుంది. ప్రజలు అప్పటికప్పుడు తమకు తోచిన బాణీలలో యథాతథంగా పాడుకుంటారు. బాణీని కూర్చడానికీ, అందులో బలంగా వ్యక్తం చేయడానికి ప్రత్యేకంగా ప్రయత్నాలు జరగవు. పోరాట దశలో ప్రజలు కొత్త విషయాలను ఉన్నవి ఉన్నట్టుగా, మార్పులేకుండా పెట్టేశారు. పాత బాణీలో, భాషలో పాడుకున్నారు. సంప్రదాయంగా వస్తున్న వ్యక్తీకరణ పద్ధతిని ఎక్కువగా మార్చలేదు. ప్రజలు చేసే ఇలాంటి కొద్ది మార్పులుకూడా ప్రజాభివ్యక్తీకరణకు దగ్గరగా ఉంటాయి. ఈ పాటలు వారి జీవితంలోంచి వెలువడటమే కాకుండా, అందులో ఒక భాగంగా ఉంటాయి. పోరాట జీవితావసరాలకు అనుబంధంగా వెలువడే పాట పోరాట జీవితం లోంచే వెలువడుతుంది.

ఇకపోతే కేడరు వెలువరించే పాటలలో 'గానశైలి' ఎక్కువగా ఉంటుంది. కళాకారుల ప్రతిభ పాటలలో చోటుచేసుకుంటుంది. అదనంగా సంగీతాన్ని జతచేస్తారు. పాటని 'ప్రదర్శన' స్థాయికి మలుస్తారు. పోరాటాల తరువాత వచ్చే "విప్లవ పరిస్థితు"ల్లో

ఈ పద్ధతి మరింత శక్తివంతంగా మారుతుంది. పోరాటాలు విప్లవ దశకి దారితీస్తాయి. అప్పుడు విప్లవీకరణ చెందిన పాటలకు, ప్రజా పోరాట పాటలకు మధ్య కొంత భేదం కనిపిస్తుంది.

ప్రజల పాటలు నోటి పాటలు కావడంవల్ల వాటిమీద ఇతర కవి, రచయితల దృష్టి నిలవదు. ఆ కారణంగానూ, సామూహికం కావడంవల్లనూ కొన్ని తావులో ప్రజా వ్యతిరేక భావాలు చోటుచేసుకోవడానికి ఆస్కారం ఉంది. సైనిక చర్యకు ముందు వచ్చిన పాటలు ఎక్కువగా సభలూ, సమావేశాల్లో (వేదిక) పాడుకొనే వారు. ఆ తరువాత ప్రజలే కవులూ, కళాకారులయ్యారు. శ్రమజీవులే ప్రదర్శకులూ, ఉపన్యాసకులూ అయ్యారు. అప్పుడు వేదిక అవసరం లేకుండా పోయింది.

## సైనిక చర్య

1948 సెప్టెంబరు 13న సైనికచర్య ప్రారంభానికి వారం పదిరోజుల ముందు నుండే కోదాడ, మునగాల దరిదాపులో యూనియన్ పోలీసులకూ, నైజాం పోలీసులకూ ఘర్షణలు జరిగాయి. అప్పటినుండి యూనియన్ ఏదోరూపంలో జోక్యం చేసుకుంటుందని ప్రజలు భావించారు. అంతకుముందు నాలుగైదు నెలలనుండే యూనియన్ ప్రభుత్వం తెలంగాణా ప్రజలకు సహాయపడడానికి వస్తుందని కాంగ్రెస్ కార్యకర్తలు సూచిస్తూనే ఉన్నారు. ప్రజలు కూడా సైనిక చర్య 'ఇదుగో అదుగో' అంటూ ఎదురుచూశారు. కోదాడ కాల్పులను అందుకు సంకేతంగా భావించారు. కానీ కమ్యూనిస్టులు ఆ విష యాన్ని పట్టించుకోలేదు. సైనిక చర్య అంత త్వరగా జరగదని వారు అభిప్రాయ పడ్డారు. కొంతమంది నాయకులు ఆ సమయంలో సైనిక చర్య గురించి ఆలోచించనే లేదు.

కానీ గ్రామాల్లో ప్రజలు వర్షం రావడాన్ని పసికట్టినట్లుగా ఈ సైనిక చర్య విషయాన్ని పసికట్టారు. యూనియన్ ప్రభుత్వం, నైజాం దౌర్జన్యాలను ఆపితే బాగుండునని ఆశించారు. కానీ యూనియన్ ప్రభుత్వం కమ్యూనిస్ట్ల పట్ల శత్రుపూరిత విద్వేషంతో ఉందని ఊహించలేదు.

సంస్థానంలో స్టేట్ కాంగ్రెస్ తమ బతుకులను మార్చలేదనీ, ఎలాంటి సహాయం చేయలేదనీ, తెలుసు. కాని జాతీయ కాంగ్రెస్ నాయకులైన నెహ్రూ, పటేల్ మొ॥ వారు తమకు అండగా నిలుస్తారని భావించారు. అందుకే సైనిక చర్య కోసం కొంతమంది ప్రజలు పోరాటంలో ఉండి కూడా ఎదురుచూశారు. అలాంటి వారిలో కవులూ, కళా కారులూ చాలామందే ఉన్నారు. ముఖ్యంగా ఉప-జాతీయ దృక్పథం కలిగిన దాశరథి, కుందుర్తి మొదలైన వారు తమ కావ్యాలను ఆదశ వరకే రాశారు.[2]

పోలీస్ చర్య కోసం యూనియన్ సైన్యాలు సరిహద్దుదాటి వస్తూంటే పై అభిప్రాయాలు కలిగిన కొందరు ప్రజలు సైనికులకు హారతిపట్టి టాంకులకు దండలు వేశారు. సైన్యాలకు స్వాగతం పలికారు. మిలటరీ సైన్యానికి ప్రధాన కేంద్రమైన సికింద్రాబాదు కంటోన్మెంటుకు వెళ్ళి-

లష్కరు పోదామురో! రంగన్నా! రారో!
మన ఫౌజును సూద్దామురో! సింగన్నా! రారో!
రజాకారు బడాచోరు రాజ్యం పోయిందిరో
నైజాము సర్కరోడు నవ్వులపాలయెరో[3] అని పాడుకొన్నారు.

యూనియన్ సైన్యాలు తమకు సహాయపడడానికే వచ్చాయనీ, తమ జీవితాలను సుఖమయం చేయడానికి నైజాం పోలీసులతో పోరాడే వీరులుగా భావించారు.

కానీ ప్రజల ఆశలు యెంతోకాలం నిలవలేదు. వారం పదిరోజుల్లోనే యూనియన్ సైనికుల స్వభావం తెలిసిపోయింది. వారిని "కాంగ్రెస్ రజాకారులు"గా భావించారు. రజాకార్లు కాంగ్రెస్ వారికో, యూనియన్ సైన్యానికో సరెండర్ అయ్యారు. దళాల చేతుల్లో చిక్కలేదు. నాలుగు రోజుల్లో సైనిక చర్య పూర్తయింది.

యూనియన్‌లో హైదరాబాదు సంస్థానాన్ని కలపగూడదనీ, భారతి సైన్యాల ప్రవేశాన్ని వ్యతిరేకించాలనీ "స్వతంత్ర హైదరాబాద్ నినాదాన్ని" హైదరాబాద్ కమ్యూనిస్ట్ పార్టీ నగర కమిటీ ఒక పత్రికా ప్రకటన చేసింది.[4] ఈ ప్రకటనను ఆసరాగా తీసుకొని కమ్యూనిస్ట్‌లు రజాకార్లతో కలిసి పోయారని భారత ప్రభుత్వం తమకు అనుకూలమైన ప్రచారాన్ని చేసుకొన్నది. కాని ఈ ప్రకటనను ఆంధ్ర కమ్యూనిస్ట్ పార్టీ ఖండించింది.

సైనిక చర్య ప్రారంభించిన మొదటి రోజు నుండే ప్రజలూ, దళాలూ కలిసి రజాకారు కేంపులపై దాడి చేశారు. యెన్నో కేంపులను నేలమట్టం చేశారు. ఆయుధాలను లాక్కొని దాచిపెట్టారు. కొన్నిచోట్ల సైనికులు రజాకార్లను ప్రజల నుండి రక్షించారు. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి దొర గడీనీ, మరిపెడ దేశ్‌ముఖ్ దామోదర్‌రెడ్డి గడనీ, సూర్యాపేట దేశ్‌ముఖ్ గడినీ, విసునూరు రామచంద్రారెడ్డి గడిలోని రజాకార్ల కేంపునూ దాడిచేసి నేలమట్టం చేశారు. అంతేకాకుండా పేరుపొందిన రజాకారు కేంపులను(లద్దునూరు, మోతుకూరు మొ॥ వి) కసికొద్దీ నాశనం చేశారు.

రజాకార్ల పీడ విరగడ కావడంతో గ్రామాలన్నీ కోలహలంగా, ఉత్సాహంగా కళకళలాడాయి. ఊరిబయట రహస్యంగా దాక్కునే దళాలు ఊళ్ళోనే మకాంవేశాయి. రాత్రిళ్ల నిర్భయంగా నిద్రపోయేవారు. చాలా కాలం నుండి గుహల్లో బతికిన బ్రతుకులు

వెన్నెలరోకి వచ్చినట్లైనాయి. అంతవరకు గ్రామరాజ్యాలు ఏర్పడని ఊళ్ళలో గ్రామ కమిటీలు ప్రారంభమయ్యాయి.

ఈ పరిస్థితి ఎంతో కాలం నిలవలేదు. పదిహేనురోజుల లోపునే కాంగ్రెస్ వాలంటీర్లు గ్రామాల్లోకి ప్రవేశించారు. పోరాటం జరుగుతూన్నంత కాలం యూనియన్ ప్రాంతంలో తలదాచుకున్న వాళ్ళంతా యూనియన్ సైన్యాల అండతో తమతమ గ్రామాలకు ప్రవేశించారు. సెప్టెంబరు 25 వ తేదీ తర్వాత నుండి దాదాపు అన్ని ప్రాంతాల్లోనూ కాంగ్రెస్, మిలటరీ దాడులు ప్రారంభమయ్యాయి.[5] దాడులను కొనసాగించడానికి మిలటరీ కేంపులు మోహరించాయి.

దొరలూ, అధికారులూ, కాంగ్రెస్ కార్యకర్తలూ కలిసి తమ భూములను, ఆస్తులను తిరిగి స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించారు. కమ్యూనిస్ట్ కార్యకర్తలను, సానుభూతిపరులను, స్త్రీ పురుషులనే భేదం లేకుండా కొట్టి చిత్ర హింసల పాలు చేశారు. అరెస్టు చేశారు.

సైన్య దాడులు జరిగినప్పుడు తమనితాము రక్షించుకోడానికి, ప్రజలను రక్షించడానికి వీలుగా మళ్ళ ఆయుధాలు పట్టుకోవాల్సిందని పార్టీ హెచ్చరించింది. ప్రజల్లో కలిసి జీవించిన కార్యకర్తలు మళ్ళీ దళాలుగా ఏర్పడి రహస్యంగా తిరిగారు.

ఆ సమయంలో ఒకవైపు ప్రజలను హింసిస్తూ కమ్యూనిస్టుల వల్లనే ప్రజలకు కష్టాలు వచ్చాయని కాంగ్రెస్ కార్యకర్తలు ప్రచారం ప్రారంభించారు. ఈ కాలంలో కమ్యూనిస్టు వ్యతిరేక గేయాలుకూడా వచ్చాయి.

దేశప్రజలను ముందర నడిపి
దేశముఖులను దొరలను దోచినవాళ్ళు
గుట్టల పడ్డరురో కూలన్నా వాళ్ళు
చెట్లల పడ్డరురో రన్నో రైతన్నా — అనే పాటలో కమ్యూనిస్టులు

ఇప్పుడు గ్రామీణ ప్రజలను రక్షించలేరని నిరూపించారు. ఇంకా—

ప్రజాసేవ అన్నారు - ప్రజలు కష్టపడుతుంటె
దెబ్బలెన్నో తింటుంటే - పారిపోతూ ఉంటారు.
మోసగాళ్ళను నమ్మవద్దు - అశాంతి లేపవద్దు
శాంతిని కాపాడవలయు - శత్రువులను దునుమాడవలయు
పట్టి బంధించవలయు - అల్లరుల నణచవలయు
హాయిని చేకూర్చవలయు - స్వతంత్రమనుభవించవలయు[6] — అని

కమ్యూనిస్టు వ్యతిరేకంగా పాటలుపాడి ప్రచారం చేశారు. రజాకార్ల పీడ విరగడై

పోయిందని, ఎన్నికలు జరిపి ప్రజలే సర్కారు ఏర్పాటు చేసుకోవచ్చనీ, ఆ సర్కారు వారే ప్రజలకు భూములను, పశువులను పంచి పెడుతుందని చెప్పారు. అందుకోసం—

జాతీయతను నాశనం చేసి - రష్యా రంగుల మొగాలద్ది
రైతుకూలీ మంత్రాల్ చదివి - మాటలు చెప్పే కమ్యూనిస్టుల
పంథాలోని పరమ రహస్యం

కుండ బద్దలుగ కొట్టవలెనోయ్ [7] అంటూ ఊరూరా పాడుతూ ప్రచారంచేశారు.

సైనిక చర్యవరకూ వచ్చిన పాటల్లో జాతీయవాదుల, సామ్యవాదుల మధ్య వైరుధ్యాలు కనిపించవు. ఒకరి పాటల్లో మరొకరిని స్మరించారుకూడా.

జమలాపురం కేశవరావు - శౌర్యవంతుడండో
వెంగలరాయని బోలినవాడు- వీరాభిమన్యుండు
బద్దం ఎల్లారెడ్డిగారు - బహు పరాక్రమశాలండీ [8]

1940-46 వచ్చిన జాతీయవాదుల పాటల్లో రైతుల దైన్యావస్థా, ఆహార సంక్షోభం, నైజాం ప్రభుత్వ పీడన గురించీ రాశారు. ఈ పాటలు పరస్పరం ఉపయోగించుకొన్నారు. జాతీయవాదుల పాటలు ఎక్కువగా సంకలనాల్లో కనిపిస్తాయి. మౌఖిక వ్యాప్తిలో అతి తక్కువగా ఉన్నాయి. పాటలకన్నా కళారూపాలలో వీరు ఎక్కువగా ప్రచారం చేశారు. ముఖ్యంగా బుర్రకథలు. (వివరాలకు చూ. ప్రజా కళారూపాలు) సైనికచర్య తరువాత వచ్చిన కళారూపాల్లో కమ్యూనిస్టు వ్యతిరేకత ఎక్కువగా కనిపిస్తుంది.

చాలా గ్రామాల్లో గ్రామరాజ్య కమిటీలు అదృశ్యమయ్యాయి. పంచుకొన్న భూములను కౌలుమీద సాగుచేయడానికి కొంతమంది రాజీపడ్డారు. మరి కొంతమంది తమంతట తాము లొంగిపోయారు. ప్రజలలో ఏర్పడిన ఈ పరిస్థితిని నిరుత్సాహం అని అనుకున్నారు. అంతేగానీ ఆ పరిస్థితిని తట్టుకొని నిలబడగలిగే వాతావరణాన్ని పార్టీ సకాలంలో ఏర్పరచలేకపోయింది. పార్టీ తన ఎత్తుగడలను వెనువెంటనే ప్రజలకు అందించలేక పోయింది. ప్రజలను ఐక్యంచేసి తన బలాన్ని నిరూపించుకోవడానికి సైన్యం ఎలాంటిఅవకాశాన్నీ ఇవ్వకపోవడం ఒకకారణం కావచ్చు. కాని పార్టీ ప్రమత్తత కూడా తక్కువ కారణంకాదు. సాధించిన విజయాలను నిలబెట్టుకోవడానికి ఆలస్యంగానైనా పార్టీ ఈ కింది కార్యక్రమాన్ని ఇచ్చింది.

విజయాలను నిలబెట్టుకొంటూ దళాలు కొత్త ప్రాంతాలకు విస్తరించాలి. సైన్యం చేసిన దాడులవల్ల ప్రజలు పరాజయం పొందలేదు. శత్రువుపై దెబ్బతీస్తూ ప్రజా విజయాలను స్థిరపరచాలి. శత్రువు ఏజంట్లకు బుద్ధిచెప్పాలి. మళ్లీ పార్టీని నిర్మించాలి.

చిన్నచిన్న గెరిల్లా దళాలను నిర్మించి శత్రువు నెదుర్కోవాలి. కాంగ్రెస్‌పార్టీ స్వరూపాన్ని, స్వభావాన్ని ప్రజలకు వివరించి చెప్పి పోరాటానికి సన్నద్ధంచేయాలి.[9] పార్టీ ఇచ్చిన ఈ కార్యక్రమాన్ని పాటలుగా వెలువరించుకున్నారు. కాని సంఖ్యలో ఇవి చాలా తక్కువగా ఉన్నాయి. కారణం పార్టీ రహస్యంగా పనిచేయడం, తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కోవడమే. నిర్బంధాల మధ్య పాటలు పాడుకోవడం కొన్నిసార్లు సాధ్యం కాదు.

## సైనికచర్య తరువాత

సైనికచర్య తరువాత పోరాట ప్రాంతాల్లో వర్గ సంబంధాలలో ఎన్నో రకాల మార్పులు వచ్చాయి. పెద్ద భూస్వాములు భూమిని అమ్ముకోవడానికీ, కొన్నిచోట్ల వదులుకోవటానికి సిద్ధమయ్యారు. ఇలాంటి కారణాలవల్ల మధ్య తరగతి రైతుకు తన ఆర్థిక విధానాన్ని కొంత మెరుగు పరచుకొనే అవకాశం లభించింది. అంతే కాకుండా యూనియన్ ప్రభుత్వంమీద కొన్ని భ్రమలు ఏర్పరచుకొన్నారు. అందువల్ల ఆచరణలో సాయుధ పోరాటం పట్ల ఆసక్తి పోయింది,

పై ధోరణి సాధారణ ప్రజానీకంమీద కొంత ప్రభావాన్ని చూపింది. అయినప్పటికీ తమ ప్రయోజనాల నిమిత్తం పోరాటాన్ని తుదికంటూ కొనసాగించడానికి శ్రమజీవులు నిశ్చయించుకొన్నారు. అయితే ప్రజాచైతన్యం శత్రువులను దెబ్బకుదెబ్బ తీయగలిగే స్థాయికిలేదు.[10]

కలకత్తా పార్టీ కాంగ్రెస్‌లో యుగోస్లావియా ప్రతినిధివర్గం సూచించిన ఆదేశాల మేరకు ఆంధ్రాకమిటీ పోరాటం కొనసాగించటానికి ఆజ్ఞలు జారీచేసింది. కాని ప్రజా ఉద్యమ స్వభావాన్ని కలిగించడంలో పార్టీ విజయవంతం కాలేకపోయింది.

పోరాటమంటే ఇష్టపడే చురుకైనవారితో కొన్ని దళాలను మాత్రమే ఏర్పాటు చేయగలిగారు. ఈ విధంగా ప్రజాబాహుళ్యం నుండి వేరయిన పోరాటరూపం, నిర్మాణం మళ్ళ కొత్తగా నిర్మించుకోవలసి వచ్చింది. రైతాంగం మినహా రైతు గెరిల్లా పోరాటం సాగించడానికి నిర్ణయించారు.

యూనియన్ సైన్యాలదాడిని తట్టుకొని ప్రజావిజయాలను నిలబెట్టుకోవడం కోసం యూనియన్ ప్రభుత్వ స్వభావాన్ని విప్పిచెప్పే ప్రచారాన్ని కొనసాగించక తప్పలేదు. కాంగ్రెస్ కమిటీలు దొరల ప్రయోజనాలను కాపాడేవే. వాటికి వ్యతిరేకంగా పోరాటం ద్వారా సాధించుకొన్న విజయాలను, గ్రామ కమిటీలను కాపాడుకోవాలనే ప్రచారం ప్రారంభమైంది. ఈ దశలో సూర్యాపేట తాలూకాలో ఒక పాట బహుళ ప్రచారంలో

ఉంది. ' ఓ రైతా రాజీపడా లనుకుంటున్నావా? ఎలుకకు-పిల్లికి మధ్య రాజీ అసంభవం' అనేదే దాని సారాంశం. ఈ పాటను రామన్న గూడెముకు చెందిన పార్టీ సభ్యులౌకరు రాశారు.[11]

కొత్త రాజకీయాల దృష్ట్యా, ఎత్తుగడల మార్పు[12] వల్లా ప్రచారాన్ని అధికతరం చేయాల్సిన అవసరం ఏర్పడింది. అందువల్ల ప్రచార విధానాలు, సాధనాలు మార్పుచెందాయి. సైనికచర్య తర్వాత పోరాటం కొనసాగింపుకోసం మౌళిక రూపాంతో వెనువెంటనే గ్రామాలలో ప్రచారాన్ని ఎక్కువ చేయవలసి వచ్చింది. ఈ కొత్త పరిస్థితులలో పాటలు. తదితర కళారూపాలు ఎక్కువగా "కేదరు" నుంచి వచ్చాయి. ఇప్పుడు కేదరు అంటే "దళాలే"

***కాంగ్రెస్ దారి - ప్రజల గమ్యం :*** ఈ దశలో ప్రజల్లో వ్యతిరేకత బాగా ప్రబలింది. స్టేట్ కాంగ్రెస్ నాయకులైన జమలాపురం కేశవరావు లాంటివారు కూడా యూనియన్ పోలీసుల జోక్యాన్ని బహిరంగంగా ఖండించారు. పోలీసుల చర్య ముగిసిన తరువాత - తెలంగాణా స్పెషల్ పోలీస్ కమీషనర్ పదవిలో ఉన్న నంజప్ప జనజీవితాలను అస్తవ్యస్తం చేశాడు. 'కమ్యూనిష్టులపై దండయాత్ర' పేరుతో భీభత్సం సృష్టించాడు. నంజప్పను విమర్శించడమంటే యూనియన్‌ను విమర్శించడమన్నంత భయంతో ఉన్నారు. అలాంటి క్లిష్ట పరిస్థితుల్లో సర్దార్ జమలాపురం కేశవరావు డోర్నకల్ మహాసభలో నంజప్పకు వ్యతిరేకంగా మాట్లాడి ప్రజలకు ధైర్యమిచ్చారు. ప్రభుత్వం కాంగ్రెస్‌ది అయినా కాకపోయినా ప్రజలపై అత్యాచారాల్ని సహించకూడదని, రక్షకుడిగా వచ్చిన నంజప్ప భక్షకుడిగా వ్యవహరిస్తున్నాడని ఆందోళన వ్యక్తపరచారు. పోలీసుల చర్య తరువాత ఒక్క రజాకార్లు పతనమవడం తప్పితే జనరల్ చౌదరి పరిపాలనలో మరో విధమైన మార్పు రాష్ట్రంలో లేదని ఆయన విమర్శించారు.[13] అలాంటి పరిస్థితుల్లో నంజప్ప పట్ల ప్రజలు వ్యతిరేక భావం కలిగి ఉండటంలో ఆశ్చర్యమేమీలేదు. అలాంటి వ్యతిరేకతే గ్రామాలలో నంజప్పని గేలిచేస్తూ ప్రజలతో పాటలు పాడించింది.

పోలార్ప గుట్టల్లో కమ్యూనిష్టు ఉందాని
లాఠీలు గదిలిస్తివీ నంజప్ప
కమ్యూనిష్టుల బట్టగా * —అని ప్రజలు బహిరంగంగా పాడుకున్నారు. చరిత్రలో కనిపించే నంజప్ప కృత్యాలు ప్రజల పాటల్లో కూడా స్పష్టంగా కనిపించడం గమనించదగ్గ విషయం. కమ్యూనిష్టులనుపట్టడానికి నంజప్ప లారీలతో గుట్టలన్నీ చుట్టుముట్టాడని, ఎదురు కాల్పుల్లో నిలబడలేక చావుదెబ్బతిని 'ఇల్లంద' పారి

పోయాడని పాడుకున్నారు. మరొక ప్రయత్నంలో గెరిల్లా దళాలు అతని 'ఇంజన్ను' కాల్చాయని, పిరికిపందలా అతను పారిపోయాడని ప్రజలు అతని పరాభవాలను పాడుకున్నారు. నైజాంకు యూనియన్ రక్షణ కల్పించడాన్ని ప్రజలు సులభంగా అర్థం చేసుకొన్నారు. నంజప్ప పాటల్లో నైజాం ప్రసక్తి కూడా తీసుకొచ్చారు.

ప్రజల్లో కాంగ్రెస్ వ్యతిరేకత నంజప్ప పదవిలోకి రాకముందునుండీ ఉంది. కాని ఆ తరువాత నంజప్ప వ్యతిరేకత ఒకరకంగా వచ్చి కాంగ్రెస్ వ్యతిరేకతగా బలపడినట్లుగా కనిపిస్తుంది. అందుకే కాంగ్రెస్‌ను "గద్దెక్కి మా గొంతు కొరుకవచ్చావా?" అని ప్రశ్నించారు. అంతేకాదు "నీ బంధువర్గాల నిజరూపు గన్నాము నీ చిలక పల్కుల మోసాన్నిగన్నాము" అని కాంగ్రెస్ వర్గవ్యభావాన్ని ప్రజా కవులు బట్టబయలు చేశారు. "పోట్టకాలే పేదప్రజల పుట్ట పగిలింది. పెను పాములపైన చలిచీమలెగబడ్డాయి." 14 అని తమకు తెలిసిన భాషలో ఎగుర్కొంటామని ధీమాతో చెప్పుకొన్నారు.

యూనియన్ పోలీసులతో పోరాడడానికి నిర్ణయించుకొన్నపుడు ఒక కొత్త పోరాట దశ ప్రారంభమైంది. ఇది పూర్వపు పోరాటదశకన్నా, రూపం కన్నా విభిన్నమైంది. శక్తిమంతమైనది. కొంత సామూహికతని, ప్రజా స్వభావాన్ని కోల్పోయిన ప్పటికీ పాటలు వెలువడడానికి ఇది ఏమాత్రం ఆటంకం కాలేదు. పోరాటదశలో ప్రజలు ప్రధాన పాత్ర వహించకుండా దళాలే ప్రధాన పాత్ర వహించాయి. ప్రజల సహాయ సానుభూతులు ప్రజా వీరుల పట్ల ఆదరం తగ్గలేదు. పైగా పెచ్చింది కూడా. ప్రజలపై జరిగే దౌర్జన్యం, బీభత్సం వల్ల ప్రత్యక్ష పోరాటానికి తాత్కాలికంగా కొంత దూరంగా ఉన్నారు. కొంతమంది వెంటనే ఈ పరిస్థితి గమనించి పోరాటంలోకి వెళ్ళిపోయారు. నిర్లిప్తతకూ, తటస్తతకూ అవకాశం లేని సమయమది. అప్పుడు "విజయమో! వీర స్వర్గమో!" అనే భావన పాటల్లో కూడా వ్యక్తమయింది.

ఎన్ని కష్టాలు వచ్చినా భయంకరమైన ఆపదలు చుట్టుముట్టినా కేడరు ముందుకు పోవడానికే నిర్ణయించుకొంది. సామాన్య ప్రజలకు కాంగ్రెస్ నాయకుల స్వభావాన్ని, దేశ రాజకీయ పరిస్థితిని వివరించి చెప్పింది. ఇందుకోసం దండాగానం, గొల్లసుద్దులు, బుర్ర కథలు చాలా ఉపయోగ పడ్డాయి. ఇవి ప్రదర్శన కళలు. వీటిని ప్రదర్శించలేక పోయినా ఇందులోని పాటల్ని ప్రత్యేకంగా పాడి ప్రచారం చేశారు. ఈ రకంగా రెండు విధాలా కళారూపాలు ఉపయోగపడ్డాయి. వీటిలోనూ. పాటల్లోనూ ఇతర దేశాల రాజకీయ పరిస్థితినీ, ఆ దేశాల ప్రజల గురించీ వివరించారు.

భవిష్యత్తు మీద ఆశ, పోరాటం మీద నమ్మకం కలిగించడంలో పాటలు, కళారూపాలు తమ కర్తవ్యాన్ని విజయవంతంగా నిర్వహించాయి.

ప్రజల ప్రతిఘటన పెరుగుతున్న కొద్దీ మిలటరీ దాడులు ఎక్కువయ్యాయి. చాలామంది ప్రాణాలు కోల్పోయారు. ఎంతో మందిని హింసించారు. కార్యకర్తం కోసం, దళ సభ్యుల కోసం ఊరూరా గాలింపు ప్రారంభమైంది. లోగడ దొరల గడీల్లో క్రూరమానాలు హరించారు. రైతులమీది జుర్మానాలు విధించారు. జుర్మానాలు చెల్లించలేని వారిమీద చిత్రహింసలు జరిపారు. అందుకే యూనియన్ పోలీసు వచ్చిన తర్వాత -

ఇండియన్ సర్కారు ఎవరిదో తెలియదా ?
గుండె నిబ్బరంగా గురిచూసి కాల్చరా !
చేతుల్లో చిక్కిన రైతుకూలీలను
గడిగోడల్ల కాల్చి చంపిస్తుంద్రు
చేతి వేళ్ళలోన సూదులను దిగగొట్టి
కాళ్ళు చెట్టుకు గట్టిరీ - ఊపుచూ
కటిక దెబ్బలు కొట్టరీ !* —అని పాడుకున్నారు.

రజాకార్లు దొరల గడీల్లోనే మకాం చేసి ప్రజలను హింసించేవారు. ఈ నాడు యూనియన్ పోలీసులు కూడా దొరల ప్రయోజనాలను కాపాడటం కోసం దొరలగడీల్లోనే ప్రజలను కాల్చిచంపడానికి పూనుకొన్నారు. అందుకే పైపాటలో ప్రజలు ప్రభుత్వ స్వభావాన్ని బట్టబయలు చేశారు.

"వర్కర్" (1948) మాసపత్రికలో "యూనియన్ యుద్ధ ప్రకటన"లో ధనికవాద రక్షణ కోసం 'యుద్ధం' తప్పదని వ్యగ్యం జోడించి 'క్రాంతిరేఖ' ఒక పాట రాశారు. సైనికచర్యకు ముందు నైజాం ఒక రాజు. ఈ రోజున రాజ ప్రముఖుడు. ఇదివరకు దేశద్రోహి ఈనాడు దేశ భక్తునిగా యూనియన్ గుర్తించింది. ఒకనాడు రావణరాజ్యమన్న నైజాం రాజ్యం - యూనియన్ సర్కారు ప్రవేశంతో రామ రాజ్యంగా మారి పోయిందా? అని ప్రశ్నించారు. "దున్నే వాడికే భూమనీ, శ్రామికు లదే దేశమని చూడండా పాడు ప్రజల మిడిసిపాటు నినాదాలు." — అలాంటి చైతన్యాన్ని చంపాలి. [16] ధనిక వాదాన్ని రక్షించడానికి ప్రజారాజ్యవాదుల్ని నిర్మూలించాలని ఈ పాట సారాంశం.

ప్రజలు తమ అభీష్టానికి అడ్డుపడితే, ఎంతటివారినైనా లెక్కచేయరు. నెహ్రూనే కాదు తెలంగాణా ప్రజల గుండె గాయాన్ని గాంధీ బొమ్మతో కప్పి అలంకరించలేరని నొక్కి చెప్పారు. నెహ్రూకి వ్యతిరేకంగా పాటలనే కాదు ప్రత్యేకంగా కళారూపాలు కూడా వెలువరించారు. ఫాసిస్టులకు, హిట్లరుకి వ్యతిరేకంగా తెలుగులో కూడా సాహి

త్వం వెలువడింది. ఈ దశలో వెలువడిన గొల్లసుద్దులు, వీధిభాగోతంలో[17] ప్రాంతీయ రాజకీయాలు, జాతీయ వాతావరణం, అంతర్జాతీయత ముప్పేటలుగా వెలువడింది. అందులో ఆగ్రహం మాత్రం జనసహజమైందే.

## సాహిత్యరంగం

వరుసగా ఐదేళ్ళనుండి జరుగుతున్న ప్రజాపోరాటంలో సర్క్యులర్లు, రాజకీయ లేఖలుతప్ప ఎలాంటి సాహిత్యమూ ప్రత్యేకంగా ప్రజలకు అందలేదు. అచ్చుయంత్రం ఉపయోగించి అవసరమైన సాహిత్యాన్ని అందించిన దాఖలాలు లేవు. 'ప్రజాశక్తి' పత్రికలోనూ కొన్ని ఇతర పత్రికల్లోనూ అప్పుడప్పుడు కొన్ని పాటలు అచ్చయ్యాయి. అవి పోరాటంలోని ప్రజలు వెలువరించుకున్న అసలైన ప్రజల పాటలు కావు. ఎక్కువగా ఆంధ్రప్రాంతం కవులు సానుభూతిపరులు రాసిన పాటలు, నాటకాలు, నాటికలు, కథలు వెలువడ్డాయి. జార్ ప్రభువుల పాలనలో కమ్యూనిస్ట్‌పార్టీ పత్రిక 'ఇస్క్రా' ని రహస్యంగా అచ్చువేసి చాటుగా పంపిణీ చేసినట్లుగా తెలంగాణాలో ఏ పత్రికా ప్రచారం జరపలేదు. వేళ్ళమీద లెక్కపెట్టగలిగేన్ని ప్రజాశక్తి పత్రిక ప్రతులు వెదురు గొట్టాల్లో దూర్చి కృష్ణానదిలో ఈది ఎంతో కష్టంగా నైజాం సరిహద్దుల్ని దాటించి తెచ్చేవారు. కొన్ని పార్టీ సర్క్యులర్లు మాత్రం తీశాసు. అంతేకాని సాహిత్యాన్ని అచ్చువేసిన సాక్షాలు లేవు. అయినప్పటికీ ఎప్పటికప్పుడు యంత్రాలకన్నా త్వరగా ప్రజల్లోకి పాటలద్వారా భావవ్యాప్తి జరిగింది. ఈ పాటలకు ఎలాంటి అడ్డంకులు లేవు. ఇవి నిజమైన ప్రజలదగ్గరకు నేరుగాపోతాయి. అచ్చుపత్రులు చదువుకొన్న వారి వరకే పరిమితం. పాటలు మాత్రం మొట్టమొదట నిరక్షరాస్యులైన ప్రజల దగ్గరికే పోతాయి. అక్కడేరూపంలోనూ, విషయంలోనూ ప్రజాస్వభావాన్ని సంతరించుకొని ప్రచారంలోనికి వస్తాయి. ఇలా వచ్చిన పాటలు స్థానిక ప్రజల అభీష్టానికి అనుగుణంగా ఉండేవి. ఈ పాటలలో శిల్పంకన్నా ఉద్రేకం ఎక్కువగా ఉంటుంది. హృదయంలో ఆలజడి కలిగిస్తాయి. వీటిలో ప్రజల ఆలోచనాసరళి, తాత్కాలిక అవసరాలు ఎక్కువగా చోటుచేసుకొంటాయి. పాట బాగున్నపక్షంలో కొంతమార్చి కేడరు ప్రచారంలోకి తీసుకువస్తుంది. అలా ఎన్నో రూపాలుగా పాటలు వాడుకలోకి వచ్చాయి. చాలా రూపాలు కనుమరుగై చివరగా ఎక్కువ ప్రచారంలోకి వచ్చిన రూపమే మిగిలిపోతుంది. ఇది ఊరుని బట్టి, ప్రాంతాన్ని బట్టి, రాజకీయ చైతన్యాన్ని బట్టి, పోరాట స్థాయిని బట్టి ఉంటుంది.

ఈ మార్పు పైన చెప్పిన భౌతిక విషయాలవల్ల మాత్రమే కాకుండా పాట

నిర్మాణాన్ని బట్టి కూడ ఉంటుంది. చరణాలు తీసివేసినా కొన్ని చరణాలు కలిపినా పాటస్వరూపంలో ఎలాంటి మార్పురాదు. వచ్చినా ఆ మార్పు అతి స్వల్పంగా ఉండి ఒక్క పాటకు విభిన్నరూపాలను ఇస్తుంది. జోహార్లుచెప్పే పాటల్లోని అమరవీరుని పేరు, ఊరు మరికొన్ని వివరాలు తీసివేసి మరో అమరవీరునికి అనుగుణంగా పాడుకొంటారు. అంటే పాట ఒక్కటే కాని రూపాలు మాత్రం అనేకం.

అలాంటి పాటలు ఎన్నో ఉన్నాయి. ఏ పాట మొదటిదో, ఏ పాట దేనికి అనుకరణో తేల్చి చెప్పటం చాలా కష్టం. నిరసన, ప్రతిఘటన వ్యక్తం చేసే పాటలు కొంత భిన్నంగా ఉంటాయి. వీటన్నింటినీ పోరాట సాహిత్యంగానే గుర్తించాలి. ఈ భిన్నత బాణీలోనూ, భావనలోనూ, విషయంలోనే కాకుండా ప్రచార పద్ధతిలోనూ ఎంతో మార్పు కనిపిస్తుంది.

## సాంస్కృతిక దళాలు

వైజ్ఞానికదళాలు, కళాకారులు, రచయితలు రహస్య జీవితంలోకి వెళ్ళిపోయారు. ఇదివరకున్న సాంస్కృతికరంగ నిర్మాణం మొత్తం మారిపోయింది. ప్రజలతో ప్రత్యక్ష సంబంధంలేదు. భూస్వాములు వేషం మార్చి గ్రామాల్లోకి ప్రవేశించారు, సడలిపోయిన అధికారాన్ని వాళ్ళు పుంజుకోవడానికి ప్రయత్నించారు ఈ విషయాన్ని ప్రజలు జాగ్రత్తగా గమనిస్తూ వచ్చారు. యూనియన్ సైన్యపు రంగు, కాంగ్రెస్ స్వభావం ఇట్టే తెలిసిపోయింది. అందుకే మళ్ళీ భూస్వాములకు లొంగిపోవడానికి శ్రమజీవులు నిరాకరించారు. ఇంత పోరాటం చేసి సాధించుకొన్న విజయాలను వదిలిపెట్టుకోవడం వారికి ఏ మాత్రం ఇష్టంలేదు. అందుకే పట్టిన ఆయుధాలను దించకుండా పోరాడటానికే మొగ్గుచూపారు. ఇలాంటి దశలో ప్రజలకు ప్రధాన శత్రువైన నైజాం నవాబు, రజాకార్ల స్థానంలోనే యూనియన్ పోలీస్, కాంగ్రెస్‌పార్టీ వచ్చినట్లు భావించారు. ఆ పార్టీని నడిపే నెహ్రూ, సర్దారుపటేలు, సీతాపతి, జనరల్ చౌదురి మొదలైన నాయకులు కాశింరజ్వీ, విసునూరు దొరల స్థానాన్ని ఆక్రమించినట్లుగా ప్రజలు భావించారు. ఈ వాతావరణాన్ని, కొత్త పరిస్థితులను ప్రజలకు తెలియజెప్పటం కోసం వెనువెంటనే పాటను ప్రధానంగా చేసుకొని ప్రచారం చేశారు. ఈ సమయంలో దళ సభ్యులే ఎక్కువగా పాటలు రాశారు.

ఐదారేళ్ళ ముందునుండే పోరాటంలో ఉన్న కేడరు కవులు ప్రజా సాహిత్యంలోని ఎన్నో లక్షణాలను పుణికి పుచ్చుకొన్నారు. ప్రజలు వెలువరించుకొన్న పాటల కన్నా కేడరు పాడి ప్రచారం చేసే పాటలస్థాయి కొంత హెచ్చుగా ఉంటుంది. పార్టీ

కేడరుకు సాహిత్యాన్ని ఏ పాళ్ళలో అందించిందో తెలియదుగాని కేడరు మాత్రం ప్రజలకు ఎంతో విలువైన సాహిత్యాన్ని అందించింది. ప్రజలు కూడ తమ సొంత రీతిలో పాటలు కట్టుకొని మరింత ప్రయోజనాత్మకంగా ఉపయోగించుకొన్నారు. ఈ రెండు ధోరణుల్లో సాహిత్యం వెలువడింది.

కేడరుకు ఏదో ఒక రూపంలో పోరాటంలో పాల్గొంటున్న ప్రజలకూ, మధ్య వున్న భేదమే వారి సాహిత్య సృజనలోను, ప్రచారంలోనూ కనిపిస్తుంది. కేడరు, కవులూ, ప్రజాకవులూ ఒకరినొకరు ప్రభావితం చేసుకొన్నారు. పాటలద్వారా తమ ప్రచారాన్ని కొనసాగించారు. అయితే వారి అవసరాలను, ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని యూనియన్‌కు వ్యతిరేకంగా రకరకాల పాటలు రకరకాల స్థాయిలో రాయడం గమనించవచ్చు. అంతేకాదు. వాళ్లు పొందిన నిర్వేదం, నిరాశ కూడా పాటల రూపంలో వెలువరించారు. ముఖ్యంగా అమరజీవులమీద వచ్చిన పాటల్లో ఈ లక్షణం కనిపిస్తుంది. అదే కేడరు రాసిన పాటల్లో పోరాటంపట్ల ఉత్సాహాన్ని, విజయంపట్ల విశ్వాసాన్ని కలిగిస్తాడు. సమైక్యంగా పోరాడటానికి కావల్సిన చైతన్యాన్ని పొందుపరుస్తారు.

యూనియన్ సైన్యాలకు పట్టుబడకుండా దళాలను దూరప్రాంతాలకు వెళ్ళి రక్షణ తీసుకొనమనీ ప్రాంతీయ కమిటి సలహా ఇచ్చింది. ఈ దశలో "రాజీ పడబోకు రైతన్నా-పిల్లి ఎలుకల రాజీ ఎలాంటిదన్నా" అనే పాట తెలంగాణా అంతటా బాగా వ్యాప్తమైంది. ఏ గ్రామం వెళ్ళినా, ఏ నోట విన్నా, ఈ పాటే[18] కార్యకర్తల్లాగే కవులూ, కళాకారులు పగలు తిరగలేక పోయారు. కొంతమంది అడవుల్లోకి వెళ్ళిపోయారు. ఈ పరిస్థితిని గుర్తించి ప్రజలలో నిరాశ వ్యక్తం కాకుండా ముఖ్యంగా స్త్రీలలో చైతన్యం కలిగించడానికి రహస్యంగా ఉంటూనే స్త్రీల పనిపాటల వరసల్లో పాటలు పాడారు. ఈ పాటలు ఇప్పటికీ శ్రమచేసే సమయంలో పాడుకొంటూనే ఉన్నారు. "సువ్వీ సువ్వన్నల్లారా" అనే రోకటి పాటను స్త్రీలు ఆ నిర్బంధపు రోజుల్లో పని చేసుకుంటూనే పాడుకొన్నారు.

సువ్వీ సువ్వన్నల్లారా మాయన్నలార
సువ్వీయని పోటువేసి పాటపాడంగా నేనొడ్లు దంచంగ
అట్లట్ల పోయేటి వారాలెవ్వారూ ఆ ధీరులెవ్వారూ
అడవుల్ల దిరిగేటి ఆంధ్ర బిడ్డలూ మన కన్నబిడ్డలూ-
చిన్ని మన తమ్ముళ్ళు చీకటి దొరలు చీకటి దొరలు

స్త్రీలు పొలం పనులకు పోయినట్లుగా సద్ది మూటలు పట్టుకొనిపోయి "గెరిల్లాలకు సంతోషం చెప్పి విప్లవగీతాలు వినిపించేవారు" అలా వెళ్ళిన స్త్రీలు తమ పాటలు దళ

సభ్యులకు, దళసభ్యుల పాటలు తాము విని వాటిని సాటి స్త్రీలకు వినిపించేవారు. ఈ విధంగా పాటల్ని ప్రచారం చేసేవారు. ప్రజలు తమ భావాలను అనుభూతులను పాటల రూపంగా పాడి వినిపించేవారు. గుట్టల్లోనూ, బోడుల్లోనూ వాస్కున్న దళాల వలయాకారపు దాడులవల్ల చెల్లా చెదురై పోయాయి. ఊరి ప్రజలకు రానురాను వారు దూరమయ్యారు. కాని దళ సభ్యుల పాటలు మౌఖికంగా ఊళ్ళోకి ప్రవేశించేవి. ఆ వీరుల వీరోచిత కార్యాలు ప్రజల పాటల్లో ప్రస్ఫుటించేవి. ఈ విధంగా అజ్ఞాత వీరులు ప్రజల మధ్య జీవించారు పాటల రూపంలో.

## మైదానాల నుండి అరణ్యాలకు ప్రవహించే పాటలు

వలయాకారపు దాడుల [19] వల్ల పార్టీ పలుచనైంది. ఈ దాడుల్లోనే 'బండెనక బండి కట్టి' లాంటి పాటలు రాసిన యాదగిరిని సైనికులు అమానుషంగా చంపారు. మైదానాల నుండి గిరిజన ప్రాంతాలకు దళాలు తరలి పోవలసి వచ్చింది.

కాల్చినను నిలబెట్టి మంటల
పేల్చినను ఇసుమంత లొంగక
నిల్చి రాజ్యాన్నేలుకొందాం *

చాలా మంది దళ సభ్యులు లొంగుబాటుకు అంగీకరించ లేదు. పరిస్థితులు విషమిస్తుంటే గ్రామాల్లో ఉండలేక కొత్త ప్రాంతాలకు వెళ్లారు. ఆంధ్రకమిటి ఆజ్ఞతో కొన్ని దళాలు మైదాన ప్రాంతాలలో రహస్యంగా ఉన్నాయి. ఎక్కువ దళాలు అడవి ప్రాంతాలకు చేరుకున్నాయి. [20] దళాలు ఒకనిర్మాణం లేకుండా చెల్లాచెదురైనట్లే ఆ దళాలలోని వైజ్ఞానిక రంగంలో పనిచేసే కవులూ, కళాకారులు కూడా చెల్లాచెదురైపోయారు. కొంతమంది అడవుల్లోకి వెళ్ళి పోయారు.

అడవిలో అడుగుపెట్టిన దళాలకు గిరిజనులు మొదట సహకరించలేదు. భయంకరమైన వారి జీవితాల్లో దాగిన దోపిడీని చూసి దళాలు వెనువెంటనే వారి బాగుకోసం కృషి చేయటం ప్రారంభించారు. తాము చేస్తూన్న రైతాంగ పోరాట లక్ష్యాలను వివరించి వారి మద్దతును సంపాదించుకొన్నారు. గిరిజనులపై సాగుతున్న దోపిడీ పద్ధతులను వీరికి మొదటిసారిగా తెలియజేశారు. తమని దోచుకొనితింటున్న వారిపై సంఘటితంగా ఎలా పోరాడాలో నేర్పారు. పార్టీపైన, దళసభ్యులపైన గిరిజనులకు విశ్వాసం చేకూరింది. వారిలో చైతన్యం కలిగించడానికి మళ్ళి పాటల అవసరం కలిగింది. ఈ కాలంలో వెలువరించుకున్న పాటలలో రెండురకాలున్నాయి. 1. దళాలు

తమకుతాము పాడుకున్న పాటలు, 2. గిరిజనులు తమకుతాము తమ భాషలో పాడుకున్న పాటలు.

**మొదటి రకం పాటలు :** ఈ పాటల్లో ప్రచార గుణం లేదు. కాబట్టి ఏ ప్రాంతంలో పుట్టిన పాటలు అక్కడే నిలిచిపోయాయి. కొన్ని పాటలు మాత్రం ఆనాటి సభ్యుల పాత జ్ఞాపకాల్లోంచి ఏరుకోవలసి వచ్చింది. ఈ దశలో ఆహారపదార్థాలేవీ దొరకనందున పెసళ్ళు, బొబ్బర్లు మొదలగు పప్పు ధాన్యాలను మూడు పూటలా గుగ్గిళ్లు చేసుకొని తినేవారు. అందుకే గుగ్గిళ్ళమీద, నాటి తమ పరిస్థితిమీదా ఎక్కువగా పాటలు కట్టు కున్నారు. ఈ పాటలు కొన్ని చరణాలు తప్ప పూర్తిగా లభించలేదు.

వర్షాకాలంలో వానలు వరదల వల్ల ఎన్నో కష్టాలు పడ్డారు. ఇలాంటి వాతా వరణం వీరి పాటల్లో కనిపిస్తుంది. భయంకరమైన పరిస్థితిలోకి రావడానికి నెహ్రూయే కాదు సర్దార్‌పటేల్ కూడా కారకుడే. అందుకే వీళ్ళిద్దరిమీద పాటలు పాడుకున్నారు.

హోయే హోయే హోయే-తెలంగాణ బంధనాలు
నిలిచాము ప్రాణమొడ్డీ-బంగారు తెలుగుతల్లి
  పటేలంటే పటేలు గాదురా
  అడవి పందినీ మించినాదురా
హిట్లరంత వీడయ్యి ఉండగా
ఇరుగదన్న లేచినాం-పటేలు వల్లభాయి
ఒదిగుండు వల్లభాయీ-వరుసాన వల్లభాయి
  వచ్చుచున్నది కొత్తనీరురా-తిరుగటానికే వీలు లేదురా
  నదుల గుట్టల కెగబాకె నీరురా
అరణ్య ప్రాంతపు నదీ జలాలతో-కొట్టుక
వచ్చే పీనుగలన్ని లెక్కబెట్టుకోరా
  ఓరోరి వల్లభాయి నీకు దిక్కు లేదు
  పోరోరి తెలంగాణ గడ్డనుండి *

అడవి పంది, కొత్తనీరు రావడం, తిరగడానికే వీలులేకపోవడం, నదులు, గుట్టలు ఈ పాటకు వాతావరణాన్ని కల్పించాయి. అరణ్య ప్రాంతంలోని శత్రువులను చంపితే ఆ శవాలని మైదాన ప్రాంతంలో లెక్కబెట్టుకోమని హెచ్చరించారు.

అదే కాలంలో ఒక పత్రికలో వచ్చిన ఒకానొక వ్యంగ్యచిత్రం ఆధారం చేసుకొని-

అల్లీ బిల్లీ మాటలతోని

దొమ్మరి గంతుల వేషాలతోని
చుప్పనాతి రూపముతోని
చుట్టు ఉండే మాత (కె. యం. మున్షి) తోని
మూట ముల్లె నెత్తిన బెట్టుక
నైజామోన్ని సంకన బెట్టుక
నవ్వుచునుంటివో ఓ జొహ్హారులాలుగా!*

అని ఆ వ్యంగ్య చిత్రానికి అక్షర రూపం కల్పించారు. ఇది చదివితే ఆ చిత్రం ఎలా ఉందో ఊహించుకోవచ్చు. ఆ చిత్రంలో లేని దళసభ్యుల ఆశయాన్ని—

ఓరీ! మూటా ముల్లె నెత్తిన బెట్టుక
ఏ ఊరెళుతావు-ఏడా నువ్వుంటావు
ఎక్కడచూసిన ఇదే విప్లవం....
మూటా ముల్లె కాలిపోతది-నైజామోడు సలిగిపోతాడు
మధ్యన నువ్వు మాడిపోతావురో-ఓ జొహ్హారులాలుగ![21]

1948 సెప్టెంబరు 18 న నైజాం నవాబు లొంగిపోయాడు. అంతకు ముందు ఖచ్చితంగా ఒక సంవత్సరం కింద అదే రోజున నైజాం ఒక ఫర్మానా జారీ చేశాడు. (చూ. అనుబంధం) అందులో పత్రికలపై ఎన్నో ఆంక్షలు విధించాడు. పత్రికల్లో వచ్చే వ్యంగ్యచిత్రాలపై విరుచుకుపడ్డాడు. వాటిని ప్రచురించడం చట్ట సమ్మతంకాదని హెచ్చరించాడు. పైన పూర్కొన్న వ్యంగ్యచిత్రం సంస్థానం బయట నుండి ప్రచురించే ఒక పత్రికలో వెలువడినట్లు, కాసం నారాయణతో జరిపిన ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.[22]

*రెండోరకం గిరిజన పాటలు* : గిరిజనులకు కొద్ది తెలుగు వస్తుంది. అడవి ప్రాంతంలో పుట్టి పెరిగిన వారికి సంబంధించిన గిరిజన భాషలో కొత్తగా తెలుగు పదాలు కలిపి పాటలు కట్టారు. మొదటి నుండీ ఆ ప్రాంతంలో పని చేస్తూన్న వ్యక్తులు, వారి భాషలోనే వారికి సాహిత్యాన్ని అందించడానికి ప్రయత్నించారు. గిరిజనులో కొంతమంది చురుకైన వారు ఈ కార్యకర్తలతో సమానంగా పనిచేస్తూ సైద్ధాంతికంగా కొంత అవగాహనకు వచ్చారు. ఇలాంటి వారికి లోగడ ప్రచారంలో ఉన్న పాటలను పాడి వినిపించారు.

సైద్ధాంతిక అవగాహన, రాజకీయ దృక్పథం గల మంచి పాటలనుకున్న వాటిని గిరిజనులు స్వీకరించలేదు. రాజకీయ కార్యకర్తలకు గిరిజనుల రాజకీయ ఆర్థిక రంగాలలో మాత్రమే పరిచయం ఉంది. కాని వారి సాంఘిక, సాంస్కృతిక జీవితంలో ప్రగాఢమైన అవగాహన లేకపోవడం వల్ల వారు ఎలాంటి పాటలు స్వీకరిస్తారో తెలుసుకోవడం కష్టమైంది. కాబట్టే మొదట గిరిజనుల శ్రమ జీవితంలోంచి వెలువడిన బాణీలలో

కాకుండా మైదాన ప్రాంత ప్రజల బాణీలలో పాటలు పాడి వినిపించారు. వీటినీ శ్రద్ధగా విని ఆనందించేవారు. కాని మళ్ళీ పాడుకోలేదు. మొదట గిరిజన భాషల్లోకి పాటల్ని తర్జుమా చేసి వినిపించారు. కానీ ఆ పాటల్ని కొద్దిమంది కార్యకర్తలే పాడేవారు.

ప్రజలలో చైతన్యం పెరిగిన కొద్దీ తమ భాషలో తమ భావాల్ని వ్యక్తం చేసుకున్నారు. మనకు చిరపరిచితమైన గిరిజన బాణీలలోనే వారు పాటలు పాడుకొన్నారు. గిరిజనులలోని చురకైన కార్యకర్తలు కొందరు మాత్రం కొన్ని తెలుగు పాటలను తమకు అనువుగా తర్జుమా చేసుకొన్నారు. ఈ పాటలు గిరిజన కార్యకర్తలే పాడేవారు. ఈ నాటికీ ఈ పాటలను గిరిజనులు మరిచిపోలేదు.[23] వాళ్ళ జీవితానికి మాత్రమే సంబంధించిన అంశాలుగల పాటలనే పాడుకున్నారు.

కొక్కకి దొడ్డిల్లె ముసిలాన్ని బట్టిల్లె
ఇరుబాత సుఖమురోరన్నా
ఇసుకట్ట బతుకన్న గోసిగుట్టె కరువేనన్నా
పొడిగీన కటపర్సి కిస్టె సుట్టూనేడ
సంగీన పొర్లి ఆడన్నా[24]

తమది అడవిలోని జంతువుకన్నా హీనమైన బతుకుగా వారు భావించారు. అలాంటి భావన ఉన్న పాటలు, వారి సాంఘిక జీవితానికి దగ్గరగా ఉన్న పాటలు గిరిజనులను ఆకట్టుకొన్నారు. మైదాన ప్రాంతాలలో జరిగిన ఆర్థిక దోపిడి విధానాలు తమ జీవితాలకు అన్వయించుకొని సమైక్యత పొందారు. అలాంటి వాటిల్లో "ఏరన్న రాకమునుపే" అనే పాటను చెప్పుకోవాలి. "పండిన కూరగాయలు, ధాన్యాలు, రక్తమాంసాలను అర్పించి సోమరిపోతులను మేపాలి ఎల్లకాలం, తెలియార తెలివి తోడ కలవారి జీతగాడు" అని హెచ్చరించుకొన్నారు. పొద్దున సద్ది కూడూ, మధ్యాహ్నం నీళ్ళకూడు, జీతం కొద్ది, పొద్దంతా పని, అందువల్లనే పెద్దోరికి భాగ్యం పోగయ్యింది. పేదవారికి తిట్లూ, తన్నులూ, కష్టాలు, పేదరికం తప్పలేదు.

యిన్నిటి కోర్చియున్న ఏ రోజు తిట్టులన్నా
గట్టిగా మాటలాడ కట్టేసి తన్నుతారు.

ఈ బతుకువద్దు పదరా పోరాడు జీతగాడ—అని పాడుకున్నారు.

ఉప్పువేసిన ఆకుకూర (ఉప్పాకు) తప్ప వాళ్ళకు తినడానికి ఏమీ లభించేదికాదు. గిరిజన కార్మికులకు అతితక్కువ కూలీరేట్లు చెల్లించి కాంట్రాక్టర్లు, వ్యాపారులు ఎన్నో లాభాలు పొందేవారు. గిరిజనులు అమ్మబోతే అడవి కొనబోతే కొరివి. కుల పెద్దలు కూడ గిరిజనులపై దోపిడీకి తావిచ్చారు. దోపిడీదార్లతో కుమ్మక్కయి కొద్ది లాభాలా కోసం

ఎంతోమంది. జీవితాలను నాశనం చేశారు. ఇలాంటి పరిస్థితిలో గిరిజన స్త్రీల బతుకులు ఎంతో నికృష్టంగా ఉండేవి. పనిలోనూ, ఆచార వ్యవహారాల్లోనూ, కట్టుబాట్లలోనూ, ముఖ్యంగా పెళ్ళి సందర్భాలలో స్త్రీలు చాలా దౌర్జన్యాలను ఎదుర్కోవలసి వచ్చింది. అందుకే దళాలు అడవిలో ప్రవేశించిన తర్వాత గిరిజన స్త్రీలు కూడా తమ బతుకులను బాగుచేసుకోవడానికి ఎంతో చైతన్యంతో, త్యాగంతో ముందుకు వచ్చారు. కొన్ని వందల మంది ప్రాణాలర్పించారు. కన్నబిడ్డల ప్రాణాలు కళ్ళముందే పోయినా చలించలేదు[25]. మిలటరీకి రహస్యాలు చెప్పలేదు.

స్త్రీలతోసహా ఎంతోమంది గిరిజనులు దళాలలోకి వచ్చారు. వీరిలో కొంతమంది కమాండరులయ్యారు. ప్రాణాలను కాపాడుకోవడానికి క్రూరమృగాలతో మొండిపోయిన ఆయుధాలతో పోరాడే గిరిజనులు, తమ బతుకుమీద దెబ్బతీసే శత్రువులమీద ఆయుధాలు ఎక్కుపెట్టారు. తమకు చిరపరిచితమైన అడవిలో కార్యకర్తలను ప్రాణ ప్రదంగా దాచారు. వాళ్ళు చెప్పే విషయాలువిని తమ భాషలో తమభావాన్ని వ్యక్తంచేసుకొన్నారు. అలా వెలువడిన పాటలు చాలా వరకు సామూహికమైనవే.

గిరిజనులతో గ్రామ కమిటీలు, గ్రామపెద్దలు ఏర్పాటు అయ్యాయి. ఇలా ఏర్పాటు చేసుకొన్న కమిటీలు ఆయా ప్రాంతాల్లో ఎన్నో విజయాలను సాధించుకొన్నారు. ఆ విషయం గిరిజనులకు గొప్ప సంతోషాన్ని కల్గించింది.

కృష్ణానది ప్రాంతంలోని నల్లమల అడవులలోగల చెంచుల్లో, ఆదిలాబాద్ జిలా లోని గోండుల్లో భద్రాచలం ప్రాంతంలో, గిరిజనులో ఉద్యమం పెంపొందింది. తెలంగాణా ప్రాంతంలోని మొత్తం గిరిజన ప్రాంతమంతటా కమ్యూనిస్టు పార్టీ విస్తరించింది.[26]

ఆర్థికపరమైన కొన్ని కోరికలు విజయవంతం అయినాయి. శత్రువులు, దోపిడీ దొరలు, అడవి నుండి పారి పోయారు. వ్యాధి నివారణ, సాంఘిక సమానత్వం, విద్య, రాజకీయాలు మొదలైన అనేక రంగాలలో కార్యకర్తలు పని ప్రారంభించారు. ప్రజల్లో చైతన్యాన్ని కలిగించడానికి, భావప్రచారాన్ని విస్తృతం చేయడానికి మౌఖిక పద్ధతుల ద్వారా వివిధ ప్రాంతాలకు పాటలు అందివ్వడం జరిగింది. ఈ క్రమంలో ప్రాంతాన్ని బట్టి సాహిత్య కళారూపాలను, పాటలను ఎంపిక చేశారు, సామూహికంగా పాటల్ని తయారుచేశారు. ఈ పాటలు కార్యకర్తే తయారుచేసి ప్రజలకు అందించారు, ఇందులో చాలా వాటిని తమ చైతన్యానికి అనుగుణంగా ప్రచారం చేసారు. కాకపోతే కార్యకర్తలు అందించునట్టుగా కాక తమ సొంత బాణిలో ప్రజలు పాడుకొన్నారు. ఆ క్రమంలో బాణీలో మార్పులు, భాషలో చేర్పులు జరగడం సర్వసామాన్యమైన విషయం. కాకపోతే

గిరిజనులు సామూహికంగా పాడడం వల్ల పాటకు శక్తివచ్చింది.

పాడేటప్పుడు గిరిజనులు చరణాలను రెండుకన్నా ఎక్కువసార్లు పునశ్చరణ చేస్తారు. చరణాలు ఎక్కడికక్కడ పూర్తి అవుతాయి. రాగం ప్రతి చరణానికి లేదా కొన్ని చరణాలకొకసారి వెలువడుతుంది. "రేలా రేలా రేరేలా" అనే పల్లవి ఉంటుంది. పల్లవి వాళ్ళకు చాలా చిరపరిచితమైనది. ఈ పల్లవిని ఇష్టం వచ్చినప్పుడు ఇష్టం ఇష్టం వచ్చిన చరణం దగ్గర పునశ్చరణ చేస్తారు. స్త్రీ పురుషులు వలయాకారంలో నిలిచి నడుము చుట్టూ, భుజాల చుట్టూ చేతులు వేసుకుని లయబద్ధంగా అడుగులు వేస్తారు. తలలు వంచి ముందుకు అడుగులు వేసి, తలలెత్తి వెనక్కి అడుగులేస్తూ పక్కకి జరుగుతోంటారు. నె, నెనే, నే నే నే.... అని గాని, రేరేలా రెరెలా రెరేలా అని పాడతారు. ఒకరు పాడుతూ ఉంటే మిగిలిన వాళ్ళు సామూహికంగా వంతలందిస్తారు. కొన్ని గంటల పాటు ఈ నృత్యం కొనసాగుతుంది.

నాటి నుండి నేటిదాకా పాడే ఈ పాట నృత్యం కూడా

రేలా రేలా రేలా రేలారే రేలయ్యో రేరేలా రేలా రేలా రేలా
నైజాముర్రా కైతే రాజరబాయి రాజరబాయి గుడుంబాయి గుడుంబాయి
॥నైజాం॥

తినడాన్కి తిండీ ఇల్లే గుడుంబాయి గుడుంబాయి
ఎద్దుబాత పాపంచో గుడుంబాయి గుడుంబాయి ॥రేరేలా॥
ఉత్తడానికి గుడ్డల్లే ఉత్తడానికి గుడ్డల్లే గుడుంబాయి గుడుంబాయి
మొత్తడానికి ముంతఇల్లే గుడుంబాయి గుడుంబాయి ॥నైజాం॥
ఎద్దుబాత పాపంబోయె గుడుంబాయి, గుడుంబాయి
తిండడాన్ని బొచ్చెఇల్లే గుడుంబాయి గుడుంబాయి
ఉండడానికి చోటుఇల్లే గుడుంబాయి గుడుంబాయి

"అడవిలో ఉండడానికి చోటుఇల్లే" అని పాడుకొంటే ఆశ్చర్యపోనవసరం లేదు. అది ఎంతో వాస్తవం. చిన్న గుడిసె వేసుకోవడానికి అవసరమయ్యే కలప, అనుమతి లంచాలు ముట్టనిదే లభించదు. అక్కడ వేసుకొన్న గుడిసెని అధికారులు ఎప్పుడుపడితే అప్పుడు ఖాళీచేయించేవారు. గిరిజనుడికి నాది అనుకొనేది ఏదిలేదు. భూమి, ఇల్లు, వాకిలి అన్నీ ఇతరుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడిఉన్నాయి. అందుకే వారు నైజాంకాలంలో తిండి, గుడ్డ, పశువులు ఏవీ లేవని పై పాటల్లో పాడుకున్నారు. ఈ పాటలో ప్రతి చరణం దేనికదే పూర్తి అవుతుంది. ఈ పాటలు నిర్మాణంలో సులభంగా ఉంటాయి. పాల్వంచ తాలూకా కోయలు తమ బతుకు తాము ఎలా బతకలేక పోయారో వర్ణించే

పాట—

జోడు నిమ్మవాక్తె-అదునావదెంతో
పుటుక పిర్సర్‌వాక్తె-అదునావదెంతో
పుడ మొక్క పుట్టి-అదునావదెంతో
పెర్సా మొక్క పెర్సికి-అదునావదెంతో
పుయిత్తపుంగం పూసి-అదునావదెంతో
అత్తకాలను అడికె-అదునావదెంతో
పత్తొపండి పండికె-అదునావదెంతో
వానియక్కీని.... ....వానియాలిని[27]

ఈ పాటలో గిరిజన వ్యవసాయం ఎంత నికృష్టమైన స్థితిలో ఉందో తెలియడమే కాదు ప్రతి దశలోనూ భూస్వామ్య అధికారం ఎంత దౌర్జన్యపూరితంగా ఉందో తెలుస్తుంది. పుట్టే మొక్కల్ని పూసేపువ్వుల్ని నావేనంటాడు దొర.

అలాంటి వ్యవస్థలో గిరిజనులు-

ఏరన్న వాసిరిల్లం ఎరువంకవత్తైరన్నా
పినర్లొను మంతెనన్ను దొడీల్లా జీతగానెం
ఈ పోద్కు మనపెరన్న? కాదోయి దొరకుమన్న
ఈ పోద్కు సదరుమన్న నీబలముతోపిసన్న
ఈ పోద్కు సదర్‌కన్నా నీ కష్టాకు తీర్కున్న
దోపిడి దొంగ కేనీ కాపాడ నైన కేని
నరకాటి తమకుమీద ఏకంగ ఢీకొనాలే

దొరతనాన్ని కాపాడే సైన్యాలను, పోలీసులను, ఏకంగా ఢీకొనాలని బాసచేసు కొన్నారు. పై పాట నాజర్ రాసిన "ఏరన్న రాకముందే ఏరువాక వచ్చెరన్నా" అనే పాటను కోయభాషలోకి మార్చారు.

ఈ విధంగా చైతన్యాన్ని పెంచుకొంటూ ఏకమవుతున్న గిరిజనులమీదకు పోలీసులు దాడులు ప్రారంభించారు. గ్రామాలకు గ్రామాలే తగులబెట్టారు. కుదుటబడు తున్న వారి బతుకులను అస్తవ్యస్తంగా చేశారు. వేలమందిని నిర్బంధంలోకి తీసు కొన్నారు. వారికోసం ప్రత్యేకంగా కేంపులు ఏర్పాటు చేశారు.

## కేంపులూ, జైళ్ళనుండి వెలువడిన పోరాట పాటలు

పది, పదిహేను గ్రామాల ప్రజలను ఒక్కచోట చేర్చి, ఒక కేంద్రంగా చేసి

అక్కడ మిలటరీ కేంపుల్ని ఏర్పాటు చేశారు. ఒక తాలూకాలోని గిరిజనుల్ని కేవలం మూడు నాలుగు నిర్బంధ శిబిరాలలో ఉంచారు. దాన్నే బ్రిగ్స్ పథకమని అన్నారు. ఈ నిర్బంధ శిబిరాలకే 'పునరావాస కేంద్రాల'ని ముద్దుపేరు పెట్టారు.[28]

నిర్బంధంలోనికి తీసుకొన్నవారిని అనేక బాధలకు గురిచేసేవారు. హిట్లర్‌కాలంలో ఫాసిస్టులు ఏర్పాటుచేసిన కాన్‌సంట్రేషన్ కేంపులకన్నా ఇవి ఘోరంగా తయారయ్యాయి. ప్రజలు ఈ కేంపులను జైళ్ళు అని పిలిచారు. లేదా 'కేంపు జైలు' అన్నారు. 'ఖమ్మం జైలు పాట' (చూ. అనుబంధం) పరిశీలిస్తే ఆనాటి జైళ్ళ పరిస్థితి కండ్లకు కట్టినట్టుగా కనిపిస్తుంది. ఈ జైళ్ళన్నీ యూనియన్ పోలీసు వచ్చినతర్వాతే తెలిసాయి. ఆ జైళ్ళలో దుర్భర జీవితాన్ని అనుభవించినవారు ఎన్నో పాటలను కట్టుకున్నారు.

స్వాతంత్రోద్యమం నుండి తెలుగు సాహిత్యంలో జైలు పాటలు చాలా కనిపిస్తున్నాయి.

> జన్మమదేలా జైలుకు పోని
> ధర్మముతోడను - జన్మభూమికిని మన
> నిర్మల త్యాగము నొసగని వాని[29]

అని జైలుకు పోవడాన్ని ఒక రాజకీయ కార్యక్రమంగా భావించారు. దైవచింతన, త్యాగనిరతి జీర్ణించుకొని ధర్మంగా బతకడానికి అలవాటుపడ్డ ప్రజలు ఆ పరిస్థితులలో "రఘురాముని తలవని జన్మమదేలా" అని పాడుకోలేదు. అదే వరుసను పదాలను వాడుకొని "జన్మమదేలా జైలుకు పోనీ" అని పాడుకున్నారు. కాని గత తాత్వికభావననుండి యింకా బయటపడలేదు. కాని ప్రజలు క్రమంగా జైళ్ళనే పాఠశాలలుగా చేసుకొన్నారు. నిరక్షరాస్యులైన చాలామంది కార్యకర్తలు అక్కడే అక్షరాలు నేర్చుకున్నారు. జైలు గోడలనే పాటలు రాసే పలకలుగా చేసుకున్నారు.

జైలు గోడలమీద ఒక రైతుబిడ్డ రచించిన "మనమంతా ఖైదీలం" గీతం 1948 మే 5 నాటికి 'నవయుగ' పత్రికలో ప్రచురితమైంది.

> నైజాం నరకాసురుడితో
> రాజీ బేరం వలదన్నందుకు
> టాటా, బిర్లా, జమీందార్లందరూ
> సాగించే పరపీడన పోవాలని
> పోరాడే మనమంతా ఖైదీలం[30]

అనే పాటను ఒక అజ్ఞాత కవి రచించాడు. జైళ్ళలో సత్యాగ్రహాలు, నిరసన ప్రదర్శ

సలు, లాఠీ ఛార్జీలు జరిగాయి. హక్కులకోసం పోరాటాలు జరిగాయి. ఇదంతా ఆంగ్లే యుల కాలంలో జరిగింది కాదు. స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడిన తర్వాత జరిగింది. కార్మిక, కర్షకయోధులు కలిసి నిర్మించే "భూతల స్వర్గం రావాలని పోరాడే మనమంతా ఖైదీలం స్వతంత్ర భారత ప్రభుత్వ ఖైదీలం" అని జైల్లో కటకటాలమీద దరువు వెలువరిస్తూ పాడుకొన్నారు. మరో కవి అసలు జైళ్ళ పుట్టుక గురించే ప్రస్తా వించాడు.

"బస్సు పుట్టిందోయ్ బాబు/బస్సు పుట్టిందోయ్/బస్సు పుట్టి బండ్లవారి/కడుపు కొట్టిందోయ్" అనే పాట బాణీని జైలుకు ఆపాదించి "జైలు పుట్టిందోయ్ బాబు జైలు పుట్టిందోయ్ జైల్లున్న ఖైదీలకు బాధపుట్టిందోయ్"[31] అని పాడుకున్నారు.

జైలుకు పోయివచ్చిన మరోకవి జైలు జీవితం గురించి చెబుతూ "కలగాదు, కథగాదు, కలనిజము చెప్పెదము" అంటూ ప్రారంభించి ఆ కేంపును సవివరంగా వర్ణించాడు.

వృద్ధులను, బాలలను పురికించి చంపారు
మన తెలంగాణాలో మారణ కేంపులు నిలిపి
మనలను హింసించారు. మాడ్చి చంపారు.
సైన్యపాలనతోడ చేశారు ఘోరాలు
ఖమ్మం పట్టణమందు కేంపు జైలు
కనబడ్డవారిని పట్టి తెచ్చి నింపారు *

ఈ విధంగా యూనియన్ మిలటరీ కమ్యూనిస్టుల ఏరివేత పేర సాధారణ జనాన్ని ఎన్నో ఇక్కట్లకు లోనుచేశారు. పట్టుబడ్డవాళ్ళలో దొరల ఏజెంట్లు చూపించిన వారిని పోలీసులు జైళ్ళలో చిత్రహింసలపాలు చేసేవారు. ఈ నిర్బంధ శిబిరాలలో కనీస సౌకర్యాలుకూడ లేవు. నీళ్ళకోసం మరుగుదొడ్లకోసం ప్రజలు పడిన బాధ వర్ణనాతీతం.

మండుటెండల్లోన మంటగాడ్పుల్లోన
మలమల మండాం మండుటెండల్లోన మంచినీళ్ళు లేక
బావులు నాలుగు తవ్వ బండలే పడ్డాయి
ఒక లోటా దొరకవు ఒండు నీరైనా
మట్టానా పాకీదొడ్డి వంపూన నీళ్ళబాయి
వేసారు పాకీదొడ్డి వేయిమందీకొకటైన
దొడ్డి బాగాలేక చెడ్డవాసనవేసి దానుంచె
ప్రవహించు ఆ పాడునీరంత

అంతేగాకుండ నిర్బంధితులకు సరియైన తిండి పెట్టకుండా ఆకలికి మాడ్చేవారు. ఖైదీలతో అన్ని రకాల సొంత పనులు చేయించుకొనేవారు. కాళ్లు పిసికించుకొని, వొళ్ళు పట్టించుకొని కనీసం తిండైనా పెట్టేవారు కాదు. ఆ రకంగా తిండిలేక ఎన్నో కుటుంబాలు కేంపుల్లో చనిపోయాయి. మశూచి, కలరా తదితర అంటువ్యాధులు సోకినపుడు ఎలాంటి మందులు పంపిణీ చేయలేదు. ఆ రకంగా కేంపుల్లో కొన్ని వేల మరణాలు సంభవించాయి.

బ్రిగ్స్ పథకం అమలుజరిపినప్పుడు నాలుగైదువేలమంది సైనికులు ఆరేడు గ్రామాలను చుట్టుముట్టారు. ఆ సమయంలో ప్రజలు భయంతో ఒకచోటికి పరుగెత్తేవారు. పురుషులతో పాటు స్త్రీలు, పిల్లలు. ముసలీ ముతకా మూట ముల్లెలతో ఇండ్లు, ఊళ్ళు విడిచి పారిపోయారు. ఆ సమయంలో పశువులుకూడ వారిని అనుసరించాయి. తాము వెళ్ళిపోతే ఆ పశువులను చూసే దిక్కులేదని భావించి నోరులేని ఆ పశువుల్ని కొందరు తమ వెంట తెచ్చుకొన్నారు.

మనుషులు, పశువులు ఓచోట సైనికులకు పట్టుబడ్డారు. తరువాత వారిని కేంపు జైళ్ళలో తోశారు. ఆ జైళ్ళకు చుట్టూ కట్టిన కారుముండ్ల తీగలోంచి పశువులు కనిపించేవి. తమ బతుకుకన్నా భయంకరంగా వాటి బతుకు కనిపించింది. నీళ్లు, ఆహారం లేక కృంగి, కృశించి మరణావస్థలో ఉన్న పశువులను చూస్తూ రైతాంగం ప్రాణాలు గిలగిలా కొట్టుకొన్నాయి. అలా చూడడంకన్నా తమ ప్రాణాలు పోయినా బాగుండునని అనుకొన్నారు.

పోలీసులు, జైలు అధికారులు ఈ పశువుల పరిస్థితికి ఎలాంటి చర్యలు తీసుకోలేదు. తమకు వ్యతిరేకవర్గమైన రైతాంగ ప్రజలను చిత్రవధలపాలు చేసి చంపివేశారు. కాని ఆ ప్రజల ఆస్తియైన పశువులు ఏం తిరుగుబాటు చేస్తాయి? వర్గ స్వభావం, మనుషులనే కాదు వారి పశువులనుసైతం శత్రువులుగా భావిస్తుంది. కనీస మానవతని కూడ చూపలేకపోయారు. అందువలన కొన్ని వేల అమాయక జీవులు నేలకొరిగాయి.

దొరికిన పాటలనుబట్టి చూస్తే కేంపులలో తిండి గురించి ప్రజలు చాలా కష్టపడినట్టు తెలుస్తోంది.

ముక్కియున్న జొన్నలతో ముందుగ గుగ్గిళ్ళు వేసి సింగళ్ళోన-బోసి
ఆహా! ఇంకనేమి చెప్పనేల సోదరా !
పాత చింతపండు చారు పదిలముగ కాసి తెచ్చె, పోసిరి గుగ్గిళ్ళపైన
మాయమాయె చారునీళ్ళు చూడ కింద వరదగట్టె
ఇష్టమైతె తినుమటంచు కష్టమైతె మానుమటంచు
కదిలితేను కాలితన్ను ఆహా! మెదిలితేను కర్రపొన్ను

ప్రజలకు సరైన తిండి దొరకకపోవటం, ఎన్నో తన్నులు, గుద్దులు తింటే గాని కొద్దిపాటి హేయమైన తిండి దొరికేది.

గుగ్గిళ్ళ పండమని గూండాలబెట్టి
వారు మంచి కూరగాయుంటే మాయం చేస్తారు
కలకాదు కథకాదు కలనిజము తెలిపెదము
సైన్యపాలనతోడ చేశారు ఘోరాలు

మంచినీళ్ల రేషన్ పెట్టి ఇచ్చేవారు. అతి తక్కువ నీటితో ఇతర అవసరాలు కూడా తీర్చుకోవాలి. ఉడికీ ఉడకని జొన్నలు తినడం వల్ల కొంతమంది బంక విరేచనాలతో చనిపోయారు. మరి కొంత మందిని కారుముండ్ల తీగ దాటి తప్పించుకు పోతున్నారనే నెపంతో కాల్చివేశారు. ఈ పరిస్థితుల్లో కేంపుల్లో అనేక ఆందోళనలు జరిపి ఖైదీలు కొన్ని కోర్కెలను సాధించుకొన్నారు. ఖమ్మం జైలుతో వరుసగా నాలుగు నెలలు ఆందోళన జరగడంవల్ల పేరిని రాష్ట్రేతర జైళ్ళకు పంపారు.

సంస్థానంలోని ఖమ్మం, వరంగల్లు, హైదరాబాద్, సికిందరాబాద్, నిజామాబాద్, ప్రాంతేతరమైన గుల్బర్గా, జాల్నా, బీడ్ జైళ్ళలో ఎంతోమంది నిరసనవ్రతాలు, సత్యాగ్రహాలు, పోరాటాలు చేసి అన్యాయాల నెదుర్కొన్నారు. తమ కోర్కెలను సాధించుకొన్నారు. 1950 జనవరి 26 వ తేదీన నెహ్రూ ప్రభుత్వం నైజాం రాజుకు రాజప్రముఖ్ పదవిని ప్రకటించింది. అది సహించలేని ఖైదీలు జైళ్ళలోనే అలజడి లేవదీశారు. జైళ్ళలో కాల్పులు జరిగాయి. మహిళలపై కూడా లాఠీచార్జీలు జరిగాయి.

ఇన్ని ఘోరకృత్యాలు జరుగుతున్నందువల్ల ఖైదీలు జైళ్లనే విప్లవ కేంద్రాలుగా మార్చుకొన్నారు. రాజకీయ ఖైదీలు, సాధారణ ఖైదీలకు ఒకవైపు సానుభూతినం విస్తూ మరోవైపు తెలంగాణా రైతాంగ పోరాటం గురించి చెప్పేవారు. సాధారణ ఖైదీలు కూడా రాజకీయ ఖైదీలపట్ల సానుభూతి చూపుతూ వారి మాటలను, పాటలను వినేవారు. వారితో కలిసి పనిచేసేవారు. ఉదాహరణకు జాల్నా జైలులో జరిగిన సంఘటనను చెప్పుకోవచ్చు. "అంతర్జాతీయ గీతం" పాడటాన్ని జాల్నా జైలులో నిషేధించినప్పుడు ఆ ఉత్తర్వును రెండువేలమంది ఖైదీలు కలిసి కట్టుగా ధిక్కరించారు సాధారణ ఖైదీలు, రాజకీయ ఖైదీలు అనే భేదం లేకుండా ఒక్కటై గొంతు కలిపారు అప్పటినుండి ప్రతిరోజూ అందరూ అంతర్జాతీయ గీతం పాడుతూ ఉండేవారు. ఎలాంటి పాశవికమైన లాఠీచార్జీలు కాని, ఇతర శిక్షలు కాని వారి ఐకమత్యాన్ని దెబ్బతీయలేక పోయ్యాయి. అంతేకాదు ఖైదీలు ఒక సెల్‌నుండి మరొక సెల్‌కు వార్తలందించుకునే వారు. జైళ్లలో రాసిన పాటలు బయటికి పంపుతుండేవారు. ఆ విధంగా జైళ్ళలోంచి,

జైళ్ళలోని తిరుగుబాట్లలోంచి పోరాట సాహిత్యం వెలువడింది. అందుకే నిర్బయ ముగ పోరాడు మమ్ము నిర్బంధమందుంచి/ప్రాణాలు తీశారురా కామ్రేడ్!

యూనియన్ ప్రభుత్వపు పోలీసురా
మెడల చుట్టురి ఉరిత్రాళ్ళు మెలివేసికొనుచుండ
రెయిలు సెల్లులనుండి ప్రజల బాగుకోరి
జయగీతాలు అందిచారురా కామ్రేడ్స్[32]

అని వారి పాటలను అందుకొన్న ప్రజలు ఖైదీల వీరోచిత కార్యాలను కీర్తించారు. కేంపులలో వేలాది మందిని నిర్బంధించి హింసించేవారు. కొద్దిపాటి విద్యార్హత కలిగిన వాళ్ళను, పార్టీ కార్యకర్తలను ఇతరులను జైళ్ళకు పంపారు. కేంపుకూ, జైలుకూ భేదం ఉన్నట్టే సామాన్యునికీ, కార్యకర్తకూ ఉంది. అలాగే కేంపునుండి వెలువడిన పాటకు జైలు గోడలు దాటి వచ్చిన పాటకు భేదం ఉంది. పైన ఉదహరించిన ఈ రెండు రకాల పాటల్ని లోతుగా తరచి చూస్తే కేంపు పాటల్లో సామూహికత, జైలు పాటల్లో వ్యక్తిగత ఆలోచన కనిపిస్తుంది.

## పాటలు - పోరాట విరమణ

తెలంగాణా పోరాటంలో సాధించుకొన్న విజయాలను నేల రాయడానికి యూనియన్ ప్రభుత్వం నిర్ణయించుకొంది. నైజాం వ్యతిరేక పోరాట విజయాలనే కాకుండా "తెలంగాణాలో ప్రజారాజ్యం" స్థాపనకోసం సాయుధ పోరాటానికి పూనుకొన్నారు. పై అంశాలన్నీ పాటల్లో వ్యక్తమైనవే.

పోలీసు చర్యకు ముందు ప్రజల నోటిపాటలు తామరతంపరలుగా వెలువడ్డాయి. ఈ పాటలు నైజాం వ్యతిరేక పోరాటకాలంలో వచ్చిన (కాంగ్రెసు, కమ్యూనిస్టు, పోరాట సానుభూతి పరులు) పాటలకన్నా విభిన్నమైనవి. ఇందులో ఎక్కువగా రాత పాటలు ఉన్నాయి. వీటిలో ప్రచారగుణం తక్కువ. భూమి పంపకం జరిగిన తరువాత పాటల్లో కనిపించిన ఉత్సాహం, ఆనందం మళ్ళీ భూములు లాక్కొన్న తరువాత తగ్గిపోయింది. పైగా కసి, కోపం పెరిగాయి. ప్రజాపంథా నుండి దూరమైన పాలసీవల్ల అడవికి మాత్రమే పరిమితమై పోయినందువల్ల పాటల జోరు తగ్గింది. పుష్కలమైన నదీ ప్రవాహంలా కాకుండా పిల్లకాల్వలలో పారే నీటిలా పాటల స్వరూపం మారిపోయింది. ప్రజలనుండి వేరైపోవడమే కాకుండా, అలా వేరై పోరాడే క్రమంలో వెలువడిన పాటలు వ్యక్తిగత లేదా దళానికే పరిమితమై వచ్చాయి. దళాలు తమనుతాము కాపాడుకొనే స్థితి ఆ పాటల్లో ప్రతిబింబించాయి.

నాజీ నెత్తురాల సాగనంపేవరకు
అస్త్ర సన్యాసంబు ఇలలోన కల్లయని
రణభేరి మోగించెరా
తెలంగాణ
విప్లవమని నినదించెరా

అస్త్రసన్యాసం (పోరాట విరమణ) చేయమని విప్లవ బాసలు చేశారు. అంతేకాదు-

తెలంగాణ వీరులు సమరనాదము పిలుపు
అందుకొని ప్రజలంత భారతదేశములోన
సాగిరండని చెప్పెను
తెలంగాణ
వేగుచుక్కై వెలసెను

దళాలు అరణ్యాలు పట్టినా 'తెలంగాణా బాట'ని భారతదేశ మంతటా విస్తరించాలని, భారతదేశంలో తెలంగాణాల్ని సృష్టించాలని భావించారు. ప్రజలు ఈ దళాలను విముక్తి దాతలుగా భావించారు. గ్రామాల్లో తాము సాధించుకొన్న విజయాలను ఒక్కొక్కటే తమ చేతుల్లోంచి చేజారిపోతుంటే దళాలపట్ల వారికి గౌరవాభిమానాలు ఎక్కువయ్యాయి. ప్రజల అభిమానం ఉంది. కాని వారు పోరాటంలో పాల్గొనలేక పోతున్నారు. ఈ విషయం దళాలకు తెలుసు. ఐనప్పటికీ—

చావు బతుకుల మధ్య
సాగే మా పోరాటం
నీ అంతం కండ్లజూచు
నంతవరకు శాంతించదు
ఇది ప్రతిజ్ఞ ఇది శపథం
వదలం మా బిగిపిడికిలి వదలం

అని నిర్ణయం తీసుకొన్నారు. ఆంధ్రప్రాంతంలో జరిగిన సాయుధ పోరాట స్నేహహస్తాన్ని ప్రభుత్వం క్రూరంగా అణచివేసింది.

1951 మేలో కేంద్ర కమిటీ తెలంగాణాలో ప్రజాస్వామిక పద్ధతి అమలు చేయాలనే కోరిక వెలిబుచ్చింది. కాని మిలటరీ పాలకులు విధ్వంసకచర్యలు జరుగుతున్నాయనే నెపంతో పోలీసు పాలన కొనసాగించాలని భావించారు. అందుకే మొదట విరమణపై సంప్రదింపులకు నిరాకరించారు. కాని పార్టీ కేంద్రకమిటి కోరిన మీదట కాంగ్రెసు వర్గం సంప్రదింపులకు అంగీకరించింది. ఆ సందర్భంలో—

వేటాడి అలసించి ఓటమి తెలసించి
రాజీకై పిలిచింపిరా
మాటలలో తేనెలొలికిస్తుందిరా- ఓరన్న
మనసు కత్తులబోసు చేసిందిరా- అని పాడుకున్నారు.

నిజానికి సంప్రదింపులకు ఒప్పుకొన్నప్పటికీ మనసులో అయిష్టత ఉన్నట్టు ప్రజలు పసిగట్టారు.

మరోవైపు పార్టీ "వ్యవసాయకూలి, పేద రైతులకు భూమిని ఇవ్వలేని మనం భూసంస్కరణలతోనే రాజీకి అంగీకరించినట్లయితే ధనికరైతు ప్రయోజనాల రక్షణ కోసం, కేవలం జైళ్ళనుండి బయట పడడం కోసం రైతాంగానికి ద్రోహం చేసినట్లుగా మనం అపార్థం చేసుకోబడతాం. అందుకే భూమి సమస్యను పక్కకు పెట్టే రాజీని అంగీకరించేకంటే బహిరంగ ఓటమిని అంగీకరించి తెల్లజెండా ఎత్తడం వందరెట్లు మెరుగు అని భావించింది.[33]

సైనికచర్య తరువాత పంచుకొన్న భూములు ప్రజల చేతుల నుండి దూరమయ్యాయి. భూస్వాములతో రైతులు రాజీపడి అవే భూములను కౌలుకుచేసుకోవడం జరిగింది. ఆ సందర్భంలో—

ఎన్నో ఆశలతో చెమటోడ్చి
దున్నుకున్న బంజరుభూమి
కన్నుగప్పి మాయలుపన్ని
తన్ని గుంజుకునే భూస్వామి
అన్నా నీవుగన్నా కలల[34]
అన్నీ వ్యర్థమాయెగదోయి-అని పాడుకున్నారు.

పంచుకున్న బంజరు భూమిని కన్నుగప్పి, మాయలుపన్ని అంతగా కాకుంటే తన్ని గుంజుకున్నారు. పోరాటంలో కన్నకలలు వ్యర్థమైనాయని ప్రజాకవి సుద్దాల హనుమంతు బాధపడ్డారు.

పోరాటానికి దూరమైనప్పటికీ పార్టీకి ప్రజలు దూరం కాలేదు. పార్టీ పోరాట రూపంలో భాగస్వాములు కాకపోయినా పార్టీ సృష్టించిన పోరాట సంస్కృతిలో భాగంగానే ఉన్నారు. ఈ అభిప్రాయాన్ని ఎన్నో పాటల్లో వ్యక్తంచేశారు. కూడా సైనికచర్య తరువాత తెలంగాణా పరిస్థితుల్లో వచ్చిన మార్పుని, వైరుధ్యాలను అంచనా వేసుకోలేకపోయారు. ఒక అడుగు వెనక్కివేసి రెండడుగులు ముందుకువేసే ఎత్తుగడని అనుసరించకపోవడంవల్ల 1951 అక్టోబరులో పోరాటం ఉపసంహరణ అపరిపక్వ ఉప

సంహరణగా మారిపోయింది. ఈ ఉపసంహరణపట్ల ప్రజలు చాలా అసంతృప్తి పొందారు. సకాలంలో ఎత్తుగడలు మార్పు చేస్తే ప్రజాదళాల్ని పునర్నిర్మాణంచేసే అవకాశం ఉండేదని భావించారు. కాని అలాంటి అవకాశం కోల్పోవడంవల్ల విరమణ తదుపరి ఎన్నికల పోరాటం మేరకే పరిమితం కావాలసివచ్చింది. ఇదంతా కళ్ళారా చూసిన ప్రజాకవి సుద్దాల హనుమంతు 'వ్యవసాయ కూలీ' అనే పాట రాశారు.

పేదప్రజల ముందుంచుకొని
పేరు పొందిన నాయకులంతా
వేదికలపై నిలిచీ మేజులు
బాది చేసిన వాగ్దానాలు
యేరుదాటి తెప్పగాల్చిన
తీరుగా నేర్పెనుగదోయి వ్యవసాయకూలి
భూమికోసం భుక్తికోసం
శ్రమకు దగినా ఫలితంకోసం
దొరల భూస్వామ్య విధానాల
దోపిడి నిర్మూలనకోసం
రైతు నీవు ఏకమై
పోరాటము సాగించవోయి వ్యవసాయ కూలి[35]

చివరగా-

సైనిక చర్యకు ముందు చాలా రకాలుగా పాటలు వచ్చాయి. ఇందులో కొన్ని జానపద పాటల బాణీల్లో పాటలు రాశారు. సైనికచర్య తరువాత మధ్యతరగతి శిష్ట కవులు రంగంనుంచి నిష్క్రమించారు. ఇప్పుడు పోరాటంలో నిలిచింది శ్రమజీవులే. సాంస్కృతికరంగంలో కూడా వారే నిలబడవలసి వచ్చింది. పోరాటం, నిర్బంధాల మధ్య పోరాడే ప్రజలే తట్టుకుని నిలబడగలరు. అప్పుడు వచ్చిన పాటల్ని ప్రచారం చేసిన గాయకులు శ్రమజీవులే. అందుకే సానుభూతిపరులైన కవులు (కోగంటి, ముక్కామల, అయ్యపు వెంకటకృష్ణ మొ॥ వారు) రాసిన పాటలను ఆధారం చేసుకుని పాడుకున్న ప్రజల పాటల రూపాలు కూడా వెలువడ్డాయి. ఆ తరువాత కేవలం పోరాటంచేసే వర్గం మాత్రమే పాటల ప్రచారం చేసింది. పోరాటానికి ఒక కేంద్రీకృత లక్ష్యం ఏర్పడటంవల్ల పాటలు ఆ పరిధిలోంచే వచ్చాయి. ఈ దశలో సాంస్కృతిక దళాలు చెల్లాచెదురయ్యాయి. కేడరు మైదానాల నుండి అడవులకు తరలినందున పాటలు మౌఖిక ప్రచారంవల్ల గ్రామాలల్లోకి వచ్చాయి. లోగడ ఆయాకవులే ప్రజల మధ్య

గానం చేసేవారు. శతాబ్దాలుగా మార్పు లేని గిరిజన పాటల్లో ఒక కొత్త భావన చేరింది. వారి భౌతిక పరిస్థితులు, పోరాట లక్ష్యాలు పాటల్లో ప్రతిబింబించాయి. అడవుల నుండి, రహస్య స్థావరాలనుండి పాటలు వెలువడినా వాటికి ప్రచారం ఎక్కువగా లేదు. మళ్ళీ ప్రజా సమూహం కలిసిన జైళ్ళు, కేంపుల నుండి పాటలు వెలువడ్డాయి. అక్కడ కూడా ఏదో ఓ మేరకు పోరాటం ఉన్న కారణంగా పాటలు ఎక్కువగానే వెలువడ్డాయి. పోరాట దశల్లో పోరాట జీవిత చిత్రణగా పాట తన కర్తవ్యాన్ని నేరవేర్చింది. మతం పట్ల ప్రజల భావననీ, కాంగ్రెసు ప్రచారాన్నీ, ఆ ప్రచారం వెనకగల పరిస్థితుల్ని పాటలు తెలియజేస్తున్నాయి. పోరాట విరమణ సందర్భాంలో వెలువడిన పాటలు చూచాయగానైనా ప్రజల మనోభావనని తెలియజేయడం గమనించవచ్చు. ప్రభుత్వం విధించిన ఆంక్షలు, నిషేధాలు రాత సాహిత్య మేరకే పరిమితమయ్యాయి. మౌఖిక సాహిత్యానికి అవి అడ్డంకులు కాలేకపోయాయి.

అప్పటికప్పుడు ఆశువుగా పాటలు పాడి వినిపించేవారు. ఆ పాటలు మౌఖిక ప్రచారం వల్ల ఎన్నో ప్రదేశాల్లో పాడుకున్నారు.

## పాదసూచికలు

1. కమ్యూనిస్టు పార్టీ కమిటీ సమీక్ష (నలగొండ జిలా), 1952, సైనికచర్య తరువాత, పే. 2.
2. కుందుర్తి కృతులలోని "తెలంగాణా"లో-"అందుకే యూనియన్ సైన్యాలకు స్వాగతం అణచివేసి నందుకు అంతులేని దురాగతం (పే 134) అనీ, "ఆనాడు మనం తీసుకొన్న పోలీసుచర్య విజయానికి మొదటి మెట్టు" (పే 135)అనీ భావించారు. ఆరుద్ర త్వమేవాహం పూర్తినాటికి పోలీసుచర్య ప్రారంభం కాలేదు. రుద్రవీణలో దాశరథి "స్వేచ్ఛాభారత సైన్యమ్ము తలుపు బ్రద్దలుకోట్టే" వరకే కవిత్వాన్ని రాశారు.
3. కె. వి. రమణారెడ్డి, 1984, "తెలంగాణా పోరాటం-సాహిత్యం" మాకివలస, విరసం, మహాసభలో చదివిన ప్రసంగవ్యాసం, అరుణతార, పే 14.
4. కమ్యూనిస్టు పార్టీ కమిటి కమీక్ష (నల్లగొండ జిల్లా) 1952, సైనికచర్య తరువాత, పే. 4.
5. -పై -పే 4.
6. కె. ఎల్. ఎస్. సింహ. "దళాలగుట్టు బట్టబయలు", (ఆచార్యరంగా) (1949) లో)

7. సాధన, ప్రభాత పుస్తకశాల, రచయిత? (పే. 9.)
8. యన్. కె. చౌదరి, 1948, హైదరాబాదు స్టేటు అనే కాశీం రజ్వీ బుర్రకథ, పే. 2.
9. పుచ్చలపల్లి సుందరయ్య, 1983, వీర తెలంగాణా రైతాంగ విప్లవ పోరాటం గుణపాఠాలు, పే 112
10. ఆదిరెడ్డి (మిర్యాలగూడెం) తో (17. 5. 80)న జరిపిన ఇంటర్వ్యూలో చెప్పారు.
11. పుచ్చలపల్లి సుందరయ్య, 1983 వీర తెలంగాణా రైతాంగ విప్లవ పోరాటం గుణపాఠాలు, పే 252.
12. మూలం వి. వీరభద్రరావు, వి. రామచంద్రరావు. 1949, హైదరాబాదుపై పోలీసుచర్య, పే 75.
13. భారత ప్రభుత్వం నంజప్ప ఆగడాలను సమగ్ర పరిశీలన జరిపేందుకు ఒక కమిటీని ఏర్పరచింది. వీరు కేశవరావుతో సుదీర్ఘ చర్చలు జరిపారు.
హీరాలాల్ మోరియా, 1978, సర్దార్ జమలాపురం కేశవరావు, పే 76-77.
14. తిరునగిరి రామాంజనేయులు, 1972, "ఓరన్నా కాంగ్రెసన్న" తెలంగాణా పోరాట గేయాలు, పే. 49.
15. సోవియటు రష్యాను చూడన్నా
పేదలకు స్వర్గము
సర్వసుఖములు ప్రజలకేనన్నా
తూర్పు యూరపు ప్రజలు ఎంతో
ఓర్పుతో పోరాడి గెలిచారు
చీని దేశములో నేడన్నా
చాంగ్ కై షేక్ ప్రభువును నేడు
చావగొట్టే చెవులు మూయుచు
బర్మా మలయా ప్రాకినాదన్నా
ఈ విప్లవాగ్ని భరత ఖండం చుట్టినాదన్నా
ఇండోనేషియా వియత్నాములు
వీరతతో పోరుచున్నవి

తెలంగాణా పోరాట గేయాలు (విశాలాంధ్ర ప్రచురణ) పే 43. పేజి 51.
బైరాగుల పాటలో మొత్తం అంతర్జాతీయ పరిస్థితి వర్ణించబడింది.
చూ. ఔనంటావా? కాదంటావా? సుద్దాల హనుమంతు పాటలు, పే 27.

16. ఈ పాట పోలీసు యాక్షన్‌కు సుమారు నెల రోజుల ముందుగా రాయబడింది. ఇది చారిత్రక ప్రాముఖ్యత గల రచన. ఇది ఆనాటి నెహ్రూ, పటేలు ప్రభుత్వపు లోకవంచనను వ్యంగ్యంగా చిత్రించిన చారిత్రాత్మక గేయం. ఈ గేయం చెప్పిన జోస్యం అక్షరాలా నిజమైంది. పోలీసుచర్య ప్రారంభంకాగానే గుంటూరు, తెనాలి మొదలైన ప్రాంతాల్లో ఈ పాటను ప్రత్యేకంగా కరపత్రాలుగా వేసి పంచారు. పోలీసులు వెతికి వెతికి ఈ కరపత్రాలన్ని చించివేశారు. ఈ గేయంతో పాటు "జయపతాక నెత్తరా" అనే పాట ఆనాటి సింగరేణి బొగ్గు గనుల కార్మిక సంఘం కార్యదర్శి, తెలంగాణా రైతాంగ పోరాటంలో మృతి చెందిన శేషగిరిరావు ద్వారా ఆ ప్రాంతంలో విశేషంగా వ్యాప్తిచెందింది.

17. జయధీర్ తిరుమలరావు, 1986, ప్రజా కళారూపాలు, పే. 45.

18. చంద్ర పుల్లారెడ్డి, 1984, వీర తెలంగాణా విప్లవ పోరాటం, పే. 26.

19. ఐదారు వేల మిలటరీ సైనికులుకూడి ఏడెనిమిది గ్రామాలను వలయాకారంగా చుట్టుముట్టి ఆ ప్రాంతాలను గాలించి కమ్యూనిస్టులను, దళ సభ్యులను, సానుభూతి పరులను నిర్మూలించే పథకం.

20. కొంతమంది దళ సభ్యులు హుజూర్‌నగర్, మిర్యాలగూడెం అడవుల్లోకి వెళ్ళి పోయారు. నల్లగొండ కేడరు మొత్తం దేవరకొండ అడవికి వెళ్ళిపోయింది ఇటువైపు సూర్యాపేట దళాలు మానుకోట, భద్రాచలం అడవి ప్రాంతాలకు చేరుకున్నాయి. ఖమ్మం జిల్లాలోని దళాలు కొత్తగూడెం, భద్రాచలం ప్రాంతాన గల గోదావరీ నదీ తీరానగల అరణ్య ప్రాంతంలోకి వెళ్లారు. వరంగల్లులోని కొన్ని దళాలు ములుగు, ఏటూరి నాగారం ప్రాంతాలకు వెళ్ళారు. మరికొంత మంది మంథని దగ్గరగల గోదావరిని దాటి వెళ్ళిపోయారు. కరీంనగర్ ప్రాంతం లోని దళాలు ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు తాలూకాలోకి ప్రవేశించాయి.

21. కాసం నారాయణ సేకరించి ఇచ్చిన పాట.

22. కాసం నారాయణ జనగామ ప్రాంతం నాయకులు. దళ నాయకులుగా మంథని ప్రాంతంలోని అరణ్య ప్రదేశంలో ఉన్నారు. ఆనాటి తమ అనుభవాలను 21-3-82 నాడు జరిపిన ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.

23. పాలవంచ, భద్రాచలం ప్రాంతంలో ఆనాడు పనిచేసిన కార్యకర్తలు కొంద రున్నారు. వారు ఇంకా ఆనాటి పాటల్ని గుర్తుంచుకొని పాడారు. వీరిలో ఉయ్యాల పుల్లయ్యగారొకరు. వీరిద్వారా చాలా పాటలు లభించాయి.

24. ఈ పాటని ఉయ్యాల పుల్లయ్య పాడగా రికార్డు చేశాను.

25. జయధీర్ తిరుమలరావు, 1980 "తెలంగాణా పోరాటం కనిపెంచిన వీర వనితలు" నూతన, పే. 55.

26. పుచ్చలపల్లి సుందరయ్య, 1983, వీర తెలంగాణా విప్లవ పోరాటం-గుణపాఠాలు పే. 318.

27. ఒక విలేఖరి, 1948, "తెలంగాణా విప్లవ పోరాటంలో మొలకెత్తిన ప్రజా కవిత్వం", విశాలాంధ్ర.

28. పుచ్చలపల్లి సుందరయ్య, 1983, వీరతెలంగాణా విప్లవ పోరాటం-గుణపాఠాలు పే. 320.

29. గురజాడ రాఘవశర్మ, 1973, జాతీయగీతాలు, పే. 447.

30. అజ్ఞాత కవి, 1972, తెలంగాణా పోరాట గేయాలు, పే. 76.

31. జి. లింగారెడ్డి సేకరించి ఇచ్చిన పాట.

32. నంద్యాల శ్రీనివాసరెడ్డి రాసినట్లు కాసం నారాయణగారు సేకరించి ఇచ్చినపాట.

33. కమ్యూనిస్టుపార్టీ కమిటీ సమీక్ష (నల్లగొండ), సైనికచర్య తరువాత 81వ పే.లో చంద్ర రాజేశ్వరరావు లేఖ (15-7-1951) ఉదహరించారు.

34. సుద్దాల హనుమంతు, 1983, "వ్యవసాయ కూలి", సుద్దాల హనుమంతు పాటలు, పే 7.

35. -పై-

# 7

# సాహిత్య ప్రక్రియలు - పాట

సాధారణంగా రాత సాహిత్యం నోటి సాహిత్యంకన్నా అధిక గౌరవ మర్యాదలు కలిగి ఉంటుంది రాత సాహిత్యంతో సంబంధం ఉన్న వారి వర్గం, కులం, హోదాలు సులభంగా తెలుస్తాయి. సమాజంలో ఈ సాహిత్యమే 'అధికారం' కలిగి ఉంటుంది. ఇందులో మళ్ళ ప్రాంతీయ భాష, దేశ భాష, ప్రాశ్చాత్య భాష, దైవభాష మొదలగునవి ఉంటాయి. ఇవికూడా ఏదో ఓ మేరకి కొంత 'అధికారం' కలిగి ఉంటాయి. ఈ అధికారంలో కొంత మార్పు కనిపిస్తుంది. వీటి అన్నింటికి లోబడి ఉండేదే నోటి సాహిత్యం.

అలాంటి సాహిత్యంమీద నోటి సాహిత్యం మొదటిసారిగా ఎంతో గుణాత్మకంగా ప్రభావం చూపించింది. ఈ ప్రభావం భాషలో, భావనలో, రాజకీయాల్లో అన్నింటిలోనూ కనిపిస్తుంది.

## నాటకం

సూర్యాపేట, హుజూర్‌నగర్ ప్రాంతాల్లో పోరాటకాలంలో ఒకటి అరా నాటకాలు వేసినట్లు తెలుస్తున్నది. 'మాభూమి' నాటకం విజయవంతమైన తరువాత ఈ ప్రయత్నాలు మునగాల సరిహద్దు ప్రాంతాల్లోనూ జరిగాయి.

రంగస్థలానికి కట్టుబడిన నాటకం లిఖితధోరణిలోంచి వెలువడినా దానికున్న 'ప్రదర్శన' లక్షణంవల్ల ప్రేక్షకులు చదువురాకున్నా చూసి అర్థం చేసుకోగలుగుతారు. పదాల అర్థాలు తెలియకున్నా హావభావాల్నిబట్టి అవగతం చేసుకుంటారు.

తెలంగాణాలో సాంఘిక నాటకరంగం అనే దశ లేకుండానే పోరాటం ప్రభావం వల్ల పోరాట నాటకాలు, నాటికలు రాయడం జరిగింది. ఆంధ్రప్రాంతం రచయితలతో ఎన్నో పోరాట నాటకాలు రాయించింది.

1940 నుంచే అభ్యుదయ నాటకాలు ప్రారంభమయ్యాయి. సాంఘిక నాటికలు వేసే కళాకారులు, రచయితలు కమ్యూనిస్టు పార్టీ ఉద్యమాల ప్రేరణతో ముందుకు వచ్చారు. ఆ రోజుల్లో ఈ పద్ధతిలో వచ్చిన మొదటి నాటకం 'ముందడుగు'. పుస్తకాల అమ్మకంలోనే కాదు ప్రదర్శన విజయంలో కూడా రికార్డు సృష్టించింది. దీన్ని మద్రాసు అడ్వైజరీ ప్రభుత్వం నిషేధించింది. అందుకు నిరసనగా ఆంధ్రదేశమంతటా 15-8-1946 'ముందడుగు దినోత్సవం'[1] జరిపారు.

ఆ తరువాత 'అపనింద' నాటకం వచ్చింది. దాని తరువాత 'మాభూమి'. ఈ నాటకాన్ని 125 దళాలు ప్రదర్శించాయి. ఆంగ్లేయ ప్రభుత్వం ఎన్నో నాటకాల్ని నిషేధించింది. మంత్రులు ఈ నాటకాన్ని చూసి మెచ్చుకున్నారు. పశ్చిమ గోదావరి జిల్లాలో మొదట ఈ నాటకాన్ని నిషేధించారు. ఆ తరువాత కాంగ్రెసు ప్రభుత్వం ఈ నాటకాన్ని నిషేధించింది.[2]

మాభూమి నాటకాన్ని నల్లగొండజిల్లా ప్రజాపోరాటం ఆధారంగారాశారు. ఈపోరాటమే రచయితలకు ప్రేరణగాపనిచేసింది. మాభూమిని తెలంగాణా సరిహద్దు ప్రాంతాలలో ప్రదర్శించారు. ఈ నాటకం సాంస్కృతిక రంగంలో ఎంతో చైతన్యం కలిగించింది. సంస్థానంలోకి నాటకం రాకున్నా నాటకంలోని పాటలు ''భాయీ బందగే నీ జీవితమే జీవితము", "తెలుగు బిడ్డా మేలుకోవోయ్ నైజాము తెలుగుబిడ్డా లేచిరావోయ్", ''నరక కూపమీ క్రూర నిరంకుశ నైజాం పాలన రైతా" అనే పాటలు తెలంగాణా మొత్తంలో మౌఖిక ప్రచారం పొందాయి. మాభూమిని పాలకవర్గాలు నిషేధించగలిగాయేగాని అందులోని పాటలను నిషేధించలేకపోయింది. ఆ పాటలు ఏ ప్రజా పోరాటాన్ని ఉద్దేశించి రాశారో ఆ ప్రజలే తమ సొంతం చేసుకొన్నారు. ఈ పాటలు ఫలానా నాటకంలో ఉన్నాయని సాధారణ ప్రజలకు ఎవరికీ తెలియదు.

నాటకాలే కాకుండా అయ్యపు వెంకటకృష్ణయ్య రాసిన నాజీ నైజాం[3] మొ॥ గేయనాటికలు కూడా వచ్చాయి. తెలంగాణా పోరాటంలో పాల్గొనడానికి చెల్లెలు ప్రయాణమవుతున్న సందర్భంలో అక్కా-చెల్లెళ్ళ సంభాషణని నాటికగా మలిచారు. ఈ నాటిక స్త్రీలలో ఎంతో చైతన్యం తెచ్చింది. మొత్తం నాటిక ఒక్క ఊపున నడుస్తుంది.

తెలంగాణా రైతాంగ పోరాట కాలంలో ఎన్నో నాటికలు ఎంతోమంది ప్రసిద్ధ రచయితలు రాశారు. ఐతే వీటి ప్రదర్శన సరిహద్దు ప్రాంతాల్లో తప్ప తెలంగాణా గ్రామాల్లో సాధ్యం కాలేదు. జాతీయవాద బుర్రకథలోని పాటలు కూడా కొన్ని ప్రచారం పొందాయి. ముఖ్యంగా అడ్లూరి అయోధ్యరామ కవి రాసినవి.

## పద్య రచనలు

భూస్వామ్య వ్యవస్థలో పద్యమే ప్రధాన వ్యక్తీకరణ రూపం. తెలుగు లిఖిత సంప్రదాయం ఏర్పడినప్పటినుండి అవిచ్ఛిన్నంగా పద్యమే కవిత్వానికి వాహకం. కావ్యాల్లో కొద్దిపాటి వచనం వాడుకున్నప్పటికీ, పాటని పూర్తిగా ఈ రాజాస్థాన కవులు విస్మరించారు. పద్యం 'రాజ ప్రయోజనాల' కోసం పరిమితమైంది. ఐతే దీర్ఘకాలంగా పద్యం కాలూనడం వల్ల పద్యాన్ని సాధారణ కవులు, శ్రమజీవి కవులు అనుకరించారు. పద్యం రాస్తేనే కవి అనే భావం ఉంది. ఆశువుగా పద్యరచన చేయడం పరిపాటి అయింది. యక్షగానాలు, వీధి భాగోతాలు, తోలుబొమ్మలాట మొ॥ ప్రక్రియల్లో పద్య గానం ఎక్కువగా చోటు చేసుకుంది. పద్యాన్ని పాడి అర్థమయ్యేరీతిలో (హావ భావాలతో చెప్పే హరికథ) వినిపించడం వల్ల ప్రజలు ఆనందిస్తారు.

ఆ విధంగా పద్యానికి ప్రజలు పాఠకులుగా కాక శ్రోతలుగా ఉంటారు. ఇలాంటి రచనల్లో సంస్కృత సమాసాలు తక్కువగా పడతాయి. కొన్ని గ్రాంథిక పదాలు మాత్రం ఉంటాయి. శ్రామిక వర్గం కవులు రాసే పద్యరచనలు సులభంగా అర్థ మవుతాయి. కఠినమైన పదాలు, భావం తక్కువగా చోటుచేసుకుంటాయి.

పద్య రచనలో పాండిత్య ప్రకర్ష ఎక్కువై శ్లేష, యమకాల మెరుగుల కోసం భావాన్ని బలిపెట్టే కవులు ఒకవైపు ఉండగా మరోవైపు పద్యాలలోనైనా ప్రజలకు దగ్గరగా తమ భావాన్ని ప్రచారం చేసిన వారున్నారు. ఇందులో ప్రత్యక్షంగా శ్రమ జీవులకు పనికి వచ్చే సాహిత్యం లేకున్నప్పటికీ వారి జీవితాన్ని చక్కగా వర్ణించారు. ఈ శతాబ్ది ప్రారంభంలో అలాంటి వారిలో ప్రముఖంగా చెప్పుకోదగినవాడు గంగుల శాయిరెడ్డి ఒకరు.

భాగవతంలోని పోతన పద్యాలను అనుసరించి రాసిన పద్యాలలో "శ్రమముచే ఘ్రాణించు శ్వాసమే శ్వాసంబు" అనీ, "దినము కష్టించు వారెపో దివ్యులరయ" అనీ శ్రమజీవులు శ్రమని గుర్తించారు. "పనిబాట సేయని పదము పదముకాదు" అని పద్యాల్లో పనిపాట ప్రాధాన్యాన్ని గురించి చెప్పారు. పదము పనిపాటగానే ఉంటుందనే వాస్తవాన్ని శ్రమజీవి వర్గం కవే చెప్పగలడు. ఈ విధంగా రైతాంగ జీవితాన్ని వర్ణించిన శాయిరెడ్డి పద్యాలు గ్రామాలలో పాడుకునే వారిని తెలిసినప్పుడు ఆశ్చర్యం కలగలేదు.

ఇలాంటి శ్రమజీవుల వర్గానికి చెందిన కవులు తెలంగాణాలో వచ్చిన ఉద్యమా లకు సంబంధించిన ఆయా దశలకి అనుగుణంగా ప్రతిస్పందించారు. పోరాటంలో పద్యాలు గానం చేశారు.

కేవలం ఒకటి రెండు పద్యాలే కాకుండా పద్యకావ్యాలు కూడా వచ్చాయి. ఇందులో ముఖ్యంగా దాశరథి, ఎర్రోజు మాధవాచార్యులు గురించి చెప్పుకోవాలి. దాశరథి అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం మొ॥ని పద్యరచనలే. మాధవాచార్యుల వారి 'మఘవలయం'[4] సైనికచర్యకు ముందు రజాకార్లు చేసిన దౌర్జన్యాలను ప్రధానం చేసుకొని రాశారు.

నాకు దొరికిన పది పద్యరచనల్లో రెండు 'జమీన్ రైతు' పత్రికలో అచ్చయ్యాయి. మిగిలిన ఎనిమిది పద్యాలు మౌఖికంగా ప్రజలు పాడుకునేవి. ఐతే ఈ పద్యాలు అందరూ పాడరు. కొద్దిమంది మాత్రమే పాడతారు. "ఏవైనా పద్యాలు వస్తాయా" అని అడిగితే శ్రమజీవులు తాము పాడరు. పద్యం పాడే అతన్ని చూపిస్తారు. ఆతను గొంతెత్తి రాగయుక్తంగా పాడతాడు.

పోరాటంలో నల్లగొండమీద ఎన్నో పాటలు వచ్చినట్లుగానే పద్యాలు కూడా పాడుకున్నారు. ఈ పద్యాలు రైతాంగం పాడుకోవడం వల్ల పద్యగానంలా కాకుండా స్వతంత్రేచ్ఛగా పాడుకొనేవారు. సుంకర రాసిన "తెలంగాణా" వంటి బుర్రకథల్లో పద్యాలు ఉన్నాయి.

ఈ పద్యరచనల్లో 'ఫాసిస్టు దౌర్జన్యదోపిడి', 'కాంపౌడు' అనే ఇంగ్లీషు మాటలు చోటుచేసుకొన్నప్పటికీ మొత్తంమీద గ్రాంథికపదాలే ఎక్కువగా ఉన్నాయి.

ఆకర్షబద్ధమైన ఛందస్సుకన్న, మాత్రాబద్ధమైన కవిత్వంకన్నా, ధ్వని సంపుటాల్లోంచి వెలువడే నోటిపాటలే ఎక్కువ ప్రజాదరణ పొందుతాయి. పాటలు తప్ప శ్రమజీవులు పద్యరచనలు ఎక్కువగా వెలువరించలేదు.

## కథ, నవల

ఇకపోతే కథ, నవల ఈ రెండు పూర్తి ఆధునిక రాత సాహిత్యరూపాలు. ఇవి మధ్యతరగతి ప్రజలకే పరిమితమవుతాయి. పోరాట కాలంలో వీటిని రాసినప్పటికీ పోరాడే ప్రజలకు వీటివల్ల ఎక్కువగా ప్రాయోజనం కలుగదు. నవలలు ఎక్కువగా పోరాటం తరువాతే వెలువడ్డాయి. ఈ నవలల్లో పోరాటాన్ని చిత్రించడానికి ప్రయత్నాలు జరిగాయి. ప్రజా చైతన్యాన్ని చరిత్ర పుస్తకాలకన్నా ఎక్కువ విపులంగా నవలలు చిత్రించగల్గుతాయి.

పాత సమాజాన్ని ధిక్కరించి కొత్త సమాజం వైపు అడుగువేస్తున్న క్రమంలో ఆయా పరిస్థితుల్ని, ప్రజల చైతన్యాన్ని రాజకీయ మలుపుల్ని కళారూపాలు ప్రతిబింబిస్తాయి. దృశ్య, మౌఖిక రూపాలు మళ్ళీ చరిత్ర నిర్మాతలైన ప్రజలకు దగ్గరగా

పోతాయి. కథ, నవలకు ఆ పరిధి స్వభావం లేదు. కాబట్టి అవి శ్రమజీవులైన ప్రజలకు దూరంగా ఉంటాయి. దూరంగా ఉన్నప్పటికీ ఇవి ప్రజల పోరాట దశలను చిత్రించాయి. ప్రజల పోరాట క్రియాశీలక స్వభావాన్ని యధాతథంగా సమర్థించాయి. 'మాలపల్లి' లాంటి ఒకటి అరా నవలలు ప్రజల జీవితాన్ని చిత్రించాయి. తెలంగాణా రైతాంగ పోరాటం ప్రభావంతో వెలువడిన ముఖ్యమైన నవలల్లో (ప్రజల మనిషి, గంగు, ఓనమాలు, మృత్యువు నీడల్లో, మృత్యుంజయులు, సింహగర్జన) రైతాంగ సంబంధాలు, పోరాటాలు గాఢంగా హత్తుకునేలా వైవిధ్యపూరితంగా రచింపబడినాయి. ఒక విధంగా ఈ నవలలు గత పోరాట చరిత్రను గుండెల్లో దాచుకొన్నాయి. ఈ విధంగా లిఖిత సాహిత్య ప్రక్రియగా ఉన్న కథలు, నవలలు తమ పరిధి మేరగల ప్రయోజనాన్ని నెరవేరుస్తున్నాయి. ఆ పరిధిలో అవి అప్రత్యక్షంగానైనా ప్రజల కోసం ఉపయోగపడినట్లుగానే భావించాలి.

మౌఖికంగా అటు పాట ఇటు లిఖితరూపంలో నవలల్లా కాకుండా మధ్యలో వచన కవిత ఒకటుంది. తెలంగాణా రైతాంగ పోరాటం ప్రారంభం నుండే వచన కవిత బీజాలు పడ్డాయి. పోరాటకాలం నాటికి పోరాట ప్రభావాన్ని నింపుకొని తెలుగులో తొలి వచన కావ్యం 'తెలంగాణా' వెలువడింది. పోరాటం అనేక వచన కవితల్నే గాకుండా కావ్యాలను కూడా సృష్టించింది. ఈ కావ్యాలన్నీ ఏదో ఓ మేరకి పోరాటాన్ని కథా వస్తువుగా చేసుకున్నాయి.

ప్రజలు కథానాయకులయ్యారు. పాత సంప్రదాయాలన్ని పటాపంచలయ్యాయి.

సామ్యవాద సిద్ధాంతాలు కవిత్వీకరింప బడినాయి. ఐతే ప్రజలమీద ఈ కవితల, కావ్యాల ప్రభావం ఏమీ పడలేదు. శ్రమజీవుల బాణీలు, భావాలు, పోరాటాల ప్రభావమే ఈ కావ్యాల నిండా పడింది! ఈ విధంగా శ్రమజీవుల విజయాన్ని వివరంగా తరచి చూడాల్సిన అవసరం ఉంది.

## వచన కవిత్వంపై ప్రజాబాణీల ప్రభావం

తెలంగాణా పోరాట ప్రభావంతో కావ్యాలు వెలువడ్డాయి. కొప్పరపు సుబ్బారావు-ఎరుకల లచ్చిమి, ఆరుద్ర-త్వమేవాహం, సోమసుందర్-వజ్రాయుధం, గంగినేని వెంకటేశ్వరరావు-ఉదయిని, కుందుర్తి-తెలంగాణ మొదలైనవి. రమణారెడ్డి-భువన ఘోష, దాశరథి-అగ్నివీణ. రుద్రవీణ, మహాంధ్రోదయంలోని కొన్ని రచనలు నైజాం వ్యతిరేకతను, ప్రజల పోరాటాన్ని, వారి త్యాగాల్ని వర్ణించాయి. ఈ కవులందరిమీదా, తెలంగాణా సాయుధ పోరాటంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావం ఉంది. ప్రజా సాహిత్య కళారూపాల ప్రభావం కూడా వుంది. అందువల్ల వారు ఛందోబద్ధమైన

కవిత్వం రాసినా గేయకవిత్వం రాసినా, వచన కవిత్వం రాసినా అందులో ప్రజల సొత్తయిన మౌఖిక రూపచ్ఛాయలు చాలా ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. వారి కవిత్వంలో ప్రజా కవిత్వ ధోరణి కనిపిస్తుంది.

ఈ కవులందరిలో దాశరథిని పోరాటంతో ప్రత్యక్ష సంబంధం. ఆయన నైజాం గద్దె దిగేవరకు సాగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు. పోలీసు నిర్బంధాలకు, జైలు శిక్షలకు గురయ్యారు. రమణారెడ్డి ప్రజల పక్షాన నిలిచి పోరాటానికి మద్దతు పలికారు. పోలీసు నిర్బంధానికి గురైనా, గంగినేనిది దూరపు సంబంధమే. ఆయన ప్రత్యక్షంగా పాల్గొనలేదు. మిగతా కవులందరూ మిత్రులవల్ల, వార్తా పత్రికల వల్ల కొన్ని సంఘటనల వల్ల విషయాలు తెలుసుకొని కావ్యాలు రాశారు. వీరి కావ్యాలన్నింటిలో ప్రజల పాటల లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ముఖ్యంగా బరువులు లాగుతున్నప్పుడు, పల్లకీ మోస్తున్నప్పుడు పాడే పని పాటల లక్షణాలు, వృత్తి గాయకులు ప్రచారం చేసిన బుర్రకథ వరసలు, పోరాటంలో వచ్చిన ప్రజల మార్చింగ్ పాటల లక్షణాలు కనిపిస్తున్నాయి. ఇవి కొన్నిచోట్ల ఉన్నవి ఉన్నట్టుగానూ కొన్నిచోట్ల కొద్ది మార్పులతోనూ కనిపిస్తున్నాయి.

ఆరుద్ర, కె. వి. రమణారెడ్డి, కొప్పరపు సుబ్బారావు, కుందుర్తి మొదలైన కవులంతా బుర్రకథ బాణీని తమ కవిత్వంలో వాడుకున్నారు. సాహిత్యంలో ఇది ప్రజా విజయంగా భావించవచ్చు.[5]

వినరయ్యా ఓ తెలుగు తంద్రులారా
వినరమ్మా ఓ తెలుగు తల్లులారా

అంటూ ప్రారంభించిన కొప్పరపు సుబ్బరావు -

గుండాల్ నలుగురు, జాగీర్దారూ
గుడ్డలు కుక్కిరి లచ్చి నోటిలో
గట్టిగ కట్టిరి కరచరణమ్ములు
గుట్టుగ మోసిరి జాగీర్ కోటకు[6] - అంటూ దుండగుల కామానికి ఎరుకల లచ్చిమి బలైపోయిన వైనం వర్ణించారు. కొప్పరపు సుబ్బారావు. టెక్నిక్ లేకుండా కవిత్వాన్ని ఊహించలేనన్నటువంటి ఆరుద్ర స్వీయ కల్పిత మానసిక సంఘర్షణలోంచి త్వమేవాహం రాశారు. అందులో సైతం ప్రజా కళారూపాల జాడలోకి అనివార్యంగా రావలసి వచ్చింది. "బ్రెయిన్‌లో బ్రెన్‌గన్ రెయిన్‌లా ఆలోచనల బ్రెయిన్ , , - అంటూ అత్యాధునిక రీతిలో ప్రారంభించినా ఒక దశలో -

భళాకోయి భళి తమ్ముడూ
భళానోయి భళి దాదానా
నక్కలు తిరిగే కోటలో
నాలుగు స్తంభాల కోటలో
రాకాసి రాజొక డుండెరా[7] – అంటూ బుర్రకథ బాణీని ఉపయో

గించుకున్నారు. అలాగే భువనఘోషలో రమణారెడ్డి అదేపని చేశారు. ఈయన బాణిలో వీరరసం ఎక్కువ. ఆ వీరతని చాటడానికి –

వేనకు వేలై వేలై వేలై
వీరులు చాలై చాలై చాలై
వేలై కోట్లై చాలై జాలై
దళాలు బారులు సింహవాహినులు....
సైసై సైయని సైయని సైయని
రైరై రైయని రైయని రైయని
సైయని రైయని రైయని సైయని....[3]

పదపునశ్చరణ శిల్పంతో మౌఖికగానపద్ధతికి దగ్గరగా కవిత్వం రాశారు.

కుందుర్తి రాసిన మొదటివచన కవితా కావ్యమైన 'తెలంగాణ' లో బుర్రకథ గురించి ప్రస్తావించారు. అంతేకాదు, బుర్రకథ బాణీని ఉపయోగించకుండ ఉండలేక పోయారు.

ఆరుద్ర మరోరకంగా కూడా ప్రజల దగ్గరికి వచ్చారు. శ్రమజీవులు బరువులు లాగేప్పుడు లేదా మోసేప్పుడు పాడేపాటలు ఆయనపై ప్రభావం చూపాయి. ఈ సిద్ధాంతగ్రంథంలో ఉదహరించిన పల్లకి పాటను (పే.9) ఆరుద్ర త్వమేవాహంలోని 'సెకండ్లు' అనే ఖండికతో పోలిస్తే విషయం అవగతమవుతుంది.

తొయ్యోయ్ తొయ్యోయ్ తొయ్
మెయ్యోయ్ మెయ్యోయ్ మెయ్
లాగండ్రా బాబు
లాగండ్రా బతుకు
లాగండ్రా గన్ను
ఇంకా ఇంకా రాజ
ఇంకా ఇంకా నాయన

లాగండ్రా బతుకు
లాగండ్రా బరువు

శ్రమజీవులు బరువులలాగుతూ పనిచివర్లోగాని మధ్య మధ్యలో గాని హ - హం అంటూ పనితీవ్రతను తగ్గించుకుని తేలికపడతారు. దీనికి అనుగుణంగానే "కొట్టోయ్ కొట్టోయ్ పిట్ట, కొట్టోయ్ కొట్టోయ్ కింద" - అంటూ మంచి ఊపుతో హుషారుగాసాగే కవితచివరలో "మొయ్యోయ్ హయ్యమ్ హం తొయ్యోయ్ హయ్యం హం" అంటూ నిదానిస్తుంది.

పనిపాటల బాణీ (పడవనడిపేటప్పుడు పాడేపాట) ని గంగినేని వేంకటేశ్వరరావు అనుకోకుండానే తమ కావ్యంలో చోటిచ్చారు.

ఆగిందమ్మా గాలి
ఆగిందమ్మా నాడి
సాగిందమ్మా సంగ్రామం
కోరిందయ్యా రుధిరం
నడవండమ్మా ముందుకు
తడపండయ్యా ధరణి[10]

అటు ఛందస్సు ఇటు గేయంలోని లయను కాదని (ప్రజలకు దూరమైన) వచనంలో నిలపాలని నిర్విరామంగా కృషిచేసిన కుందుర్తి ప్రజల పాటల ప్రభావం లోంచి తప్పించుకోలేకపొయ్యారు. కథకుడు ఏమని పాడుతున్నాడయ్యా-

బతుకుపూవులో తేనె ఎదయా ?
తుమ్మెద తాగిందీ........ వినరా!
ఆకాశంలో తారలేవమా?
మబ్బులు మింగాయి.॥ - వంటి చరణాలు

బుర్రకథల వరుసధోరణి బయటపెడుతున్నాయి. తెలంగాణా కావ్యంలోనే కాదు దండియాత్ర, నయాగార వంటి ఇతర కావ్యాలలో కూడా ప్రజలపాటల పల్లవిని స్ఫురింపజేసే చరణాలు, మార్చింగ్‌సాంగ్ పద్ధతిలో ఉన్న పాదాలు కనిపిస్తాయి. తెలంగాణ కావ్యంలో (కుందుర్తి కవితలు : 46) మార్చింగ్ పాట నమోనా కనిపిస్తుంది.

'పాటలు పాడితిన్ తెలుగుబాబులు నిద్దుర మేలుకోగ,పోరాటము సేయగా'[12] అని ఛందోబద్ధ కవిత్వంలో చెప్పుకున్న దాశారథికి ప్రజలపాట ఒరవడిన వాడుకోక

తప్పలేదు.[13] ప్రజల పాటలకు ముఖ్యలక్షణమైనపదాల పునశ్చరణ ఈయన కవిత్వంలో చాలా స్పష్టంగా ఉంది.

వజ్రాయుధంలో కూడా ప్రజల పాటల ప్రభావం కనిపిస్తుంది. "కదలండి కదలండి కదలి పోరాడండి" అనో "పోరండి పోరండి కదలి పోరాడండి" అనో

లేవండి లేవండి
ఆయుధాలు తీయండి
కత్తితో కర్రతో
వడిశాలతో కదలి[14] - అని పలుచోట్ల వచన కవితల్లో

పాటల బాణీ కనిపిస్తుంది. శత్రువులు శత్రువులు అనే పునశ్చరణ పదాలు కవితను మౌఖిక సంప్రదాయానికి దగ్గరగా తీసుకెళుతున్నాయి. ఈ లక్షణంవల్లనే పోరాటకాలంలోనే రాసిన 'ఖబర్దార్ ఖబర్దార్ నైజాం పాదుషాహి'- అనే కవిత ప్రజలదై పోయింది. పోరాటకాలంలో దాన్ని విరివిగా పాడుకున్నారు. కవి తనకు తెలిసిన ప్రక్రియలో కవిత రాశారేగాని,పోరాటంలో పాడుకోవడానికని ప్రత్యేకంగా రాయలేదు. అయినప్పటికీ ఆ కవితలో ఉన్న ప్రజల పాటల లక్షణంవల్ల ఆ సమయంలో దాని అవసరంవల్ల ప్రజల్ని చేరింది. లిఖితబద్ధమై నిర్వహించే కర్తవ్యంకంటే మౌఖిక రూపంలోపడి, ప్రవహించిన ఆ కవిత ఎంతో ప్రయోజనాన్ని సాధించింది. ప్రజలకు అది సోమసుందర్ కవిత అనిగానీ, ఆంధ్రప్రాంతపు కవి రాసిందని గానీ తెలీయదు. ప్రజలనుండి ప్రజలకు అనే వలయంలో వచ్చి, ప్రజా సాహిత్యంలో భాగమైపోయిన సాహిత్యానికి ఉదాహరణగా ప్రసిద్ధిపొందిన "ఖబర్దార్ ఖబర్దార్ నైజాం పాదుషాహి" అనే కవితను చెప్పవచ్చు.

రోకళ్ళు, కారాల
మూటలతో కదిలారు
కూల్చారు రక్కసుల
గెల్చారు శత్రువుల[15] అంటూ ఉద్రేకంగా సాగిన సోమసుందర్

కవితలో మార్చింగ్ సాంగ్ ధోరణి ఉంది. ఆయన తన కావ్యంలో కొమరయ్య, అనంతయ్యల్ని కీర్తించారు. సూర్యాపేట, బాలేముల సంఘటనల్ని ప్రస్తావించారు. రైతుకూలీ సభలు, ప్రజారాజ్య పరిషత్తులు చేపట్టిన కార్యక్రమాల్ని గుర్తుచేస్తూ ప్రజల ఆయుధాల్ని, వారు రంగంలోకి కదిలివచ్చిన తీరును వర్ణించారు. చాలామంది మధ్య తరగతి కవులలాగే ఈయనకూడా పౌరాణిక గాథల్లోంచి ఉపమానాలు వాడుకున్నారు. నైజాంను కీచకుడిగా, భస్మాసురుడిగా, తెలంగాణ గెరిల్లా వీరుణ్ణి గాండీవి(విజయుడి)గా

చిత్రించారు. 'తెలంగాణ జవనాశ్వము సింహము' అన్నారు రమణారెడ్డి. సింహాన్ని వాహనంగా చేసుకునేవారు పురాణాల్లోనే కనిపిస్తారు.

ఉద్యమాలకు, పోరాటాలకు, విప్లవాలకు కవులు ప్రతిసారి ప్రతిస్పందిస్తారు. వాటి ప్రభావం వారి రచనల్లో వుండడంవల్లనే ఆ తరువాత వెలువడే సాహిత్యంలో పోరాట ప్రభావం కనిపిస్తుంది. టాల్‌స్టాయ్‌వంటి మహారచయిత, అక్టోబరు విప్లవం రచయితగా తనకు కావల్సిందంతా ఇచ్చిందని ఒప్పుకున్నారు.[16] సమాజంపట్ల తమ బాధ్యతను గుర్తెరిగిన కవులు పోరాట ప్రభావాన్ని తమ రచనల్లో ప్రతిధ్వనింపజేశారు.

**"October Revolution produced a poetic inspiration that profoundly influenced the future development of Russian literature."** [17] అన్న మాటల్ని తెలంగాణ పోరాటానికి అన్వయించుకుని చూస్తే పై విషయాలు స్పష్టమౌతాయి. ఈ మధ్య తరగతి కవులు ప్రజలపై, ప్రజా సమస్యలపై దృష్టి మరల్చడమే కాదు. కవులుగా తమ ప్రత్యేకతను నిలబెట్టుకోవడానికి తప్పనిసరై ప్రజల బాణీలను ఉపయోగించుకున్నారు.

కవిత్వం ఛందోబద్ధమైనదైనా, మాత్రాఛందస్సుదైనా వచన రూపమైనా మధ్య తరగతి కవులు రాసే ఏ కవితా ప్రక్రియ ఐనా ప్రజలతో ఏ మాత్రం సంబంధం లేనిదే,[18] ఎందుకంటె **civilised poetry is the work of a more highly individualised society.**[19] అందువల్ల కవులు తమ కవిత్వం ప్రజల్ని లేదా కనీసం మధ్యతరగతి పాఠకుల్ని చేరడానికి అనేక ప్రయత్నాలు, ప్రయోగాలు చేశారు. అలాంటి ప్రయత్నాల్లో వారు ప్రజల దగ్గరికి వెళ్లడం ఒక ముఖ్యమయిన విషయం. దానివల్ల వారు తమను కొత్తగా వ్యక్తీకరించుకోగలిగారు. కాని వారి రచనలు ఎంత వరకు ప్రజల్ని చేరాయన్నది ఆలోచించవల్సిన విషయం. ఈ సందర్భంలో జార్జి థామ్సన్ కవులనుద్దేశించి అన్న మాటలు గుర్తుతెచ్చుకోతగ్గవి. **"If they are to recover their power to inspire they must seek inspiration from the people."** [20]

పోరాటం సిద్ధాంతపరమైన, ఆచరణాత్మకమైన విషయ పరిజ్ఞానాన్ని కలిగించింది.[21] పార్టీ మెంబర్లు కాకపోయినా [22] సంగం కార్యకర్తలలో పరిచయాలుంచుకుని ప్రజల నాడిని తెలుసుకుని, అందుకు అనుగుణంగా రాసి ప్రజాకవులయ్యారు. అలాంటిదే ప్రజా సాహిత్యమైంది.

## ముగింపు

శ్రమజీవుల పనిపద్ధతులు, శ్రమ సంబధాలలోంచి పాట పుడుతుంది. భూస్వామ్య సమాజంలో వుత్పత్తిలాగే శ్రమజీవుల సాహిత్యంకూడా ఉన్నతవర్గానికే

దత్తమవుతుంది. అలా పరాయిదైపోయిన సాహిత్యంలో ప్రజాస్వభావం ఉన్నప్పటికీ అది శ్రమజీవివర్గంనుండి దూరమవుతుంది.

శ్రమైక జీవన సంస్కృతిలో మతభేదాలు లేవు. శ్రమ విధానం ఇద్దరికీ ఒకటే. ఒకే విధమైన పనిలోంచి పాటని వెలువరించినట్లే ఒకే రకమైన కష్టసుఖాలు అనుభవిస్తారు.

వర్గసమాజంలో పని, పనికి సంబంధించిన శ్రమలోంచి వెలువడిందే నిజమైన ప్రజాసాహిత్యం. లేదా వుత్పత్తికి సృష్టికర్తలైన ప్రజల గురించి వారి శ్రేయస్సుకోసం వెలువరించిన ఎలాంటి సాహిత్యాన్నైనా ప్రజాసాహిత్యం అనవచ్చు.

తెలుగు ప్రాంతంలో జమీ వ్యతిరేకోద్యమంలో మొదటిసారిగా ప్రజలలో ప్రచారం చేయడానికోసం సాహిత్యాన్ని సాధనంగా చేసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో వెలువడిన ఫాసిస్టు వ్యతిరేక సాహిత్యంలో అనేకమైన ప్రజల పాటల బాణీలు చోటుచేసుకున్నాయి. ఆ పాటల్లో ప్రజల భాష, భావవ్యక్తీకరణ చోటు చేసుకుంది.

అయితే నిజమైన ప్రజాసాహిత్యం ఆంధ్ర ప్రాంతంలో కాకుండా తెలంగాణా రైతాంగ పోరాట కాలంలో వచ్చింది.

రాత సాహిత్యం భద్రపరచడం కోసం ప్రారంభమైన తెలంగాణా ఉన్నతవర్గం వారి ఉద్యమం, సామ్యవాదభావ ప్రభావంతో వివిధ ఉద్యమాలు వెలువడడానికి దోహదమైంది. ఈ ఉద్యమాల్లో పద్యాలు, లిఖిత గేయ రచనలు ఎక్కువగా వచ్చాయి.

ఆంధ్ర మహాసభలు సంఘంగా మారే క్రమంలో పాటలు వెలువడ్డాయి. ఈ పాటల్ని మధ్య తరగతి కవులే ప్రజలకోసం రాశారు. సంఘం పునాదివరకు పాకే క్రమంలో ప్రజలే పాటలు వెలువరించుకోవడం ప్రారంభించారు.

సజీవంగా, సచైతన్యంగా వుండే జాతులూ, వర్గాలూ బయటకు కనిపించకపోయి నప్పటికీ లోలోన తిరుగుబాటు చేస్తూనే ఉంటాయి. దోపిడీ వ్యవస్థను ఎదిరించడానికి దాన్ని మార్చడానికి చేసే పోరాటాలు మాత్రమే సాహిత్య చరిత్రనీ, స్వభావాన్నీ పూర్తిగా మార్చగలుగుతాయన్న సత్యం తెలంగాణా పోరాటకాలంలో ప్రజలు నిరూపించారు.

బేదఖలీ పోరాటం ప్రారంభంనుండి స్త్రీ పురుష భేదం లేకుండా పోరాటంలో పాల్గొన్నారు. అప్పటినుండి స్త్రీల పాటలుకూడా పోరాట సాహిత్యంలో సగభాగ మయ్యాయి.

వుత్పత్తివరకే పరిమితమైన పాట - వుత్పత్తిని దక్కించుకోవడానికి అవసరంగా

పనిచేసింది. వ్యక్తి దృక్పథం పోయి సమిష్టి దృక్పథం హెచ్చింది. తద్వారా పని పాట శ్రామికుల సొత్తయినట్లే పోరాటపాట ప్రజలపాటగా మారిపోయింది. పోరాటపాట అటు వుత్పత్తిలోనూ, ఇటు పోరాట రంగంలోనూ ఏకకాలంలో పనిచేసింది.

వర్గపోరాటంలో శ్రమజీవులు పాడుకున్న పాటల్లో రైతాంగ సంస్కృతికి దగ్గరగా ఉన్నాయి. వేలాదిగా వెలువడిని ఈ పాటలు ఎక్కువగా ఆనాటి రూపంలో ఇవ్వాళ కనిపించవు. అలా కనిపించిన కొన్ని పాటలైనా పరిశీలిస్తే చాలా విషయాలు తెలుస్తాయి. ఇలాంటి పాటలు పోరాటం జరిగి నాలుగు దశాబ్దాలు దాటినా ఇవి ఇంకా ప్రజల జీవితంలో పచ్చగానే ఉన్నాయి. వారి శ్రమ సంబంధాల్లో ఈ పాటలు పనిచేస్తున్నాయి.

పోరాటకాలంలో ప్రజలు విజృంభించే దశలో ఉంటారు. పోరుబాటలో త్యాగాల పాళ్ళలో వాళ్ల క్రోధం వెల్లువలా పాకింది. శతాబ్దాలుగా అణచిపెట్టిన ప్రతిఘటన శక్తి, తరతరాల పగ ఇవన్నీ ప్రస్ఫుటంగా వారి పాటల్లో చోటుచేసుకొన్నాయి. పోరాటం ఉధృతమైనకొద్దీ ఈ పాటలుకూడా విజృంభించాయి. విప్లవకాలంలో అసలు సాహిత్యమే మరుగైపోతుంది. విప్లవ తరంగంలో అందరూ కొట్టుకుపోతారు. మాటలు కట్టిపెట్టి చేతలకు దిగుతారు. విప్లవ కార్యక్రమంలో ప్రతివారూ తలమునకలవుతూ వుంటే యిక సాహిత్య వ్యాసాంగానికి తావుండదని లూసన్ అభిప్రాయపడ్డారు.

లూసన్ పైన చెప్పిన మాటలు తెలంగాణాకు వర్తించేట్లుగా లేవు. లూసన్ రాత సాహిత్యం వెలువరించే రచయితలను దృష్టిలో పెట్టుకొని చెప్పిఉంటారు. అంతేకాని శ్రమజీవులకు ఈ విషయం వర్తించదు. ప్రజలు పోరాడుతూనే పాటలు వెలువరించు కొంటారు. పాడుతూనే పోరాడుతారు.

అంతేకాదు ప్రజలు వెలువరించే నోటి పాటలను ఏ ఆంక్షలు ఆపలేవు. నిషేదాలు తాకలేవు. అశువుగా వెలువడి మౌఖిక పద్ధతిలో ప్రచారం పొందుతాయి.

కార్మికోద్యమంలో వెలువడే నినాదాలు, పాటలు వ్యవసాయ పోరాట పాటల కన్నా కొంత భిన్నంగా ఉంటాయి. రైతాంగమే కార్మికులుగా మారినప్పుడు మరికొంత విలక్షణంగా పాటలు వస్తాయి. ఈ ప్రత్యేక లక్షణాలు పరిశీలనార్హం. పోరాటం తరువాత వచ్చే విప్లవ సాహిత్యోద్యమంలో 'పాట' తన రూపాన్ని, స్వభావాన్ని ఎంత వరకు నిలుపుకోగలిగిందో కూడా బేరీజు వేయాలి. మారుతున్న పరిస్థితుల్లో మౌఖిక రూపం ప్రజలలో ఎంతవరకు పనిచేస్తుందో అంచనా వేయాలి.

పోరాటం చివరివరకు నిలిచిన కవులూ, కళాకారులు శ్రమజీవులే! వీరే ప్రజా కళారూపాల ద్వారా పోరాట దశలను ప్రచారం చేశారు. వృత్తి కళాకారులే ఈ కళా రూపాలను ప్రచారం చేయడంవల్ల వీటికి చావులేదు. ప్రజలే కళాకారులు, రచయితలు కావడంవల్ల పాటలు ప్రజాకళారూపాలు జన హృదయాల్లో నిలిచిపోతాయి.

పోరాటాలు నూతన ప్రజాస్వామిక సంస్కృతికి బీజం వేస్తాయి. నూతన సంస్కృతిలోంచి సాహిత్యం, కళలూ ప్రజాస్వభావాన్ని పొందుతాయి. పోరాటం తరువాత వచ్చే విప్లవదశలో ఈ సంస్కృతి, సాహిత్య కళారూపాలు మళ్ళీ పునరుజ్జీవనం పొందుతాయి. ప్రజలకోసం మరింత లోతుగా, దీక్షగా పనిచేస్తాయి. వర్గరహిత సమాజంలో ఈ ప్రజాసాహిత్యమే ఉంటుంది. అది ప్రజల కోసమే పనిచేస్తుంది. ఆ క్రమంలో ప్రజలే కవులూ, కళాకారులవుతారు.

## పాదసూచికలు

1. సుంకర, వాసిరెడ్డి 1980 : మాభూమి. పే. 8.
2. పై. పే. 12.
3. అయ్యాపు వెంకటకృష్ణయ్య 1948 : మనదీ భారతదేశం, ప్రజాశక్తి, పే.3
4. ఎర్రోజు మాధవాచార్యులు 1972 : మధువలయం, నూజివీడు.
5. కె.వి. రమణా రెడ్డి 1984 : తెలంగాణా పోరాటం-సాహిత్యం, విరసం : పే. 46
6. కొప్పరపు సుబ్బారావు 1947 : ఎరుకల లచ్చిమి, పే. 3
7. ఆరుద్ర 1949 : త్వమేవాహం, పే. 39
8. కె.వి. రమణా రెడ్డి 1955 : భువనఘోష, విశాలాంధ్ర, విజయవాడ పే. 28
9. ఆరుద్ర 1949 : త్వమేవాహం, పే 25—36
10. గంగినేని వెంకటేశ్వరరావు 1950 : ఉదయిని, ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ.
11. కుందుర్తి 1975 : కుందుర్తి కృతులు, పే. 55.
12. 1950లో వెలువడిన రుద్రవీణలోని ఈ పద్యం 'అంకితం' శీర్షికతో వుంది. అదే పద్యం 1955లో వచ్చిన మహాంధ్రోదయంలో కూడా ఉంది. అయితే శీర్షిక 'తెలంగాణా తల్లి'గా మారింది. 'తెలుగునాటికి పెచ్చుదనమ్ములొందితిన్' అనే

ముగింపు- 'ఏయుగమునాటను కాంచెపడావలెక్ట్రిక్' అని మారింది.

దాశరథి 1977 : దాశరథి కవిత, పే. 13.

13. "పదతుల మానాలు దోచి/గుడగుడమని హుక్కా త్రాగి/జమీయన్ కూర్చుండి నిప్పు/మడికట్టుక నిల్చినావు/నగాకోరు బజారోడు/ప్రజాకాల పోషకుడవు/పూళ్ళ కూళ్ళ అగ్గిపెట్టి/ఇళ్ళన్నీ కొల్లగొట్టి/తల్లిపిల్ల కడుపుగొట్టి/నిక్కిన దుర్మార్గ మంత/నీ బాధ్యత నీ బాధ్యత"

దాశరధి 1977 : దాశరథి కవిత, పే. 111.

14. ఆవంత్స సోమసుందర్ 1959 : వజ్రాయుధం, పే. 43.

15. — పై — పే. 53.

16. **"The October Revolutoin gave me everything as a writer"** అని టాల్‌స్టాయ్ పేర్కొన్నారు.

17. **Albert Belyaev** 1978 : **The Sociological struggle and Literature. P. 46.**

18. **"Our poetry has been individualised to such a degree that it has lost touch with its source of life."**

**George Thomson** 1953 : **Marxism and Poetry, PPH, P.** 72

19. — పై — పే. 27.

20. — పై — పే. 28.

21. **'For us Socialists the Russian Revolution was a great source of theoritical and practical knowledge'** అని ఎస్. కే. న్యూమన్ అనే జెక్ కవి అన్నాడు.

**Dimitry Markov** 1981 : **Socialist literature problem of Development. P. 35.**

22. **The Polish poet wladyslaw Broniewski, for instance, was not actually a party member, but closely associated with the communists. As Gorky said about himself that he secured the "truly revolutionary spirit to be found"**

పై — పే. 35.

# అనుబంధం-I

## అప్పుల బాధలు

పంట యేదిరా అన్నయ్యా పదిపుట్లు యేదిరా అన్నయ్యా!

అన్న : కలుపుగూళ్ళకు పిత్తనాలకు కౌలునకు, నౌకర్ల గాసం
ఇంటిఖర్చు, పెంటఖర్చు లెక్కచూడుము చెల్లెలా
ఇది నిక్కమైనదే చెల్లెలా - నాగుమిత్తి జాగుసేయక
ఎవరిబాకీ వారికిచ్చితి, ఏడుతూములు ఇంటి
కిచ్చితి - ఏమనందును చెల్లెలా నేనేమి జేసితి చెల్లెలా!

భార్య : అయ్యో బావా! నెయ్యినమ్మితి బాలుడేడ్చిన పాలు
బోయక-పాలుపెరుగును అమ్మి పైకము పరగనీకే
ఇచ్చితి ఆ లెక్క జూపర బావయా మా దిక్కు ఎవరూ బావయా?

భర్త : పల్లి బర్రె పైకమోరికి మిత్తి, సత్తి ఎత్తివేసితి
అసలు బాకి నిలిచియున్నది కసిని జూపకె మరదలా
ఇక విసుగుజెందకే మరదలా!

తల్లి : చిన్న కొడుకును జీతముంచి బాకితెచ్చిన
పైకమేదిరా గట్టిగింజల పొట్టుగింజల
నెలకు ముప్పది సేర్ల గింజలు
లెక్కజూపర పుత్రకా
మా దిక్కు ఎవరో పుత్రకా?

కొడుకు : పయ్యేకొరకు పైకమిస్తి
పసులదాణకు గింజలిస్తి
మిత్తిసత్తిని దీసివేస్తి
మిగులలేదురో తల్లిరో
ఇక తగులు సోదితల్లిరో

తండ్రి : పాటి భూమిని సాగుచేస్తివి
తోట పైరులెన్నో వేస్తిమి
మేలిపంటల నెంతో దీస్తివి
పంటయేదిరా పుత్రుడా
ఆ ఫలితమేదిర పుత్రకా ?

పక్కయింటి పాపరాయుడు
నిక్కముగ పదకోట్లు నింపెను
బిక్కమొగమిక ఏలవేసేవు
చక్క మార్గము నెఱుగవైతివి
పరులపాలై పోయెరా నీపాటు పాడై పోయెరా?

.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

కొడుకు : మబ్బు బట్టెను మాయమయ్యెను
అబ్బరము తబ్బిబ్బులయ్యెను
లోటుపాటును తెలియనైతిని
కూటికి కరువయ్యె మనకిక
ప్రాప్తమా ఇది దైవమా ఏ పాపమెరుగను దైవమా!

తండ్రి : తగవులాడగ తగదు మనకిక
సంఘపెద్దలు గలరు మనకిక
అయ్య దేవర మాదు ఈ మొర
ఆలకించుము ఆదరించుము
దారిజూపర పెద్దన్నా
మము దరిని జేర్చరా పెద్దన్నా
మిత్రియనగా మృత్యుదేవత
నాగుయనగా నాగుబాము
అందుకే మన పెద్దలందరు
పొందుగా ఈ పేర్లు బెట్టిరి
నాగు విషమే కర్షకా
ఇక మిత్తి చావే కర్షకా.
నాగులేని మిత్తిలేని
కొత్తలోకం కోసమెళ్దాం....

# అమరజీవి కొమరయ్య

తెలుగుతల్లి బంధాలు త్రెంచివేయుటకోన
బలమట్లు చూపించి తొలిబలిగ నీవేగ
శూరత్వమున నీవెరా కామ్రేడ్ జోహారు లివిగోరా

ఆహార సంక్షోభ మంతరింపగజేయ
ఆంధ్రమహాసభ ఆశయమెదనుంచి
తిండిగింజల బట్టగా కామ్రేడ్ దీక్షతో సాగావురా

విసునూరు దేశముఖు గడినున్న ధాన్యంబు
బట్టబయలు చేసి పట్టివ్వ ప్రభుతకు
క్రూర జమిందారుకు కామ్రేడ్ ఘోర తప్పిదమంటారా

నడిరాత్రి వేళందు కడిపెండి పైబడి
తుపాకి తూటాల తూట్లుబడగ పేల్చి
విసునూరు రౌడీలురా కామ్రేడ్ నీ అసువులను గొన్నారురా

నిన్నుగన్న తల్లిదే ధన్యజీవితమాయె
కొమరయ్య నీజీవి అమర జీవితమోయి
స్వాతంత్ర హస్తాలరా కామ్రేడ్ సాల్యూట్ చేస్తాముర

నిను బలిగొన్నటి ఆ నీచులను దునుమాడి
నిను గన్నటి మా తెనుగు భూమిని మేము కామ్రేడ్
స్వాతంత్రముగచేసి శాంతినిలిపెదమోయి!

## దొడ్డి కొమరయ్య పాట

కష్ట జీవుల పల్లి
కడవెండి గ్రామములో
కొమురయ్య, మల్లయ్య
అన్నదమ్ముల వారు
సాయంత్రమూ వచ్చి
అన్నమ్ము తిన్నారు.
బహిరంగ సభయని
బాజారు కొచ్చిరి
అందరు కలిసిరీ
మీటింగు బెట్టిరీ
జై జైలు మిన్ను ముట్టంగా, జైయాంధ్ర
మహాసభకు జై కొట్టినారో ॥జై॥

విసునూరి దొరబంట్లు
మిస్కినల్లి రౌడీలు
కలవర పడిబాగ
కల్లు సారా త్రాగి
రాల్లు పెద్దలు తీసి
యిండ్లపై రువ్విరి
ఆయింటి అమ్మొచ్చి
అడలి బొబ్బలు పెట్టి
సప్పుడిని సంఘపోలు
సైటు పడవచ్చిరి
అన్యాయ మేమిటి
వాని జులు మేమిటని
ఎర్రజెండా కింద

ఏకమైనా ప్రజలు
ప్రతిఘటించగ వచ్చినారు, దొరలంట్లు
పశువులారా! యని అడిగినారో ||ప్రతి||

అమ్మ దొరసానమ్మ
తల్లి దొరసానమ్మ
నీ పప్పు నీ ఉప్పు
నీ సొమ్ము తిన్నాము
నిన్ను ప్రేమంటమా తల్లి, మామాట
మించీ పోతె ముండా ||నిన్ను||

ప్రజల దోచుకునే
అబ్బసలీగాడు
లేని పద్దులు రాసి
మినికినెల్లిగాడు
సాటు దెబ్బలు గొట్టె
పక్కీరమదుగాడు
మాట దప్పనివాడు
మట్టపల్లిగాడు
ఉండవల్సనోల్లు వారీ, మిమ్ముల
జేలుగానిస్తామా బిడ్డ— ||ఉండ||

దొంగ చీకటొకట
దొరలు సరకారొకట
కొమురయ్య నెవరూ
కొట్టనే లేదని
దొంగ సాక్షాలతో
దొరల కేసులు మాపి
పట్ట పగలు సంపున
నడివీధిలోగాని
దొరతో మాట్లాడలేరు
కళ్ళుండి సత్యము చెప్పలేరు

గోరుండి మాట్లాడలేరు, దొరకెదురు
సూసి సత్యము సెప్పలేరో ॥గోరుండి॥
నాయమన్నది లేని
నైజాము రాష్ట్రాన
నలిగి నాశనమయ్యో
దొరల దోపిడి కింద
ప్రజలంత ఏకమైనారు-నైజాము
పాలనకు ఎదురు తిరిగినారు ॥ప్రజలంత॥

కైపులో మత్తులో
కండ్లకావర మెక్కి
గురిచూచి గుంపుపై
తూట తూపాకెత్తి
కాల్చెరా పక్కిరామదూ—దెబ్బ పేల్చెరా
మిసికినెల్లి
దెబ్బ దెబ్బకు ప్రజలు
జే కొట్టినారు ॥దెబ్బ॥

కాల్లకు తగిలనోల్లకు
కాల్లకు తగిలాయి
చేతులకు తగిలనోల్లకు
చేతులకు తగిలాయి
కొమురయ్య కొక్కనికి
డొక్కలో తగిలింది
అదిరిపడి తూపాకి లొట్టలే కిందేసి
గడీలకే ఉర్కినారు రౌడీలు దొరసానితో కల్సినారు ॥అదిరిపడి॥

అమ్మ దొరసానమ్మ
తల్లి దొరసానమ్మ
తెల్లవారిందంటే
మేము బ్రతుకాలేము

మూకు సద్దీగట్టి
మమ్ము సాగదోలు
మా పేరు చెప్పకే తల్లి నీవు
మా దారి చెప్పకే ముండా
ఓరి అబ్బాసలె
ఓరి మిసుకూవల్లి
ఓరి పక్కీరమదూ
ఓరి మట్టపల్లి
ఇపుడన్నమాట
నోటి కెట్లొచ్చెరా
మల్లెగట్లా నేను వారినేనా
మాట పడందాన్ని బిడ్డా-

ఎట్టి శాకిరి పనులు
ఎగనామం బెట్టారు
లేవిశిస్తులు పన్ను
లేవు పొమ్మన్నారు
సరకారు పనులనే
సాగనీయ మన్నారు
సరదారులై నిల్చినారూ——పోరాడ
సమరమందున దూకినారూ ॥సరదారులై॥

## వినతి

మాన్య పాండిత్యమునకె సన్మానవాంఛ
నాకుపూజ్యంబు నివ్వి భూనాయకునకు
ప్రజల గోడులు వినుచుట భావ్యమంచు
వచ్చియున్నాడ కృష్ణభూపాలచంద్ర

రాతిరియున్ పవల్ తమదురక్తము
నోర్చి శ్రమించి మేనిపై
చేతెడు గుడ్డయున్ తినచేరెడు
గింజలు లేక ఎన్నియో
యాతనలోర్చుచున్ ప్రజకుహాయిని
గూర్చె దేశభక్తులౌ
రైతులగోడు నీవయినవ్రక్కలు
సేయవే బాలభూపతి

రాజుగారింటి పెండ్లి బైరాగి తిండి
ఉన్నతోద్యోగులింట పుత్రోత్సవాలు
ఆర్థివానికి భిక్ష ఈ అన్నిటికిని
పెట్టుబడిదారు నిరుపేద రైతు........

—గడియారం రామకృష్ణశర్మ

# మాలి పటేలా - పోలీసు పటేలా!

మాలిపటేలా - పోలీసుపటేలా!
పటువార్లు దొరలు మీరు ప్రజల ముంచుతున్నారు ||మాలి||
అన్యాయం సేయమనీ
అందరితో -ప్రంటమని బాసలు చేసినారు
మోసానికి దిగినారు ||మాలి||
భూస్వాములు అయ్యి పెద్ద
ఆసాములు అయినారు
పేరాసకొద్ది మీరు పేదోళ్ళ భూమిలాగి
పెద్దోళ్లై పొయ్యారు ||మాలి||
లేవి శిస్తు వసూళ్ళలో
లేనిపోని చిక్కులల్లి
వేలకొద్దిలంచాలు - ఏడిపించితిన్నారో ||మాలి||
కూలినాలి జనానికి
కూలి సరిగ ఇవ్వకుండ
వెట్టిచాకిరి మరీ వంగివంగి దండాలా? ||మాలి||
పేదోలం బకితికొద్ది
పోచమ్మకు బెట్టుకుంటె
మూఢభక్తి ముసలోళ్ళు
ముత్తాలమ్మకు బెడితే!
కోడిపిల్ల మామూళ్ళని గుంజుకుంటరో ||మాలి||
కాలమ్మే మారింది
పూటకెల్లని బేరగాళ్ళ
మూటలెత్తుకొని తిరిగి
గంపబరువులో లేసే
గతివేని జీతగాళ్ళ ఊరుమామూల్లని ఊడగుంజుకుంటరో ||మాలి||
కాలమ్మే మారింది
కనిపెట్టి తిరగండ్రో
కొవ్వెక్కిన గొర్రెపోతు
కొండకు తలగుద్దినట్టు
సంఘపోల్ల తెరువొస్తె - సావు పిచ్చికుక్క సావు ||మాలి||

## కలసిపోరుతె

ఓ ........ పల్లెటూరి కూలిరైతా
పిల్లజల్లా సల్లగున్నారా! ॥ఓ॥
ఆపగాలం కష్టపడినా
అస్తమానం పాటుపడినా-
పొట్టనిండా బువ్వలేక
ఒంటినిండా బట్టలేక కష్టకాలమే
దాపురించెనా? ॥ఓ॥
ఎండలనకా-వానలనకా
కండలను కరిగించినీవు
ఆలుపిల్లలు అలమటించ
ఇల్లువాకిలి ఏదిలేకా-
బాంచెనంటు బ్రతుక నేర్చావా? ॥ఓ॥
మేక వన్నె మొకము దొరలు
తోక ఊపుడు జండాలోళ్ళు
నిన్ను దువ్వుచు మోసగించగ
కన్నీళ్ళతో గడుపుతున్నావా?
కరువుతోనే కాలమీడ్చేవా? ॥ఓ॥
నీకు నాకు-బలము వుంది
నిగ్గదీసే-శకితి వుంది
పట్నపోల్ల అండవుంది
సంగపోల్ల జండవుంది
కలిసికట్టుగ ముందురావోయి ॥ఓ॥
రష్య వుంది-
చైన వుంది,
రైతుకూలి రాజ్యముంది
రక్తమొలికిన అమరవీరుల
రైఫులుంది, తుపాకి వుంది
కష్టజీవుల సంగముంది కల్సిపోరుతె
రాజ్యముంది ॥ఓ॥

## ఆపుర బండోడో

కుచ్చుటోపి పెట్టుకోని కండ్లకు జోడేసుకొని
కాళ్ళకు బూట్లేసుకొని బెత్తెంకర్ర చేత పట్టుకోని
నేనువస్త ఆపర మల్లయ్యో బండి ఆపర మల్లయ్యా
దొడ్డితోవంట పోయి పైజామ తొడుక్కొని
పైన షేర్వాని వేసుకోని
చెల్కతొవ్వ పోనీయ్‌రో మల్లయ్యా
చెప్పినట్లు పోనియ్‌రో మల్లయ్య ॥ఆపర॥
బండిమీద నేను బండికింద నువ్వు ఆపర మల్లయ్యా
ఆపర మల్లయ్యా
ఇసునూరు నుండి బండి బయలెల్లెను దొరో
బంగులనుండి వెళ్ళెను దొరో
ఎంతదూరం వచ్చెను బండి ఆపర మల్లయ్యో
బండాపుర మల్లయ్యా
చెన్నూరు చెల్కపల్లి లసుపల్లి బోళ్ళల్ల
ఆపర మల్లయ్యో బండాపర మల్లయ్య
రాపాక వంశాన రామచంద్రారెడ్డి
మొండ్రాయిగిర్ని వచ్చె ఆపర మల్లయ్యో బండాపర మల్లయ్య
మొండ్రాయి గిర్నివద్ద మొండి మిల్టిరున్నది
నేను రాను దొరో బండి ఆపను దొరో ॥ఆపర॥
మా అయ్యగాని బండి ఆపర మల్లయ్య బండాపర మల్లయ్య
మైలారం నీకు మాన్యం ఇస్తగాని ఆపర మల్లయ్యా
బండాపర మల్లయ్యా
నల్ల నరుసయ్య కమినిష్టులో కలిసెనట
నిన్నగాక మొన్న మల్లయ్య దొడ్డి కొమురన్న చచ్చెనురో
నాపానం వనుకుతు వున్నది ॥ఆపర॥

జనగామ మార్గము బండిపోనియ్యర మల్లయ్యో
జనగామ వచ్చేదారో
అబ్బ బతికితినిరో మల్లయ్యో
ఇద్దరేసి పెండ్లాల నీకు జేస్త్రా మల్లయ్యో ॥ఆపర॥
కమ్యూనిస్టులు వస్తుండ్రు రాజ్యమెవరిదిరో
రజాకార్లు వస్తే రాజ్యం మనదేరా మల్లయ్యో
బండిమీద నేను, బండికింద నువ్వు ॥ఆపర॥
సంగపోల్లు వస్తున్రు నేనెల్లి పోతాను దారో
నీ బండి నాకొద్దు సంగపోల్లు వస్తున్నారు.
సస్తినిరో మల్లయ్య నేను అబ్బబ్బ సస్తినిరో........ ॥ఆపర॥

# ఖమ్మం జైలుపాట

ఆర్యులార అన్నలార అక్కలార చెల్లెలార
అలకించి వినుడీ పాట
నైజాము రజాకార్ల ఆట
నైజాము రజాకార్ల దుండగాలు చెప్పనలవికాదు ఇక
కమ్యూనిస్టుల బట్టుటకై
కోడిగూసె సమయమందు కొంతమంది మిలటరీతో
చిన్న పెద్దలనక బట్టి కొట్టిరి బజారుకీడ్చి
పట్టి స్త్రీల చెరచువారు కొందరు ॥ఆర్యులార॥
ఒహో! ఇండ్లు లూటి చేయువారు కొందరు
కమినిస్టుల కొరకు జేలు కమ్మం మెట్టులోన ఒకటి
కట్టిరి కడు అక్రమముగ కారుముండ్ల తీగ జుట్టి
గట్టిగ పోలీసు మిలటరి కాపలా పెట్టిరి జైళ్ళలోన అక్కట
ముక్కియున్న జొన్నలతో ముందుగ గుగ్గిళ్ళుజేసి సిరిగుల్లోనబోసి
ఆహా ! ఇంక నేమియు చెప్పనేల సోదరా! ॥ఆర్యులార॥
పాత చింతపండు చారు పదిలముగా కాసితెచ్చి
పోసిరి గుగ్గిళ్ళపైన మాయమాయె చారునీళ్ళు
చూడ కింద వరద గట్టె
ఇష్టమైతె తినుమటంచు కష్టమైతె మానుమటంచు
కదిలితేను కాలితన్ను ఆహా! మెదిలితేను కర్రపోన్ను ॥ఆర్యులార॥
ఇట్లు బాధలు జేసిరి జవానులు
ఇంక ఏమి తెలుపవలెను సోదరా
ఇంతలోనే పోలీసు ఆక్షను ఆయెరా
రామరాజ్యము వచ్చినది రాజినామ చేసితేను
వదలీ పెడుతమంటరు వారు
అయ్యో ఒప్పుకోదు మనసు మాది ॥ఆర్యులార॥

## దళాలయొక్క గుట్టు బట్టబయలు

దళాలయ్యా దళాలు - మాయదారి దళాలు
మాటు మాయదారి దళాలు - మాయాదళాలు ॥ద॥
సేవసేవ యంటారు - ప్రజాసేవ యంటారు
కూలిసేవ యంటారు - కూడదీసుకుంటారు ॥ద॥
ఐక్యతైక్యతంటారు - ఆదరిస్తమంటారు
అందరొకటియంటారు - అదోఇదో చెప్తారు ॥ద॥
మీదుకోసమంటారు - మాదుకష్టమంటారు
మాయలెన్నొ చెప్తారు - ప్రజల మోసగిస్తారు ॥ద॥
అన్నమన్నమంటారు - గట్లల్లోకంటారు
తీసుకరమ్మంటారు - తిప్పలెన్నొ పెడ్తారు ॥ద॥
గ్రామాల్లోకొస్తారు - అన్నంపెట్టమంటారు
పెట్టకుంటె ప్రజలాను - పెక్కుబాధల్ పెడ్తారు ॥ద॥
బెబ్బలెన్నో కొడ్తారు-తిట్లెన్నొ తిడ్తారు
బాధలెన్నొ పెడ్తారు- చందలివ్వమంటారు
యివ్వకుంటె ప్రజలాను-ఆస్తిదోపిడంటారు
గొడ్లతోలు కెళ్తారు-ఖూనీలు చేస్తారు ॥ద॥
చంపగా మిగిలి నోర్ని-చందాలివ్వమంటారు
ఇవ్వకుంటె మిమ్ములాను-అదేచేస్తమంటారు ॥ద॥
ఇట్లు లొంగకుంటేను-ఇండ్లు కూలదోస్తారు-
పెళ్ళమనిపిస్తారు-అడవిపాలౌతారు ॥ద॥
వారి రక్షణాకు వారు-ప్రజలకేమో చెప్తారు
ప్రజల మోసగిస్తారు-రక్షణిస్తమంటారు ॥ద॥
మోసగాండ్ర నమ్మవద్దు-అశాంతి లేపవద్దు
శాంతిని కాపాడవలయు-శత్రుల దునుమాడవలయు ॥ద॥
పట్టి బంధించవలయు-అల్లరుల నణచవలయు
హాయిని చేకూర్చవలయు-స్వతంత్ర మనుభవించవలయు ॥ద॥

కె. యల్. యస్. సింహ.

## కాంగ్రెసు పాట

నీతులు చాలించరా బూతుల పంచాంగపుదొర
నీ మంచిని చెప్పరా కోతల సంచారపుదొర
రాయిరప్ప తీసుకోమన్నావు
రోకలిబండ పట్టుకోమన్నావు
కారంపొడి కట్టుకోమన్నావు
రజాకార్లు రావడంతో రయమున నీవు పారిపొయ్యావు
మా ఈపులు పగిలినయో
పుండాకోరు ఓ దుండగిదొర ॥నీతులు॥

గడ్డిచొప్పాములేమొ తగిలెయ్యమన్నావు
గొడ్లనన్నిటిని కొట్టుకొని పోయినావు
సగంపైకం జోడించుకున్నావు
నిలబెట్టి అడిగితె నీ వొప్పుకోవు
కారణమేమంటే చెప్పకున్నావు ॥నీతులు॥

మల్లెందుకోరి ఓ దగాకోరు దుండగపు దొర
ముంగట ముగ్గురు తుపాకిమంది
ఎనకా ఏడుగురు రైపోల్లమంది
నడుమ కచ్చులంల నాయకుడండి
ఈ మాటకాదంటె సుబూతు ఉందండి ॥నీతులు॥

# ఫకీర్ల పాట

| | | | |
|---|---|---|---|
| పైశాచి రజకార్లు | అల్లా కెనాం | నాశంబుగావించి | అల్లా కెనాం |
| జాగీర్ జమీందార్ల | ,, | సాగనం పేశాము | ,, |
| తాత తండ్రులనాటి | ,, | పోతభూములన్ని | ,, |
| లాగుకొన్నామండి | ,, | సాగుచేశామండి | ,, |
| రెండువేల గ్రామాలు | ,, | సిండాయి పంటలతో | ,, |
| డొక్కలెండినమాకు | ,, | బుక్కెడన్నందొరికె | ,, |
| ఆబాలగోపాలం | ,, | శాబాసుగన్నారు | ,, |
| పోరాట సమయాన | ,, | బీరులై యూనియను | ,, |
| మాదివిజయం చూచి | ,, | బాదుకొని గుండెల్లు | ,, |
| యూనియన్ సర్కారు | ,, | సైనికులదింపించి | ,, |
| నైజాము రాక్షసుణ్ణి | ,, | రాజప్రముఖునిచేసి | ,, |
| జాగీరు జమీదారులకు | ,, | స్వాగతంబిచ్చారు | ,, |
| మా భూములన్నిటిని | ,, | గోభూములుగా మార్చి | ,, |
| సైతాన్ జాగీరుదారుర్ల | ,, | చేతుల్ల బెట్టారు | ,, |
| చిప్ప చేతికిచ్చి | ,, | ముప్పతిప్పలుబెట్టి | ,, |
| కాలుసేతులుగట్టి | ,, | కూలిరైతులగాల్చారు | ,, |

## ఉయ్యాల పాట

| | | | |
|---|---|---|---|
| వీరమట్టా రెడ్డి | ఉయ్యాలో - | ధీర అనంతా రెడ్డి | ఉయ్యాలో |
| మీవీర మరణమును | ,, | మరువమెన్నటికైన | ,, |
| మీవంటి వీరులు | ,, | మా మధ్య నిలబడి | ,, |
| మాకు వెల్గును జూప | ,, | ఓర్వదీ ప్రభుత్వంబు | ,, |
| ఈ దొంగ దోపిడులు | ,, | సాగవని సర్కారు | ,, |
| ఆంధ్రమహాసభ తనను | ,, | అంతమొందించునని | ,, |
| హడలెత్తి సంఘాన్ని | ,, | అణచ జూస్తున్నారు | ,, |
| పాత సూర్యాపేట | ,, | పోరాటమును జూడు | ,, |
| పురుషులూ లేనపుడు | ,, | పల్లెలో స్త్రీలంత | ,, |
| పరువు కాపాడుకొన | ,, | బయలుదేరినారు | ,, |
| శీలరక్షణ కొరకు | ,, | స్త్రీలంత కూడారు | ,, |
| లారీల చుట్టేసి | ,, | లడాయి జేశారు | ,, |
| ప్రజల బలమూ జూచి | ,, | పారిపోయిరి వాళ్ళు | ,, |
| పౌరహక్కుల కొరకు | ,, | పోరాటమిది యమ్మ | ,, |
| ఝాన్సి లక్ష్మి చరిత | ,, | చాటి చూపాలమ్మ | ,, |
| మన ప్రజల రాజ్యమును | ,, | పొంది తీరాలమ్మ | ,, |

—బి. స్వరాజ్యం

## అనుబంధం-II

# ప్రజాకవుల సంక్షిప్త వివరాలు

1978లో క్షేత్ర పర్యటన చేస్తున్నప్పుడు గ్రామాల్లో చాలామంది కవులు కనిపించారు. వీరు గుజిలీప్రతి పుస్తకాల్లో పాటలు రాశారు. అప్పుడప్పుడు పాత (చిన్న) పత్రికల్లో పాటలు అచ్చు వేశారు. కాని వారి పాటలు ప్రజల నోళ్ళమీద సజీవంగా వినిపించాయి. ఐనా వీరు అచ్చు కాగితాలు చూసి తృప్తిపడేవారు. అచ్చు కావడం ఒక గొప్ప. ఇలాంటి కవుల వివరాలు సాహిత్య లోకానికి అంతగా పరిచయం లేదు. అక్కడ వీరికి స్థానం లేదు.

సుద్దాల హనుమంతులాంటివారు 'ఎన్నికల కవి'గా పేరుపొందారు. రాజారాం లాంటి కవీ, గాయకుడు, కళాకారునికి 'బుర్రకథల రాజారాం' అని పేరు వచ్చింది. ఇలాంటివాళ్ళగురించి ఆ కాలంలోనే దిన, వార, మాస పత్రికల్లో విరివిగా వ్యాసాలు రాశాను. 'సుద్దాల హనుమంతు పాటలు' పుస్తకంగా వెలువరించాను.

సుద్దాల హనుమంతు, రాజారాంలాంటి ప్రజా కవుల పాటలు ఎక్కువగా అచ్చు కాలేదు. అచ్చయినచోట్ల అనామక కవో, అజ్ఞాత కవో అని ఉంది. ఈ కవులతో ప్రత్యక్షంగా కలిసి మాట్లాడటంవల్ల వారి వివరాలు తెలిశాయి. కాని వివరాలు తెలియని కవులూ, కళాకారులే అధికం.

ఆ రోజుల్లో పాటలు రాసి, పాడి ప్రచారం చేసిన తెలంగాణా కవుల్లో పినిశెట్టి వెంకటేశ్వరరావు (నల్లగొండ), అప్పన్న(వరంగల్), కాంచనపల్లి చినసీతారామారావు (నల్లగొండ), అక్లూరి అయోధ్యరామయ్య (గార్ల?),రామాంజనేయులు (హుజుర్‌నగర్), శ్రీమతి స్వరాజ్యం (సూర్యాపేట) ముఖ్యులు. సకాలంలో సంపూర్ణ వివరాలు అంద నందువల్ల వీరి గురించి రాయలేకపోతున్నాను.

తెలంగాణా రైతాంగ పోరాటానికి ఆంధ్ర ప్రాంతంలో ఉంటూ ఎన్నో విలువైన పాటలు రాసిన సోమసుందర్, నార్ల చిరంజీవి మొదలైన వారినికూడా ఇక్కడ గుర్తు తెచ్చుకోవడం అవసరం.

శెట్టిపల్లి (పేజి 53), నెల్లూరి వెంకట్రామా నాయుడు (పేజి 52)ల గురించి ఈ పుస్తకంలోనే కొన్ని వివరాలు ఇచ్చాను. ఇలాంటి ప్రజాకవులకు సంబంధించిన వివరాలు కె.వి. రమణారెడ్డి రాసిన 'కవిలోకం' పుస్తకంలో చూడవచ్చు.

కాళోజి, మఖ్దూం, దాశరథిలాంటి జగమెరిగిన కవుల గురించి కూడా ప్రత్యేకంగా ఇక్కడ రాశాను. కారణం- ఈ పోరాటంలో వాళ్ళు ప్రత్యేకంగా ప్రజాసాహిత్య పరిధిలో పని చేయడమే. దాశరథిలాంటి వాళ్ల చక్కని పాటలు రాశారు. అవి ఇంకా ప్రచారంలో ఉన్నాయి. కాళోజి గేయాలైతే సరేసరి. ఆయన రాసిన గేయాల్లో మొత్తం తెలంగాణా రాజకీయోద్యమ చరిత్ర ఉంటుంది.

మొత్తానికి ఇందులో రాత సాహిత్యం కవులు, నోటి సాహిత్యం కవులు కలగలసి ఉన్నారు. ఐతే ఇద్దరూ ప్రజలకోసమే పని చేశారు. ప్రజా రాజకీయాల్ని గౌరవించి ప్రజలకోసం సాహిత్యాన్ని సృష్టించారు. ఆ మేరకే వారి సేవని గురించి రాశాను. పోరాటంలో పనిచేసిన అందరి కవుల గురించి ఇక్కడ ఇవ్వలేకపోవచ్చును. ఆ కృషి ఇక ముందైనా జరుగుతుందని ఆశిస్తున్నాను.

పోతుంది దోపిడీ రాజ్యం

వస్తుంది పేదోల్ల రాజ్యం

## రాజారాం

జననం : 29-1-1929 మరణం : 28-9-1981

జనగామ తాలూకాలో రాజారాం బుర్రకథన్నా, బుర్రకథ రాజారామన్నా ఆబాలగోపాలానికి తెలుసు. వ్యవసాయ కూలీ కుటుంబానికి చెందిన రాజారాం ఆంధ్ర మహాసభలో కార్యకర్తగా పనిచేశారు. సంగం కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొన్నారు. తగిన వయసులేదని పార్టీలోకి తీసుకోకపోవడంవల్ల బాల సంఘాలను నిర్వహించారు. అయినా వేదికలమీద సంగం పాటలు పాడటానికి, అది ఎంత పెద్ద సభ అయినా సరే రాజారామే కావలసివచ్చేది. రాజారాం నూరుపాళ్ళ శ్రామికవర్గకవి. అతని పాటలన్నీ శ్రమజీవులకు కంఠపాఠాలు.

శ్రామికవర్గ కవులకి శ్రమ బాణీలన్నీ ఒక్కటే. ఉత్పత్తి శ్రమకి సంబంధించిన బాణీ ఏదైనా రోకటి పాటగానీ, ఉయ్యాల పాటగానీ (ఇవి మామూలుగా స్త్రీల పాటలు)

మోట కొడుతూ పురుషులు పాడే పాటలుకానీ కవి ఒకరకంగానే స్వీకరిస్తాడు. రాజారాం పాటల్లో మనకీవిషయం స్పష్టంగా తెలుస్తుంది.

చదువంటే చిన్నప్పటినుండి అభిమానం. అంటరానివాడని బళ్ళో అవహేళన చేశారు. ఊరి బయట పశువుల్ని కాస్తూ, దారినపోయేవాళ్ళ చలవతో అక్షరాలు నేర్చుకున్నారు. పశువులు కాస్తూనే తన తోటి వాళ్ళ జీవితాల్ని చదువుకున్నారు.

సంగం ఏర్పాటు చేసిన రాత్రిబడుల చదువు సమాజానికి అర్థం తెలియజేసింది. 'చిన్నతనంలో మోటగొడుతు తండ్రి పాడిన మోట పాటలు, తల్లి పాడే కలుపు పాటలూ, పశువులు కాస్తూ తాను పాడిన "చిలిపి పదాలు" సంగం పాటలుగా మారాయి. తల్లి నోట విన్న కలుపు పాటే దొర పొలంలో పనులు బంద్ పెట్టమనే పిలుపుగా మారింది.

స్వగ్రామమైన దేవరుప్పల విసునూరు దేశముఖు జమీ గ్రామం. కళ్ళు తెరచిన క్షణంనుంచే దొర దౌర్జన్యాలను చూసిన రాజారాం అక్షరం అక్షరాన్ని ఆయుధంగా చేశారు. ఏ దొర దగ్గరైతే 'దొర బడిత'గా పనిచేసేవారో ఆ దొరమీదే సవాళ్ళు విసిరారు. అవి పాటలై, ఉపన్యాసాలై భూస్వామ్యం పునాదుల్ని కదిలించాయి.

పోరాట ప్రారంభంలో వాలంటీర్లని ఆహ్వానించడంనుంచి ప్రజాశక్తి కన్ను తెరచి ప్రళయ కాలాన్ని అంతరింప చేసేందుకు దళాలు నిర్మించేదాకా పోరాటాన్ని పాడుతునే ఉన్న ప్రజాకవి రాజారాం. పదహారేళ్ళ వయసులో 'మీర్జా ఇస్మాయిల్ ఆర్డరు' కింద నిర్బంధానికి గురై చంచల్‌గూడ జైల్లో ఆరు నెలలు గడిపారు. జైల్లోనుంచి దళసభ్యుడిగా జన హృదయంలోకి నడిచారు.

నలగొండ యోధులు వెలగించినా జ్యోతి
నలుదిశలు పాకిందిరా - తెలంగాణ
సింహనాదము చేసెరా !

## దాశరథి

జననం : 1927, సెప్టెంబరు మరణం : 1987, నవంబరు

ఖమ్మం జిల్లా మానుకోట తాలూకా గూడూరులో జన్మించారు. నైజాం వ్యతిరేక పోరాటంలో దళ సభ్యులుగా పనిచేశారు. కార్యకర్తగా, కవిగా తమ కర్తవ్యాన్ని నిర్వహించారు. ఖమ్మం మహాసభల సందర్భంగా ప్రచురించిన ప్రబోధ గేయాలలో దాశరథి

రాసిన పాటలు ఆయన సాహిత్య జీవితంలో నిలిచిపోతాయి. (అని రాసినట్లుగా గుర్తు చేయవలసి వచ్చింది.

ఆనాడి ప్రజలు నిరక్షరాస్యులు. ఆంధ్ర మహాసభల కరపత్రాలు చదువలేరు. అందుకే దాశరథిలాంటి కవులు ఆయా కరపత్రాలను పాటలుగా కట్టి, ప్రజలలో ప్రచారం చేయడం జరిగింది. ఈ పాటలు ఇంకా ప్రజలకు జ్ఞాపకం ఉన్నాయి. ఇలాంటి పాటల రచయితగా ప్రజలతో పనిచేసి మళ్ళ సినీ గీతాల రచయితగానే ప్రజలకు పరిచయమయ్యాడు. అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం మొదలైన పద్య కావ్యాలు వారికి పరిచయం లేదు.

దళాల్లో ఉంటూ నైజాం వ్యతిరేక పోరాటంలో పోలీసులకు పట్టుబడి నిజామాబాదు సెంట్రల్ జైలులో శిక్షననుభవించారు. 'ప్రబోధ గేయా'లే కాకుండా 'తెలంగాణా స్వాతంత్ర్య గేయాలు' పుస్తకంలోనూ కొన్ని పాటలు రాశారు. పులుపుల శివయ్య రాసిన "పలనాడు వెలలేని మాగాణిరా" పాట బాణిలో తెలంగాణాని పోరాటానికి అన్వయిస్తూ ఒక వీరగీతికను రాశారు. ఈ పాట ప్రజలు మహోద్రేకంతో పాడుకున్నారు. వీరి ఈ పాటను చూసి మరికొన్ని ప్రాంతాల్లో పాటలు వెలువడ్డాయి. తెలంగాణా పోరాటంలో పాటలు. పద్య రచనలు రాసి నైజాం వ్యతిరేక భావాన్ని సాహిత్యం ద్వారా ప్రచారం చేసిన కవులలో దాశరథి అగ్రగణ్యులు. 'మా నిజాం రాజు తరతరాల బూజు' అనీ 'తెలంగాణ కోటి రతనాల వీణ' అనీ తెలుగుజాతిమీద, భాషమీద వందలాది రచనలు చేశారు. ఐతే పాటతో మొదలుపెట్టి పద్య రచనకి దిగిపోవడంవల్ల ప్రజలకు దాశరథి దూరమయ్యాడు. పండిత కవులకు దగ్గరయ్యాడు.

నైజాం గద్దె దిగిన తరువాత దాశరథి రచనల్లో 'శక్తి' తగ్గిపోయింది. పోరాట విరమణ తరువాత ఆంధ్ర ప్రాంతం కవులు, కళాకారులు సినీరంగాన్ని ఆశ్రయించారు. తెలంగాణానుండి ఒక్క దాశరథే సినీకవిగా వెళ్ళారు.

పోరాటం కొనసాగింపులో కూడా ప్రజల పక్షాన నిలువగలిగితే దాశరథి షాబ్లో నెరౌడాలా అయ్యేవారని భావించేవారున్నారు.

రాష్ట్ర సమాచార, పౌరసంబంధాల శాఖలోనూ, ఆకాశవాణిలోనూ పనిచేశారు. కళాప్రపూర్ణ బిరుదునందుకుని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవిగా కూడా పనిచేశారు.

మీ అడుగు జాడలలో - మీ ఉద్యమ రంగంలో
కోటి చేతులొకటి చేసి - కొన ఊపిరిదనుక పోరిన వారికి
జోహార్లు జోహార్లు జోహార్లు - అమరవీరులారా మీకు జోహార్లు !

## సుద్దాల హనుమంతు

జననం : — మరణం : 10-10-1982

నల్లగొండ జిల్లా రామన్నపేట తాలూకా పాలడుగు గ్రామంలో నిరుపేద కుటుంబంలోంచి వచ్చిన హనుమంతు కొద్దిగా చదువుకున్నవారు. కానీగీ బడుల్లో అయ్యవార్ల ఇళ్ళలో పెద్ద బాలశిక్ష, శతకాలు, పురాణాలు చదువుకుని స్వాతంత్ర్యో ద్యమం ప్రభావంతో రాజకీయాలను తెలుసుకున్నారు. చిన్నతనంనుండీ హరికథలూ, నాటకాలు, ప్రజల పాటలు మొదలైన కళలంటే ప్రేమ. ఆ తరువాత నాటక కంపెనీ లలో చేరి చిన్న చిన్న పాత్రలు వేశారు. అద్వైతమార్గంలో ప్రయాణించి ప్రాణా యామాలు, యోగాభ్యాసాలు, ఏకాంతవాసాలు చేశారు.

పన్నులు వసూలు చేసే దొరల గుండాలు మామూలు ప్రజలను పిల్చుకుతినే వెట్టి చాకిరి వీటికి ఎదురు తిరిగిన జనాన్ని రోజుల తరబడి చేసే చిత్రవధ ఇవన్నీ మనసులో హత్తుకుపోయాయి. దీనికి వ్యతిరేకంగా నిరసన చూపాలని తహతహలాడే వారు. పంటచేను, పాడిఆవు, పడుచు బిడ్డ, నడిచే గొడ్డు, నాలుగు కాసులు ఇవేవీ రైతుకు ఉండటానికి వీలులేదు. ఈ పద్ధతి వారిని చాలాబాధపెట్టింది. కానీ ఏమీ చెయ్యలేక ఆర్య సమాజ్ ఉద్యమంలో పాల్గొని నైజాంపై విమర్శలు చేయడాన్ని చూసి ఆనందపడేవారు. తాను విమర్శించేవారు. అస్పృశ్యత నివారణకై, వర్ణాంతర వివాహాల ప్రచారానికై నైజామ్ పాలనలోని లోపాలను ఎత్తిచూపుతూ పాటలు రాసి సభల్లో పాడటం జరిగింది.

ఆర్య సమాజ్‌తో సంబంధాలు ఉన్నందుకుగాను ఉద్యోగానికి అర్హత కోల్పో యారు. 1944 భువనగిరి ఆంధ్ర మహాసభ సుద్దాల జీవితమార్గాన్ని ఒక మలుపు తిప్పింది. అప్పటినుండి ఆంధ్ర మహాసభ కార్యకర్తగానే కాకుండా కవిగా పాటలురాసి, కళాకారునిగా కళారూపాలు ప్రదర్శించి ప్రజల్ని ఉత్తేజపరచి సంఘ సభ్యులుగా మార్చారు. సంగమే దళమైనప్పుడు తాను, తన పాటలు, తమ పాటల ట్రూపూ మొత్తం పోరాటరంగంలోకి దుమికారు.

కవి, గెరిల్లాగా పనిచేస్తూ ఎన్నో పాటలు రాశారు. ప్రజలకు ఉపన్యాసాలు అర్థంకావని పాటల రూపంలో గానం చేశారు. వీరి పాటలు పోరాటకాలంలో అచ్చులో రాలేదు. ఒకటీ, అరా తరువాత సైక్లోస్టయిలు కాగితాల్లో వచ్చాయి. ఈ పాటలన్నీ మౌఖికంగా పాడుకోవడంవల్లే లభించాయి. జనగామ, రామన్నపేట, ఆలేరు మొ॥

ప్రాంతాల్లో వీరి పాటలు అధిక ప్రచారంలో ఉన్నాయి. పోరాటం తరువాత వచ్చిన ఎన్నికల పాటలు ఎక్కువగా వీరే రాశారు. ఐతే పోరాటంలో రాసినటువంటి గొప్ప గీతాలు మళ్ళీ రాయలేకపోయారు.

అమరవీరులమీద శక్తిమంతమైన గీతాలు రాసిన హనుమంతు సాహిత్య సైనికునిగా తానూ అమరుడయ్యారు.

అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నా మదిని ఇన్ని ఆవేదనలు

## కాళోజి

జననం : 1914 సెప్టెంబరు 14

అరశతాబ్దంగా ప్రజలకోసం ప్రజోద్యమాలను, రాజకీయ దశలను కవిత్వీకరించిన కాళోజీ వరంగల్ జిల్లా మడికొండలో జన్మించారు.

నిజాం పాలనలో భయంకరమైన దోపిడీ దౌర్జన్యాలను చూసి ప్రభుత్వం, ప్రభుత్వాధికారులకు వ్యతిరేకంగా ప్రజల తరఫున కవిగా వకాలతు పుచ్చుకున్నారు.

జాతీయ భావాలు కలిగిన కాళోజీ 1935లో వచ్చిన ఆర్థిక సంక్షోభం, రెండో ప్రపంచ యుద్ధం, క్విట్ ఇండియా ఉద్యమం ఆంధ్ర మహాసభలు మొ॥ వాటిలో ప్రజాస్వామ్య భావవ్యాప్తికోసం నిరంతరం కృషి చేశారు. "గ్రంథాలయోద్యమ ఆస్థాన కవి"గా ఎన్నో కవితలు రాశారు.

ఆర్య సమాజంలో కొంతకాలం కార్యకర్తగా పని చేశారు. వకాలత్ చదువు చదివినా వృత్తిపరంగా దానికి కట్టుబడలేక పోయారు. వకాలత్ చదివే కాలంలో ఆంధ్ర మహాసభల్లో పనిచేస్తూ ఉద్యమాలకు దగ్గరయ్యారు. ఆయన పాల్గొన్న ప్రతీ ఉద్యమంలోనూ కవితలు రాశారు. జాతీయ భావాలు కలిగి ఉన్నప్పటికీ కాంగ్రెసు నాయకుల పెడధోరణుల్ని చూస్తూ సహించలేదు. వాటిని ఎప్పటికప్పుడు ఖండించారు. రజాకారు ఉద్యమంలో నైజాం నవాబుకి వ్యతిరేకంగా కవితలు రాసి వేదికలమీద పాడారు. ఎన్నో సార్లు జైలు శిక్షననుభవించారు. ఒక సంవత్సరంపాటు వరంగల్ నగరంనుండి బహిష్కరణకు గురయ్యారు.

కాళోజీ మొదట కథలు రాశారు, 'కాళోజీ కథలు' పేర అణా గ్రంథమాల ఒక

పుస్తకాన్ని ప్రచురించింది. ఇందులో నైజాం పాలనలో ప్రజల జీవితం వర్ణించారు. కవితలకి వస్తే "రాణి వాసమున రంజిల్లు రాజా/భూములన్నియు నీకు భుక్తమైనట్లు/ పల్లెబీదలబాపి పన్ను లాగెదవా/ప్రజలను హింసించు ప్రభువు మాకేల/విధియింప భక్షింప వనరాజులేడా" అని ప్రశ్నించారు. నాటి రైతాంగం తరఫున కాళోజీ కవితలు పాలకులతో వాదించాయి. రజాకారు దౌర్జన్యాలు పెచ్చు పెరుగుతున్న కాలంలో "మన పిల్లల చంపి మనల బాధించిన/మానవాధములను మండలాధీశులను/.... కాలంబురాగానె కాటేసి తీరాలె/సత్యమ్ము హింసయని సంకోచింపరాదు/శాంతియని చాటినను శాంతింపగ రాదు" అని రాబోయే రైతాంగ పోరాటాన్నీ ఆ పోరాటంలో దొరలను ఎదురొడ్డిన సంఘటనలను చాలా రోజులముందే భాష్యం చెప్పారా అనిపిస్తుంది.

నిజాం ప్రకటించిన సంస్కరణలను, విధానసభకు ఎన్నికైన ఇంటి యజమానుల ప్రతినిధి బలదేవ్ పతెంగెని, పట్టాదార్ల ప్రతినిధిగా ఎన్నికైన పింగళి వెంకట రామారెడ్డిని, మేధావుల తరఫున ఎన్నికైన జస్టిస్ లక్ష్మారెడ్డిని విమర్శిస్తూ కవితలు రాశారు. ప్రతి సంఘటనకి ప్రతిస్పందించి ప్రజల తరఫున వకాల్తా పుచ్చుకొన్న కాళోజీ నాటినుండి నేటిదాకా ప్రజా కవే!

అడవుల కొండల అనుంగు బిడ్డలు
పొలాల పొత్తిట పెరిగిన పాపలు
లేచిరి క్రోధోద్ధత భీకరులై

## మఖ్దూం

జననం : 4-2-1908 మరణం : 24-8-1969

మఖ్దూం పూర్తి పేరు అబూ సయాద్ మహ్మద్ మఖ్దూం మొహియుద్దీన్ ఖుద్రీ. ముస్లిం కుటుంబానికి చెందిన వీరు, తెలంగాణాలోని మెదక్ జిల్లాలోని ఆందోల్ గ్రామంలో జన్మించారు. తండ్రి మరణించడం, తల్లి మరొక వివాహం చేసుకోవడం వల్ల ఆయనకు బాల్యం లేకుండా పోయింది. మఖ్దూం తాతలది ఉత్తరప్రదేశ్. ఆయన పితామహుడు ఔరంగజేబు సైన్యాలతో పాటు దక్కన్‌కు వచ్చాడు. మఖ్దూం పుట్టేనాటికి ఆయన తండ్రి గౌస్ మొహియుద్దీన్ ఆందోల్ తహసిల్ ఆఫీసులో సూపరింటెండెంట్‌గా పనిచేసేవాడు.

మఖ్దూంకు తార యుద్ధ నైపుణ్యం, తండ్రి కార్యనిర్వహణ అబ్బినయి. అయితే ఆయన తాతలాగా చక్రవర్తుల ప్రయోజనం కోసం తుపాకీ పట్టలేదు. ప్రజా విముక్తి కోసం పోరాడారు. వినయ విధేయతలతో మ.ఫ.వ. నైజాం ప్రభుత్వం వారి దగ్గర తండ్రిలాగా గుమాస్తా గిరి చేయలేదు. బాధ్యతాయుతమైన పార్టీ కార్యకలాపాల్ని కొనసాగించారు.

పల్లెలో పుట్టి పెరగడం, ఆ తరువాత హైదరాబాదుచేరి ధర్మవంత హైస్కూలులో చదువుకోవడం, సుల్తాన్ బజారు మసీదు నేలమాళిగలో రోజులు దొర్లించడం, రొట్టెముక్కలతో ఆకలి చంపుకోవడం, జీవిక కోసం సినిమా తారల చిత్రాలు అమ్మడం వంటివి అప్రధానమైన విషయాలైనప్పటికి వాటికి ఎంతో ప్రాధాన్యత ఉంది. ఆ జీవితానుభవాలు ఆయన్ని ప్రజల పక్షాన నిలిచేట్లు చేశాయి. ఉస్మానియా విశ్వ విద్యాలయ కళాశాలలో పూర్తి చేసుకున్న ఎం. ఏ., సిటీ కాలేజిలో నెరపిన అధ్యాపక వృత్తీ, పార్టీ చైతన్యం, జైలు జీవితం వల్ల ఎదిగి విద్యార్థి, కార్మిక, కర్షక ఉద్యమాలకు సారథ్యం వహించగల స్థైర్యం లభించింది.

విద్యార్థిగా ఉస్మానియా యూనివర్సిటీ హాస్టల్లో ఉన్నప్పుడు సరదా కోసం వరించిన కవిత్వాన్ని చివరి వరకూ వదిలిపెట్టలేదు. జమాలుద్దీన్ జోక్స్ సృష్టించి వదలినా, స్నేహితుడిని ఏడిపించడానికి 'పీలాదుపాలా' అనే పాట రాసినా, ఆ తర్వాత భావ కవిత్వం రాసినా - ఒకనాటికి అదే కవిత్వం ఆయన చేతిలో ఎరుపెక్కి ఆయనతోపాటే ప్రజల పక్షాన నిలిచింది. "జంగె ఆజాద్," స్టాలిన్ కి ఆవాజ్," "తెలంగాణా" "ఖైద్," "చాంద్ తారోంకాబన్," 'హవేలీ' వంటి ఖండికలు ఆయనను ప్రజాకవిగా నిలిపాయి.

హైదరాబాదు ఫ్యూడల్ సంస్థానంలో మఖ్దూం పెరుగుతున్నప్పుడు, నిజాంకు వ్యతిరేకంగా కమ్యూనిష్టు భావాలుగల వారు సాగించే పోరాటాలు, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా కాంగ్రెస్‌వారి ఉద్యమాలు జరుగుతున్నాయి. 1939లో సామ్రాజ్యవాద యుద్ధం మొదలైంది. జాతీయ కాంగ్రెసు, మహారాష్ట్ర పరిషత్తు, తెలంగాణాలో ఆంధ్ర మహాసభ దేని పరిధిలో అది పనిచేస్తున్నాయి. నాగపూర్ కామ్రేడ్స్ సహాయంతో 1939లో మఖ్దూం స్టూడెంట్స్ యూనియన్‌ని స్థాపించాడు. 1940లో పార్టీలో చేరి, సిటీ యూనిట్‌కి మొదటి కార్యదర్శి అయినాడు.

ధరలు బాగా పెరగడం వల్ల 1940-41లో కార్మిక వర్గంలో అశాంతి చెలరేగింది. రామ్‌గోపాల్ మిల్లు, అల్విన్ మెటల్ వర్క్స్, వజీర్ సుల్తాన్, ఆజాం జాహీ,

ఉస్మాన్ షాహీ, ఎమ్మెన్ కె మొదలైన మిల్లుల్లోని కార్మికులు, రైల్వే కార్మికులు సమ్మె చేశారు. వారి సమస్యల పరిష్కారానికి కామ్రేడ్స్ అసోసియేషన్ నిర్విరామంగా కృషి చేసింది. దాని వెనుక మఖ్దూం ప్రేరణ చాలా ఉంది. రచయితగా, ఉపాధ్యాయుడుగా. కార్యకర్తగా ఆయన ప్రజల్ని ఉత్తేజితుల్ని చేశారు. 1944-46 మధ్య అనేక కార్మిక సంఘాలకు ఆయన అధ్యక్షుడు. రాష్ట్రంలోని ప్రతి కార్మిక సంఘ సంస్థాపనలో ఆయనకు సంబంధం ఉంది. 1946-48లలో షోలాపూర్, బొంబాయిలో రహస్య జీవితం గడిపారు. 1951 మేలో అరెస్టయి 1952లో విడుదలయ్యారు.

అదే సంవత్సరం ఉప ఎన్నికల్లో హుజూర్‌నగర్ నుండి శాసనసభకు ఎన్నిక య్యారు. 1953-54లో ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్య ప్రధాన కార్యాలయం వియన్నాలో బాధ్యతాయుతంగా పనిచేశారు. 1956 నుండి 1969లో చనిపోయే వరకు శాసన మండలి సభ్యుడుగా ఉన్నారు. కమ్యూనిస్టు గ్రూపు నాయకుడిగా అనేక కార్మిక సంఘాలకు నేతృత్వం వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యులుగా, ఎ.ఐ.టి.యు.సి. ఉపాధ్యక్షులుగా ఉన్నారు.

ఆయన గీతాల సంపుటి 'గులెతార్'లోని కవితలు ఇంగ్లీషు, రష్యన్, హిందీ, తెలుగు భాషల్లోకి అనువదించ బడినాయి. ప్రజలను చేరని సాహిత్యానికి ప్రయోజనం లేదని ఆయన గట్టిగా నమ్మాడు. ఆయన విషయంలో అలోచనకు - అచరణకు ఎక్కువ దూరం లేదు. ఆయన జీవితం ఆయనను కవిని చేసింది. ఆయన అవగాహన ఆయనను కమ్యూనిస్టును చేసింది.

మఖ్దూం రాసిన తెలంగాణా, ముస్తఖ్బిల్, జంగ్‌హై జంగ్ ఆజాదీకా మొ॥ పాటలు పోరాటంలో మౌఖికంగా పాడుకున్నారు. దళాలు జంగ్ హై జంగ్ ఆజాదీ మార్చింగ్ పాటగా మార్చుకొని పాడుకోవడం జరిగింది. మఖ్దూం రాసిలో తక్కువైనా వాసిలో ఎక్కువగా ఉన్న కవితలు రాశారు. ఇతని కవితల్ని చూస్తే పైకి కవి మఖ్దూం, కమ్యూనిస్టు మఖ్దూం వేరువేరనిపించినా అంతరాల్లో ఒక్కడే.

1958లో రాసిన చాంద్ తారోంకే బన్ గీతంలో —

కామ్రేడ్స్<br>
చేయిచేయ్ పట్టుకో<br>
గమ్యమున్ చేరుకో<br>
ప్రేయమౌ గమ్యముల్<br>
ప్రాణ నిర్గమ్యముల్

మూపుపై సిల్వలన్
మోసుకుంటూ నడూ!

పోరాట దశ దాటి ఎన్నికలకే పరిమితమైన పార్టీ కార్యక్రమాలు కొనసాగిస్తూ కూడా ప్రస్తుత దశ గురించి, ముందు విప్లవ పోరాటం కొనసాగవలసిన అవసరాన్ని గురించీ అతనికి స్పష్టమైన అవగాహన ఉందని పై గీతం వల్ల తెలుస్తోంది.

## డా॥ ఆలువాల వెంకయ్య

జననం : — మరణం : 1958, మార్చి 3

"తాలెల్లయి లెల్లయిలో ఆంధ్ర సంఘంతో చేరండయో" అంటూ ఆలువాల వెంకయ్య తమ గళాన్ని విప్పి ఆంధ్ర మహాసభలకి ప్రజా స్వభావాన్ని చేకూర్చటానికి నడుం కట్టారు. అంతేకాదు చేస్తూన్న వైద్యవృత్తిని పక్కనబెట్టి తెలంగాణా ఉద్యమానికి కేంద్రమైన సూర్యాపేటలో ఆంధ్ర మహాసభకు సంబంధించిన ఎన్నో కార్యక్రమాలను నిర్వహిస్తూ వాటిలో పాల్గొన్నారు. ఖమ్మంలో జరిగే 12వ ఆంధ్ర మహాసభకు సూర్యాపేటనుండి ప్రజలను, కవులను, కళాకారులను ప్రోత్సహించి పంపారు. ఆ సందర్భంలో దాశరథి, కొమరగిరి నారాయణరావులతో కలిసి "ప్రబోధ గేయాలు" రాశారు. ఈ చిన్న పాటల పుస్తకాన్ని "ప్రజా ప్రచురణాలయం" వారు 1945లో ప్రచురించారు. ఇందులో ఆలువాల వెంకయ్యగారి రెండు పాటలున్నాయి. ఈ రెండు పాటలుకూడా మౌఖిక వ్యాప్తి పొందాయి. ఈనాటికీ ఈ పాటలు ప్రజల పాటల్లో ఒక భాగంగా మారిపోయాయి.

"ఆంధ్ర మహాసభ కరుగుదెంచండి" అనే పాటలో ఆంధ్ర మహాసభలు ప్రజల కోసం చేసే కార్యక్రమాలన్నింటిని పాట రూపంలో ఉంచారు. ఇందులో పోలీసంఘాన్ని, వెట్టి చాకిరినీ, మొండ్రాయి ప్రజల బేదఖలీ పోరాటాన్నీ, సేలు పొసైటీల గురించి, లంచగొండి విధానాన్ని గురించి ఈ పాటలో సవివరంగా రాశారు. ఈ ఒక్క పాట ఎన్నో రూపాలలో స్థానికంగా పాడుకోవడం జరిగింది. ఈ సంకలనంలోని 'లంచ గొండి విధానం' పాటలో తెలంగాణా గ్రామాల్లో లంచగొండితనం ఏ విధంగా అమల్లో ఉందో తెలుపుతుంది. అంతేకాదు ఈ విధానాన్ని రూపుమాపడానికి సంగంలో చేరాలని ఉద్బోధిస్తుంది.

ఆలువాల వెంకయ్య వైద్యుడు, కవి, రచయిత, నటుడు, హార్మోనిస్టు, దర్శకుడు. సూర్యాపేట ప్రాంతంలో సాంస్కృతిక కళారంగాలలో వెంకయ్య పాత్ర ఎంతో ఉంది. నాటకాలకోసం వైద్యవృత్తిని నిర్లక్ష్యం చేశాడు. తద్వారా ఆర్థికంగా దెబ్బతిన్నాడు. కష్టజీవి, బొబ్బిలి యుద్ధం బుర్రకథలను వివిధ ప్రాంతాలలో బుర్ర కథలుగా చెప్పారు. ఆంధ్ర మహాసభ చీలిపోయి పోటీ సంఘం ఏర్పడిన తరువాత, "ఎందుకయ్యా పోటి సంఘం మందుములయ్యా, ఉన్న సంఘం చాలునయ్యా పులిజాల రంగయ్యా" అన్న పాట తెలంగాణాలో మారుమ్రోగింది. అప్పట్లో వీరిని కామ్రేడ్ ఆలువాల వెంకయ్య అనేవారు. వీరు కమ్యూనిస్టు భావాలు కలిగియుండి సానుభూతి పరులుగా పనిచేశారు. (పార్టీ సభ్యుడేమో కూడా) అయినప్పటికీ నాటకాలపట్లగల ఆసక్తితో మామూలు నాటకాల్లో పనిచేయడానికి కూడా సిద్ధపడ్డారు. ఎన్ని కష్టాలు పడైనా నాటక ప్రదర్శనలను నిర్వహించేవారు. ఇతివృత్తంతో తాను సంపూర్తిగా ఏకీభవించకపోయినా ప్రదర్శించదగిన నాటకానికి సంపూర్ణ సహకారాలు అందిచ్చేవారు.

1948-50 ప్రాంతాల్లో 'జనతా కళా మండలి సంస్థ' ద్వారా తెలంగాణా ప్రాంతం పర్యటించారు. వీరు ఎన్నో నాటక సమాజాలను నిర్వహించారు. 'ఆంధ్ర రాష్ట్రం' అనే నాటకాన్ని రాశారు. పోరాటం తర్వాత సాధారణ నాటకాలకు పాటలు రాసి ప్రదర్శించారు. తుదకు అనారోగ్యంతో అనేకమైన సంసార బాధలతో మరణించారు.

కదిలించి బలగాన్ని - ఎదిరించి వైరులను
శక్తి చూపించగల - సమయమిదె లేలెమ్మ

## సుంకర సత్యనారాయణ

జననం : 1909 మార్చి 23 మరణం : 1975 సెప్టెంబర్ 5

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటానికి మద్దతుగా, నాజీ నైజాం రాక్షసత్వానికి వ్యతిరేకంగా తన కలంనుంచి చండ్ర నిప్పులు కురిపించి తన జీవితాన్ని ప్రజలకు అంకితం చేసిన కవి, కళాకారుడు, నాటకకర్త సుంకర సత్యనారాయణ కృష్ణా జిల్లా ఈడుపుగల్లు గ్రామంలో జన్మించారు. జాతీయ భావాలు, అభ్యుదయ భావాలుగల తండ్రి రామచంద్రయ్య ప్రోత్సాహంతో ఇంగ్లీషు చదువుకి స్వస్తిచెప్పి

జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. అందుకుగాను జైలు శిక్ష ననుభవించారు. జైలులో ఉండగానే సాంప్రదాయ సాహిత్యాన్ని అధ్యయనం చేశారు.

జైలునుండి విడుదలైన తర్వాత తిరుపూరు తాలూకా కాకర్లలో సోదరునితో కల్సి వ్యవసాయం ప్రారంభించారు. అక్కడ జమీందారీ గ్రామాల్లో ప్రజల దుర్భరస్థితి, జమీందారుల దౌర్జన్యాలు చూసి సహించలేక జమీందారుకు వ్యతిరేకంగా ప్రజలను సంఘటితపర్చడానికి నడుంకట్టారు సోదరులిద్దరూ. అందుకోసం జంగం కథను నేర్చుకుని, దాన్ని బుర్రకథ రూపంలోకి మార్చి ఊరూరా తిరిగి జమీందారీ దోపిడీకి వ్యతిరేకంగా కథలు చెప్పారు. ఈ క్రమంలోనే సరిహద్దు గ్రామాలైన తెలంగాణాలో (మునగాల పరగణాలో) ప్రవేశించి హరిజనోద్ధరణ పేరుతో మీటింగులు పెట్టి బుర్ర కథలు చెప్పి తెల్లారేసరికి ఊరొదిలి మరో ఊరు చేరుకునేవారు.

1942లో కమ్యూనిస్టు ఉద్యమంవైపు ఆకర్షితులై అభ్యుదయ రచయితల సంఘం ప్రారంభంనుండి అందులో ప్రముఖ పాత్ర వహించారు. 1943లో ఫాసిజానికి వ్యతిరేకంగా అనేక పాటలు రాసి హిట్లర్ ఘోరకృత్యాలను, ఎర్రసేన విజయపరంపరను తెలుగు ప్రజలకు విశదపరచాడు.

స్టాలినో గ్రాడుదాక సాగిరానిచ్చి నిన్ను
ఎర్రసేన చుట్టుముట్టి గొర్రెకోత కోయుచుండ హిట్లరూ
అబ్బ! నా కళ్ళు సల్లబడ్డవోయి హిట్లరూ!—అనే పాట ఆ రోజుల్లో ఒక విజయగీతిక ఒక రణన్నినాదం.

అనంతరం తెలంగాణా పోరాటంలోని ప్రతి మలుపులోను పుంఖానుపుంఖంగా పాటలు రాసి సాంస్కృతిక దళాలకందించాడు. 'తెలుగు బిడ్డా మేలుకోవోయ్' పాట ఇంకా అనేక ఇతర పాటలు ఈనాటికీ తెలంగాణాలో పాడుకుంటూనే ఉంటారు. ఆ రోజుల్లో ఈ పాటలు నిజాంపాలిట ఈటెల్లా పనిచేశాయనటం అతిశయోక్తికాదు.

మరోవైపు బుర్రకథలు - ఈ రూపాన్ని రక్తమాంసాలతో నింపి దాన్ని అద్భుతంగా తీర్చిదిద్ది పోరాటంలో ప్రధానాయుధంగా వాడటంలో సుంకర కృషి అనన్యసామాన్యం. కష్టజీవి, తెలంగాణా బుర్రకథ అటు ఆంధ్ర, ఇటు తెలంగాణాలోను మార్మోగాయి. ఒక్క కష్టజీవి బుర్రకథ లక్ష ప్రతులు అమ్ముడుపోయాయంటే దాని ప్రాధాన్యత గురించి వేరే చెప్పనవసరం లేదు.

వాసిరెడ్డితో కలిసి ముందడుగు, అపనింద, మా భూమివంటి నాటికాలు రాశారు. ముందడుగు, మాభూమి నిషేధానికి గురైనాయి. సుంకర రాసిన కాంగ్రెసా? ఆంగ్రేజా? నాటిక పోరాట అంశంలోని కాంగ్రెస్ వారి నిజరూపాన్ని బహిర్గతం చేసింది. 'వీర

సంఘము' ఉత్తేజాన్నిచ్చే నాటిక.

1948లో పార్టీపై నిషేధం రావడంతో సుంకర అజ్ఞాత జీవితం గడపవలసి వచ్చింది. ఈ కాలంలో ఆయన కుటుంబం అనేక బాధలకు గురైంది. చెట్టుకొకరు, పుట్టకొకరై పోయారు. ఆత్మబంధువులు కాల్పుల్లో మరణించారు. ఈ కష్టకాలంలోకూడా సుంకర తన ఆత్మస్థయిర్యాన్ని విడువక గుంతకల్లు దగ్గర కమ్మకొట్టాల గ్రామంలో ఉంటూ అనేకమంది రాజకీయ కార్యకర్తలను తయారుచేశారు. సుంకర రాళ్ళు కొట్టి బతుకుతున్నాడన్న వార్త విని, బహిరంగ లేఖ రాసిన కె.వి.రమణారెడ్డికి మహోన్నత మైన ఆశావాదంతో, ఆత్మస్థయిర్యంతో జవాబిచ్చారు.

తెలంగాణా పోరాట విరమణ అనంతరం సినీరంగంలో చేరి పుట్టిల్లు, పల్లెటూరు, నమ్మినబంటు, భూమికోసం వంటి సినిమాలకు పాటలు, మాటలు రాశారు.

మా భూమి కొనసాగింపుగా గెరిల్లా నాటకం రాసి తన చివరి రోజుల్లో విజయ వాడలో ప్రదర్శన ఇచ్చారు. ఈ విధంగా వర్తమాన ప్రజావిప్లవంతో సంబంధం ఉంచుకోగలిగారు.

తెలంగాణా పోరాటాన్ని గానం చేసిన ఆయన గొంతు 1975 సెప్టెంబర్ 5న మూగవోయింది. అవిశ్రాంత సాంస్కృతికరంగ సైనికుడు శాశ్వత విశ్రాంతి తీసుకున్నారు.

## వాసిరెడ్డి భాస్కరరావు

జననం : 2 సెప్టెంబర్, 1914 మరణం : 1 నవంబర్, 1957

తెలుగు నాటకానికే నూతన మార్గాన్ని నిర్దేశించిన 'మా భూమి' నాటక రచయితల్లో ఒకరైన వాసిరెడ్డి భాస్కరరావు పెంచికలదిన్నె గ్రామంలో జన్మించి, తండ్రి మరణంతో కృష్ణా జిల్లా వీరులపాడు గ్రామంలో పెంపకానికి వచ్చారు. రాజకీయ కార్యకలాపాలల్లో చురుగ్గా పాల్గొన్నారు. తెలుగులోను, హిందీలోను విద్వాన్ పట్టా తీసుకుని నందిగామ జిల్లా స్కూలులో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు. కానీ మారుతున్న రాజకీయ పరిస్థితులవల్ల అది ఎంతో కాలం సాగలేదు. ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమం ఆయన్ని కమ్యూనిస్టుగా రూపుదిద్దింది. ఉద్యోగానికి రాజీనామా చేసి కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో లీనమైపోయారు.

ఈ దశలోనే వీరులపాడు గ్రామానికి దగ్గరలోనే (కొణతమాతుకూరు) హిందీ ఉపాధ్యాయుడుగా ఉన్న సుంకర సత్యనారాయణతో పరిచయం ఏర్పడింది. ఈ పరిచయమే వీరిని అనంతర కాలంలో ప్రముఖ జంట నాటక రచయితలుగా తయారు చేసింది. అప్పటికే సుంకర సత్యనారాయణకున్న సంగీత జ్ఞానం, పల్లెటూరి (అను భవం), సాహిత్యంపైనున్న పట్టు, భాస్కరరావుగారికున్న సాహితీ పరిజ్ఞానం. ఈ రెంటికీ తోడు తెలంగాణా రైతాంగ పోరాట నేపథ్యం.... ఇవన్నీ కలగలసి వీరిని ప్రజా నాటకాలను తయారుచేయడానికి ప్రోత్సహించాయి. వీరు రాసిన మొదటి నాటకం ముందడుగు ఆనాటి ప్రభుత్వ నిషేధానికి గురైంది. రెండో నాటకం ఆపనింక. 'మా భూమి' వీరి మూడో నాటకం. తెలంగాణా పోరాటంలో ఈ నాటకం నిర్వహించిన పాత్ర అమోఘమైనది. ప్రజానాట్య మండలి దళాలతోపాటు అనేక ఔత్సాహిక నాటక బృందాలుకూడా ఈ నాటకాన్ని పెద్ద ఎత్తున ప్రదర్శించాయి. ఇది కూడా ప్రభుత్వ నిషేధానికి గురయింది.

ఆ తర్వాత పార్టీ వీరికి 'ప్రజాశక్తి' నిర్వహణ బాధ్యతలను అప్పజెప్పింది. బెజవాడలో ప్రజాశక్తి పత్రిక పనిలో నిమగ్నమైకూడా మరోవైపు తెలంగాణా పోరాటా నికిసంబంధించిన వార్తలను ఆధారం చేసుకుని కొన్ని పాటలు రచించారు. తనకు సృజ నాత్మక రచనలు చేసే సమయం దొరక్కపోయినా ఉన్న కొద్ది అవకాశాలను కొత్త రచయితలకు సలహాలివ్వడంలో ఉపయోగించేవారు.

1948 జూన్ 1వ తదీన ఆయన ఇంటిపై పోలీసులు దాడిచేసి ఆయన లైబ్రరీని స్వాధీనం చేసుకోవటంతోపాటు రెండేళ్ళుగా శ్రమించి తయారుచేసిన 'భారతీయ సాహిత్య విమర్శ' అనే వెయ్యి పేజీల పుస్తకం తాలూకు రాత ప్రతినికూడా తీసుక పోయి తగలబెట్టారు. ఆయన్ని అరెస్టు చేసి 20 రోజులు జైల్లో చిత్రహింసలుపెట్టారు. దానితో అసలే అంతంతమాత్రమైన ఆరోగ్యం పూర్తిగా దెబ్బ తిన్నది. తిరిగి వీరుల పాడు చేరుకుని ఆ అనారోగ్యంతోనే 'పోతుగడ్డ' నాటకాన్ని రచించారు. ఈ నాటకం మునగాల పరగణాలో అనేకసార్లు ప్రదర్శించారు. 1950లో మద్రాస్ చేరుకుని పుట్టిల్లు, పల్లెటూరు, కన్నతల్లివంటి సినిమాలకు మాటలు, పాటలు రాశారు. 1952నుండి తీవ్ర అనారోగ్యంతో బాధపడుతూ వీరులపాడులో తన 43వ ఏట మరణించారు.

నెత్తురు చేరులు పారిన
కత్తులు ఓల్చుకు పోయినా
ఎత్తిన జండా దించకోయ్

## ముక్కామల నాగభూషణం

జననం : 1910 ఫిబ్రవరి 4

ఆంధ్ర ప్రజా నాట్యమండలి కార్యకర్తగా, కవిగా, కమ్యూనిస్టు పార్టీ సభ్యునిగా పనిచేసిన ముక్కామలగారు తెలంగాణా పోరాటం వివిధ దశల్లో ప్రతిస్పందించి ఎన్నో శక్తిమంతమైన పాటలు రచించారు. వీరు ఆనాడు రాసిన పాటలు తెలంగాణా పల్లెపల్లెల్లోనూ మారుమోగాయి. పోరాట వీరులు పాడుకొనే మార్చింగ్ పాటలూ, ప్రజలు పాడుకొనే వీరగీతికలూ రాశారు.

1922లో విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమావేశంలో వాలంటీరుగా రాజకీయాల్లోకి ప్రవేశించారు. 1934లో హరిజన సేవా సంఘంలో చేరి "హరిజనులని పేరిడితే మాలల కాకలి తీరేనా! దేవుని గుడులకు దారులు తెరిచితే తీరేనా కష్టాలు" అని పాటలు రాశారు.

సోషలిస్టులు, కమ్యూనిస్టులు కూడా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో ఉండేవారు. ఆ కాలంలో ప్రముఖ కమ్యూనిస్టులతో పరిచయం కలగడంవల్లా, డిమిట్రావ్ రాసిన "యునైటెడ్ ఫ్రంట్", "గతితార్కిక భౌతికవాదం" మొ॥ పుస్తకాలు చదవడంవల్లా అభ్యుదయ భావాలు కలిగాయి. అంతేకాదు అప్పుడు ప్రపంచానికి సంభవించబోయే ఫాసిస్టు ప్రమాదాన్ని గుర్తించి కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

ఫాసిస్టు వ్యతిరేకంగా సాగినసాహిత్యోద్యమంలో ప్రముఖంగా పాల్గొన్నారు. ఫాసిస్టులకు వ్యతిరేకంగా ప్రజల బాణీలు తీసుకుని ఎన్నో పాటలు రాశారు. ఉపన్యాసాలతోపాటు వేదికలమీద పాటలు పాడేవారు. మొదటి దశతో ముక్కామలగారు కళాకారునిగా కూడా పనిచేశారు. 1943లో భారత కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహాసభ బొంబాయిలో జరిగింది. అందులో ఆంధ్ర కమిటీ తరపున ముక్కామలకూడా పాల్గొని "కదన భూమి కేగుదాం కత్తి దూసి దూకుదాం ఫాసిజాన్ని రూపు మాపి ప్రజల శక్తి చాటుదాం"లాంటి పాటలు, డప్పు నృత్యం మొదలైన కళారూపాలు ప్రదర్శించారు. అక్కడనుండి వచ్చాక ఆంధ్ర ప్రజా నాట్య మండలి ఏర్పాటులో ప్రముఖ పాత్ర

వహించారు. అప్పుడే రైతు సమస్యలమీదా, ఎరువులు, వ్యవసాయంమీద చిన్న చిన్న పుస్తకాలు రాశారు. విద్యార్థి యువజన సంఘాలకు పనికివచ్చే పాటలు రాశారు మహిళా ప్రబోధ గేయాలు కూడా ఎన్నో రాశారు. స్త్రీల పాటలు (1944) పుస్తకంలో పెరజోలుహ, ఎన్నాళ్ళు బానిస బతుకు, అభివృద్ధి మార్గాన నడచిపోదాము, సామాన్య మటమ్మా, జోలపాట, మంగళం మాతా మొదలైన పాటలు రాసి స్త్రీలలో చైతన్యం కలిగించడానికి ప్రయత్నించారు.

1945-46 నుండి రాష్ట్ర రైతు సంఘాధ్యక్షునిగా, ప్రజానాట్యమండలి కార్య కర్తగా పనిచేస్తూ, జమీందారీ విధానం రద్దు కొరకు రైతు పోరాటాల్లో పాల్గొన్నారు. రైతుసంఘ నాయకునిగా మునగాల రైతుల సత్యాగ్రహ పోరాటంలో పాల్గొంటున్న సమయంలో కొన్ని పాటలు రాశారు. ఆ విధంగా రైతు సమస్యలతోనూ, జీవితం తోనూ, పోరాట కాలంతోను సంబంధం కలిగిన సుబ్బరామలగారు తెలంగాణా పోరాటం పట్ల ఎంతో ఆసక్తి చూపారు. పోరాట కాలంలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ సభ్యునిగా ఉంటూ ఆ పోరాట దళలతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉన్నారు. అందుకే ఎన్నో పాటలు రాయగలిగారు.

1947-48 సంవత్సరాలలో రహస్యంగా ఉంటూ ఆంధ్ర, తెలంగాణా పోరాటాలను అనుసంధించారు. ఈ బాధ్యత నిర్వహించే కాలంలోనే వీరిని అరెస్టు చేసి రాజమంద్రి జైలులో నిర్బంధించారు. కాని జైలునుండి తప్పించుకుని వచ్చి పోరాటంలో తిరిగి పాల్గొన్నారు. మళ్ళీ 1849లో పోలీసులు అరెస్టు చేసి పుదుక్కోట సంస్థానం జైలులో నిర్బంధించారు. జైలునుండి తప్పించుకుని వచ్చినకాలంలో వీరు రాసిన పాటలు తెలంగాణా ప్రజలు మౌఖికంగా పాడుకొన్నారు. ఐతే ఈ పాటలు వీరు రాసిన ఫాసిస్టు వ్యతిరేకోద్యమంలోని పాటల వరసల్లోనే రాశారు. తెలంగాణా పోరాట పాటల కన్నా ఫాసిస్టు వ్యతిరేకోద్యమ పాటలే ఎక్కువగా రాయడం గమనించాలి.

1952 తరువాత కమ్యూనిస్టు పార్టీకి రాజీనామా చేశారు. కమ్యూనిస్టు భావాల కన్నా ఇప్పుడు ఎక్కువగా సంస్కరణవాద కార్యక్రమాల్లో మునిగిపోయారు. గేయాలూ, గేయ కావ్యాలూ, రేడియో నాటికలు రాస్తున్నారు. ప్రజాస్వామ్య భావాలతో నిరంతరం తమ సాహిత్య కృషి కొనసాగిస్తున్నారు.

గట్టిగ మాటలాడ కట్టేసి తన్నుతారు
ఈ బతుకు వద్దు పదరా పోరాడు జీతగాడా

## నాజర్

జననం : 1925

గుంటూరు జిల్లాలోని పొన్నెకల్లు సొంత గ్రామం. చిన్నతనం నుండి కళలమీద ప్రీతి. సంగీతం, నటన అంటే పడిచచ్చేవారు. చిన్నతనంలోనే 'బాలరత్నసభ' నాటకం కంపెనీలో వీరిని చేర్చుకున్నారు. ఇక్కడే ముస్లిం పేరు తీసి 'గోపి' పేరు పెట్టారు. 1935లో కంపెనీ ఆర్థికంగా చితికిపోవడంతో మళ్ళీ ఇంటికి వచ్చారు.

నరసరావుపేటలో ఒక పంతులు గారి దగ్గర 'జోలి కట్టుకుని' సంగీతం నేర్చుకున్నారు. ఇంటింటికి తిరిగి ఎన్నాళ్ళు అడుక్కోవాలి? అనే ప్రశ్న ఉదయించింది. మళ్ళీ ఇంటికి వచ్చి తాతలనాడు సన్నాయి వాద్యానికోసం ఇచ్చిన భూమిని సాగు చేశారు. నష్టంతో వ్యవసాయం మూసేశారు. పొలం పనుల్లో కూలీగా పనిచేశారు. ఒక పొగాకు కంపెనీలో కూలీగా కుదిరారు. కూలీ లెక్కల్లో మోసం చేయడాన్ని ఎదిరించి అక్కడి నుండి బయట పడ్డారు.

అత్తగారి ఊరు గారపాడు(సత్తెన పల్లి)లో యువకులకు నాటకాలు నేర్పారు. ఆ కాలంలోనే కమ్యూనిష్టులు మిత్రులయ్యారు. 'అమ్మ' నవలలోని పావెల్‌తో తనను తాను పోల్చుకున్నాడు. జోలీ సంచీ, దున్నల నాగలి, కూలీ చెమట, పొగాకు కంపెనీ మోసాలు ఒక్కసారి బుర్రలో తిరిగాయి.

1943లో తాలూకా, జిల్లా సభల్లో పాటలు పాడారు. ఇతరులు ఇచ్చిన ప్రదర్శనలు చూశారు. కళారూపాల ప్రదర్శన పొట్ట కోసం కాదనీ, ప్రజల కోసమనీ తెలుసుకున్నారు.

చిన్నతనం నుంచి కళలపట్ల ప్రీతి, నిరుపేదగా అనుభవించిన కష్టాలు తన స్థానం ఏమిటో చూపించాయి. వెంటనే బుర్రకథలో శిక్షణ పొందారు 'బెంగాలు కరువు' బుర్రకథ రాసి దాన్ని వందల సార్లు ప్రదర్శించారు.

ఈలోగా తెలంగాణా పోరాటం భగభగలు తాకాయి. "బండెన్కా బండి కట్టి ఏ బండ్లె నువ్వొస్తవు నాకొడ్కో జిన్నారెడ్డి" అనే పాట మౌఖికంగా గుంటూరు వరకు పాకింది. ఈ పాట శైలి బాగా నచ్చింది. ఆ బాణీలో "ఏరన్న రాకమునుపే

ఎరువాక పచ్చేరన్న ఎవరింట ఉందువన్నా ఓరన్న జీతగాడ" అనే పాట రాశాడు. ఈ పాటలో తన చిన్నతనంలో అనుభవించిన పేదరికాన్ని వర్ణించాడు.

బుర్రకథకి క్రొత్త జవజీవాలు కల్పించిన నాజర్ ఫక్కీని ఎంతోమంది అనుకరించారు. ఐతే తెలంగాణా పోరాటానికి ప్రత్యక్షంగా నాజర్ బుర్రకథ ఉపయోగపడలేదు. వీరు రాసిన ఒకటి, అరా పాటలు మాత్రం తెలంగాణా అంతటా ప్రచారంలో ఉన్నాయి. పైన పేర్కొన్న పాట గిరిజనుల్లోనూ ప్రచారం పొందింది.

బందగీ రక్త ధారావాహిని
ప్రవహించినంత మేరా
ఆరుకోట్ల భుజాల నడే మహోజ్వలమూర్తి
శౌర్యాంకుర స్ఫూర్తి సాగె నాంధ్రుని కీర్తి

## అయ్యాపు వెంకట కృష్ణయ్య

జననం : 1909, మే.

శుద్ధ వైదిక కుటుంబంలో జన్మించిన వెంకట కృష్ణయ్యకి సహజంగా సంస్కృతాంధ్ర భాషల్లో తగిన పాండిత్యం ఉంది. చారిత్రక గ్రంథావలోకన, సామ్యవాద ఉద్యమాలు ఆయన వృత్తినీ, ప్రవృత్తినీ ప్రభావితం చేశాయి.

1930 ఉప్పు సత్యాగ్రహంతో మొదలై సంస్కరణోద్యమంలోకి దారితీశారు. చిన్నతనం నుండి వీరికి కీ॥శే॥ అనుమర్లపూడి రామారావు (1949 అక్టోబరు 11న కడలూరు జైల్లో కాల్చివేశారు) కమ్యూనిస్టు రాజకీయాల గురువు. వీరితో పాటే వెంకట కృష్ణయ్య జాతీయోద్యమం, జమీవ్యతిరేకోద్యమం, రైతు, కార్మికోద్యమాల్లోనూ ఏదో ఓ మేరకి పాల్గొంటూ సాహిత్యాన్ని వెలువరించారు.

ఆశీర్వచనాలు, మంత్రాలు పాడేనోరు ప్రజా పోరాట గీతాలు ఆలపించింది. యుద్ధ కాలంలో ఫాసిస్టు వ్యతిరేకోద్యమ గీతాలు రాశారు. ఈ కాలంలో సంపన్నులు సనాతనవాదులు వీరి కుటుంబాన్ని వెలి వేశారు. ఎన్నడో దానం పొందిన ఒక ఎకరం భూమిని లాక్కున్నారు. వీరి కుటుంబంపై నానారకాలైన వత్తిడి తెచ్చారు. వీరి ఇంట్లో పార్టీ సమావేశాలు జరుగుతున్నాయనీ, నిషిద్ధ సాహిత్యం ఉందని శోధించారు. పుస్తక

రూపంలో ఆనాడు నిషిద్ధ సాహిత్యం ఏ కొద్దిగానో దొరకవచ్చుగాని మౌఖికంగా దాగిన తన పాటలుగాని, ఇతరుల ఎన్నో పాటలు గాని పోలీసులు శోధించలేకపోయారు.

వీరు రాసిన "మనదీ భారతదేశం" పుస్తకాన్ని ప్రజా శక్తినగర్ ప్రెస్ మీదా, భాండాగారంమీదా, పుస్తకశాలలమీద జరిపినదాడుల్లో వేలాది ప్రతులు పట్టుకుపోయారు. ఐనప్పటికీ ఈ పాటలు, కళారూపాలు మళ్ళీ మౌఖికంగా వ్యాప్తిలోకి వచ్చాయి. వీరు కేవలం పాటలే కాదు కళారూపాలు రాసి ప్రదర్శించేవారు. ఎక్కువగా కళారూపాలే రాశారు. వీరి పాటల్లో బందగీ పాట, రక్తపిపాసీ గేయం, నాజీనైజాం గేయ నాటిక పేర్కొన తగినవి. ఆనాడు వీరు శ్రీమతి మోటూరి ఉదయం మొ॥ వారి సహకారంతో ఎన్నో మహిళా ప్రబోధగేయాలు రాశారు.

వీరి సాహిత్యంలో శిష్ట భాష ఎక్కువ. పెళ్ళి మంత్రాల బాణీలో దీర్ఘ గేయాలు రాశారు. ఈ విధంగా వైదిక వృత్తి నుండి వచ్చిన వెంకట కృష్ణయ్య తెలంగాణా రైతాంగ పోరాటానికి వైదిక మంత్రాలకు సంబంధించిన బాణీని సరికొత్తగా అందించారు.

ప్రజల రాజ్యంబు నిర్మించాలోయ్
పర్వదినమని జగతి చాటాలోయ్

## కోగంటి గోపాలకృష్ణయ్య

గుడివాడ దగ్గరి బొమ్ములూరు వీరి సొంత ఊరు. చిన్నతనం నుండీ వీరికి నాటకాలపట్ల ఆసక్తి. ఐదోతరగతి చదువుతున్నప్పుడే అరుగుల మీద పరదాలుకట్టి నాటకాలు ఆడేవారు. అలా పెరిగిన ఆసక్తి ఫాసిస్టు వ్యతిరేకోద్యమంలో పెద్దదైంది. తమ ఆసక్తికి అనుగుణమైన పాటల్ని, సాహిత్య కళారూపాల్ని తామే ఏర్పాటుచేసుకోవలసి వచ్చింది. ప్రజాశక్తినగర్ గుడ్డిదీపం వెలుగులో 'హిట్లర్ పరాభవం' వీధిభాగోతం రాశారు.

బెంగాల్ కరువు, రాయలసీమ కరువు కాలంలో జోలెకట్టుకుని బజారుల్లో, రైల్వే స్టేషన్లలో పాటలు పాడుతూ, చిత్ర విచిత్ర వేషాలువేస్తూ డబ్బు వసూలు చేశారు.

బొంబాయి వైజ్ఞానిక ప్రదర్శనల్లో కోగంటి కోయవేషం మంచి పేరు సంపాదించింది. బొంబాయి నుండి వచ్చాక ద్విగుణీకృతోత్సాహంతో పని చేశారు. వీరికున్న లయజ్ఞానం అసమానమైనది. అతి తక్కువ సమయంలో పాటలు రాసేవారు. ప్రతి పాటకు ఏదో ఒక ప్రజల పాట బాణీ ఉండేది. వీరి పాటలకు ప్రేక్షకులను, శ్రోతలను ఆకర్షించే గుణం ఉంది.

1944 భోనగిరి ఆంధ్ర మహాసభ కార్యక్రమాలకు హాజరయ్యారు. సభల తరువాత అక్కడే ఉండి తెలంగాణా ప్రజల జీవితాన్ని దగ్గరగా చూశారు. భోనగిరి సభల్లో జాగిరు రైతుల గురించి పాటలు రాశారు. తెలంగాణాకి రాకముందే రాజమండ్రిలో అరెస్టయి 9నెలల జైలుశిక్ష అనుభవించారు.

తెలంగాణా పోరాటం వివిధ దశల్లోనూ పాటలు రాసి వేదికమీద పాడేవారు. అందులో కొన్ని పాటలు తెలంగాణా ప్రజల దాకా వచ్చాయి. "ఓయ్ హోయ్ నైజా మోయ్" పాట మొదట 'జాపానోయ్' అని రాశారు. దాన్నే కొద్దిగా మార్చి తెలంగాణాకు అన్వయించారు. ఈ పాటని ప్రజలు తమకు తోచిన బాణీలో పాడు కున్నారు. నైజాం రాజుని దృష్టిలో పెట్టుకుని 'బద్మాష్‌పాదుశా' వీథినాటకాన్ని రాశారు. పోలీసులు ఈ పుస్తకాన్ని నిషేధించారు. ప్రతులన్నిటినీ కాల్చివేశారు. 60, 70 ప్రదర్శనలు కూడా జరిగాయి. ఇంద్రజాలం-వీథినాటకం, పేరిగాడిరాజ్యం, కలియుగ కురుక్షేత్రం మొ॥ కళారూపాలు వెలువరించారు.

వీరు కవులూ, గాయకులూ, నటులూ ప్రయోక్త కావడం వల్ల వందలాది ప్రదర్శనలు ఇవ్వగలిగారు. ఆ క్రమంలోనే ఎస్. వి. కె. ప్రసాద్ ద్వారా వరంగల్, హైదరాబాదు, సూర్యాపేట మొ॥ ప్రాంతాలు ప్రదర్శించామని ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. ఐతే ఎలాంటి ప్రదర్శనలు ఇచ్చారో వివరాలు తెలియదు. "తెలుగునాడంత మేల్కొన్నాదోయ్ తెలంగాణ ప్రజలకండగ నున్నారోయ్" అని 1946 చివరలోనే తెలంగాణా ప్రజలకు హామీ ఇచ్చారు. ఇచ్చిన హామీని వీరు వ్యక్తిగతంగా చివరివరకు నిలుపుకోలేకపోయారు.

మీసం దువ్విన తెలంగాణా-కూసం విడిచిన తెలంగాణా
జాల వీడలా తెలంగాణా-బాకులు పట్టిన తెలంగాణా!

## తెన్నేటి సూరి

జననం : 1911 మరణం 16-11-1958

తెన్నేటిసూరి కృష్ణజిల్లాలో జన్మించారు. వీరి తల్లి వెంకటలక్ష్మమ్మ. తండ్రి తిరుమలరావు.

పుట్టినఊళ్ళోనే ప్రాథమిక విద్య పూర్తిచేసి పై చదువులకి బందరు వచ్చాడు. అక్కడే సాహిత్య రచనా వ్యాసాంగానికి అంకురార్పణ జరిగింది. కొందరు పత్రికాధిపతులతో పరిచయం ఏర్పడింది. వారి మద్దతుతో ఓ ప్రెస్సులో ఉద్యోగం లభించింది. ఈ పని చేస్తూనే ఆయా పత్రికలకి వ్యాసాలు రాయడం మొదలు పెట్టారు.

ఈ సందర్భంలో సూరిగారికి కాంగ్రెస్ నాయకులూ, కమ్యూనిస్టు మేధావులు పరిచయమయ్యారు. "సాహిత్యం ప్రజల కోసం" అనే వాతావరణంలో సూరి కొత్తగా రచన ప్రారంభించాడు. లిఖిక పత్రికలో రాసిన రచనలకు భిన్నంగా, తమ కుటుంబ సభ్యుల అభీష్టానికి వ్యతిరేకంగా రచన ప్రారంభించాడు. పైగా ఇంట్లో అందరూ కాంగ్రెస్ వాదులు. ఒక్క సూరి తప్ప.

ప్రజానాట్య మండలి ఎన్నో పాటలు, కళారూపాల ద్వారా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం చేసింది. అందుకు సూరి కూడా తన వంతు సహకారాన్ని అందించారు. ఎన్నో పాటలు రాసి వారికి అందించాడు.

వీరు పనిచేసే ప్రెస్సే సాహిత్య వేదికగా పనిచేసింది. కార్మిక కర్షక కూడలిగా మారింది. కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు కాకపోయినా పార్టీ ఆదేశాలను గౌరవించాడు. పార్టీ నాయకులతో కలిసి పనిచేసాడు మహిళా చైతన్యం కోసం పాటలు రాసాడు. ఫాసిజాన్ని శక్తిమంతంగా ఖండించాడు. సూరి ప్రత్యేకత ఏమంటే బాల గేయాల రచన! పిల్లల కోసం వారి బాణీల్లో ఇంతగా పాటలు రాసిన కవి మరొకరు లేరు. కేవలం పాటలే కాదు. 'గొల్లకాడ' అనే నాటకం కూడా రాసి ప్రదర్శించాడు. తెలంగాణా రైతాంగ పోరాటం గురించి ఆంధ్రప్రాంతంలో సానుభూతి సంపాదించడం కోసం పాటలు రాశాడు. అందులో పిల్లల పాటలే ఎక్కువ "సవాలన్న నైజాముకు జవాబెవ్వరు" అనే పాట ఈ నాటికీ ప్రజల వాడుకలో ఉంది. "బాల చంద్రుడెవ్వరూ" అనే పాటలో పిల్లల్లోనే కాదు పెద్దల్లో కూడా పౌరుషాగ్ని కీలలు వ్యాపింపజేసేది. సూరి రాసిన పాటల్ని బుర్రకథల్లో, ఇతర ప్రదర్శన కళారూపాల్లో ఉపయోగించే వారమని

ప్రజాకవి సుద్దాల హనుమంతు చెప్పారు. ఈ రకంగా సూరి తెలంగాణా రైతాంగ పోరాటంతో ఎంతో ప్రభావితుడయ్యాడు. ఆయన పాటలు ప్రజల నోళ్ళలో నిలిచాయి.

పనిచేస్తున్న ప్రెస్సు మూతపడ్డాక ఆంధ్రపత్రికలో చేరారు. రచయితగా పత్రికోద్యోగిగా అధికారుల మన్ననలను పొందారు. ఆంధ్రపత్రిక సారస్వతాను బంధం సంపాదకునిగా ప్రతిభావంతంగా పని చేసారు. ఓవైపు రాతసాహిత్యం పనిచేస్తూ తెలంగాణా పోరాటానికి నోటి పాటల్ని కంపోజు చేసేవారు. ఆంధ్రపత్రిక నైజాంలోకి ప్రవేశించేదికాదు. కాని ఈ నోటి పాటలు సరిహద్దుల్ని లెక్కచేయకుండా నిరాఘాటంగా వెళ్ళి వ్యాప్తిపొందేవి. మరోవైపు చంఘీజ్‌ఖాన్, రెండు మహానగరాలు నవలల్ని అనువదించారు. ఎన్నో కథలు, గేయాలు రచించారు. కలంతోనే కాకుండా గళంతో పాడే పాటల రచయితగా ఆయన చాలా మందికి తెలయదు. ఇప్పటికి ఆ పాటలు పాడుకునే తెలంగాణా ప్రజలకు వాటి రచయిత తెన్నేటి సూరి అని తెలియదు. ఐనా ఆ పాటలింకా ప్రచారంలో ఉండడం కవి సజీవతని చాటుతున్నాయి.

టీబీ ఆయన భౌతిక శరీరాన్ని తినేసింది. కాని ఆయన పాటిన బాణీలు ఆయన్ని సజీవంగా ఉంచాయి!

నల్లగొండ బలిదాన - రక్తాంకమల్లదే
తెలంగాణ గగనాన అరుణతారై వెలుగు
ఆ తార వెలుగులోనే మము నడుపుమో
దివ్య స్వాతంత్ర్య దేవీ!

## పులుపుల వెంకట శివయ్య

జననం: 14-11-1910. మరణం: 14-7-1976.

వీరు కవి, వక్త, వ్యాసకర్త. అంతేకాదు రంగు పులుముకోకున్నా ప్రజానాట్య మండలి కార్యక్రమాల్లో పాల్గొన్న నటుడు కూడా. పుట్టింది పలనాడులోనైనా వ్యక్తిగా పెరిగింది ఆంధ్రదేశమంతటా! చిన్నతనంలోనే వైదిక వాసనలు రాల్చేసుకొని కమ్యూనిస్టు భావాలు వంటపట్టించుకొన్నారు. ఆ రోజుల్లోనే యం. ఎస్. సి. చేసికూడా ఉద్యోగం చేయలేదు. ప్రజలకోసం పనిచేయడానికి నడుంకట్టారు. ఈ క్రమంలోనే

కవిగా, నాయకుడిగా కర్తవ్యం నిర్వహించారు. పలనాడులో కమ్యూనిజాన్ని ప్రవహింప చేసిన ప్రముఖుడు. చంద్రం లాంటి వారికి మార్గదర్శకులుగా ఉండి వారిని తీర్చిదిద్దారు. ఎంతోమంది కవుల రచనలకు మెరుగులు దిద్దారు. గొప్ప పాటలుగా ప్రచారంలోకి వచ్చిన వాటివెనుక శివయ్య కలం ఉంది. వీరు మొత్తం ఎన్ని పాటలు రాశారో తెలి యదుగాని వీరి స్మృతి సంచికలో 18 పాటలు ప్రచురించారు. ఈ పాటలన్నీ చాలా ప్రచారం పొందాయి. ఈ పాటల ప్రభావంతో ఎన్నో వందల పాటలు వచ్చాయి. పులుపుల శివయ్య గీతాలు మనిషి పూలుగుని ఉరికెత్తించే గీతాలు! 'పలనాడు వెలలేని మాగాణిరా' పాట ఆంధ్రుల వీరగీతికగా పేరు పొందింది.

పైన పేర్కొన్న 18 పాటల్లో ఓ దివ్య స్వాతంత్ర్యదేవీ, వరదకృష్ణ, మాకొద్దీ నల్ల దొరతనం, తెలంగాణ రణన్నినాదం మొ॥ పాటలు ప్రవహించే కృష్ణానది వేగాన్ని పరిహసిస్తూ తెలంగాణా ప్రజల గుండెల్లోకి ప్రవహించాయి.

పాడవే గొంతెత్తి పాడవే కృష్ణా
మా తెలుగు చరితల మహితస్రవంతి
ముక్కోటి తెలుగుల వీరరక్తమ్ము
మున్నేరుగా కలసి పొరలి ప్రవహించ ॥పా॥

తెలంగాణా రైతాంగ పోరాటంలో తెలంగాణా ప్రజలేకాదు ఆంధ్రప్రాంతం ప్రజల రక్తం కూడా కలిసింది.

అచ్చులో పాటలు సంస్థానంలోకి రాలేని పరిస్థితిలో-

వీరి పాటలు మౌఖికంగా పలనాటి సరిహద్దుల్లోంచి పారే కృష్ణానదిని దాటి తెలంగాణా పోరాట రంగంలోకి ప్రత్యక్షంగా దూసుకువచ్చాయి. మరోవైపు విజయవాడ మీదుగా ఖమ్మం సరిహద్దులు దాటాయి. వీరు రాసిన -

ఒక్క సుముహూర్తాన ఉప్పొంగి భరతోర్వి
స్వాతంత్ర్య శంఖము సింహనాదము చేయ
మేటవై నిలిచిందిరా - పలనాడు
ముందుండి పోరించిరా - అనే పలనాడు గీతంలోని ఒక భాగం——
నాజి నైజాము గోరీగట్టగ నాడు
నలగొండ యోదులూ వెలిగించినా జ్యోతి
నలుదిశలు పాకించిరా, తెలంగాణ
సింహనాదము చేసెరా! - అంటూ తెలంగాణాకి అన్వయించి పాడుకున్నారు. ప్రజల పౌరుషాన్ని మేల్కొలిపే ఒక ప్రాంతం పాట, మరో ప్రాంతం ప్రజల పోరాటానికి వీరగీతికగా మారింది.

## అనుబంధం - III

తెలంగాణా ప్రజల్ని పోరాటం నుండి దృష్టిమరల్చడానికి నైజాం ప్రభుత్వం కూడా ఎన్నో ప్రయత్నాలు చేసింది. అందుకు గాను నల్లగొండలో ప్రత్యేక రేడియో ప్రసార కార్యక్రమాలు ఏర్పాటు చేయాలని సంకల్పించింది. అందుకు సంబంధించిన ప్రభుత్వ రహస్య ఫైలు వివరాలు ఇవి.

## నల్లగొండలో నైజాం రాజుల పాటులు-I

నైజాం ప్రభుత్వ రహస్య శాఖ (4/STA/56 and No. 2252/P) ప్రకారం నల్లగొండ జిల్లా వ్యాప్తంగా కమ్యూనిస్టుల ప్రభావంలో పడిపోయింది. అందులో ముఖ్యంగా నాలుగు తాలూకాలో పూర్తిగా కమ్యూనిస్టులదే పైచేయిగా ఉంది. అంతే కాకుండా ఈ తాలూకాలు కల్లోలిత ప్రాంతాలుగా ఉన్నాయి. ఇతర జిల్లాల్లో కూడా వీరి ప్రభావం పడుతోంది. మిలటరీ పోలీసులు అల్లర్లను అణచివేస్తున్నప్పటికీ సాధారణ ప్రజల్లో ప్రభుత్వంపట్ల వ్యతిరేకత ప్రబలిపోతుంది. అందువల్ల కమ్యూనిస్టు ప్రచారానికి ప్రజలు లొంగిపోతున్నారు. కాబట్టి ఈ ప్రాంతాల్లో విప్లవం రాకముందే కమ్యూనిస్టు సిద్ధాంతాలకు 'ప్రతికూల ప్రచారం' అధికం చేయవలసి ఉంది. అందుకోసం ఒక పద్ధతి ప్రకారం ప్రభుత్వం తరపున ప్రచార ప్రణాళిక ఒకటి తయారు చేసుకోవాలని భావించారు.

ఇందులో మత, సామాజిక సాధనాల్ని (Social Commandments) ఉపయోగించి ప్రభుత్వ సంస్థల ద్వారా ప్రచారం కొనసాగించాలి. ఈ పని వెనువెంటనే ప్రభుత్వ స్థానిక శాఖల ద్వారా నెరవేర్చాలని నిర్ణయించారు.

అందుకోసం—

నాటి హైదరాబాదు రేడియో ద్వారా తెలుగులో ప్రతికూల ప్రచారాన్ని వెంటనే ప్రారంభించాలి. ఇది ప్రజల్ని ఆనందింపజేసేదిగా ఉండాలి. ఉద్యమాల నుండి వారి దృష్టిని మరల్చేదిగా ఉండాలి. అందుకోసం నాలుగు కల్లోలిత తాలూకాల్లో సుమారు వంద కాకపోయినా యాభై రేడియో సెట్లు అమర్చాలి.

గ్రామీణ ప్రచారంలో నిపుణుడైన ఒక వ్యక్తిని ఇందుకు ప్రత్యేకంగా నియమించాలి. ఢిల్లీ ఆలిండియా రేడియోలో గ్రామీణ ప్రచార శాఖలో పనిచేసే మహమ్మద్

మీర్జాని నెలకు 500 రూ॥లు జీతం ఇచ్చి ప్రభుత్వం వెంటనే ఇక్కడికి తెప్పించు కోవాలి. అతను రేడియో శ్రోతల్ని మంత్ర ముగ్ధుల్ని చేసి రేడియో పట్ల ఆసక్తి కలిగిస్తాడు.

ఈ పని 1947 మార్చినుండి ప్రారంభించాలి అని ప్రభుత్వ సిఫారసులు చేసింది.

హైదరాబాదులో రేడియో సెట్లు లభ్యం కానందువల్ల బొంబాయి నుండి తెప్పించాలి. ప్రభుత్వం తరపున ఉత్పత్తిదారులనుండి తెప్పించాలంటే ఆలస్యం అవుతుంది. కాబట్టి ఎక్కడ ఎన్ని సెట్లు దొరికితే అన్ని కొనేయాలి. దక్కన్ రేడియో స్టేషన్ డైరెక్టర్ రోజూ సాయంత్రం 6 గం॥ల నుండి 6-30 గం॥ల వరకు ఈ ప్రత్యేక కార్యక్రమాల్ని ప్రసారం చేయడానికి ఒప్పుకున్నాడు.

ఐతే రేడియో స్టేషన్‌లో పని చేసేవారి సూచనలువున్నా బయటివారి సూచనలు తీసుకోవడం బాగుంటుందని భావించారు. సూచనలు ఇచ్చిన వారికి కొంత గౌరవవేతనం చెల్లించాలని భావించారు.

సాధారణ ప్రచారంకోసం కాకుండా ప్రత్యేకంగా కమ్యూనిస్టుల ప్రతికూల ప్రచారం చేయడమే ఈ రేడియో ప్రోగ్రాం ప్రధాన లక్ష్యం. ఇతర పార్టీల కార్యకలాపాలకు వ్యతిరేకంగా ప్రచారం చేయదు.

ఈ కార్యక్రమాన్ని నెరవేర్చడానికి **"Chief Organiser, The Hyderabad Dominions, Public Security Committee"** వారికి కొంత డబ్బూ, కోరిన సిబ్బందీ ఇవ్వడానికి నిర్ణయాలు తీసుకున్నారు.

కమ్యూనిస్టు ప్రతికూల ప్రచారం కోసం ప్రఖ్యాత పరిశోధకులు కుందూరి ఈశ్వరదత్తు నైజాం ప్రభుత్వానికి 3.3.1947నాడు ఒక నివేదిక సమర్పించారు.

ఈ నివేదికలో ఎలాంటి కార్యక్రమాలుండాలో వివరంగా తెలియజేశారు. అంతే కాకుండా కమ్యూనిస్టు పార్టీ ప్రచారాన్ని మొదట అధ్యయనం చేసి అవే పద్ధతుల్ని అవలంభించాలని ప్రభుత్వానికి సూచించారు. **'Song is the best and most powerful medium of appeal not only to emotion but also to feeling.'** కమ్యూనిస్టు పార్టీ పాట ప్రాణాన్ని పట్టుకొంది. అంతేకాదు ముప్పైకి పైగా పాటల పుస్తకాల్ని ప్రచురించింది అని తమ నివేదికలో ప్రభుత్వానికి తెలిపారు.

ఊరేగింపుల్లో, సభల్లో, పండుగపబ్బాల్లో, పంట కోతల్లో పాటని ఉపయోగిస్తారు. కమ్యూనిస్టులు జానపద నృత్యాన్ని కూడా తెలివిగా వాడుకుంటున్నారు. ఈ నృత్యాలు గ్రామీణ ప్రజలను చాలా ఆకట్టుకుంటాయి. ఇందులో బతుకమ్మ నృత్యం (చుట్టకాముడు నృత్యం) చెప్పుకోతగింది. కమ్యూనిస్టు పార్టీ వారే ఈ పాటల్ని కట్టి

ప్రజలకు అందిస్తారు. ఈ పాటలు ప్రజల మనస్సు మీద చాలా ప్రభావం చూపుతాయి. కాబట్టి ఈ కార్యక్రమాలు రూపొందించేవారు మొదట ఈ పాటలు, గాథల పట్ల ఆసక్తి ఉండాలి. వీటిని సేకరించాలని నివేదికలో స్పష్టం చేశారు.

జాగీరు ప్రాంతాల్లో, ఇతర ప్రాంతాల్లో ప్రజలు పడే కష్టాలను నైజాం ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చినప్పుడు వెంటనే చర్య తీసుకుంటుందని, అత్యవసరంగా వారి బాధలను వివరిస్తుందనీ, వెంటనే న్యాయం కలిగేలా చేస్తుందనీ భావన కలిగే విధంగా నినాదప్రాయంగా ప్రచారం చేయాలని ఈశ్వరదత్తు తమ నివేదికలో చెప్పారు. (చూడు అనుబంధం III-III)

నల్లగొండ జిల్లా పోలీసు సూపరింటెండెంటు 1947 మార్చి నెలలోనే ఈ రేడియో సెట్లు అసలు క్షేమంగా కాపాడగలమో లేదో తెలియదు కాబట్టి కమ్యూనిస్టుల ప్రభావం పడని గ్రామాల్లో రేడియో ప్రసారాలు చేస్తే బాగుంటుందని సూచించారు. మొత్తానికి 4.5.1947 నాడు రూ॥లు 30,500/- ప్రభుత్వ ఆర్థిక శాఖ మంజూరు చేసింది. ఐతే ఈ కార్యక్రమం అమలు విషయం తెలియదుగాని పాటలతో ప్రజల పోరాట అవసరాల్ని కప్పిపుచ్చడానికి ప్రభుత్వపరమైన ప్రయత్నాలు జరిగాయన్న వాస్తవాన్ని గుర్తించాలి.

## ఆంక్షలు-నిషేధాలు-II

హైదరాబాదు స్టేట్‌లో ప్రభుత్వం ప్రాంతీయ భాషలైన తెలుగు, కన్నడ, మరాఠీ, అధికార భాష అయిన ఉర్దూ, ఇంగ్లీషు, హిందీ మొదలైన భాషల పత్రికలు, పుస్తకాలు ఏ మాత్రం అభ్యుదయ భావాలను ప్రకటించిన వాటిని నిషేధించేవారు. ఇలా నిషేధానికి గురైన పత్రికలు, పుస్తకాల సంఖ్య ఎన్నో వందల్లో ఉంటుంది. కొద్దిగా ఆలోచింపజేసే ఏ భాషలోని పుస్తకాన్నయినా సంస్థానంలో నిషేధించేవారు.

1939లో మరాఠీలో ప్రచురించిన "పావదా" (Ecomiastic Song) అనే పాటల పుస్తకాన్ని ప్రభుత్వం 8.8.1939 నాడు నిషేధించింది. ఈ పుస్తకం ముందు మాటలో కవి చెప్పుకొన్నట్టు **"This book is not based on communal principles, but it is based on the obtaining as the natural civil liberties"** పౌరహక్కులకోసం ప్రత్యేకంగా పాటల రూపంలో పుస్తకాలు ప్రచురించడం జరిగింది. నియంతల పరిపాలనలో పౌరహక్కులు అడగడం పెద్ద నేరం. పైగా రచయిత **'Pavada' will be the wish of all the humanity that the**

**Nizamshah must save the subjects from the cruelities of the officers having listened to the blessings."** అని ముందుమాటలో చెప్పుకొన్నారు. ప్రభుత్వాధికారుల అక్రమాల ఊసు ఎత్తినందువల్ల ఈ పాటల పుస్తకం నిషేధానికి గురైంది.

## క్రాంతిగీతాలు

21.9.1941లోనే (ఫైలు నెం. 54/పి.యు.యస్/50 ఎఫ్) 'గద్దె లింగయ్య' సంకలనం చేసిన 'క్రాంతి గీతాలు' పాటల పుస్తకాన్ని ప్రభుత్వం సంస్థానంలో నిషేధించింది. విప్లవ స్వభావాన్ని కలిగి ఉన్న దృష్ట్యా ఈ పుస్తకాన్ని నిషేధించారు. ఈ పుస్తకంలోనే తుమ్మల వెంకటరామయ్య రాసిన "ఎగరాలి ఎగరాలి మన ఎర్ర జెండా", పెండ్యాల లోకనాథం రాసిన 'కూలీల పాట', మద్దూరి అన్నపూర్ణయ్య రాసిన "కూలీల రాజ్యం", అజ్ఞాత కవి రాసిన "విప్లవ గీతం" ఈ నిషేధానికి కారణంగా చూపించారు. మద్దూరి అన్నపూర్ణయ్య పాట దగ్గర ఒక నోట్‌లో— "మద్రాసు ప్రావిన్సులో ఇతనొక దుష్ట కమ్యూనిస్టుగా పేరుమోశాడు. **India Defence Act** చట్టం కింద మొదటిసారిగా అరెస్టు చేయబడినాడు" అని ప్రత్యేకంగా రాయడాన్ని గమనించాలి. దీన్నిబట్టి నిజాం ప్రభుత్వానికి కవులన్నా కమ్యూనిస్టులన్నా, వారు రాసిన పాటలన్నా భయాన్ని తెలుపుతుంది.

యథాతథ ఒప్పందం తరువాత నైజాం ప్రభుత్వానికి ఒక కొత్త సమస్య ఎదురైంది. కమ్యూనిస్టు పార్టీపై పూర్తి నిషేధం విధించారు. కాంగ్రెస్ నాయకుల్ని చట్ట వ్యతిరేక కార్యకలాపాల కారణంగా అరెస్టులు చేశారు. ఈ కారణాలవల్ల చాలా మంది నాయకులు సరిహద్దు ప్రాంతంలోకి వెళ్ళిపోయారు. అక్కడినుండి నైజాంలోని ఇండియన్ పోస్టాఫీసులద్వారా సాహిత్యాన్ని, పత్రికలనీ స్వేచ్ఛగా పంపేవారు. సంస్థానంనుండి అక్కడకూ వార్తలు పోయేవి. ఈ విధంగా పాటలూ, సాహిత్యం దిగుమతి అయ్యాయి. ఇది నైజాం ప్రభుత్వం గమనించింది. అందుకే 1947 డిశెంబరు 23న ఆర్కైవ్సు ఫైలు నం.1/ఎస్.ఎ.48 (చూ. అనుబంధం **IV-IV**)లో నైజాం డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు కొత్త సెన్సారు నిబంధనలు చురుగ్గా పనిచేయడంకోసం ప్రయత్నాలు ప్రారంభించారు. ఏదో ఒక రకంగా ఇండియన్ పోస్టాఫీసులకు కూడా తమ సెన్సారు నియమాలను వర్తింపజేసి సాహిత్యాన్ని, పత్రికల్ని అరికట్టాలని చూశారు.

## బుర్రకథలపై ఆంక్షలు—నిషేధాలు-III

కేవలం పాటలేకాదు, పాటని ఆధారం చేసుకొని పాడుకొనే అన్ని రకాల బుర్ర కథలు ప్రభుత్వానికి అలజడి కలిగించాయి. అందుకే ఈ కథల్ని నిషేధించడానికి ఎన్నో రకాలుగా (ఫైలు నం. 41/పి.ఎ./55 తేది. 2.6.55 ఎఫ్, 15/పి.ఎ./55 తేది. కుర్దాద్ 19, 1355 ఎఫ్) ప్రయత్నించింది. ఈ ఫైలులో బుర్రకథల ప్రభావాన్ని వాటి పనితీరును కూడా చెప్పారు. అందుకే కాస్త వివరంగా తరచి చూడటం జరిగింది.

'బుర్రకథ' అనగానే నాటి నిజాం ప్రభుత్వ అధికారులు ఎంత నిశితంగా, కథా సరళిని, ప్రజా వైఖరిని విశ్లేషించడానికి తమ బుర్రలను పనిచేయించారో వారి మాటల్లోనే చూద్దాం. 'వాల్ష్' అనే పోలీసు డిప్యూటీ డైరెక్టరు జనరల్ ఆధ్వర్యంలో ఈ బుర్రకథల తంతుపై ఒక వివరణ పత్రం తయారైంది. డైరెక్టర్ జనరల్ ఆ వివరణ పత్రాన్ని న్యాయ, పోలీసు శాఖ కార్యదర్శికి 2.6.55 (ఎఫ్) నాడు పంపుకున్నాడు.

ఆ వివరణ పత్రాన్ని దాదాపు యథాతథంగా ఇక్కడ పొందుపరచవచ్చు.

బుర్రకథ ప్రాముఖ్యాన్ని గురించి మన దగ్గర సంపూర్ణమైన వివరాలు లేవు. సర్వసాధారణంగా బుర్రకథలు గ్రామీణ జానపద కథా వస్తువును వివరిస్తాయి — వీటిని చెప్పడానికి సంగీతాన్ని తోడు చేసుకుంటారు. ఈ కథాభాగాన్ని చిన్న పుస్తకాలుగా ప్రచురిస్తారనికూడా మాకు విదితం అవుతున్నది. బుర్రకథకులు ఈ ప్రచురిత కథా భాగాన్ని హృద్గతం చేసుకుంటారు. బుర్రకథను గానం చేసేవారు ఈ కథాభాగాలను వివరంగా చెప్పడం అనేది ఆశు ప్రక్రియ. కథాగానంలో ఆశు వివరణ భాగమే ప్రధానమని తెలియవస్తున్నది. వాస్తవానికి పుస్తక రూపంలో ప్రచురించిన బుర్రకథలో నిషిద్ధ అంశాలు ఎవీ ఉండవు. అక్కడక్కడ వుండవచ్చు కూడా. కానీ ఆశువుగా చెప్పే వివరణలే బుర్రకథాగానాలలో వచ్చిపడే ప్రధాన నిషిద్ధ అంశాలు. ఇప్పటివరకూ బుర్రకథ చెప్పే వారెవ్వరిపైనా చర్య తీసుకొనలేదు.

బుర్రకథ చాలా ప్రమాదకరమైన ప్రచార సాధనమనీ, దానిని ఇక వ్యాప్తం కాకుండా నిషేధించమని ఉన్నదనీ చెప్పడం నిర్వివాదమైనది. బుర్రకథాగానం నిషిద్ధం కాదు. కానీ ప్రభుత్వాధికారులను, జమీందారులను నిశితంగా దుయ్యబట్టుతూ, వారిపట్ల రైతాంగంలో తీవ్ర అసంతృప్తిని కలగజేయడానికి తెలంగాణా గ్రామప్రాంతాలలో కొన సాగుతున్న తీరు నిషిద్ధమైనదనీ చెప్పక తప్పదు.

'బుర్రకథలు నిషిద్ధమైనవి' అని చట్టం చేయడం సాధ్యం కాదని నా అభిప్రాయం. ప్రజారక్షణ చట్టం (పబ్లిక్ సేఫ్టీ యాక్ట్)లో రహస్య శాసన భాగంగా ప్రభుత్వం చేర్చిన ఆత్యయిక అధ్యాయ పాఠం మా కార్యాలయంలో కానరాలేదు. ఈ ఆత్యయిక అధ్యాయం ఏ విధంగా నిర్వచించినప్పటికి, బుర్రకథలను దీని పరిధిలోకి తీసుకు రావడం వీలుకాదని నా అభిప్రాయం.

బుర్రకథలలో చేరే కొన్ని నిషిద్ధ అంశాలు ప్రజా రక్షణ చట్టంలోని 29వ సెక్షన్ పరిధిలోకి, హైదరాబాదు రక్షణ చట్టం పరిధిలోకి అసఫియా శిక్షాస్మృతిలోకి వస్తాయనేది నిర్వివాదాంశం. ఆ విధంగా కొన్ని సందర్భాలలో మాత్రమే మనం చర్య తీసుకోగలుగుతాము. ప్రచురించిన కొన్ని బుర్రకథలలోనూ కొన్ని నిషిద్ధాంశాలు ఉండవచ్చు. అటువంటి వాటిని నిషేధించవచ్చు - వాటిని గానం చేసిన వారిపై చట్ట ప్రకారం చర్య తీసుకోవచ్చు. కాని ఈవిషయంలో మనం గట్టిచర్య తీసుకొనడం సాధ్యం కదనే నా అభిప్రాయం.

ప్రజా రక్షణ చట్టం ప్రకారం చర్య తీసుకోవాలంటే ప్రతి సందర్భంలోనూ, గాయకుల గానం మధ్యలో మట్లాడే మాటలు రాసుకొని, అవి నిషిద్ధమైనవని తేల్చి ఏ సందర్భానికి తగ్గట్టుగా ఆ అంశాలను పురస్కరించుకొని చర్య తీసుకొనవలసి ఉంటుంది. పలికిన మాటలను పలికినట్లు సాక్ష్యాధారాలుగా ఉటంకించి రుజువు చేస్తేనేగాని శిక్ష విధించడానికి మన న్యాయస్థానాలు ఇచ్ఛగించడం లేదు. కాబట్టి అటువంటి మాటలను తెలుగు షార్ట్‌హాండ్‌లో రాసుకోగలిగిన సిబ్బంది మనకు ఉంటే తప్ప చర్య తీసుకొనడానికి గానీ, శిక్ష విధింపజేయడానికిగానీ అవకాశం ఉండదు. అంతమాత్రాన చర్య తీసుకొనడానికి మనం వెనుకంజ వెయ్యనక్కరలేదని నా భావన విశ్వాస పాత్రులైన సాక్షుల సమక్షంలో, తెలుగులో, మామూలు రాతలోనే బుర్రకథకుల మాటలను రాసుకొని, నేరారోపణ చేయడం సాధ్యం —— శిక్ష పడేటట్లు చేయడం సాధ్యం ఇట్లు కొందరు వ్యక్తులు చర్యలు తీసుకొని, ఈ బెడదను నివారించవచ్చునని నా అభిప్రాయం. జిల్లా పోలీసు సూపరింటెండెంట్లకూ, సుబేదార్లకూ, ఈ దుష్ప్రచారాన్ని గురించి, దాన్ని నిరోధించవలసిన అవసరాన్ని గురించీ వివరణ సహితమైన జాబులు రాస్తేబాగుంటుంది. బుర్రకథలు ఏర్పాటయ్యే బహిరంగ సమావేశాలకు, సమర్థులైన ఉద్యోగులను, సాధ్యమైనంతవరకు పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్లను పంపి, తగు చర్యకు వీలు కలిగించేటట్లుగా సూపరింటెండెంట్లకు ఆదేశాలు పంపవచ్చును. ఇట్లు బహిరంగ సమావేశాలకు వెళ్ళే ఉద్యోగులు మామూలు లిపిలోనే బుర్రకథాగానానికి సంబంధించిన వివరాలను రాసుకోవచ్చు. వీలైనంతవరకు కథా వివరణ అంశాలను, పలికిన మాటలను

పలికినట్లుగా రాసుకొనడానికి ప్రయత్నం చేయాలి. అప్పుడు ఆ బుర్రకథాగానలక్ష్యం సవివరంగా మనకు విదితం అవుతుంది. పోలీసు ఉద్యోగితో ఉండే సాక్షులను చాలా జాగ్రత్తగా ఎన్నుకోవాలి — వీరు చదువుకున్నవారై ఉండాలి. బుర్రకథ సరళిని లక్ష్యాన్ని, తెలివితో వివరించి చెప్పగలవారై ఉండాలి.

బుర్రకథలను ఎల్లప్పుడూ బహిరంగ సమావేశాలలోనే గానం చేస్తారనుకోరాదు. "సంచార రాజకీయ బృందాలు" గ్రామ గ్రామాలలో తిరుగుతూ, ఎక్కడ గ్రామీణులు సమూహంగా చేరుతారో అక్కడ గానం చేస్తారు. అట్లా గానం చేసే వారిని, ఆ రాజకీయ బృందాలను గురించీ స్థానిక పోలీసు ఉద్యోగులు తెలుసుకుంటూ ఉండాలి. అటువంటి వ్యక్తులను వెన్నాడాలి. వారి మాటలను మామూలు లిపిలో రాసుకోవాలి — బహిరంగ సమావేశాలలో రాసుకున్నట్లే వీటినీ రాసుకోవాలి. ఇట్లా చేస్తే ఈ నిషిద్ధ కార్యకలాపాల్లో పాల్గొనే కొందరిపైనయినా చర్యతీసుకోవడం వీలవుతుంది. ఇట్లాచేస్తే సూపరింటెండెంట్లకూ, ఈ ప్రచార ఉద్యమంలో పనిచేసే వారి సంగతి, బుర్రకథల వివరాలు అన్నీ తేటతెల్లమవుతాయి. నేరారోపణ చేయడం సాధ్యం అయినా కాకపోయినా 'హైదరాబాదు రక్షణ చట్టం' మేరకు, నిందితుల చర్యలను నిరోధించవచ్చు, నేరారోపణ చేయగలగటం ఉత్తమ పద్ధతి. అట్లా వీలుకాకపోతే నేరారోపణకు చట్టం అనువు కాకపోతే, హైదరాబాదు రక్షణ చట్టం ఒక్కటే చర్యకు వీలు కలిగించే సాధనం.

1944లో బెజవాడ కిసాన్ మహాసభ జరిగినప్పటి నుంచీ బుర్రకథ ప్రాధాన్యానికి వచ్చినట్లు విదితం అవుతుంది. అప్పటి నుంచీ మద్రాసు రాజధానిలోనూ ఇక్కడా కూడా ఇది ప్రచార సాధనం అయింది. వచ్చేవారం నేను మద్రాసుకు వెళ్తున్నాను. మద్రాసు రాజధాని ప్రత్యేక పోలీసులతో బుర్రకథను గురించి చర్చిస్తాను. ఇప్పటికి మాకు తెలసినంతవరకూ, బుర్రకథలపై మద్రాసు రాజధాని పోలీసులు ఏ విధమైన చర్య తీసుకోలేదు.

భూమ్యాదాయశాఖ, పోలీసుశాఖల మంత్రి ఫసలీ 1355, ఆబాద్ 1న ఈ క్రింద విధంగా తమ అభిప్రాయాలను నమోదు చేసి పంపారు —

బుర్రకథల ద్వారా కొనసాగుతున్న దుష్ప్రచారం వలన మన ఆంధ్ర జిల్లాలన్నింటినుంచీ నాకు చిక్కులు వాటిల్లుతున్నాయి. రాజకీయవాదులు వీటిని ఏర్పాటు చేస్తున్నారు. అన్నిచోట్లా కేవలం కమ్యూనిస్టులే కాదు కాంగ్రెసువారు కూడా పాడుతున్నారు. ఇట్లా నాటకాలు, కథాగానాలు బహిరంగంగా కొనసాగుతున్నాయి. ప్రభుత్వోద్యోగులను ద్వేషభూయిష్ఠంగా, హాస్యాస్పదంగా చిత్రిస్తున్నారు. గ్రామీణులకు అనాదిగా ప్రభుత్వోద్యోగులపట్ల గౌరవ మర్యాదలను నశింపచేయడం వీరి ఏకైక

లక్ష్యం. కాని ఈ సమస్యకు సంబంధించినంత వరకూ చట్టం విస్పష్టంగా లేదు.

ప్రజారక్షణ చట్టం 29వ సెక్షన్ ప్రకారం — — మహోఘనత వహించిన నిజాంప్రభువుల ఉద్యోగులనుగానీ, అనుయాయివర్గాన్నిగానీ పాలితప్రజలనుగానీ, కంగారు పెట్టేఉద్దేశంతో, భయపెట్టే ఉద్దేశంతో, కించపరిచే ఉద్దేశముతో ద్వేషింపచేసే ఉద్దేశంతో ఎవ్వరైనా రాత పూర్వకంగా గానీ, వాక్కుగా కానీ, సంజ్ఞగాగానీ, ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగాగానీ, ఏ ప్రకటన చేసినప్పటికీ, ఏ ప్రవాదును ప్రచారం చేసినప్పటికీ, అది నేరం అవుతుంది.

ఈ సెక్షనును సవరించడం ఆవసరం అని భావిస్తున్నాను. పోలీసులను, ప్రభుత్వోద్యోగులను కించపరిచే లక్ష్యంతో నాటకాలు, గానాలు, బుర్రకథలు చెప్పడం వగైరాలను ఈ సెక్షన్ పరిధిలోకి తీసుకోవాలి. దీని సాధ్యాసాధ్యాలను వివరించవలసినది అని ఆంతరంగికశాఖ కార్యదర్శిని అడుగుతున్నాను. ఈ లోగా అసఫియా శిక్షాస్మృతి 145 సెక్షన్ ప్రకారం అన్ని బుర్రకథలను నిషేధించడం సహేతుకంగా ఉంటుందని కూడా భావించారు.

ప్రజారక్షణ చట్టానికి కొన్ని కార్యాచరణ నిబంధనలను చేర్చే ఒక రహస్య అనుబంధం ఉంది. అది మహోఘనత వహించిన ప్రభువుల ఆమోద ముద్ర కొన్ని ఏళ్ళ క్రిందటే పొంది ఉన్నది. కానీ అది అమలు కావడం లేదు. అయినా దానివలన మనకు తగు ప్రయోజనం కలుగదు. బ్రిటిష్ భారత ప్రాంతాలలో కాంగ్రెసువారు కొనసాగించే విప్లవచర్యలను ఎదుర్కొనడానికి బ్రిటిష్ ప్రభుత్వం చేసిన శాసనం అది. దానిని అనుసరించి మనమూ అటువంటిది చేశాం కానీ కమ్యూనిస్టుల పద్ధతులు కాంగ్రెసు పద్ధతులకు భిన్నం. అయినా ఈ కార్యాచరణ నిబంధనలను నల్లగొండ జిల్లాలో అమలు చేయడం ఎంతవరకు ఉపకరిస్తుందీ అని పోలీసు డైరెక్టరు జనరల్ పరిశీలిస్తున్నారు.

ఆంతరంగిక శాఖ కార్యదర్శి ఫసలీ 1355 ఖుర్దార్ 9న పోలీసు డైరెక్టరు జనరల్ ఇలా రాశారు.

పోలీసు మంత్రి ఆదేశానుసారం నల్లగొండ జిల్లాలో ప్రజ్వరిల్లిన కమ్యూనిస్టు ఆక్రమచర్యలను గురించి సమీక్షించడానికి నిన్న సమావేశం జరిపాం. నల్లగొండ జిల్లాలో బుర్రకథలను నిషేధించాలని నేను ప్రభుత్వానికి సూచించవలసినదిగా ఈ సమావేశంలో తీర్మానించారు.

నల్లగొండ జిల్లాలో, ప్రస్తుత సంక్షోభ పరిస్థితులలో, బుర్రకథల గానంలో

వచ్చిపడే నిషిద్ధ ప్రకటనలను గురించి పోలీసులు నిక్కచ్చిగా సమాచారం సేకరించ గలుగుతారని ఆశించే అవకాశం లేదు అనే ఈ సంక్షోభాన్ని మామూలు నేరారోపణ పద్ధతులలద్వారా నివారించే అవకాశం లేదని చెప్పవలసి వస్తున్నది.

అందువలన హైదరాబాదు రక్షణ చట్టం 55 సెక్షన్ ప్రకారం ప్రభుత్వం చర్య తీసుకోవడం ఉచితమని సిఫారసు చేస్తున్నాను. అంటే —— నల్లగొండ జిల్లాలో సంగీతం కలిసి కొనసాగించే నాటకాలను, వీరగాథలను సామాన్యం అయిన బుర్రకథ లను చేర్చి —— వినడానికి జనం సమావేశం కావడంగానీ, అట్లా సమావేశపరచడం గానీ, పాడడంగానీ నిషిద్ధచర్యలుగా పరిగణించాలి. అటువంటి సమావేశాలను నిషేధిం చడానికి, చెదరగొట్టడానికీ; నిందితులపై రుజువయ్యే నేరాలను ఆరోపించడానికీ, ఈ విధమైన చట్టబద్ధ చర్య ఉపకరిస్తుంది.

ఇంతకూ ప్రజారక్షణ చట్టంలో నిషిద్ధ చర్యలకింద ఈ చర్యలను గూడా పొందుపరుస్తూ, ఒక సవరణను జారీ చేశారు.

గానం, నాటకం, బుర్రకథ

ఈ సవరణ నిజాం సంస్థానంలో వర్తిస్తుందనే, జరీదు (గెజెట్) లో ప్రచురించిన నాటినుంచీ అమలులోకి వస్తుందనీ నిర్ణయించారు.

తీరా సవరణ చట్టాన్ని ప్రభుత్వ ముద్రణాలయంవారు అచ్చు తప్పులతో అచ్చువేయగా బుర్రకథ అనే శబ్దం తప్పుగా అచ్చుఅయింది. అందువల్ల దానికి ఒక అధికారికమైన (అచ్చుతప్పు పట్టిక) ను వెంటనే అచ్చువేసి జోడించారు.

ఈ విధంగా బుర్రకథలోని నైజాం ప్రభుత్వం నిషేధించడానికి ఎంతో నిశితంగా పరిశీలించింది. చట్టపరంగా నిషేధించడానికి అన్ని కోణాలనుంచి తన శక్తియుక్తులను ప్రయోగించింది. నిషేధ ఉత్తర్వులను ప్రచురించగలిగిందేగాని నిషేధిం చలేకపోయింది. ఆనాటికే ప్రజలే కళాకారులుగా, వృత్తిగాయకులే సంచార రాజకీయ బృందాలుగా పనిచేశారని ఈ ప్రభుత్వనివేదిక వల్ల తెలుస్తోంది.

అనుబంధం-VI

# F A R M A N-I

it is observed that some local papers Publish false items of news regarding political and administrative matters thereby misleading the public and causing confusion in their minds. Such false news is persistently published by some papers inspite of contradictions issued by Government. Moreover articles are often thoughtlessly written and published which help to create an unpleasant atmosphere all round. All local papers ara therefore warned to be more careful in future and not give publicity to baseless rumours or write bitter and provacative articles which may lead to breach of the peace or create needless complications. If this warning is not headed, the entire responsibility will rest on the editors of the papers who behave in this way. As the present time is critical, the Prose and Cons should be carefully considered before any matter is published so as to avoid disturbing the peaceful atmosphere of the country.

The public also on their part, should not unhesitatingly believe all statements published in the local Press unless they are confirmed by the Hyderabad Government. Such objectionable conduct is often only for the sake of gain. No man of sensible character however approves of such journalistic methods which must soon bring their own retribution.

It may be added that sometime Cartoons of such of respectable position appear in objectionable style in the local papers All serious mind people would consider them to be vulgar and in bad taste.

Sb/-
H.E.H.

18th Sept. 1947.

# FARMAN-II

It is often seen in these days, that some public leaders instead of reflecting calmly on the political problems of today, are found of delivering hasty and irresponsible speeches or publishing articles of the same nature in the newspapers,a line of conduct which may lead to a disturbance of the peace.At the same time baseless attacks are made on Government Officers or on the constitutional advisor, or suspican againt them is spread very widely, whereas property speaking, it is the busyness of the ruler or of his Government to weight these questons and to take such action in regard to any of them as may be called for.

In any case, all members of the public are warned, Irrespective of race or creed, that the course these men are persuing is not beneficial but may on the contrary prove harmful in the present atmosphere in which important and delicate questions are being considered and definite decisions are being made. Apart that it is not wise or desirable to disclose them prematurely or to bring them before the public. it is therefore necessary in such matters to exercise great care and circumspection.

To sum up, in the present difficult times one must bear in mind the wisdom contained in the famouse line of the poet Saadi which says 'Blessed is the man who can for see the end. If the precept contained in this verse is neglected. It may lead to uniformnate results such as public commotions or disturbances for which the people who caused them will have to be held responsible. One would therefore do well to take into consideration the trend of the times and not do any rash or ill-considered act which may bring regrettable consequences.

Sb/-

29 th JULY, 1947 H.E.H.

